# శ్రీ మాత

## ప్రశ్నోత్తరములు

[1953 ఆగస్టు 5 – డిశంబరు 30]



అనువాదం:

అమరవాది వేంకటరామశాస్త్రి

అమరవాది ప్రభావతి

"ఈ గ్రంథములు ముద్రించుటకు అవసరమైన
కాగితము కేంద్ర ప్రభుత్వమువారిచే
తగ్గింపు ధరకు అందజేయబడినది"

సంపుటి 10

**కోటగిరి**

శ్రీమాతారవింద సత్సంగ కేంద్రంవారి విరాళంతో

శ్రీ దివ్యమాత శతజయంతి గ్రంథ ప్రచురణ సమితిచే
ప్రచురింపబడినది.

ముద్రణ : శ్రీఅరవిందాశ్రమ ఆంధ్రభవనం ముద్రణాలయం, పుదుచ్చేరి.



# శ్రీ మాత

జ న న ం

ఫిబ్రవరి 21, 1878

భారతదేశానికి ఆగమనం

మార్చి 29, 1914

మ హా స మా ధి

నవంబరు 17, 1973

శ త జ యం తి

ఫిబ్రవరి 21, 1978

# ప్రస్తావన

శ్రీ అరవిందాశ్రమములోని పిల్లల విషయంలో శ్రీమాత ప్రత్యేక శ్రద్ధ తీసుకొనేవారు. ప్రతిరోజూ సాయంత్రం ఆటమైదానానికి వెళ్ళి వారి ఆటపాటలను పర్యవేక్షించి, వారితో కొంతసేపు ఇష్టాగోష్టి జరిపేవారు. అత్యంత కుతూహలము కలిగించే ఆ సమావేశాలకు ఆశ్రమవాసులంతా కూడా హాజరయేవారు. అవే 1953 నుంచి బుధవారం సాయంత్రం క్లాసులుగా ప్రసిద్ధిచెందాయి. సామాన్యంగా పిల్లలకు వివిధ అంశాలపై కలిగే సందేహాలకు, సమస్యలకు సమాధానాలు కావడంవల్ల అవి ప్రత్యేకించి యేఒక్క శాస్త్రవిభాగానికి గాని, దేశానికి కాలానికి గాని పరిమితం గావు. పైగా వివిధ విషయాలపై ఆసక్తి గల జిజ్ఞాసాపరులకు అవి విజ్ఞానసర్వస్వాలే నని చెప్పవచ్చు. ఇంకా పిల్లలడిగే అనేక సందేహాలను నివృత్తి చేద్దామనుకునే పెద్దలకు, ఆధ్యాత్మిక జీవితం గడపాలనే ఔత్సాహికులకు అవి పెన్నిధి వంటివి.

1978 ఫిబ్రవరి 21 న జరిగే శ్రీమాత శతజయంతి సందర్భంగా పై ప్రశ్నోత్తరాలను, శ్రీమాత ఇతర రచనలను, ఇంకా శిష్యులతో జరిపిన అనేక ఉత్తర ప్రత్యుత్తరాలను కలిపి శ్రీ అరవిందాశ్రమం వారు ఆంగ్లంలో 15 సంపుటాలుగా ప్రచురించారు. వాటన్నిటినీ ఆంధ్ర పాఠకులకు కూడా అందజేయాలనే అభిలాషతో తెలుగువారు కూడా "శ్రీ దివ్యమాత శతజయంతి గ్రంథ ప్రచురణసమితి" అను పేరుతో ఒక సంఘముగా ఏర్పడి ఒక పథకం చేపట్టినారు. ఆ ప్రయత్నంలో, ఆంగ్లంలో వెలువడిన 1953 శ్రీమాత ప్రశ్నోత్తరాల సంపుటిని తెలుగులో రెండు భాగములుగా ప్రచురించడం జరిగింది. అందులో ఇది రెండవ భాగము.



# వి ష య సూ చి క




| | | |
|---|---|---|
| 5 ఆగస్టు : | చైత్యసత్త పురోగతి, పునర్జన్మ | 1 |
| | చైత్యపురుషజ్ఞానం కలవారి పురోగతి | 2 |
| | అభివ్యక్తి, పురోగతి | 3 |
| | అంతఃప్రేరణ, గ్రహణశీలత | 4 |
| | మనః ప్రాణ శరీర చేతనల పురోగతి | 6 |
| | మనస్సు సమర్థింపు, చైత్యసత్త యెరుక | 9 |
| | దృఢసంకల్ప ప్రవృత్తి | 10 |
| | చైత్యసత్త అవతరణ | 12 |
| | చైత్యసత్త పురోగతి, కర్మ | 13 |
| 12 ఆగస్టు : | తాదాత్మ్యభావంతో వ్యక్తుల యెరుక | 15 |
| | జ్ఞానప్రక్రియలు : ఏకాగ్రత | 16 |
| | చైతన్య విస్తరణ : పురోగతి | 17 |
| | ప్రకృతిలోని అంతులేని వైవిధ్యం | 23 |
| 19 ఆగస్టు : | వృక్షములలో, జంతువులలో ఆకాంక్ష | 25 |
| | సకల వస్తువులలో దివ్యసన్నిధి | 26 |
| | శిలలు, శక్తిపూరణ | 27 |
| | వినిమయము, సంగ్రహణేచ్ఛ | 29 |
| | ఇచ్చినకొలదీ అభివృద్ధి | 30 |
| | నాశనమొనర్చే ప్రవృత్తి, దుష్టశక్తులు | 31 |
| | నిక్కమైన వీరలక్షణం | 32 |
| | దివ్యానుగ్రహమునెడ విశ్వాసప్రయోజనం | 32 |
| 26 ఆగస్టు : | ప్రేమమూలం | 33 |
| | యథార్థప్రేమ, దాని వికృతులు | 35 |
| | మానవులయెడ జంతుప్రేమ | 38 |
| | చైత్యపురుష చైతన్యము, బుద్ధిభావనలు | 40 |

| | | |
|---|---|---|
| | పూవులు, స్ఫటికములు, జంతువులలో 'ప్రేమ' | 41 |
| 2 సెప్టెంబరు : | మతము, ఆధ్యాత్మిక జీవితము | 43 |
| | కులములు | 46 |
| | దైవం వైపు పురోగతి విధానం | 47 |
| | నాగరికతల చరిత్ర | 48 |
| 9 సెప్టెంబరు : | ప్రాణసత్త, పరివర్తనము | 51 |
| | చైత్యసత్తతో సంపర్కము, ధీరులు | 56 |
| | ప్రాణసత్త- అత్యంతశక్తిమంతమైన ఉపకరణము | 56 |
| | అసత్ప్రవృత్తులు పెక్కింటికి మూలం ప్రాణసత్త | 58 |
| | ప్రాణసత్త శక్తివిశేషం | 59 |
| 16 సెప్టెంబరు : | శరీరము, గ్రహణశీలత | 60 |
| | భౌతిక ప్రపంచంలో నిలుకడ | 61 |
| | మరణానంతరం పృథ్వీవాతావరణంలో కొన్ని పరిణతశక్తులు ఉండిపోవుట | 62 |
| | చైత్యసత్త నూతనజన్మ, అధిమానస సత్తతో మేళనము | 65 |
| | పురోగతి, యుద్ధము, ప్రతికూలశక్తులు | 67 |
| | చైతన్యాభివృద్ధి, పునర్జన్మ | 69 |
| | చైతన్యము, జ్ఞాపకశక్తి | 70 |
| | అద్భుతపరికంపనముల జలధిలో మన ఉనికి | 71 |
| 23 సెప్టెంబరు : | భౌతిక ప్రపంచం- విశ్వచలనముల ప్రతీక | 73 |
| | జంతువులలో అస్వస్థత | 74 |
| | విశ్వం- తన తోకతాను కబళించే సర్పము | 76 |

| | | |
|---|---|---|
| | పృథ్వి- విశ్వమునకు ముఖ్యప్రతీక | 77 |
| | దుష్టశక్తులు | 78 |
| | తేజోమయ పృథివి- శ్రీమాత అనుభవం | 79 |
| 30 సెప్టెంబరు : | పృథ్వీ జీవితము, జ్ఞాపకశక్తి అతిమానసపు నియతి | 79 |
| | ఇతర యోగములు సమాప్తినొందుచోట శ్రీఅరవిందుల యోగప్రారంభము | 87 |
| | సాక్షాత్కారోపలబ్ధుల నొందిన పెద్దవారు సామాన్యముగా మారరు | 88 |
| | పిల్లలలో పరివర్తనం సుకరం | 89 |
| | జీవితమంతా శిశువులుగానే ఉండనేర్చుకోవాలి | 90 |
| | ఆశ్రమంలోని పిల్లలు, తదితరులు | 92 |
| | జ్ఞాపకము, స్మృతి | 93 |
| 7 అక్టోబరు : | పూర్ణస్వస్థత చేకూర్చే చైతన్యం | 94 |
| | ఆకాంక్ష : మానసికము, ప్రాణికము, శారీరికము, ఆధ్యాత్మికము | 95 |
| | భౌతిక శరీరచైతన్యం | 97 |
| | శరీరానికిగల సహజజ్ఞానం | 98 |
| | ప్రబలమైన శ్రద్ధ, ఘనమైన విశ్వాసం | 100 |
| | కొందరు పిల్లలు ఆశ్రమంలో ఎందుకున్నారు ? | 102 |
| | తాదాత్మ్యం ద్వారా ఇతరులను గురించి తెలుసుకోడం | 103 |
| | బాధ్యతగల జనులు : పాలకులు, అధ్యాపకులు | 104 |

| | | |
|---|---|---|
| | అతిమానసపు చర్య : రూపాంతరీకరణము | 105 |
| | తనను తాను తెలుసుకోడం | 106 |
| | వ్యష్టి, సమష్టి పురోగతి | 107 |
| | అహితప్రాణశక్తుల అవతరణ, దాని ఫలితములు | 110 |
| 14 అక్టోబరు : | ప్రపంచసృష్టిలో పాల్గొనే 'స్రష్టలు' | 111 |
| | అనేక స్థాయిలలో సృష్టి | 112 |
| | దుష్టత్వం : దైవంనుండి వేర్పాటు : స్వతంత్రవతరణం | 113 |
| | దైవంతో ఏకత్వాన్ని పొందడమే సకల సమస్యలకూ పరిష్కారం | 116 |
| | సామూహిక సూచనలు, మరణభయం | 117 |
| | మరణభయ నివారణోపాయాలు | 120 |
| | చైత్యపురుషుని అమరత్వభావన, మృత్యుజయం | 121 |
| | భయమే భయవిషయాన్ని ఆకర్షిస్తుంది | 122 |
| | భయము అంటువ్యాధి : యోగి అవలంబించే నివారణోపాయం | 123 |
| 21 అక్టోబరు : | "కళాకారులు"- రంగుటద్దాల కిటికీలు | 125 |
| | కళలో, తదితర ప్రవృత్తులలో దైవవ్యక్తీకరణ | 126 |
| | రామాయణ, మహాభారతాలు | 128 |
| | జపానులో ఉద్యానవనాలు | 129 |
| | ఉత్తర, దక్షిణ ప్రాంతాల బౌద్ధమతం | 130 |
| | రావణుడు, సీత : అసురుని కోరిక | 133 |

సౌందర్యభావన, కళాభిరుచి వైవిధ్యం 134
యథార్థసౌందర్య మెరుగుటకు
రూపముల కతీతులు కావాలి 135

28 అక్టోబరు : నిజమైనకళ, దివ్యసౌందర్యసాక్షాత్కారం 135
ఉదావర్తములలో ప్రపంచప్రగతి 139
విశ్వప్రగతి, గోళగత ఉదావర్తాలు :
పరాప్రకృతి ప్రణాలిక 140
కళకు ఆత్మసంతృప్తి ప్రతిబంధకం 142
"కుక్కగొడుగు" కళలు,
నిక్కమైనకళ 144
భారతదేశంలో కళ 146
విశ్వప్రకృతి — సమస్తమునూ
కరగించెడి క్రాగు 149

4 నవంబరు : ఉదావర్తులాల గోళనిర్మాణం 150
యజ్ఞము 151
దైవసాన్నిధ్యభావన :
మానవుని నైతికదృష్టి 154
దివ్యజీవనానికి, నైతికసమున్నతికీ
విశుద్ధాకాంక్ష
దైవంతో 'బేరమాడటం' 156
దైవము నెరుంగుటే
జీవిత ముఖ్యలక్ష్యం 157

11 నవంబరు : 'Quelques Peroles' నుండి పఠనము;
సాధించవలసిన లక్ష్యము 158
సమత్వావిశిష్ట సత్తము సృష్టి 159

సామూహిక ప్రమాదాల

మిశ్రమ పరిస్థితి 219

దురదృష్ట కారకులు 220

30 డిసెంబరు : పిల్లల అంతర్గతస్థితిపై

కొన్ని శక్తుల ప్రభావం 222

చైత్యపురుషుడు మరుజన్మను

ఎన్నిక చేసుకోడం 223

కొందరు పిల్లలలో దుష్టత్వ కారణాలు 224

బిడ్డ గర్భస్థమయ్యే సమయంలో

తలిదండ్రుల చైతన్యస్థితి 225

తామసస్థితి; ఉద్రేకావశ్యకత 226

ఆశ్రమ పాఠశాలలో విద్య 227

ఆశ్రమంలోని పిల్లలు 229

'మాట్లాడవద్దు, చేసిచూపండి' 230






మహోన్నతమైన ఆదిపరాశక్తియే శ్రీమాత,
సర్వలోకాతీతమైనది. పరమదైవముయొక్క
శాశ్వతచేతనను తనయం దిముడ్చుకొనినది.

# ప్రశ్నోత్తరములు

5 ఆగస్టు, 1953

## చైత్యపురుషుడు సర్వదా పురోగమిస్తూ ఉంటాడా ?

చైత్యపురుషునిలో పురోగతి రెండు రకాలు: మొదటిది, చైత్యపురుషుడు రూపొందడము, క్రమబద్ధం కావడము. మొదట్లో చైత్యపురుషుడు జీవిలో ఒక చిన్న దివ్యవిస్ఫులింగంగా ఏర్పడి, తర్వాత క్రమానుగత వృద్ధిని పొంది స్వతంత్ర చర్య, స్వతంత్ర సంకల్పం చేయగల ప్రత్యేక చైతన్యజీవిగా రూపొందుతాడు. ఆదిలో చైత్యపురుషుడు దివ్యచైతన్యపు విస్ఫులింగం మాత్రమే. ఆ తర్వాత అనుక్రామిక జన్మలద్వారా చైతన్యపు వ్యక్తిత్వం సంతరించుకుంటాడు. పెరిగే పసిపాప మాదిరిగా అభివృద్ధి పొందుతాడు. అది నిర్మాణ దశ. పూర్ణవ్యక్తిత్వాన్ని ఇంకా పొందలేదు, చైతన్యాత్మకం కాలేదు, తనకు తాను అధినేత కాలేదు. అది పూర్తిగా ఏర్పడి, చైతన్యవంతంగా అవడానికి ఒకటి తర్వాత ఒకటిగా అనేక జన్మలు అవసరమౌతాయి.

ఈ రకమైన క్రమాభివృద్ధికి తుది ఉంది; జీవి పూర్తిగా వికాసం పొంది, పూర్ణవ్యక్తిత్వం ఏర్పరుచుకొని తనకూ, తన విధికీ పూర్తిగా అధిపతి కాగల సమయం వస్తుంది. ఈ స్థితికి వచ్చిన చైత్యపురుషుడు మానవజన్మ ధరించినప్పుడు. మామూలుకన్నా భిన్నంగా ఉంటాడు. అటువంటివారు బంధరహితంగా జన్మిస్తారు; పరిస్థితులకుగాని, పరిసరాలకుగాని, వంశానుగత ప్రభావానికి గాని లోనుగారు. ఏదో ఒక కార్యనిర్వహణ కోసం, కారణజన్ము లౌతారు. ఈ విధంగా

చేస్తే వారి పురోగమనం పూర్తి అయినట్లే. అంటే, వారికి పునర్జన్మ దాల్చవల సిన అవసరం లేదన్నమాట. అంతవరకూ పునర్జన్మ అవసరం; ఎందువల్లనంటే పునర్జన్మద్వారానే కదా వృద్ధిపొందడము. చైత్య పురుషుడు భౌతిక శరీరంతో, భౌతిక జీవనం ద్వారా క్రమవికాసం పొంది పూర్ణచైతన్య జీవిగా వృద్ధిపొందుతాడు. ఒకసారి పూర్తిగా ఏర్పడిన తర్వాత, జన్మ ఎత్తడమో మానడమో తనే నిశ్చ యించుకోగల స్వేచ్ఛను పొందుతాడు. ఈ విధంగా ఒకరకమైన పురోగతి నిలిచి పోతుంది.

పూర్తిగా అభివృద్ధి పొందిన చైత్యపురుషుడు దైవకార్య నిమిత్తం ఉపకర ణంగా పనిచేయదలచుకుంటే, చైత్యలోకంలోని పరమానందంలో విశ్రమించే బదులు, దైవకార్య నిర్వహణలో సహాయపడడానికి పనిచేయాలనుకుంటే, మళ్ళీ ఇంకొక పురోగమనం ప్రారంభించాలి. పనికి కావలసిన శక్తిసామర్థ్యాలలోను, వ్యవస్థీకరణంలోను దివ్యసంకల్పం వ్యక్తీకరించడంలోను పురోగమించాలి. ఆ విధంగా అతడు మారే సమయం ఒకటి వస్తుంది. ఈ ప్రపంచంలోనే నిలిచి, భగవత్సేవ చేద్దామనుకున్నంత వరకూ అతడు పురోగమిస్తాడు. అట్లాకాకుండా, చైత్యలోకంలోకి విరమించుకొని, దైవకార్యం కొనసాగించడానికి నిరాకరించినా, లేక త్యజించినా, పురోగమనం లేవి స్తబ్దస్థితిలో నిలిచిపోతాడు. ఎందువల్లనంటే నేను చెప్పినట్లు ఈ భౌతిక ప్రపంచంలో మాత్రమే పురోగతికి ఆస్కారముంది. ఇంకెక్కడా లేదు. చైత్యలోకం పరమానందకర ఆరామప్రదేశం మాత్రమే. అక్కడ ఏ విధమైన చలనం లేకుండా ఎట్లాఉన్నవారు అట్లానే నిలిచిపోతారు.

మరి చైత్యపురుషుని చైతన్యం లేనివారి సంగతేమిటి ?

వారు కోరినా, కోరకపోయినా, తప్పనిసరిగా పురోగతి చెందుతారు. వారి ని చైత్యపురుషుడే పురోగమించడం జరుగుతుంది. కాని, అది వారికి తెలి దు. వారు ఒక వంపురేఖను అనుసరిస్తారు. జీవితంలో ఒక ఆరోహణను నుసరిస్తారు. అది ఎదిగే పిల్లల పురోగమనంవంటిది. ఆ పురోగతి శిఖరాగ్రం ,రిన తరువాత దాని స్థాయి మారాలి. లేకపోతే అది నిలబడదు. అప్పటి వరకూ భౌతికస్థాయిలో ఉన్న పురోగమనం, మానసిక, చైత్య, ఆధ్యాత్మిక

పురోగమనంగా మారకపోతే, వంపువెంబడి అది కిందికి జారుతుంది. అప్పుడు అది విఘటితమై పురోగమనం లేకుండాపోతుంది.

భౌతికప్రపంచలోని పురోగతి స్థిరమైనదీ, శాశ్వతమైనదీ కాదు కాబట్టి, పురోగతి అత్యున్నత స్థానానికి చేరి అక్కడనుంచి పతనమై, విఘటితమౌతుంది. పురోగమించలేనిది తిరోగమిస్తుంది, అభివృద్ధి గాంచలేనిది పడిపోతుంది.

భౌతికంగా కూడ ఇలాగే జరుగుతుంది. భౌతికప్రపంచం తాను నిర్విరామంగా ఎలా పురోగమించాలో తెలుసుకొనలేదు; ఒకస్థాయిదాకా పురోగమించి అలసిపోతోంది, ప్రస్తుత పరిస్థితులలో పురోగతి చెందలేకపోతోంది; మొత్తంమీద దాని పురోగతి నిలిచిపోయి, విఘటితమౌతోంది. కేవలం భౌతికజీవితాన్ని గడిపే వారు ఒక రకమైన ఉన్నతస్థాయిని అందుకుంటారు. కాని చాలా తొందరగా మళ్ళీ జారిపోతారు. ప్రస్తుతం సామూహిక మానవప్రగతి సాగుతున్న ఈ తరుణంలో, భౌతిక ప్రగతి వెనుక ప్రాణికమైన పురోగతి, మానసికమైన పురోగతి ఉన్నాయి. ఈ కారణంగా భౌతిక పురోగతి ఆగిపోయిన తర్వాత గూడా మానసిక పురోగతి చాలాకాలం కొనసాగుతుంది; దీనిద్వారా మానవుడు ఒకరకమైన పురోగమనం సాగించగలడు.

చైత్యపురుషుని చైతన్యాన్ని పొంది, దానితో ఏకమై జీవితంలో పాల్గొనే యోగసాధకులు కొందరున్నారు. వారు జీవితాంతం పురోగమిస్తారు. మరణానంతరం గూడ వారి పురోగతి ఆగిపోదు; దేహంపనికిరాకుండా పోయిందనే కారణంతో వారు శరీరాన్ని వదిలిపెట్టినప్పటికీ పురోగమనం కొనసాగిస్తారు.

పరివర్తనం చెందడానికీ, పురోగమించడానికీ అసమర్థమైన దేహం తిరోగతి చెందుతుంది; ఆ తర్వాత అది అంతర్గత అసమతులనకు క్రమక్రమంగా గురియై, ఇక ఆరోగ్యాన్నీ, సమతనూ కూడదీసుకోలేనంతగా విషమతకు లోనౌతుంది. దానినిగురించి పై వారం మాట్లాడుకుందాము.

భౌతిక, దైహిక, మానసిక జీవితాలతో సంబంధంలేని అచ్ఛమైన ఆధ్యాత్మిక జీవనంలో మాత్రమే పురోగతి నిలిచిపోతుంది. పురోగతి చలనాలు ఏమా

త్రంలేని స్థితి అది; అంటే, నీవు వ్యక్తప్రపంచానికి బాహ్యమైనావన్నమాట. ఆస్థితికి చేరినప్పుడు, నీవు వ్యక్తప్రపంచానికి చెందవు. పురోగతిని వదలి వెళ్ళా లంటే వ్యక్తప్రపంచాన్ని వదలిపెట్టాలి; ఎందువల్లనంటే, అవి రెండూ ఒకటే: పురోగమనమంటే అభివ్యక్తి. అభివ్యక్తియే పురోగమనము.

చాలామంది ప్రేరణవల్ల ఆలోచిస్తారు, వ్రాస్తారు, అది ఎక్కడనుంచి వస్తుంది?

చాలామందా? అది ఆశ్చర్యమే: చాలామంది ఉన్నారని నాకు తెలియదు. అయితే ఏమిటి?

కవులు పద్యరచన చేసేటప్పుడు ....

ప్రేరణలు పలుతావులనుంచి వస్తాయి. కొన్ని భౌతికంగా, కొన్ని ప్రాణికంగా రావడము ఉన్నది. కొన్ని వివిధ మానసిక స్థాయిలనుంచి వస్తాయి; ఇంకా కొన్ని, చాలా అరుదుగా, ఉన్నత మనోభూమికల నుంచి గాని. అంతకంటె ఉన్నత భూమికలనుంచి గాని వస్తాయి. అన్ని ప్రేరణలూ ఒకే తావునుంచి రావు. అందువల్ల, ప్రేరణ కలిగినంతమాత్రం చేత వారు ఉత్తమ మానవులు కారు.... కొందరు బుద్ధిహీనంగా ప్రవర్తించడానికీ, మాట్లాడడానికీ కూడా ప్రేరితులౌతారు.

ప్రేరితులవడం అంటే ఏమిటి ?

నీలో లేనిదానిని, నిన్ను మించినదానిని నీవు అందుకోవడము; నీ వ్యక్తి చైతన్యజీవికి బాహ్యమైన ప్రభావానికి నివృతుడవు కావడము.

హత్య చేయడానికిగూడా ప్రేరణ రావచ్చు. కొన్ని దేశాలలో హంతకు శిరచ్ఛేదం చేస్తారు. ఆ విధంగా కలిగిన ఘోరమరణం వారిలోని ప్రాణ సత్త్వమ బలాత్కారంగా బయటకు నెట్టివేస్తుంది. శరీరం శిథిలమై తనం తాను బయటకు రాకపోవడంవల్ల దాని సహజ ఉద్వేగాలన్నీ దానిలోనే

ఉంటాయి. అది సాధారణంగా అనుచిత కుతూహలంతో అక్కడకు చూడడానికి వచ్చిన ఒకరిలో ప్రవేశిస్తుంది. వారి నిశ్చేష్టత వారిలో ఒక మార్గాన్ని ఏర్పరచి అది ప్రవేశించడానికి వీలు కల్పిస్తుంది. ఈ విధంగా హంతకుని ఉరి తీసేటప్పుడు చూస్తూ నిలబడడం వల్ల తమకు ప్రేరణ కలిగి హత్యలు చేయడం జరిగిందని కొంతమంది యువహంతకులు చెప్పినట్లు లెక్కలు నిరూపించాయి. అది ప్రేరణే అయినా చాలా జుగుప్సాకరమైన ప్రేరణ.

నీ వ్యక్తిగత చైతన్యంలో లేకుండా, బయటనుంచివచ్చి, నీలోకి చొరవగా ప్రవేశించి, నీచేత పనిచేయించేదానికి నీవు వివృతుడవయే లక్షణాన్నే ప్రేరణ అంటారు. ఇదే దానికి సరియైన వివరణ.

"అతడు అంతఃప్రేరితుడైన కవి" అని ఎవరైనా చెపితే, ఉన్నత భూమిక ల నుంచి అతడు ఏదో గ్రహించి, దానిని అసాధారణంగా వ్యక్తంచేశాడని దాని అర్థము. అంతకంటె, అతని అంతఃప్రేరణ చాలా ఉన్నతస్థాయికి చెందినదని చెపితే బాగుంటుంది.

ప్రేరణ ఎప్పుడు కోరితే అప్పుడు రాదా ?

ఎప్పుడు కోరితే అప్పుడే ? ఆ విధంగా రాదు; ఎందువల్లనంటే, మన అంతర్గత విధానాలు మనకు తెలియకపోవడం వల్ల, మన సంకల్పానుసారంగా మనం వివృతం కాలేము.

కాని, అది సాధ్యమే. యోగసాధనలో మొదటనేర్చుకునేది అదే : కోరినప్పుడెల్ల అంతర్ద్వారాలు తెరవగలగడమే. ధ్యానము, ఆకాంక్ష, ఏకాగ్రతల ననుసరిస్తే తత్ఫలితంగా వాటిని తెరవగలుగుతారు.

అత్యున్నత భూమికలవైపు వివృతుడవు కావడానికే సర్వసామాన్యముగా నీవు ప్రయత్నించు. ఎందువల్లనంటే, ఇంకొకరకపు అవాంఛనీయప్రేరణలకే దురదృష్టవశాత్తు మానవులెప్పుడూ వివృతమౌతూ ఉంటారు.... అన్నింటికీ అతీతంగా

ఎక్కడో ఒంటిస్తంభపు మేడ కట్టుకొని కూర్చోడం అసంభవం కదా. అది అంత అనుకూలమైనదని నేను అనుకోను; ఆ విధంగా అన్నీ మూసుకొని, తనలో తనే జీవిస్తే పురోగమించడం అసాధ్యం. అటువంటప్పుడు లోనున్న దానిని మాత్రమే పునర్వ్యవస్థీకరించుకోగలరు, బాహ్యప్రపంచంతో సంబంధం లేకుండా పూర్తిగా ఒకగోళంలో నీవు మూసుకుపోయినట్లు ఊహించిచూడు;—ఆ స్థితిలో—నీవు ఏమీ యివ్వలేవు, ఏమీ గ్రహించలేవు, నీ చైతన్యం, నీ చలనాలు, ప్రకంపనాలు, అన్నీ ఆ గోళంలో నీతోపాటే ఉండిపోతాయి. బాహ్య విషయాలతో ఏమీ సంబంధం లేకుండా కేవలం నీ విషయమై మాత్రమే చైతన్యవంతంగా ఉంటావు. అప్పుడేమి చేయగలవు? నీలోని వ్యవస్థను మార్చుకోగలవు, దానితో అనేకం చేయగలవు. అది అంతటితోనే సరిపోతుంది. అది ఒక రకమైన అంతర్గత పురోగతే అయినా. బాహ్యశక్తులకు సంబంధించినంత వరకు నిజమైన పురోగతి కానేరదు. కొంతకాలం తర్వాత నీవు చాలా పరిమితమై పోయినట్లు తెలుసుకుంటావు, నీతో నీవు విసిగిపోతావు.

అయితే, నీవు బాహ్యీకరణం పొందేటప్పుడు, అంతసేపూ నీవు తద్వారా ఏదో ఒకటి బయటనుంచి తెచ్చుకుంటూ ఉంటావు. అది నీటిని పీల్చుకొనే స్పాంజి మాదిరిగా కొంత శక్తిని బయటకు పంపి, కొంత లోనికి తీసుకోడంవంటిది. ఈ విధమైన ప్రతిస్పందనలు కల్గుతాయి కాబట్టే, నివసించే పరిసరాలను సరిగా ఎంచుకోడం ముఖ్యము. వాటి మధ్యగల ఇచ్చిపుచ్చుకొనే ఒక ఏర్పాటువల్లనే ఎక్కువ చురుకుగా, చలాకీగా జీవితం గడిపేవారు ఎక్కువ గ్రహించుకుంటారు. ఎవరి చురుకుదనాన్నిబట్టి వారు గ్రహించుకుంటారు. ఉదాహరణకు, ఎప్పుడూ ఎగురుతూ, గెంతుతూ, చలాకీగా తిరిగే చిన్నపిల్లలు (నిద్రపోయేటప్పుడు తప్ప మిగిలినప్పుడు ఊరుకోరుగదా, ఏమో, నిద్రపోయే టప్పుడుకూడా అనుమానమే) ఎక్కువ ఖర్చుచేస్తే ఎక్కువ గ్రహిస్తారు. వారు భౌతిక, ప్రాణిక శక్తులెక్కువ వ్యయం చేస్తారు. కాబట్టి వాటినే ఎక్కువగా గ్రహిస్తారు; ఎంత వ్యయంచేశారో అంతా తిరిగి సంపాదిస్తారు. అందువల్ల వారు ఖర్చుచేసి సంపాదించడానికి అనువైన పరిసరాల్లో గడపడం అవసరము; అప్పుడే వారు ఖర్చుచేసిన స్థాయికి తక్కువ కాకుండా తిరిగి ఆర్జించుకోగలరు.

నీ చలనాల్లో ఉదారత్వం లేకపోవడంవల్ల, నీవు చాలా తక్కువ గ్రహిస్తావు. అందువల్ల భౌతిక పురోగతి ఆగిపోతుంది. నీవు ఏరకంగానూ వృథా చేయగూడదని జాగ్రత్తగా పొదుపుచేయడంవల్ల నీ భౌతికపురోగతి ఆగిపోతుంది. నీ మనస్సు "జాగ్రత, అనవసరంగా శ్రమపడి అలసిపోవద్దు" అని హెచ్చరించడంవల్లనే నీవు భౌతికంగా గ్రహించుకునేది తగ్గిపోతుంది. నీ పెరుగుదల నిలచిపోతుంది—తార్కికంగా ఆలోచించడంలో వృద్ధికావడం పూర్తిగా నిలిపివేస్తావు.

కాని, ఇతరస్థాయిలలో గ్రహించడం మొదలుపెడతావు. కోరికలు, మోహావేశాలు పెంచుకొని జీవించేవారికి ప్రాణికస్థాయిలో గ్రహింపు పెరిగిపోయి, వారికీ వారి పరిసరాలకూ అసౌకర్యం కలిగే స్థితికి వస్తుంది. మానసిక చైతన్యంలో గడిపేవారికి మానసికమైన గ్రహింపు పెరుగుతుంది. మానసిక కార్యకలాపాల్లో స్థిరంగా పాల్గొనేవారు నిరంతరం పురోగమించవచ్చు. భౌతికదేహం కృశించి క్షీణించినప్పుడు గూడా మానవ మేధ పనిచేయడం ఆగదు. మెదడు దెబ్బతిని భౌతికస్థాయిలో దాని మేధను వ్యక్తంచేయలేనప్పుడు కూడా మానసిక పురోగమనం నిరాటంకంగా కొనసాగుతుంది. దాని ఉపకరణంకంటెకూడా యిది ఎక్కువకాలం మనగల్గుతుంది. దైహిక వార్ధక్యం మనస్సుకంటదు. మెదడును మంచిస్థితిలో నిలపడానికి నీవు తగినంత శ్రద్ధ తీసుకోలేకపోయినా, మెదడుకు దెబ్బ తగిలి గాయాలేర్పడినా, నిన్ను నీవు వ్యక్తం చేసుకోలేవు, కాని, మనస్సు వృద్ధిపొందుతుంది. ఎప్పుడూ ఏవిధమైన అతిచర్యలూ చేయకుండా, శరీరాన్ని చిన్నచూపు చూడకుండా, ఏ విధంగానూ విషగ్రస్తం చేయకుండా, అంటే త్రాగుడు, ధూమపానం వంటి చెడు అలవాట్లు లేకుండా సమతౌల్యం కాపాడుకోగలిగినవారు మెదడును చివరిదాకా మంచిస్థితిలోనే నిలుపుకోగలరు. వారు, వారి బాహ్య వ్యక్తీకరణ విషయంలో గూడ పురోగమిస్తారు. కాని, జీవితంలోని కడపటి సంవత్సరాలలో మాత్రం వారు లోలోన ఉపసంహరించుకొని బాహ్య వ్యక్తీకరణ కోల్పోతారు. కాని, వారి మానసిక పురోగతి కొనసాగుతుంది.

స్వభావరీత్యా ప్రాణకోశం చావు లేనిది. కాని, అది వ్యవస్థీకృతం కాకపోవడంవల్ల దాని సాధారణ స్థితిలో అది ఉత్తేజకరంగా, పరస్పర విరుద్ధమైన

ఉద్వేగాలతో, ఉద్రేకాలతో నిండిపోతుంది. వీటన్నిటితోనూ అది తన్ను దాను నాశనం చేసుకుంటుంది. కాని, దాని అంశలన్నీ, సజీవంగా కొనసాగుతాయి. కోరిక, ఆవేశం అనే సజీవాంశలు ఇంకా చాలాకాలం కొనసాగుతాయి. వాటికి ఆలవాలమైన జీవిలేకపోయినా అవి మనగలవు. అవి బాహ్యంనుంచి పెనుతుపాను వలె నీ మీదకు విజృంభించి నిన్ను వశపరచుకుంటాయి; నీ వెంతో ప్రశాంతంగా, నిశ్చలంగా, ఏదో స్థిరమైనదానిని పట్టుకొని వ్రేలాడుతున్నట్లు గట్టిగా కదలకుండా పెనుతుపాను అణిగిపోయేవరకు చలించకుండా నిలవాలి. వణికిపోకుండా, ఇవి అన్నీ తొలగిపోయే పెనుగాలులే యని స్థిరంగా వానికి తట్టుకోవాలి. పెనుగాలి ఆగిపోయిన తర్వాత స్థిమితపడి సాధారణ సమతను పునస్థాపించుకోవాలి. అప్పుడు కొద్దిపాటి నష్టంతో తేలిపోతుంది. అటువంటి సందర్భాల్లో సాధారణంగా అంతా సుఖాంతమే అవుతుంది.

నీటిపై తేలే బెండుముక్కవంటివారు పలుదిక్కులకు చెదరిపోయి స్థిరత్వం పునఃస్థాపించుకోలేక ఏ దుస్సంఘటనకైనా తలొగ్గుతారు, ఉన్నట్లుండి వారొక సుడిగుండంలో చిక్కుకుంటారు; ఇంకేమీ మిగలదు.

బుద్ధిహీనపు పనులు చేసేవా రుంటారు కదా.

ఆ, ఉంటారు.

వారు అలా చేస్తున్నట్లు వారికి తెలుసు. వారి మనస్సు దాన్ని ఒప్పుకొని చేయూత నివ్వదు. ఏ విధమైన సాకుగాని, సంజాయిషిగాని, వివరణగాని ఇచ్చి సమర్థించదు. ఈ స్థితి ఏమిటి ?*

* భౌతిక మనస్సు అధఃప్రాణిక చైతన్యంతో, చైతన్యపు చలనాలతో ఒకః న సంబంధం పెట్టుకుంటుంది. కొన్ని కోరికలను, ఉద్వేగాలను అధఃణికం వ్యక్తం చేసేటప్పుడు, భౌతిక మనస్సు దానికి తోడుగా వచ్చి దాని చర్యను సమర్థించడానికి ఏవో సాకులు చెప్పి, నమ్మకం కలిగించి ప్రోత్సహిస్తుంది.
ప్రశ్నోత్తరాలు 1929 (26 మే)

ఆ స్థితా? సామాన్య మానవులు బుద్ధితక్కువ పనులు చేస్తున్నామని తెలిపి, చైతన్యవంతులై కూడా దానినుంచి తప్పించుకోలేరు. దానికి కారణం తగినంత మనఃస్థైర్యం వారిలో లేకపోవడమే.

ఆ విధంగా తప్పించుకోడానికి తగినంత స్థైర్యం మనస్సుకి ఎన్నటికీ రాదు. అన్ని వైపులనుంచీ అన్నిటినీ చూడడానికి ఏర్పడిన ఉపకరణమే మనస్సు. ఒకసారి ఒకవైపునుంచి, మరొకసారి ఇంకొక వైపునుంచి చూస్తుంటే, మనస్సుకి ఉద్వేగాన్ని నిగ్రహించేటంత దృఢసంకల్పం కలుగుతుందని నీవు ఎలా ఆశిస్తావు? మనస్సు "అది అట్లాఉంది, అది ఆ విధంగా ఎందుకు ఉండగూడదు? ఉండనీ" అంటుంది. ఇక నీ సంకల్పం ఎందుకు పనికివస్తుంది?....

నేను చెప్పినట్లుగా, అది ప్రతిదానినీ ఏదోరకంగా వివరించి, అన్నిటికీ సమర్థనీయమైన మంచి కారణాలను చెపుతుంది.

దానిని నిరోధించగలిగింది చైత్యపురుషుడు మాత్రమే. నీ మనస్సు చైత్యపురుషసత్తతో సంబంధం పెట్టుకొని, దాని ప్రభావం పొందగలిగితే, అది నిరోధక శక్తిని పెంపొందించుకోగలదు. నిజమేదో, అబద్ధమేదో మనస్సుకి తెలుస్తుంది, అప్పుడు సత్సంకల్పం కలిగితే, నిరోధక శక్తిని వ్యవస్థీకరించుకొని యుద్ధంచేసి గెలుస్తుంది. దానికి చైత్యపురుషునితో సంబంధం ఎర్పరుచుకోడం అవసరం.

మానసికంగా చాలా విషయాలు తెలిసినా, ప్రశంసనీయమైన నియమాలు అవలంబిస్తున్నా, ఉద్వేగాలను నిరోధించగల దృఢసంకల్పం కలిగించుకోలేరు. ఒక్కొక్కప్పుడు, దృఢనిశ్చయుడవౌతావు, అది ఆవిధంగానే జరగాలని నిశ్చయిస్తావు. ఉదాహరణకు, ఫలానిపని చేయగూడదనుకొని చేయడం మానేస్తావు; కాని, ఉన్నట్లుండి (అది ఏవిధంగానో, ఎందుకో, ఏమి జరిగిందో ఏమీ తెలియదు) నీవు ఏమీ నిశ్చయం చేసుకోనట్లుగా ప్రవర్తిస్తావు. అంతే! వెంటనే ఆపని చేయడానికి మంచికారణం దొరుకుతుంది,....కొందరు ఎప్పుడూ ఒకవిధమైన కారణం చెపుతారు: "నేను ఈసారికి ఆపని చేస్తే అది చెడ్డదని తెలుస్తుంది.

ఇంకెప్పుడూ చేయనుకదా. ఇదే చివరిసారి." ప్రతివారూ కల్పించుకునే మంచి పాఠం యిదే; "చివరిసారిగా యిలా చేస్తున్నాను. అది పూర్తిగా చెడ్డదని, చేయకూడనిదని, ఇంకెప్పుడూ చేయగూడదని, అర్థంచేసుకోడానికై చేస్తున్నాను. ఇదే ఆఖరుసారి." అంతే,—ఇక నీకు ప్రతిసారీ ఆఖరుసారే; మళ్ళీ మళ్ళీ ప్రారంభిస్తావు.

ఇంతకంటె అస్పష్టభావాలు కలవారు లేకపోలేదు. వారు "నేను యిది చేయరాదని ఎందుకు అనుకుంటున్నాను? ఇవి వట్టి సిద్ధాంతాలు; నిజంకావచ్చు. కాకపోవచ్చు. నాకు ఈవిధంగా ప్రవృత్తి కలిగిందంటే మరి ఇది వట్టి సిద్ధాంతం కంటె మెరుగైనది కాదనే ప్రవృత్తి దేనివలన కలుగుతోంది?" అనుకుంటారు. ఇట్టివారికి ఇలా చేయడం ఆఖరుసారి కాదు. అదే తమ సహజ ప్రవృత్తి అని కూడా అనుకుంటారు.

ఈ రెండురకాల అతివాదులకూ మధ్యస్థంగా అనేకతరహాల వ్యక్తు లుంటారు. అన్నిటికన్నా అవాంఛనీయమైంది "ఈసారికి మళ్ళీ ఇలా చేస్తున్నా నంటే. నన్ను నేను విశుద్ధపరచుకోడానికే, తర్వాత ఇంకెన్నడూ చేయను." అని చెప్పుకోవటము. ఇంక ఈ విశుద్ధపరచుకోడానికి అంతం కనిపించదు.

నీవు దృఢ నిశ్చయం చేసుకుంటేనే: "ఈసారి అలా చేయకుండా ఉండేందుకు గట్టి ప్రయత్నం చేస్తాను; ఇక చేయను. నా యావచ్ఛక్తినీ వినియోగించి ప్రయత్నిస్తాను" అనుకోగలవు. నీకు ఏ కొంచెం ఫలితం కనిపించినా అది ఎక్కువనదే; అది పూర్తి ఫలితం కాకపోయినా, స్వల్పమైన గెలుపే అయినప్పటికీ, ఉత్సుకత, వాంఛ, ఉద్రేకాలూ నిలిచిపోయి లోలోపల కలత పెడుతున్నా. బాహ్యంగా మాత్రం "నేను చేయకూడదు, చలించకూడదు; నాకాళ్ళు, చేతులు బంధించుకోవలసి వచ్చినప్పటికీ నేను చేయను" అనుకుంటావు. అది పాక్షికమైన గెలుపు. కాని అది ఘనవిజయమే. ఎందువల్లనంటే, దాని ఫలితంగా మళ్ళీ వచ్చేసారి అంతకంటే ఎక్కువ సాధించగలవు. నీలోని తీవ్రోద్రేకాలను అదుపులో ఉంచుకొనేందుకు కొంత శాంతపరచగలవు; మొదట్లోకొంత ప్రయాసపడతావు. అవి చాలాకాలం అట్టడుగున ఉండి, మళ్ళీ వచ్చి నిన్ను

బాధిస్తాయి, నిన్ను విసిగించి చీదర పుట్టించినప్పటికీ నీవు వాటికి లోబడకుండా ప్రతిఘటించి; "నేను చేయను, ఏమైనప్పటికీ నేను కదలను, శిలవలె ఉంటాను'' అంటావు. క్రమక్రమంగా వాటి ఔద్ధత్యం తగ్గి నీకు రెండవవైఖరి అలవడుతుంది: "నా చైతన్యం వీటికన్నిటికీ అతీతమవాలని నా అభిలాష, ఇంకా అనేక సంఘర్షణల నెదుర్కోవలసి వచ్చినప్పటికీ నా చైతన్యం వీటికి అతీతమై నిలిస్తే, ఇవి తిరిగి రాకుండా పోయేసమయం వస్తుంది." ఆ తర్వాత నీవు పూర్తిస్వేచ్ఛను పొందే సమయం సమీపిస్తుంది. అది నీకు తెలియదు కాని అంతా పరిసమాప్తి అవుతుంది. నీ దృఢ స్వభావమూ, ఆకాంక్షలోని విధేయతలను బట్టి అది త్వరగా గాని, ఆలస్యంగా గాని రావచ్చు. ఈప్రకారం నడుచుకొంటే, ఏ కొంచెం విధేయత గల వారికైనా ఫలితం కనిపిస్తుంది. కాని, కొంత కాలం పట్టవచ్చు. వ్యక్తం చేయకపోవడమే వారి మొదటి గెలుపు. భూమిమీద శక్తులన్నీ వ్యక్తం కావాలనే ప్రయత్నిస్తాయి. వ్యక్తీకరణకోసమే అవి వస్తాయి; నీవు వాటికి అవరోధాన్ని ఏర్పరచి, వ్యక్తీకరణం నిరాకరిస్తే, అవి ఆ అవరోధాన్ని ఛేదించడానికి ప్రయత్నిస్తాయి; చివరికి ఆ ప్రయత్నంలోనే అలసిపోయి, ఎటూ వ్యక్తీకరించుకోలేక, తిరిగి వెళ్ళిపోతాయి. నీకు శాంతి లభిస్తుంది.

అందువల్ల, నీవు "మొదట నా ఆలోచనలను, దేహాన్ని, ప్రాణకోశాన్ని శుద్ధిచేసుకొని ఆ తర్వాత నా చర్యలను విశుద్ధం చేసుకుంటాను.'' అని ఎన్నడూ అనుకోకూడదు. కాని, సాధారణంగా అదే క్రమాన్ని అవలంబిస్తారు. అది ఎన్నడూ పని చేయదు. బాహ్యశుద్ధితో ప్రారంభిస్తే ఇది సక్రమం అవుతుంది: "ప్రథమంగా,—నేను అది చేయకూడదు; తర్వాత,— నేను దానిని కోరకూడదు; ఆ తర్వాత,— ఏరకమైన సంకల్పవృత్తులకూ తావివ్వరాదు: అవి నాకు లేవు, నేను వాటన్నిటికీ అతీతుణ్ణి.'' అనుకోవడం సరియైన క్రమము. మొదట అసలు చేయవు; ఆతర్వాత కోరవు; అప్పుడది నీ చైతన్యంలోనుంచి పూర్తిగా వైదొలగిపోతుంది.

చైత్యజీవి ఈ ప్రపంచంలో పుట్టేముందు ఏ స్వరూపాన్ని పొందాలో ముందుగానే నిశ్చయించుకుంటుందా ?

ఈ ప్రశ్న చాలాబాగున్నది. అది చైత్యజీవుల పురోగతి స్థాయిమీద ఆధారపడి ఉంటుంది. అంటే, ప్రారంభదశలో అవి తమ స్వరూపాన్ని ముందుగా ఎన్నుకోలేవు కాని, కొంత పురోగమించిన తర్వాత, వాటి చైతన్యస్థాయి పెరిగినప్పుడు—సాధారణముగా తాము భౌతికదేహంలో ఉన్నప్పుడే, కొంత అనుభవం వచ్చాక,— అప్పుడవి ఆ తర్వాత పొందవలసిన అనుభవక్షేత్రాన్ని నిశ్చయించుకుంటాయి.

నేను కొన్ని ఉదాహరణలు చెబుతాను. అన్నిరకాల ప్రతిచర్యలనూ తెలుసుకొని, అన్ని బలాలనూ దైవంవైపు మరలించడానికి కావలసినశక్తినీ, ఆధిపత్యాన్నీ పొందగల అనుభవం ఒక చైత్యజీవికి కావలసిఉంటుంది; అప్పుడది ఇటువంటి శక్తిమంతమైన జీవితంవల్ల నేర్చుకునేది ఏమిటో తెలుసుకోడంకోసం ఒక రాణిగానో రాజుగానో పుడుతుంది. అవి పూర్తి అధికారం గల జీవితాలుకదా. వాటిలో తెలుసుకోవలసినదంతా తెలుసుకుంటుంది. చివరికి అది శరీరాన్ని వదలిపెట్టి వెళ్ళవలసిన సమయంలో, తర్వాత పొందవలసిన అనుభవం యేదో నిశ్చయించుకుంటుంది. చైత్యపురుషుడు ఇంకా దేహంలో ఉన్నప్పుడే. అంతవరకూ నేర్చుకున్నదానిని గుర్తించుకొని ఆ తర్వాత కావలసిన అనుభవాన్ని నిశ్చయించుకుంటుంది. ఒకరకమైన అనుభవం పూర్తిగా పొందింది కాబట్టి అందుకు పూర్తిగా వ్యతిరేకమైన అనుభవం దానికి కావాలి. అందుచేత, సాధారణంగా ఇప్పుడు గడిపిన జీవితానికి భిన్నమైన జీవితం ఎంచుకుంటుంది. శరీరాన్ని వదలిపెడుతూ "ఈసారి నేను పేదరాలి అనుభవంకోసం పుడతాను." అని నిశ్చయించుకుంటుంది. చైత్యపురుషుడు పురోగతిలో ఒకానొక స్థాయికి చేరినతర్వాత, దైవంతో చైతన్యవంతంగా సన్నిహిత సంపర్కము పొందడంకోసం భౌతికదేహాన్ని తయారుచేసి పరివర్తింపచేయగల అవకాశాన్ని కోరుకుంటుంది. తన పురోభివృద్ధికి తోడ్పడిన అధికారము, శక్తి, క్రియాశీలత గల శరీరాన్ని వదలిపెట్టబోతూ, "వచ్చేసారి ఎక్కువ తక్కువలు లేకుండా, బాహ్యజీవితం ఎక్కువగా అవసరంలేనటువంటి పరిసరాలలో

పుడతాను, ఎక్కువ అధికారంగాని, ఎక్కువ దారిద్ర్యంగాని లేకుండా సమమైన మధ్యస్థజీవితం ఎంచుకుంటాను" అనుకుంటుంది. అప్పుడది, తన చైత్యలోకానికి తిరిగి వెళ్ళిపోతుంది. అక్కడ కావలసిన విశ్రాంతి తీసికొని, పొందిన అనుభవాన్ని జీర్ణించుకొని, భావి అనుభవానికి సంసిద్ధమవుతుంది. తిరిగి భూమిపైకి రావలసిన సమయం ఆసన్నమైనపుడు, ఎంచిపెట్టుకున్నదానిని గుర్తించుకుంటుంది. అది ఆలోకంనుంచి భౌతికజగత్తును మనం చూచినట్లు చూడలేదు. అది ఇంకొకరకంగా కనిపిస్తుంది. కాని, పరిసరాలలో తేడాను, పరిసరాలచర్యలలో తేడాను గమనించగలదు. దాని దృక్పథం సంపూర్ణమైనది. అది ప్రపంచాన్నంతా ఒకేసారి చూచి దానికి కావలసినది ఎంచుకుంటుంది. తనకు కావలసిన విద్య, సంస్కృతి, ప్రభావాలు ఏదేశంలో సందర్భపడతాయో అదేశాన్ని ముందుగా ఎన్నుకుంటుంది. ఒక్కొక్కసారి అలా చేయలేదు; పరిసరాలనూ, పొందవలసిన జీవితాన్నిమాత్రం ఎన్నుకుంటుంది. అక్కడనుంచే తనకు కావలసిన ప్రకంపనాలు ఎక్కడ ఉన్నాయోచూచుకుంటుంది; తను దిగబోయే స్థానాన్ని కంటితో చూచినట్లు స్పష్టంగా కనుక్కుంటుంది. కాని, అది సుమారుగానే సరిపోతుంది. ఎందువల్లనంటే, అది తాను దిగవలసినచోట కనబడే సుముఖత్వమూ ఆకాంక్షలపైన ఆధారపడి ఉంటుంది. ఆ ఎంచుకున్న వాతావరణంలో ఈవిధంగా సంసిద్ధులైనవా రుండాలి. ముఖ్యంగా తల్లి (ఒక్కొక్కప్పుడు తలిదండ్రు లిద్దరూ) కి ఈ విధమైన సంసిద్ధత, ఆకాంక్ష, ఉన్నతమైన దానికోసం ఉన్మీలనం అవసరము. అది ఒక వెలుగురేఖగా భాసించి చైత్యలోకంలోని చైత్యాత్మకు మార్గదర్శక మౌతుంది. అప్పుడది తన సంకల్పాన్ని ప్రక్షేపించి చూచి వెళ్ళవలసినచోటు ఇదేనని గుర్తిస్తుంది.

దీనివల్లనే, కొన్ని సంవత్సరాల తేడా లేకపోయినా, కొన్ని రోజులు, నెలలూ తేడా వస్తాయి; తాను ఏరోజున పుట్టేదీ నిశ్చయంగా చెప్పలేదు : "ఫలానా వారంలో, ఫలనా రోజున, ఫలానా క్షణంలో" జన్మించబోతున్నానని చెప్పలేదు. అది సంసిద్ధులైన వారిని చూచుకోవాలి. అటువంటివారు తటస్థపడినప్పుడు కిందకు దిగుతుంది. ఇదంతా ప్రతిబింబ ప్రాయముగా సంభవిస్తుంది. అది చైతన్యరహితమైన స్థాయిలోకి దిగుతుంది. ఎందువల్లనంటే, ఈ భౌతిక ప్రపంచం, మానవ చైతన్యంతో సహా, చైత్యపురుషుని చైతన్యంతో పోలిస్తే చాలా చైతన్య

రహితమైనదనే చెప్పవచ్చు. తలక్రిందులుగా పడినట్లు అది దిమ్మెరపోతుంది. ఏవో కొన్ని అరుదైన సందర్భాలలో తప్ప, దానికి చాలాకాలం వరకూ ఏమీ తెలియదు. ఎక్కడున్నదీ, ఏమి చేస్తున్నదీ, ఎందుకున్నదీ ఎంతమాత్రం తెలియదు. మెదడు సరిగా ఏర్పడని చంటిబిడ్డ ద్వారా తనను వ్యక్తం చేసుకోడం దానికి చాలా కష్టమౌతుంది. అది సరిగా ఏర్పడీ ఏర్పడని మెదడు అంకురం కాబట్టి, వ్యక్తం కావడానికి దానిలోని అంశములు సరిపోవు. తనలోని ప్రత్యేక జీవిని (చైత్యపురుష చైతన్యాన్ని) చంటిబిడ్డ వ్యక్తం చేయడం అరుదు. కాని జరుగవచ్చు. అటువంటివి చెప్పుకోగా విన్నాము. ఆ సుషుప్త్యవస్థనుంచి నెమ్మదిగా మేల్కొని వ్యక్తం కావడానికి, ఏదో ఒక కారణంవల్ల తన యిష్టప్రకారం కోరుకొని అక్కడ ఉన్నట్లు తెలుసుకోడానికి, కొంతకాలం పడుతుంది. మానసిక విద్యాబోధన ఆ సమయంలోనే ప్రారంభమై, చైత్యపురుషుని చైతన్యాన్ని మరుగుపరుస్తుంది. ఒక ప్రత్యేక కారణంగా, మరొకలోకంనుంచి వచ్చినట్లు గుర్తు చేయగం ఆంతరిక కవాటాలను తెరవడానికి కొన్నిరకాల పరిస్థితులు, కొన్ని సంఘటనలు, కొన్ని ఉద్వేగాలు అవసరమౌతాయి.

అంతా సహజంగా, సవ్యంగా జరిగిపోతే, చైత్యపురుషునితోడి సంబంధం చాలా తొందరగానే తెలుస్తుంది. అదృష్టం కలిసివచ్చి, అజ్ఞానంలో పడిపోకుండా కొంచెం జ్ఞానం కలవారి పరిచయం ఏర్పడితే, అంతా త్వరగానే జరిగిపోతుంది.

మామూలుధోరణిలో అందరూ అనుకునే న్యాయాలు, శిక్షలు, బహుమానాలు చైత్యసంకల్పానికీ, చైత్యఅభివృద్ధికీ వర్తించవు. కొన్ని మతాలు, తత్వశాస్త్రాలు ఇటువంటి అభిప్రాయాలనే అదృశ్యలోకాలకు అన్వయిస్తూ అనేకరకాలుగా కథలు చెపుతాయి. ఇవన్నీ పనికిరాని మాటలు. అది అలాకాదు. మానవుడు అర్థం చేసుకొనే శిక్షలు, బహుమానాలు అసంబద్ధమైనవి. అవి మన ఆంతర సత్యాలకు అసలు వర్తించవు. నీవు ఆధ్యాత్మిక ప్రపంచంలోకి ప్రవేశించినప్పుడు ఇవి అవక తవకలుగా గుర్తిస్తావు.

చాలామంది నా దగ్గరకు వచ్చి, "నేను ఇటువంటి క్లిష్టపరిస్థితుల్లో పడడానికి, నాకు ఇటువంటి అవాంతరం రావడానికి క్రిందటి జన్మలో ఏమిచేశాను?"

అని అడుగుతారు. దానికి నేను, "అది నీకు లభించిన దైవానుగ్రహంగా నీవు గుర్తించలేదా? నీవు బాగా పురోగమించడానికే క్రిందటి జన్మలో కోరుకున్నావేమో." అని చెప్పవలసివస్తుంది. ప్రస్తుతం వాడుకలో ఉన్న భావాలివి: "అయ్యో! నాకు ఒంట్లో బాగాలేదు, రుగ్మత ప్రవేశించింది. నేను ఏదో చేశాను; క్రితం జన్మలో ఏవో నేరాలు చేశాను"....ఇదంతా చిన్నపిల్లల తత్త్వము.

12 ఆగస్టు 1953

## కనులలోకి చూచినప్పుడు మీరు ఆ మనిషి గుణగణాలను ఎలా తెలుసుకో గలరు ?

అది కేవలం అతని కనులలోకి చూడడంకాదు. అతని ఆత్మను గుర్తించడం ద్వారా అతని తత్త్వం తెలుసుకుంటాను, నిజం చెప్పాలంటే, బాహ్యానికి కళ్ళు కవాటాల మాదిరి పని చేస్తాయి. ఆ కళ్ళలోని ఉన్మీలనంవల్ల చాలా లోతుకి వెళ్ళి అక్కడ జరిగేది చూసే అవకాశం కలుగుతుంది, మరికొన్ని సగం మూసి, సగం తెరచి ఉంటాయి. మధ్యన తెరవేసినవి కొన్ని. పూర్తిగా మూసుకుపోయి బంధించినట్లు తెరపడానికి వీలులేనివి కొన్ని కనిపిస్తాయి. ఆంతరిక జీవితానికి, జీవి విధేయతకు, స్వచ్ఛతకు గల పటుత్వాన్ని ఈ వివృతి సూచిస్తుంది. ఈ విధంగా వివృతమైన ద్వారాలలో నేను ప్రవేశించి లోనున్న వ్యక్తితో ఏకత్వం పొందుతాను. అతను చూచేదే నేను చూస్తాను. అతను అర్థంచేసుకున్నదే నేను అర్థంచేసుకొంటాను. అతను ఆలోచించిందే నేను ఆలోచిస్తాను. అతను చేసినదే నేను చేయగలను. (కాని నేను ఆవిధంగా చేయను.) ఈవిధంగా ఎవరెటువంటివారైనదీ తెలుసుకుంటాను. ఇదంతా చాలా త్వరగా అయిపోతుంది, ఎక్కువసేపు పట్టదు. ఫోటో చూచికూడా చెప్పవచ్చు కాని, అంతబాగాకాదు. మనిషిలోని ఒక లిప్తనేగదా ఫోటో గ్రహిస్తుంది. ఎక్కువ ఫోటోలుంటే.... ఫోటోలో కూడా బాగాలోతుగా వెళ్ళి చూస్తే, స్పష్టమైన భావం కనిపిస్తుంది. ఏ జ్ఞానమైనా ఏకత్వం పొందినప్పుడే కలుగుతుంది. అంటే, తెలుసుకోవలసిన దానితో తాదాత్మ్యం పొందాలి. ఊహించవచ్చు, తర్కించవచ్చు, ఆలోచించవచ్చు; కాని దానివల్ల జ్ఞానం కలుగదు.

అయితే అది మానవులకు కష్టమే.

కాదు, ఎందువల్ల?

తాదాత్మ్యం పొందడం ఎలాగో నేర్చుకోవచ్చు, అది తప్పక నేర్చుకోవలసిందే. అహంకారం పోగొట్టుకోవాలంటే అలా చేయక తప్పదు. అహంకారంతో ముకుళించుకుపోతే ఎవరూ పురోగమించరు.

అది ఎలా చేయాలి?

దానికి చాలా ప్రక్రియలున్నాయి. నీకొకటి చెపుతాను.

నేను పారిస్‌లో నివసించేటప్పుడు, అన్నిరకాల సమావేశాలూ, ఆధ్యాత్మిక తాంత్రిక పరిశోధనలూ జరిగే ఒకచోటుకు వెళ్ళేదానిని, ఒకసారి అక్కడ ఒక అమ్మాయిని కలుసుకున్నాను. ఆమె జ్ఞానసముపార్జన ప్రక్రియనొకదానిని కనుక్కుంది. మేము యిద్దరం, ముగ్గురం అక్కడ వింటున్నాము (ఆమెకు ఫ్రెంచి అంతబాగా రాదుకాని, తాను చెప్పేదేమిటో ఆమెకు బాగా తెలుసు), మాకు యిలా వివరించింది: నీవొక వస్తువును తీసుకో, లేదా బోర్డుమీద ఒకగుర్తుగాని ఒక బొమ్మగాని గీయి, ఏదైనా పర్వాలేదు. నేనే మీకోసం ఇక్కడ ఒక డిజైన్ గీస్తున్నాను" అని ఒకరకమైన డిజైన్‌లో సగం గీసింది. "దీని ముందు కూర్చుని నీ దృష్టి కేంద్రీకరించు. నీ చైతన్యంలోకి దేనిని ప్రవేశించనీయకుండా దానిమీదే దృష్టి నిలుపు. ఆ డిజైన్‌మీదనుంచి కళ్ళు మరల్చవద్దు. అది నిన్ను సమ్మోహపరుస్తుంది; అలా చూస్తూ ఉండిపో. (ఆమె అలా చూస్తూ కూర్చుండిపోయింది) అది ఎంతసేపైనా పట్టవచ్చు; అలవాటైనవారికి చాలా త్వరగా వస్తుంది. చూడగా చూడగా. నీవు చూచే డిజైన్‌గా మారిపోతావు. అది తప్ప నీకు ఇతరమేమీ కనిపించదు. హఠాత్తుగా నీవు దాని అవతలి పక్కకు వెళ్ళిపోతావు. అటు వెళ్ళగానే నీవొక నవచైతన్యంలోకి ప్రవేశిస్తావు.

అది మాకు వినోదం కలిగించగా మేము బాగా నవ్వుకున్నాము. నిజానికి అది అభ్యాసానికి చాలా అనువైన మార్గము. ఆ డిజైన్ బదులు ఒక భావాన్ని గాని, ఒక పదసముదాయాన్నిగాని తీసుకొని అభ్యసించవచ్చు. నీకొక తీరని సమస్య ఏర్పడి, సమాధానం తెలియక కొట్టుమిట్లాడుతున్నప్పుడు, నీ మనస్సులో సూటిగా, సంక్షిప్తంగా దానికొక రూపకల్పన చేసి దానిమీద మనస్సు లగ్నం చేయి, పరిశ్రమించు, ఆ పదాల మీదే మనస్సు నిలుపు, ఇంకా దానికి మూలమైన నీ సమస్యపై దృష్టి నిలుపు. దృష్టిని ఏకాగ్రం చేసిచేసి అది తప్ప అన్యం తెలియకుండా పోయేవరకూ దృష్టి కేంద్రీకరించు. ఉన్నట్లుండి ఏదో ఒకటి వివృతమై, రెండవ వైపుకి వెళ్ళిన భావం కలుగుతుంది. దేని రెండవ వైపు?.... అంటే, నీ చైతన్యంలో ఒక కవాటం తెరిచావన్న మాట, ఇక దాని వెనువెంటనే నీ సమస్యాపరిష్కారం లభిస్తుంది.

తాదాత్మ్యం 'ఏవిధంగా' పొందాలో నేర్చుకోడానికి యిది చక్కటి పద్ధతి.

ఉదాహరణకు, నీవు ఎవరితోనైనా మాట్లాడుతున్నప్పుడు, అతను చెప్పిన ఒక విషయం నీకు వ్యతిరేకంగా తోస్తుందనుకో (సాధారణంగా వ్యతిరేక ధోరణి వల్లనే ఇలా జరుగుతుంది). నీవు వాదించడం మొదలుపెడతావు. ఏ నిర్ణయానికీ రావు; చెడ్డ స్వభావం కలవాడివైతే పోట్లాట అవుతుంది. ఆ విధంగా నీ భావాలనూ, మాటలనూ పట్టుకొని వేళ్ళాడకుండా, "కొంచెంసేపు ఆగు; అతను చెప్పింది తెలుసుకోడానికి ప్రయత్నించి చూస్తాను. అతను నాకు ఆవిధంగా ఎందుకు చెప్పాడు?" అని మనస్సులో అనుకోవాలి. ఎందుకు? అనేదాని మీదనే మనస్సు లగ్నంచేసి ప్రయత్నించు. అతను ఆపకుండా మాట్లాడుతాడు కదా! నీవు అతనిని ఏమాత్రం వ్యతిరేకించకపోవడంవల్ల అతను చాల సంతోషిస్తాడు. మాట్లాడి మాట్లాడి చివరకు నిన్ను ఒప్పించాననుకుంటాడు. అతను చెప్పినదాని మీదనే నీ ఏకాగ్రత కొనసాగించి, ఆ మాటలద్వారా అతని మనస్సులో ప్రవేశించు. అతని మనస్సులోకి వెళ్ళినప్పుడు అతని ఆలోచనావిధానం నీకు వెంటనే తెలుస్తుంది, అతను అలా ఎందుకు మాట్లాడుతున్నాడో మరుక్షణంలో నీవు తెలుసుకుంటావు. సూక్ష్మబుద్ధి కలవాడివైతే ఇదివరకు నీకు తెలిసినదాని ప్రక్కన ఇప్పుడు తెలుసుకున్నది జతగా పెడతావు. అప్పుడు నీకు రెండూ

తెలుస్తాయి కాబట్టి, రెండింటినీ సమన్వయం చేసే నిజాన్ని తెలుసుకుంటావు. అలాచేస్తే నీవు తప్పక పురోగమిస్తావు. ఆలోచనను వృద్ధిచేసుకోడానికి ఇదే సరియైన మార్గం.

నీవు వాదన మొదలుపెట్టబోతుంటే వెంటనే మాటలాడడం మానేయి. మౌనం దాల్చి, ఎదుటి మనిషి ఆవిషయాన్ని ఎలా చూస్తున్నాడో నీవూ అలాగే చూడడానికి ప్రయత్నించు. అప్పుడు ఆ రెంటినీ ఏకం చేయగలవు. అలాచేస్తే నీవు పురోగతి సాధించినట్లే.

అన్నిటికీ అదే వర్తిస్తుంది. నీవు ఇతరులతో కలిపి చేసే పనులలో ఏదైనా భేదాభిప్రాయం కలిగితే, దానిని దైవకృపగా భావించి, పురోగమించడానికి ఒక మంచి అవకాశంగాతీసుకోవాలి. అది చాలా తేలిక! నీవు ఈవైపున ఉండే బదులు అవతలివైపుకే వెళ్ళుతావు. నీవైపే నీవు చూచుకొనే బదులు ఎదుటివారిలోకి వెళ్ళి చూస్తావు. కొంచెం ఊహించ గలగాలి, నీ భావాలనూ చలనాలనూ అదుపులో పెట్టుకోవాలి. అది ఏమంత కష్టంకాదు. నీవు ఏమాత్రం ప్రయత్నించినా కొద్దిసేపటికి అది చాలా తేలిక అని గమనిస్తావు.

ఊరికే చూస్తూ, మానసికంగా ప్రయత్నంచేసి, "ఇది యిలా ఎందుకు ఉంది? అతను ఆవిధంగా ఎందుకు చేస్తాడు? ఆ విధంగా ఎందుకు చెపుతాడు?" అనుకుంటే ప్రయోజనంలేదు. ఆ విధంగా ఏమీసాధించలేవు. నీకు అర్థంకాదు. అన్నిరకాల నిరూపయోగమైన సమాధానాలనూ ఊహిస్తావు. "ఆమనిషి బుద్ధిహీనుడు, కుటిలుడు" అనుకోవడం తప్ప నీకేమీ తెలియదు. ఎదుటనున్నవారిని ఏదో కొత్తవస్తువును చూచినట్లు చూచే బదులు, అతనిలోకి ప్రవేశిస్తే, అవతలవైపు ఏముందో తెలుసుకోగలవు. అప్పుడు అతనిలోనుంచి నిన్ను చూచుకుంటే అతను చెప్పేది బోధపడుతుంది. దానివెనుకనున్న కారణం, భావం మొదలైనవన్నీ స్పష్టమౌతాయి. రోజుకి కనీసం వందసార్లైనా చేయగల అవకాశం కల్పించే ప్రయోగం యిది.

మొదట్లో ఏమంత ప్రయోజనం కనిపించదు, కాని, నీవు గట్టిగా ప్రయత్నిస్తే చక్కగా సఫలమౌతుంది. ఇదే జీవితానికి ఉత్సాహాన్ని కలుగచేస్తుంది. ఇంకా నీవు బాగా పురోగమించేటట్లు చేస్తుంది. దీనివల్ల నీవు నీచుట్టూ ఏర్పరుచుకున్న కవచంలోనుంచి బయటపడతావు. ఆ కవచంలోనే ఉండిపోతే దీపప్పురుగులు దీపంతో తలపడుతున్నట్లుగానే నీవు కూడా అన్నిటితోనూ ఢీకొడతావు. ప్రతివారిచైతన్యమూ ఆ విధంగానే అన్నిచోట్లా ఢీకొంటుంది. అవన్నీ దానికి కొత్తగదా! ఇలా ఢీకొట్టే బదులు లోపలికి ప్రవేశిస్తే, అది వారిలోని భాగమే అవుతుంది, ఆ విధంగా విశాలమౌతారు. స్వేచ్ఛగా గాలి పీల్చుకొని, స్వేచ్ఛగా తిరుగుతారు. దేనికీ కొట్టుకోకుండా ప్రవేశించి, చొచ్చుకొని పోయిచూచి అర్థం చేసుకుంటారు; ఒకేసమయంలో చాలా చోట్ల నివసిస్తారు. అదంతా చాలా ఉత్సాహవంతంగా ఉంటుంది. దానంతట అదే జరిగిపోతుంది.

ఉదాహరణకు, నీవు చాలా ఉద్వేగ భరితం, సాహసోపేతం, అద్భుతం అయిన నవలను చదువుతూ, అందులో లీనమైపోతే, ఒక్కొక్కసారి నీక్లాసునూ, నిద్రాహారాలను కూడా మరచి పోతావు చదివేదానిలో పూర్తిగా నిమగ్నమైపోతావు. ఇదే తన్మయత్వము. నీవు కొంత పరిపూర్ణుడివై ఇలాచేస్తే జరుగబోయేది నీకు ముందుగా తెలుస్తుంది. కథలో పూర్తిగా నిమగ్నమైతే ఒకానొక క్షణంలో గ్రంథకర్త చివరకు ఎక్కడికి తీసుకువెడతాడో, కథ నెట్లా విడమరుస్తాడో, ఎలా సమాప్తం చేస్తాడో మొదలైనవన్నీ నీకు బోధపడుతాయి. గ్రంథకర్త కథన విధానంతో నీవు తాదాత్మ్యంపొందావన్నమాట. నీవు చేస్తున్నట్లు నీకు తెలిపి చేయకపోయినా నీవు పరిపూర్ణంగా చేస్తావు. ఇవన్నీ తన్మయత్వానికి సంబధించిన విశేషాలు.

పారిస్‌లో కొన్ని చవకబారు నాటకశాలలున్నాయి. అక్కడ ఉద్వేగభరితమైన నాటకాలాడుతారు. ఊరిశివార్లలోని ఈ నాటకశాలలకు మేధావులెవ్వరూ వెళ్ళరు. పాటకజనమే ఎక్కువగా వెళ్ళుతారు. అందులోని అంశాలన్నీ ఆకస్మిక చలనాలకు సంబంధించినవి. అక్కడికి వెళ్ళేవారంతా అతిసామాన్య మనస్కులు గావడంవల్ల, వారు నాటకశాలలో ఉన్నట్లే మరచిపోయి, నాటకంతో తన్మయులౌతారు. అప్పుడు యిటువంటివి జరుగుతాయి : రంగస్థలం మీద

విద్రోహి తలుపువెనకాల నక్కుతాడనుకోండి. అది తెలియని కథానాయకుడు రంగంమీదకు ప్రవేశిస్తాడు. ద్రోహి అతనిని చంపడానికి పొంచి ఉన్నాడు కదా. వెనక దూరాన కూర్చుని చూస్తున్న వారు "అదుగో, వెనక్కుచూడు. వాడక్కడే వున్నాడు" అంటూ అరుస్తారు, (నవ్వులు) ఒకసారి కాదు ఇలా జరగడం, కొన్ని వందలసార్లు జరుగుతుంది. నేను ఇలాగే 'లెబూసో' అనే నాటకం చూచాను, అదీ ఉద్రేకపూరితమైనదే. నాటకంలో ఒకపెద్దగది, దాని ప్రక్కనే ఒక చిన్నగది ఉన్నదృశ్యము. నాకు కథ అంతబాగా గుర్తులేదు గాని, చిన్నగదిలోని ఒక మీటనొక్కితే పెద్దగదిలోని పైకప్పు మీదపడి అక్కడున్న వారంతా హతమారిపోతారు....దానినిగురించి ముందుగానే ఒక హెచ్చరికవచ్చింది, అక్కడున్న వారంతా అదే మాట్లాడుకుంటున్నారు. చిన్నగదిలో ద్రోహి దాక్కున్నాడు. ఈ మీట సంగతి అతనికి తెలుసు. కథానాయకుడు మిగిలిన వారితో పెద్దగదిలోకి వచ్చివాదనలోకి దిగుతాడు. పైకప్పు క్రిందపడుతుందని ప్రేక్షకులందరికీ తెలుసు....నేను నాటకశాలలోనే ఉన్నప్పటికీ పైకి ఏమీ అనకుండా, ఈ పరిస్థితినుంచి నాయకుణ్ణి గ్రంధకర్త ఎలా తప్పిస్తాడో చూద్దామని నిరీక్షిస్తున్నాను. (అందరిముందూ కథానాయకుణ్ణి అలా చంపేస్తాడనుకోము కదా.) కాని ఇతరులు ఆపరిస్థితిలో లేరు, వారు "చూచుకో, జాగ్రత్త, పైకప్పు కూలిపోతుంది" అని అరవడం ప్రారంభించారు. తన్మయత్వం అంటే ఇదే.

ఈ తాదాత్మ్యం అనుకోకుండా జరిగిపోతుంది. ఈ రోజులలో నాడీవ్యాధులను కుదర్చడానికి కూడా ఈ పద్ధతి అనుసరిస్తున్నారు. ఎవరైనా ఉద్వేగం ఎక్కువై, ఆందోళనవల్ల విశ్రాంతి తీసుకోలేక పోయినా, నరాల బలహీనతకు లోనైనా, నిద్రలేమిచే బాధపడుతున్నా, (అక్వేరియం) చేపలతొట్టె ముందు కూర్చోపెడతారు. అందులో చిన్నచిన్న బంగారు రంగు చేపలు ఆహ్లాదకరంగా తిరుగుతుంటే, అతనిని పడకకుర్చీలో కూర్చోబెట్టి ఆలోచనా రహితంగా చేపలవైపు చూడమంటారు. అప్పుడు అతను ఆ చేపలు తిరగడం, ఈదడం, మునకలు వేయడం, ఒకదానినొకటి తరుముకుంటూ ఆటలాడడం, నీరు మెల్లగా కదులుతుంటే దానితోబాటు పోతూండడం చూస్తూ కూర్చుంటాడు, కొంతసేపటికి తానే చేపజీవితం గడుపుతున్నట్లు భావిస్తాడు.... తనే ఈదుతున్నట్లు, మునకలు

వేస్తున్నట్లు, ఆడుతున్నట్లు భావిస్తాడు. ఒకగంట తర్వాత అతని నరాల ఉద్రిక్తత తగ్గి మామూలుగా, విశ్రాంతుడవుతాడు.

తమ కష్టాలను గురించి ఏమాత్రం ఆలోచించకుండా చేపలవంకే చూడా లనేది యిందులో నియమము.

దైవాన్ని కూడా ఈ విధంగానే చేరుకోవచ్చా ?

దైవాన్ని తెలుసుకోవాలంటే దైవంతో తాదాత్మ్యం పొందడమే ఏకైక మార్గము. ఈ రకమైన తాదాత్మ్యమార్గం నీకు తెలుస్తే నీవు తన్మయం కాగలవు. దేనితో తాదాత్మ్యం పొందాలో ఎంచుకోగలవు దైవంతో తాదాత్మ్యం పొందాలనుకుంటున్నావు గదా, నీకు తన్మయత్వం పొందడం తెలియనంత కాలం, నీ మార్గానికి అనేకమైన అంతరాయాలు ఏర్పడి నిన్ను యిటూ అటూ ఊపి దైవంతో తాదాత్మ్యం పొందకుండా చేస్తాయి. తన్మయత్వం పొందడం నేర్చుకుంటే ఆ తన్మయత్వాన్ని ఎక్కడపొందాలో ఎంచుకోడం తరువాత చేయ వలసిన పని; దానిని ఎక్కడ పొందాలో తెలుసుకొని, ఫలితం కనబడే వరకూ ఆ స్థానంలోనే నిలవాలి. తాదాత్మ్యం పొందగల శక్తి నీ అధీనంలోనే ఉన్నట్ల యితే, అది చాలా త్వరగానే వస్తుంది. శ్రీ రామకృష్ణపరమహంస మూడు రోజులలోగాని, మూడు గంటలలోగాని, మూడు నిమిషాలలోగాని రావచ్చునని చెప్పేవారు. చాల నెమ్మదిగా వెళ్ళేవారికి మూడు రోజులు, కొంచెం త్వరగా వెళ్ళే వారికైతే మూడు గంటలు, బాగా అలవాటైన వారికి మూడు నిమిషాలు పట్టుతుంది.

చాల నెమ్మదిగా వెళ్ళే వారికి మూడు రోజుల్లోనే సిద్ధిస్తుందా ?

అవును. మూడు రోజులే. దైవంతో తాదాత్మ్యం పొందడానికి ఎంత కాలం పడుతుందని ఒకరు అడిగితే శ్రీ రామకృష్ణులు ఆ విధంగానే చెప్పారు.

అంటే ఇంకేమీ చేయకుండా మూడు రోజులనా అర్థము ?

ఏమీ చేయకుండా కాదు. దైవంతో తాదాత్మ్యం పొందాలంటే ఏపనీ చేయకుండా కూర్చోవాలని కాదు. ఏమీ చేయకుండా, కదలకుండా, మెదలకుండా మూడు రోజులపాటు కూర్చోలేవు. నీవు అలా చేయగలిగితే నీకు అసాధారణమైన పరిపూర్ణత లభించినట్లే. నీ అవసరాలన్నీ విస్మరించి కదలకుండా మూడు రోజులు కూర్చోగలగడం విశేషమే. ఆయన ఉద్దేశ్యం అదికాదు; ధ్యాస ఒక్కటే దైవం మీద నిలుపుకోవాలి. తను చెప్పినది నిజమని నిరూపించడానికి ఆ అడిగినవ్యక్తి ముందేచేసి చూపించారు. అది మూడు నిమిషాలకంటె ఎక్కువ పట్టలేదు.

ఏకాగ్రత అలవాటు లేకపోతే అనుభవం రావడం ఆలస్యమౌతుంది. అదీ గాక, సూటిగా ఏకైకలక్ష్యం, సంకల్పం లేకపోవడంవల్లకూడా అనుభవం ఆలస్యమౌతుంది. సాధారణంగా ఒక నిమిషం గాని, రెండు నిమిషాలు గాని, పది నిమిషాలుగాని, పావుగంటగాని, ఒక గంటగాని ఒకే విషయముపై ఏకాగ్రతను కోరి కూర్చోగలరు. ఇంక ఆ తరువాత అనేక విషయాలు కావలసివస్తాయి. ఒక పది సెకనులు దానినిగురించి ఆలోచించి ఆ తర్వాత వేయినొక్క విషయాలను గురించి ఆలోచిస్తారు. ఈ విధంగాచేస్తే నీకు యుగాలు పట్టవచ్చు. ఈ పద్ధతిలో నీవు కూడబెట్టలేవు: ఏకాగ్రత నిలిపి కొంచెంసేపు కూర్చొని, తర్వాత ఇతర విషయాలను ఆలోచిస్తూ. అప్పుడప్పుడు దైవాన్ని స్మరిస్తూంటే, అదంతా కూడి పెద్ద మొత్తంగా ఏర్పడుతుంది; అని అనుకోరాదు. అది ఆ విధంగా రాదు, దానివల్ల ఏమాత్రం లాభంలేదు. అది అలా సంచిత మయ్యేది కాదు, దానికి నీవు అలా చేర్చలేవు, గుణాత్మకంగా పురోగమించగలవు గాని పరిమాణాత్మకంగా పురోగమించ లేవు. ఏలా చేయాలో తెలుసుకోగలుగుతావు; చేసిందంతా ఇందుకే పనికి వస్తుంది, అంతేకాని, ఇసుకరేణువులన్నీ కలిసి తిన్నె ఏర్పడినట్లు నీవు చేసిందంతా ప్రోగుకాదు. అలాగనుక అయితే,— "మంచిది, ప్రతిరోజూ కనీసం డజనుసార్లు దైవాన్ని స్మరిస్తాను," అనుకునేటట్లు చేసే తెలివి

తేటలు కలుగుతాయి. "ఆ విధంగా కొద్దికొద్దిగా కూడబెడితే అవి పెరిగి కొండంత అవుతాయి" అనుకుంటావు.

ఇంకేమైనా ప్రశ్నలుంటే అడగండి.

ఒక ప్రశ్న ఉంది.

అది ఆసక్తికరమైనదేనా?

నా మటుకు నాకు ఆసక్తికరంగానేఉంది. కొంత మంది అతి ప్రజ్ఞావంతులుగానూ, కొంతమంది మరీ తెలివి తక్కువవారుగానూ, ఉంటారు, ఎందువల్ల ?

ఎందువల్లనంటే, సృష్టి అనేకరకాలు గదా! ఏ రెండూ సమానంగావు కదా. ప్రకృతిలో అన్నిరకాలూ సాధ్యమే. నీవు ఊహించగలిగినదానికంటె కొన్నిలక్షలు ఎక్కువగా ఏర్పడతాయి. అందువల్లనే నీకు కొంతమంది మేధావులు. మరికొంతమంది బుద్ధిహీనులు కనిపిస్తారు. ఇంకా కొంతమంది కుదురులేనివారు తటస్థపడుతారు. నీ దృష్టి పరిమితము; కాని, ప్రకృతిలో చూస్తే, యిదంతా సహజమనీ, యిది కాకుండా యింకా కొన్ని లక్షల సంఖ్యలో ఇతరములు కూడా ఏర్పడ్డాయనీ, ఏ రెండూ ఒకేరకంగా రూపొందవనీ నీకు తెలుస్తుంది. ఎక్కడో ఒకచోట రూపొందిఉంటే గాని మానవుడు దేనినీ ఊహించలేడని నా నమ్మకము. ప్రకృతికి సంతోషదాయకమైనది యిదే. ఆమె ప్రతిదీ ప్రయత్నించి, ఆకృతి నేర్ప రచి, దానినిమార్చి, కూర్చి, మళ్ళీకూర్చి అనేకరకాల సముచ్చయాలుగా రూపొం దిస్తుంది. ఒకదానినొకటి అనుసరిస్తూ, ఒకదానితో ఒకటి సంఘర్షిస్తూ, కలిసి పోయి, మళ్ళీ విడిపోయి సంచరించే ఒక ఎడతెగని చలనం యిది. పృథ్వీ జీవ నంలో ఏరెండు చలనాలూ సమానం కావు. భూమి ఉద్భవించి ఎంతకాలమైంది ? బాగాతెలిసినవారు నీకు దానిని గురించి సుమారుగా చెపుతారు. అది ఇంకా ఎంత కాలం ఉంటుంది? వారు అదికూడా చెపుతారేమో! ఆ సంఖ్య చదవడానికి వీలు లేనన్ని సున్నాలతో తయారవుతుంది. అయినప్పటికీ ఏదీ రెండుసార్లు జరుగదు.

ఏరెండు చలనాలూ ఒకటిగా ఏర్పడవు. రెండూ ఒకేవిధంగా ఉన్నాయనుకుంటే అది కేవలం బాహ్య ఆకృతిలో మాత్రమే. వెనక్కి వెళ్ళినా ముందుకు పోయినా ఏరెండు చలనాలూ సమానం కావు, కాబట్టి ఇది ఎందుకు ఉన్నది ? అది ఎందుకు ఉన్నది? అని నీవడగలేవు. నీవు ఎందుకు ? అని అడగాలనుకున్నావు. ప్రకృతికి నీకంటే ఎక్కువ ఊహాశక్తి ఉంది. ఆమె ఎల్లప్పుడూ కొత్తవాటిని ఊహిస్తుంది. అది ఆవిధంగా రూపొందడం ఎందుకు? అంటే అదెప్పుడూ మారుతోంది కదా! ఈ సముచ్చయాలు ఎప్పుడూ నవీనమే. ఈ విశ్వంలో ఏరెండు క్షణాలూ ఒకటికావు. ప్రకృతికి ఊహ ఎక్కువ. దానిని గురించి నీవెప్పుడూ ఆలోచించనే లేదా? నీకు ఎప్పుడైనా ఒకే రకమైన చలనాలు ఏర్పడ్డాయా? లేదు. నీవు నిన్న ఉన్నట్లు ఈ రోజు లేవు. అదే విధంగా ఈరోజు ఉన్నట్లు రేపు ఉండవు. నీవు ఒక పది సంవత్సరాలు వెనక్కి తిరిగి చూస్తే నిన్ను నీవే గుర్తించుకోలేవు. అప్పుడేమి ఆలోచించేవాడివో గూడా నీకు తెలియదు.

అందుచేత సమస్యేలేదు. నీవు చేయగలిగినది ప్రయత్నించడం ఒక్కటే. అన్ని సాధ్యతలూ పరిశోధించడానికి నీకు గల పరిమిత అవకాశాన్ని నీవు వినియోగించి చూడు. నీవు వాటిని గమనించడం ప్రారంభిస్తే కొద్దిలో అవన్నీ కలిపి ఒక పెద్ద గ్రంథం అవుతుంది. ఇదంతా నీదైన ఆ కొద్దిక్షేత్రములో జరిగినదే.

నీవనగా ఎంత? అనాద్యనంతకాలములో ఒక్క క్షణమాత్రుడవు.

19 ఆగస్టు 1953

"ప్రేమ మానవులకు మాత్రమే పరిమితం కాదు, పైగా అది మానవులలో కన్నా యితర పరిధులలో తక్కువ వికృతరూపం చెందింది. పూలు, వృక్షాలు చూడు. సూర్యాస్తమయమై, అంతా నిశ్శబ్దమైనప్పుడు, నీవు స్థిమితంగా ప్రకృతిలో లీనమైపో, చెట్లవేళ్ళ దగ్గర

నుంచి భూమిపైకి లేస్తూ, ఆ చెట్టులోని నారపీచు ద్వారా చిటారుకొమ్మల వరకూ వ్యాపించే ప్రగాఢ మైన ప్రేమాపేక్షల ఉత్కంఠ రూపమగు అనుభూతిని నీవు పొందుతావు. వెలుగును తెచ్చి ఆనందం కలిగించేదానికోసమై అపేక్షించడమూ, పోయిన వెలుగును తిరిగి పొందాలనుకోడమూ ఈ వృక్షాలకు పరిపాటి. స్వచ్ఛమైన ఆ తీవ్రోత్కంఠను, వృక్షాలలోని ఆ చలనాలను నీవు తెలిసికోగలిగితే, ఈ భూమిమీద అవ్యక్తమైన శాంతి, వెలుగు, ప్రేమల కొరకై అపరిమిత ఉత్కాంక్షతో నీ జీవి కూడా పైకి లేచి ప్రార్థించడం ప్రారంభిస్తుంది.

ప్రశ్నోత్తరములు 1929 (2 జూన్)

వృక్షాలు ఆకాంక్షించే ఆ వెలుగు ఏది ?

సూర్యుడే ఆ వెలుగు. సూర్యాస్తమయమై చీకటి పడగానే ఆకులు ముడుచుకోడం నీవు చూడలేదా ?

వృక్షాలు మరి దేనికోసమైనా ఆకాంక్షిస్తాయా ?

మరి దేనికోసమో అంటే? వృక్షాలకుండే అవకాశాలేమిటి?

మానవజన్మకోసం కావచ్చుగదా !

మనిషిజన్మా? వాటికి మానవులను గురించి ఏమీ తెలియదే! మనిషి దేవుడు కావాలని ఆకాంక్షించిన విధంగానా?.... మానవజన్మకోసం ఆకాంక్షించిన జంతువులు కొన్ని నాకు తెలుసుగాని, అవి మనుష్యుల మధ్య నివసించినవే. మను

ష్యల మధ్య పెరిగే పిల్లులూ, కుక్కలూ ఈ విధంగా మనుష్యజన్మకోసం ఆకాంక్షిస్తాయి. ఒక పిల్లి ఈ విధంగా తన జన్మతో చాలా అసంతృప్తి చెందుతూ, మనిషిగా కావాలనుకునేది. దాని పద్ధతిలో అది సాధనచేస్తూ ధ్యానంలో నిమగ్నమయేది. అది అనుకోకుండా అకాల మృత్యువును పొందింది. దాని ప్రాణమయ జీవిలోని భాగంతోసహా అది పూర్తిగా మనిషిలో ప్రవేశించింది. దానిలోని చిన్న చైత్యాంశ సూటిగా ఒక మానవునిలోకి వెళ్ళిపోవడమే కాకుండా దాని కొద్దిపాటి ప్రాణమయ చైతన్యంకూడా మనిషిలో ప్రవేశించింది. కాని యిటువంటివి అసాధారణంగా జరుగుతాయి.

అయితే మీరు శిలలు కూడా ప్రేమానుభూతిని పొందుతాయంటారా ?*

అది సంభవమే.

అది తెలుస్తుందా ?

అది అనుభూతిగా తెలుస్తుంది. దివ్యప్రేమానుభూతి పొందగల ఒకానొక చైతన్యస్థాయిలో ఆ దివ్యప్రేమ ఎక్కడున్నా కనిపెట్టగలరు; కాని, భౌతికంగా అది ప్రాణులమధ్య గోచరిస్తుంది గనుక అంతటి తారతమ్యం అక్కడ తెలియదు. మనం జడపదార్థాలుగా అనుకునేవాటిలోనే మనం అనుకున్నదానికన్న ఆకాంక్ష అధికం. చాలాఎక్కువ. అంతే కాకుండా, రాళ్ళు ఉన్నతమైన దానిని, ఉదార

* ప్రేమ సార్వత్రికము, శాశ్వతము; తనకు తానుగా అభివ్యక్తమవుతూ, అయినచోట సారూప్యం పొందుతుంది. అది ఒక దివ్యశక్తి. అది వ్యక్తమయిన చోట విరూపత కనిపిస్తే వ్యక్తంచేసిన ఉపకరణాలే అందుకు కారణం. అది మానవులలో మాత్రమే కాకుండా సర్వత్రా వ్యక్తమవుతుంది. వృక్షాలలో దాని చలనాన్ని గమనించవచ్చు, శిలలలో కూడా చూడగలమేమో; కాని జంతుకోటిలో దానిని కనుక్కోడం తేలిక.

ప్రశ్నోత్తరములు 1929 (జూన్ 2)

మైన దానిని, స్వచ్ఛమైన దానిని సహజంగా తెలుసుకోగలవు. అవి ఏరకంగానూ వ్యక్తం చేసుకోలేకపోయినప్పటికీ అనుభూతిని పొందుతాయి; దాని ప్రభావంవల్ల వాటిలో మార్పు వస్తుంది.

ఈ విధమైన దివ్యానుభూతివల్ల వస్తుజాలంలో, జడ పదార్థాలలోసైతం, రాళ్ళలోసైతం గ్రహణశీలత పెరుగుతుంది. రాళ్ళు శక్తులను గ్రహించి కూడబెట్ట గలవు. ఆవిధంగా కూడబెట్టిన శక్తిని అవి ప్రసారంచేస్తాయి. నీకు ఆ విధానం తెలిస్తే బాగా అర్థం చేసికోగలవు. మేలురకపు రత్నాలను తీసుకొని వాటిలోకి కొన్ని శక్తులను కేంద్రీకరించి జాగ్రత్త పెట్టవచ్చు. వాటిని అవి మెల్లగా, క్రమక్రమంగా, ప్రసారం చేయడం ప్రారంభిస్తాయి. అది ఎలా చేయాలో తెలుసుకుంటే తరగని శక్తిని అందులో నిక్షేపించవచ్చు.

ఆ విధంగా వాటిలోనుంచి వచ్చిన శక్తి ఏమైనా ఉపయోగిస్తుందా ?

తప్పకుండా ఉపయోగిస్తుంది. కాలపరిమితి లేకుండా ఆ శక్తిని అవి నిలవ చేయగలవు. కొన్ని రత్నాలు శక్తిని నిలవచేసేవిగాను, మరికొన్ని ఒకవిధమైన లంకెగాను పని చేస్తాయి. కొన్నిరాళ్ళు రక్షణశక్తిని పొందుపరుచుకుంటాయి. అంటే, ఎవరైనా ఒక రత్నాన్ని (ముఖ్యంగా ఊదారత్నం) తీసుకొని దానిలో రక్షణ శక్తిని పొందుపరచవచ్చు. ఆ రత్నం ధరించిన వారిని ఆశక్తి రక్షిస్తుంది. ఇది చాలా ఉత్సుకత కలిగించే విషయం. ఆ విధంగా రక్షణశక్తిని నిక్షేపించిన రత్నాన్ని ధరించినవారి నొకరిని చూచాను. ఆయన దానిని ధరించినప్పుడు అద్భుతంగా కనిపించేవారు. మరికొన్ని ప్రస్తరాలను భవిష్యత్తు చెప్పడానికి ఉపయోగించవచ్చు; కొందరు వాటిలోకి చూచి భవిష్యత్తు చెప్పగలరు. మరికొన్ని రాళ్ళు సందేశాల నందించగలవు. అలా చేయడానికి రెండురకాల సామర్థ్యం అవసరం, ....తగినంతగా మనస్సును ఏకాగ్రం చేయగలశక్తి ఒకటి; నేరుగా అందులోకిచూపి, మాటలతో నిమిత్తం లేకుండా తెలుసుకోగలశక్తి రెండవది. అంటే, అవి బాటరీ మాదిరిగా పనిచేయగలవు కాబట్టి ఆశక్తికి ఆధారం కూడా వాటిలోనే నిలుపుకుంటాయి. అట్లాకాకపోతే వాటికి గ్రహణశీలత కలుగదు. స్ఫటికాలు ఏర్పడే

టప్పుడు ఈ శక్తి ఆధారమౌతుంది. రమణీయమైన వైవిధ్యం, పరిపూర్ణ సామరస్యం గల శిలాస్ఫటికాలు అలా ఏర్పడడానికి కారణం వాటి కేంద్రంలో ఉన్న ఆ దివ్యశక్తి పుంజమే. తగినంత సున్నితత్వం లేకపోవడంవల్ల దీనిని అందరూ తెలుసుకోలేరు, కాని వస్తువుల వెనుకగల ప్రేమశక్తులను సూటిగా గ్రహించగలిగితే, అది అంతటా ఒకటే కావడం గమనించగలరు. మానవ కల్పిత నిర్మాణాలలో గూడా ఆ విధానం గమనించి, అవి ఏమి చెపుతున్నాయో తెలుసుకోవచ్చు.

తల్లీ. పూలు ఇచ్చినప్పుడు మీరు వాటి సాంకేతార్థం ఎలా చెపుతారు ?

పూలకి కూడా అదే పద్ధతి. ఆ పూల స్వభావంతోను దాని ఆంతరిక సత్యంతోనూ సంస్పర్శ పొందితే, అవి దేనిని తెలియజేస్తున్నాయో అవగతమవుతుంది.

అమ్మా, ఒక రోజున మీరు 'దైవం' అని చెప్పే దానికి, మేము 'దేవు' డనేదానికి తేడాను వివరిస్తామని చెప్పారు.

అది ఇప్పుడే కాదు, అనేక సంవత్సరాల తర్వాత అని చెప్పాను. మీకు ఇంకా వయసు రావాలని చెప్పాను. నాకు గుర్తులేదు కాని వయఃపరిమితి కూడా చెప్పాను. ఎందువల్లనంటే, అది గ్రహించడానికి మీ మెదడు కొంచెం ఎదగాలి.

గొప్పదైన ఈ దివ్యశక్తి విరూపం చెందడానికి కారణం ఆ పరిమితోపకరణపు అజ్ఞానమూ, స్వార్థపరత్వమే. ప్రేమ శాశ్వతమైన శక్తి; దానికి అంటిపెట్టుకునే స్వభావం గాని, వాంఛగాని, లోభంగాని, స్వకీయమైన అనుబంధంగాని లేవు. దైవంతో ఆత్మైక్యం కోసం అన్వేషణే స్వచ్ఛమైన ప్రేమ

లక్షణం. ఆ అన్వేషణలో దానికి ఏమీ అడ్డం రావు, అది దేనినీ లెక్కచేయదు. దివ్యప్రేమ తనను తాను అర్పించుకోడంలో ఏమీ ఆశించదు. కాని దానిని మానవులు (ఎలా తయారు చేశారో చెప్పనక్కర లేదు) వికృతం చేసి అసహ్యంగా తయారు చేశారు. అయినప్పటికీ మానవులతో దానికి ప్రథమ సంస్పర్శ కలిగినప్పుడు, స్వచ్ఛమైన దాని లక్షణాన్ని వదలిపెట్టదు; ఆ క్షణంలో వారికి వారు మరచిపోగలుగుతారు. దాని దివ్య సంస్పర్శ వారిలోని సౌకుమార్యాన్నీ, సౌందర్యాన్నీ మేల్కొలిపి, పెంపుచేస్తుంది. ఆ తరువాత అది అలా నిలువదు. వారి స్వభావంతో మలినపడి, యిస్తున్న దానికి బదులు కోరడం, వినిమయం చేయడం, నీచ పరితృప్తికోసం ఆర్భాటం చేయడం, దానిలోని దివ్యత్వాన్ని వికృతపరచుకొని, మలిన పడడం జరుగుతుంది.

ప్రశ్నోత్తరములు 1929 (2 జూన్)

మానవు లెప్పుడూ తాము ఇస్తున్నదానికి ఏదో ఒక ప్రతిఫలం కోరుతారెందుకు ?

వారిలో వారు మూసుకుపోవడమే దానికి కారణం. తమ పరిమితులను తాము అర్థం చేసుకోడం వల్ల. అభివృద్ధి కావాలన్నా, పరిపుష్టిచెందాలన్నా, చివరకు జీవించాలన్నా కూడా, బాహ్యవస్తువులను గ్రహించక తప్పదని అనుకుంటారు. వారి చైతన్యాన్ని పరిమితం చేసుకోవడంవల్లనే ఆవిధంగా అనుకుంటారు. వారు యిచ్చినదాని స్థానంలో ఖాళీ ఏర్పడుతుందనీ, ఆ ఖాళీని భర్తీ చేయడానికి ఏదో ఒకటి సంగ్రహించాలనీ వారి ఉద్దేశ్యం!....అది పొరపాటు గదా. నిజానికి వారు

తమ అల్ప వ్యక్తిత్వ పరిధులలో మూసుకొనిపోకుండా తమ చైతన్యాన్ని విస్తృతం చేసుకోవచ్చు. అప్పుడు, తమ సంకుచిత పరిధులలో ఇతరులతో తాదాత్మ్యం పొందడం కాకుండా, వాటిని అధిగమించి, అంతటా విస్తృతిపొంది, ఆ పరమ చైతన్యంతో ఏకమై అన్ని వస్తువులతోనూ ఏకత్వాన్ని పొందగలరు. ఆక్షణం వచ్చినప్పుడే సంకుచిత పరిధులు తొలగిపోతాయిగాని, అంతకుముందు పోవు. సంకుచిత పరిధులనుగూర్చి ఆలోచిస్తున్నంతకాలం, కోల్పోతామేమోననే భయంతో సంగ్రహించాలని ప్రయత్నిస్తారు, ఖర్చుచేసినదాన్ని పూడ్చుకోవా లనుకుంటారు. దానికంతటికీ ఆ పరిధులున్నాయని భావించడమే కారణం, అట్లాకాకుండా, విస్తరించుకొని, లోపలికి వచ్చిపోయే ప్రకంపనాలన్నీ అన్నిటిలోనూ ఏకమై పోవాలని, యింకా విస్తృతం కావాలని, హద్దులు పెట్టుకోకుండా బయటకువచ్చి అభివృద్ధి పొందాలని అనుకొని అన్నిటిలోను తాదాత్మ్యం పొందితే, ఏమీ కోల్పోనక్కర లేదు. అన్నీ వారికే ఉంటాయి. కాని, ఇది అందరకూ తెలియదు. కాబట్టి అలా చేయలేరు, ఎంతసేపటికీ ప్రోగుచేయాలని ప్రయత్నిస్తే ఏమీ జరుగదు, ఏమీ ప్రోగుచేయలేరు. అట్లా కాకుండా, తాదాత్మ్యం పొందాలి. కాని, సాధారణంగా, ఒక సద్భావమును చూపినవారు, దానికి గుర్తింపుకోరుతారు; ఎదుటివారిపై కొంచెం ఆపేక్ష కనబరిచి, అందరూ తనను ఆపేక్షగా చూడాలనుకుంటారు.... ఎందువల్లనంటే, తానే అన్నిటిలోని సద్భావనగాను, తానే అన్నిటిలోని ఆపేక్ష, ప్రేమలుగాను రూపొందే సామర్థ్యం లేకపోవడంవల్ల యిలా ప్రవర్తిస్తారు. అన్నిటినుంచీ తెగిపోయినామనుకొని పరిచ్ఛిన్నులై, అన్నిటినీ కోల్పోయినట్లు భావించుకొని, ఏమీ లేనివారుగా మిగులుతామేమోనని భయపడతారు. అట్లా కాకుండా, తాదాత్మ్యం పొందగలిగితే, పోగుచేయాలనుకోనక్కరలేదు. విస్తరించుకున్నకొద్దీ తనదగ్గర పెరుగుతుంది. తాదాత్మ్యం పొందితేనే పూర్ణత్వం వస్తుంది. అప్పుడు, తీసుకునేబదులు ఇవ్వగలుగుతారు. ఇచ్చినకొద్దీ వృద్ధి పొందుతారు.

ఇలాచేయాలంటే, తన అహంత పరిమితులనుంచి తప్పించుకో గలగాలి, అల్ప అహంతతో కాకుండా దివ్యశక్తితోను, దివ్యప్రకంపనతోను తాదాత్మ్యం పొందాలి.

ఇది చాలా కష్టమే కాని సాధించవచ్చు.

మంచి పనులు చేయడం కంటె చెడ్డ పనులు చేయడం సులభమంటారు - ఎందువల్ల ?

అలా చెపుతారు కాని అది సర్వత్రా నిజంకాదు. మనుష్యులనుబట్టి ఏర్పడుతుంది. ఏదైనా చెడు చేయడం కొంతమందికి అసాధ్యం, అటువంటివారు నాకు తెలుసు. హానికరమైన పనులు చేయాలంటే వారి స్వభావంలో అన్నీ ఎదురు తిరుగుతాయి; స్వతఃసిద్ధమైన చలనం హానికి యిష్టపడదు. ఇలా ఎక్కడో అపురూపంగా జరుగుతుంది.

ఎందువల్లనంటే, ప్రస్తుతం ఈ ప్రపంచంలో ఎక్కువభాగం యింకా ప్రతికూల శక్తుల ప్రభావంలోనే ఉంది; ముఖ్యంగా, నీచేత పనిచేయించే ప్రాణమయ శక్తి ప్రతికూల ప్రాణశక్తికి లోబడి నడుచుకుంటుంది; అంటే, కొట్టడం, నాశనం చేయడం, చెడగొట్టడం మొదలైన పనులలో అభిలాష గల శక్తులు, అన్నిటినీ పాడుచేయాలనే దుష్టసంకల్పమే వాటి స్వభావం: ఏదైనా అందమైనది గోచరించినప్పుడు, దానిని ఆస్వాదించి, ప్రేమచూపి, ఆనందించి, అది పెంపొంది పురోగమించాలనుకోడానికి (నిజమైన దివ్యచలనం) బదులు, ఒకరకమైన కోపం, కసి పెంచుకొని దానిని పాడుచేసి నాశనం చేయాలనుకుంటారు. ఇది ప్రతికూల శక్తుల ప్రభావము. చాలామందిలో అది సహజంగా కలుగుతుంది. దురదృష్టవశాత్తూ చెడగొట్టి పాడుచేయాలనే బుద్ధి పెద్దలలోను, పిల్లలలోనుకూడా సహజసిద్ధమైపోయింది....దానికి కారణం ప్రతికూల శక్తులు వారిలో ఉండడమే. ఈ శక్తులు ప్రాణమయ లోకంనుంచి తిన్నగా భూమిమీదకు దిగి, మానవచైతన్యంలోను, ఒక్కొక్కప్పుడు మృగచైతన్యంలోను ఆవాసం ఏర్పరుచుకుంటాయి. వాటికి సౌందర్యం, స్వచ్ఛత, మంచి, నిజము అంటే ద్వేషము, అదే దైవాంశను ద్వేషిస్తుంది. ఈ ద్వేషంవల్లనే నాశనంచేయాలని, పాడుచేయాలని, చెడగొట్టాలని, కళంకపరచాలని, వికృతం చేయాలని, విరూపంచేయాలని సంకల్పం కలుగుతుంది. ఇంకొక అడుగువేస్తే, అదే బాధ కలుగజేయాలనే సంకల్ప మవుతుంది. ఇదంతా ప్రతికూల శక్తుల ప్రభావమే. అచేతన,

విశ్వానికి మూలస్థానంనుంచి అది వస్తుంది.

అప్పుడు ఆ విధంగానే చెప్పాను. శాశ్వతచైతన్యం భూమిపైకి పంపడం కోసం తనలోనుంచి ప్రేమ అనే ఒక పరమశక్తిని ఆవిర్భవింపజేసిందనికూడా చెప్పాను. ప్రేమ ఆ విధంగా వచ్చింది. (శ్రీమాత 1953 ఆగస్టు బులెటిన్ తీసి అందులోని "నాలుగు నిష్ఠలు, నాలుగు నిశ్రేయసాలు" చదువుతారు.) అదే ఆ ప్రశ్నకు సమాధానం:

> ప్రేమ అంటే తాదాత్మ్యంలోని ఆనందమే; ఐక్యం కావడంలోని మధురానందంలో అది పరిపూర్ణంగా వ్యక్తమవుతోంది. ఆ రెండింటికీ మధ్య దాని సార్వత్రిక వ్యక్తీకరణపు స్థాయిలు అన్నీ కనిపిస్తాయి.

తాదాత్మ్యంలోని ఆనందం మొదటిది. తాదాత్మ్యాన్ని తెలుసుకోగలిగేది అక్కడ ముందుగా ఒకటి ఏర్పడాలి, సరిగ్గా అదే ప్రేమ. ఆ తర్వాత ప్రేమ అభివ్యక్తమౌతుంది. దాని వ్యక్తీకరణంలో అన్ని దశలు గడిచి మూలస్థానానికి చేరినప్పుడే దానికి పరిపూర్ణస్థితి. అదే ఐక్యంలోని మధురానందము. ఎడబాటును అనుభవించిన ఫలితంగా ఐక్యం కావడంలోని మధురత్వం తెలుస్తుంది. అది విశ్వమంతా పయనించి రావడంవల్ల అది చైతన్యంనుంచి విడిపోయిన భావం కల్గుతుంది; ఆ ఉద్భవస్థానానికి పునరాగమనమే ఐక్యంలోని మాధుర్యము. అప్పుడు కూడా అది దివ్యప్రేమే; విశ్వాన్నంతా పరిభ్రమించినది అదే. అది ఉద్భవస్థానానికి తిరిగి వచ్చినప్పుడే ఐక్యంలోని మధురానందం కనిపిస్తుంది; (శ్రీమాత "నాలుగు నిష్ఠల" లోని భాగాలు చదువుతున్నారు.)

> "ఈ సృష్టి ప్రారంభంలో అప్పుడే వెలువడిన పవిత్రప్రేమ రెండురకాల చలనాలతో ఏర్పడింది. అవి, సంపూర్ణసమ్మేళనం కొరకు ఏర్పడ్డ రెండు

పరిపూరక ధృవాలు. ఒకటి పరమశక్తిమంతమైన ఆకర్షణ, రెండవది అనివార్యమైన ఆత్మసమర్పణా వశ్యకత. ప్రేమతప్ప మరి ఏ ఇతర చలనమూ కూడ, మూలంనుంచి వేరై చైతన్యం జడంగా మారినప్పుడు వ్యక్తిలో ఏర్పడే అగాధాన్ని దాటించలేదు.

"రోదసిలోకి ప్రక్షేపితమైనదానిని, ఆ విధంగానే ఏర్పడ్డ సృష్టికి భంగం కలిగించకుండా మూల స్థానానికి చేర్చడంకోసమే దివ్యప్రేమ ఆవిర్భవించింది. అది అప్రతిఘటమైన సంధానశక్తి.

"పరమప్రేమ జడత్వ, అంధకారాల మీదుగా ఎత్తున విహరిస్తూ నిగూఢ, నిశాంతరాళాలలోకి తనకు తానే రజనుగా అయి వ్యాపించింది. ఆ క్షణంనుంచి జాగరణ, ఆరోహణ మొదలై నెమ్మదిగా పదార్థం ఏర్పడి అంతులేని ప్రగతి ప్రారంభమైంది."

ఇది నీ ప్రశ్నకు జవాబు. నీవు ఎంత వెనక్కి వెళ్ళి చూచినప్పటికీ సృష్టికి మూలంగా నీకు కనుపించేది ప్రేమ. కాని అది మానవులు అనుకునే ప్రేమ కాదు.

"నీవు నన్ను ప్రేమిస్తే నేను నిన్ను ప్రేమిస్తాను" అనేది ఏ రకమైన ప్రేమ ?

సాధారణంగా అంతా "నీవు నన్ను ప్రేమిస్తే నేను నిన్ను ప్రేమిస్తాను, నీవు ప్రేమించకపోతే నేనుకూడా ప్రేమించను" అంటారు. సాధారణ మానవుల

ప్రేమ వ్యక్తమయే తీరు అది. ఇంకా దాని ప్రమాణాన్ని పెంచి దైవంతో వారి సంబంధాన్ని కూడా అలాగే అన్వయిస్తారు. "నేను అడిగింది నీవు చేస్తే నీవు నన్ను ప్రేమిస్తున్నావని అర్థం, అప్పుడు నేను కూడా నిన్ను ప్రేమిస్తాను. నేను అడిగింది నీవు చేయకపోతే నీవు నన్ను ఏమీ ప్రేమించడం లేదనుకొని నేను గూడా ప్రేమించను." అని వారు దైవంతో చెపుతారు.

ఆ విధంగా అది వ్యాపారసరళిగా తయారౌతుంది.

"నీవు నన్ను ప్రేమించకపోతే, నేను నిన్ను ప్రేమిస్తాను" అని అంటే ?

అది కొంచెం నయమే!

అంతకంటేకూడా, ఎదుటివారు ప్రేమిస్తున్నారా లేదా అనే తలంపు లేకుండా ప్రేమించడం మంచిది, అప్పుడే నిజమైనప్రేమ ప్రారంభమౌతుంది. మన ప్రేమకు ప్రతిస్పందనం కలిగింది కదా అని, ఎదుటివారు ప్రేమిస్తూ ఉన్నారని ప్రేమించడం కాకుండా, ప్రేమకోసమే ప్రేమించడం నిజమైన ప్రేమ. దానికి ఏవిధమైన నిబంధనలూ పనికిరావు. ప్రేమించకుండా నిలవలేక పోవడంవల్లనే ప్రేమించాలి. దేనివల్ల ఏమి జరుగుతుందోనని ఏమాత్రం సందేహించరాదు. తన ప్రేమతో తనే సంపూర్ణ సంతృప్తి పొందాలి, ప్రేమకోసమే ప్రేమించాలి.

మిగిలినవన్నీ వ్యవహారం నడపడం అవుతుందే కాని ప్రేమకాదు.

నిజమైన ప్రేమ ఏర్పడినప్పుడు ఈవిధమైన ప్రశ్నలు రానేరావు. ఈప్రశ్న మరీ అవివేకంగా, అల్పంగా కనిపిస్తోంది. నిజమైన ప్రేమ ప్రారంభమైన క్షణం నుంచీ సర్వసమృద్ధమైన ఆనందం, సిద్ధి కలగడంవల్ల, ఎవరూ ఏ విధమైన ప్రతిస్పందనా కోరరు. వారే ప్రేమై, ఆ ప్రేమసంతృప్తిని సమృద్ధిగా గ్రోలుతారు. దానికి ప్రతిస్పందన లభిస్తోందా లేదా అనే ప్రశ్న లేదు.

అట్లా కాకుండా, లెక్కలు గడుతూ మనస్సులో అనేక భావాలు. సంవేదనలు పడుతుంటే అది ప్రేమ కానేకాదు. అదీ ఒక వ్యాపారమే.

ఇపుడు నీకు అర్థంగాకపోయినా ఏదో ఒకరోజున ఇది అర్థం అవుతుందని ఆశిద్దాము.

మిగిలినవన్నీ మానవులు ప్రేమనుంచి కల్పించినవే. అంటే, ఆ ప్రేమ ఏమంత శోభస్కరం కాకపోగా, ఇంకా అసహ్యకరమైనవాటికి దారి తీస్తుంది. ఉదాహరణకు, ఈర్ష్య, అసూయలు, ఇంకా విపరీత ప్రకృతి అయితే ద్వేషానికి దారి తీస్తుంది. మొదట ఈ విధంగా ప్రారంభమౌతుంది, ప్రేమించినప్పుడు ఎదుటి వారు తమ ప్రేమను గుర్తించాలని అనుకుంటారు. అదే దైవంతో సంబంధమైతే, తను ప్రేమించినట్లు దైవం తెలుసుకోవాలని పట్టుపడతారు. అది పతనానికి ప్రారంభము. అసలు సంగతి ఏమిటోనని ఆలోచించరు, అది వారి మనస్సుకు తట్టదు.

ఆలోచించకుండా ప్రేమించాలి, అంతే. ప్రేమిస్తారు; సర్వసమృద్ధమైన ప్రేమలో, దాని మహదానందంలో తలమున్కలౌతారు.

మానవులనుకునే "ప్రేమ" కు, అసలైన ప్రేమకు మధ్య చాలా అంతరం ఉంది.

సాధారణ మానవ చైతన్యంలో అనేక అనూహ్యరూపాలను దాల్చే ప్రేమనుగురించి నే నిక్కడ చెప్పడంలేదు; ఉచిత పరిస్థితులలో, దాని ఉత్తమ రూపం సంగతి, అంటే నిస్వార్థమైన ప్రేమ సంగతి మాట్లాడుతున్నాను. మానవులను ప్రశ్నిస్తే, పరస్పర ప్రేమను ఆశించనివారు ఎంతశాతం ఉంటారో మీకు తెలుస్తుంది. "నీవు ప్రేమిస్తే నేను ప్రేమిస్తాను" అనేవారి సంఖ్య కాదు. వారు చాలా అట్టడుగున, పాతాళంలో ఉన్నట్లెలెక్క.... అంతకంటే క్రిందమెట్టు కూడా ఉంది. "నీవు నన్ను ప్రేమిస్తే నేను నిన్ను ప్రేమించగలనేమో చూస్తాను" అనడము మరీ అసహ్యకరము. పరస్పర ప్రేమ ఆవశ్యకాన్ని గురించి మాత్రమే యిక్కడ చెప్తాను; అవరోహణక్రమంలో అది మొదటి మెట్టు.

నీవు ఒకనాడు వీటిని అర్థం చేసుకుంటావు. ఇపుడు మరీ చిన్నవాడివి.

## మానవులపై జంతువుల ప్రేమ ఏ విధమైనది ?

అతిమేధావులు కాని సామాన్యమానవులు దైవంపై కనబరిచే ప్రేమవంటిదే. మెప్పుదల, విశ్వాసం, ఒకరకమైన నిర్భయంతో కూడినదే ఆ ప్రేమ. మెప్పుదల అంటే అది చాలా మోహనంగా కనిపించడము. ఆలోచించి చూపే మెచ్చుకోలు కాకుండా హృదయంలోనుంచి, స్వతస్సిద్ధంగా వచ్చే మెప్పు. కుక్కలలో ఈ విధమైన మెప్పు అధికంగా కనిపిస్తుంది. రెండవది నమ్మకం—సాధారణంగా ఇది అనేక విషయాలతో కలిసిపోతుంది. ఏదో ఒక అక్కర, పరాధీనభావాలతో ఏర్పడుతుంది.— "నాకు ఆకలి వేసినప్పుడు ఆహారం వేస్తారు, నిలువనీడ కల్పిస్తున్నారు. నా అవసరాన్నీ చూస్తున్నారు— "అది చెప్పడానికంత బాగుండదు. ఆ తర్వాత ప్రేమ ఒకరకం భయంతో (ఇది మానవుని లోపంవల్లనే) కలిసిపోతుంది; ఒకరకమైన పరాధీనత్వం, ఒకరకమైన భయం. తనకంటె చాలా బలవంతమైనదని, చాలా చైతన్యవంతమైనదని, తనకు హాని చేయగలదని, రక్షించుకోగలశక్తి తనకు లేదని, భయం కలుగుతుంది. ఇటువంటి దైన్యపరిస్థితి మానవుని దోషంవల్లనేనని నా నమ్మకం.

మానవునికి నిజంగా జంతువుల ప్రేమను పొందగల అర్హతేఉంటే, వాటి ప్రేమ ఆశ్చర్యభావంతోనూ, రక్షణపొందుతున్న భావంతోనూ ఏర్పడుతుంది. రక్షణ పొందుతున్న భావం అతి సున్నితమైనది; దానికి కావలసినవన్నీ ఇస్తూ, దానిని రక్షించగలవారి సన్నిధిలో ఆశ్రయం లభిస్తుంది కదా!

జంతువులు పరిపక్వం చెందని ప్రాథమిక మనస్సు మాత్రమే కలిగినటువంటివి. మానవుల మాదిరిగా ఎడతెగని ఆలోచనలు వాటిని బాధించవు. ఉదాహరణకు, వాటిపై కనికరం చూపించినపుడు వాటిలో స్వతస్సిద్ధమైన కృతజ్ఞతాభావం కలుగుతుంది. అదే మానవులైతే నూటికి తొంభై ఎనిమిది మంది, మంచిగా ఉంటే కలిగే లాభాలు ఏమిటోనని ఆలోచించడం మొదలుపెడతారు. మనస్సు చురుకుదనంవల్ల కలిగే బాధలు ఇవి. జంతువులకు ఈ బాధలేదు కాబట్టి నీవు

దయచూపితే స్వతస్సిద్ధంగా కృతజ్ఞతతో మెలుగుతాయి. వాటికి విశ్వాసం ఎక్కువ. కాబట్టి అదే వాటి ప్రేమకు మూలమై, గాఢమైన అనుబంధంగా మారి, నీకు దగ్గరవడం అనివార్యమైన ఆవశ్యకత అవుతుంది.

ఇంకొక విషయం ఏమిటంటే, యజమాని మంచివాడై ఆ జంతువు విశ్వాసం కలదైతే, వారిద్దరి మధ్యా చైతన్య, ప్రాణికశక్తుల వినిమయం జరుగుతుంది. అది ఆ జంతువుకు అద్భుతంగా కనిపించి అంతులేని ఆనందం కలుగజేస్తుంది. ఆవిధంగా అవి నీ సన్నిధిని కోరినప్పుడు, నీవు దానిని ముట్టుకుంటే వాటిలో ఒక ప్రకంపన కలుగుతుంది. నీవు దానికిచ్చిన శక్తి, అంటే ప్రేమ, ఆదరణ, రక్షణల బలాన్ని అది అనుభవించడంవల్ల దానిలో అనుబంధం ఏర్పడుతుంది. ఉత్తమ జంతువులైన కుక్క, గుర్రము, ఏనుగులలో అది తేలికగా భక్తిభావాన్ని కలిగిస్తుంది. (అది మనస్సుచేసే వాదనలకు, తర్కానికి అతీతం) స్వతస్సిద్ధమైన ఆ భక్తిలక్షణం అతి నిర్మలము, మనోహరము.

ప్రాథమికావస్థలలో మానవమేధ పనిచేయడం ప్రారంభించినప్పుడు, అంతకుపూర్వం బాగున్నవాటి నెన్నిటినో పాడుచేసింది.

మనిషి ఉన్నతస్థాయిలకు చేరి తన మేధాశక్తిని ఉపయోగించడం నేర్చుకుంటే అనేక విషయాలు బాగుపడగలవు. ఈ రెండింటికీ నడిమి దశలలో అతని మేధాశక్తి అనుచితంగా, అధమరీతులలో పనిచేస్తుంది; అంచనాలు కట్టడానికి, పెత్తనం సాగించడానికి, వంచన చేయడానికి దానినొక సాధనంగా అతను ఉపయోగిస్తాడు. దానితో అది వక్రమవుతుంది. చాలామంది మనుష్యులకంటె ఉత్తమమైన జంతువులను నే నెరుగుదును. మానవుల మాదిరిగా తుచ్ఛంగా అంచనాలు వేయడం, మోసగించి బాగుపడాలనుకోడం వాటి స్వభావంలో లేదు. కొన్ని జంతువులు మానవులతో తమకు ఏర్పడ్డ దీర్ఘకాల సంపర్కంవల్ల ఇటువంటి గుణాలు అలవరచుకుంటాయి; కాని యీ విధమైన గుణాలు లేనివాటి సంగతి నేను చెపుతున్నాను.

అంచనాలు కట్టని నిస్వార్థ చలనం ప్రపంచంలోని చైత్యచైతన్యపు మనోజ్ఞ రూపాలలో ఒకటి. కాని, మానసిక మేధాశక్తి ఎక్కువైనకొద్దీ, మనిషి వృద్ధి పొందినకొద్దీ ఈ స్వభావం అరుదైపోతుంది. మేధ వృద్ధి పొందడంవల్లనే నేర్పు, తెలివితేటలు, ఆ తర్వాత అంచనావేయడం, అవినీతి వస్తాయి. ఒక గులాబీ పూచిందంటే అది సౌందర్యంలోని ఆనందం కోసం, మధుర పరిమళంకోసం, తన ఉనికిలోని ఆనందాన్నంతా వ్యక్తం చేస్తూ స్వతస్సిద్ధంగా పూస్తుంది. అంతేకాని, పూయడంవల్ల ఏమి లాభం కలుగుతుందోనని అంచనాలు కట్టి పుష్పించదు. అదే మానవులైతే కొద్దిమంది తప్ప మిగిలినవారంతా తమ మేధ వికసించడం ప్రారంభం కాగానే తమ అందమును, తెలివిని ఏ విధంగా ఉపయోగించి లాభం పొందుదామా అని చూస్తారు. దానివల్ల యితరుల మెప్పు, దానికంటె అధమమైన ప్రయోజనంకూడా కోరుతారు. కాబట్టి, చైత్యదృష్టికి మానవులకంటే గులాబిపూవే మెరుగైనది.

నీవు ఒక మెట్టు పైకివెళ్ళి, గులాబీ పూవు అచేతనంగా చేస్తున్నదానిని చైతన్యవంతంగా చేయగలిగితే, అది అంతకంటే చాలా మనోజ్ఞమౌతుంది. కాని, వస్తువులో తేడా రాకూడదు: లాభనష్టాల ప్రసక్తి లేకుండా సహజాతమైన సౌందర్య ప్రకటన, ఆ విధమైన ఉనికి, ఆనందాలలో గులాబీతో సమానం కావాలి. ఒక్కొక్కసారి (ఒక్కొక్కప్పుడు మాత్రమే, ఎప్పుడూ కాదు) పిల్లలలో అది కనిపిస్తుంది. కాని, దురదృష్టవశాత్తూ పెద్దల ప్రభావంవల్ల, పరిసరాలవల్ల, వారు చాలా చిన్నప్పటినుంచే అంచనా గట్టి పనిచేయడం ప్రారంభిస్తారు.

తనకున్నదానివల్ల, తను చేసేదానివల్ల ఈ విధంగా ప్రయోజనం పొందాలని చూడడం ప్రపంచంలో అన్నిటిలోకీ హేయము. కాని, అదే విశ్వవ్యాప్తంగా ఉన్నది. పైగా, మనుష్యులకు బాగా అలవాటయిపోయి, స్వతస్సిద్ధమైన ప్రవృత్తిగా మారిపోయింది. ఈవిధంగా లాభనష్టాలు గుణించి లాభం పొందాలనే స్వభావం అన్నిటికంటే ఎక్కువగా దివ్యప్రేమకు దూరం అవుతుంది.

## పుష్పాలు ప్రేమిస్తాయా ?

పుష్పించడమే వాటి ప్రేమ స్వభావము. సూర్యుడి దిశగా వికసిస్తున్న గులాబిపూవును చూస్తే, అది దాని సౌందర్యసమర్పణావశ్యకత మాదిరి కనిపిస్తుంది. అవి ఏమి చేస్తున్నాయో ఆలోచించవు కాబట్టి మనకి అర్థరహితంగా కనిపిస్తుంది. మానవునికి తనను తాను పరిశీలించుకోగల శక్తి ఉంది, అంటే ఏపని చేస్తున్నా ఆవిధంగా తనను తాను పరిశీలించుకోగలడు; ఏపని చేస్తున్నా తనను తాను చూచుకుంటూ, తననుగురించే ఆలోచిస్తాడు; అతనేమి చేస్తున్నాడో అతనికి తెలుస్తుంది. జంతువులు ఆలోచించవు. ఆరెండు ప్రేమ స్వరూపాలూ వేరు. నిజం చెప్పాలంటే, పుష్పాలలో చైతన్యం లేదు. ప్రేమ వాటికి సహజసిద్ధమైన చలనము. చైతన్యవంతమైన చైతన్యం వాటిలో లేదు. కాని ఆ విధంగా చేయగల ఒక దివ్యశక్తి వాటిలో పని చేస్తుంది, అత్యుత్తమమైన సార్వత్రిక చైతన్యం, సార్వత్రిక ప్రేమతో కూడిన దివ్యశక్తి, ఇవి రెండూ అన్నిటినీ సుందరంగా పుష్పించేటట్లు చేస్తాయి.

అక్కడ కూడా నేను అదే వ్రాశాను (శ్రీమాత 'నాలుగునిష్ఠల' లో కొన్ని భాగాలు చదువుతారు).

> దోష భూయిష్ఠమై, జడత్వరూపంలో అన్ని భౌతిక ప్రాణిక ప్రేరణల వెనుక చేరి ఉన్నది ప్రేమ కాదా ! ప్రతి చలనానికి, సామూహీకరణానికి ప్రేరకశక్తిగా పనిచేస్తూ వృక్షజాతిలో మనకు కనిపించేది అజ్ఞాన జడస్వరూపాలతో కూడిన ప్రేమ కాదా ?

పదార్థంలో ఏర్పడే స్ఫటికాలు ఒక ప్రేమ చలనానికి లోబడి ఏర్పడతాయి; కాని వృక్షజాతులలో ఇది ఇంకా స్పష్టమౌతుంది: వెలుగు కోసమై పెరగవలసిన ఆవశ్యకత. చెట్లు ఎప్పుడూ పైకి పెరగాలనే అనుకుంటాయి. చిన్న చెట్లు

పెద్ద చెట్లను అందుకోవాలని, పెద్ద చెట్లు యింకా పైకి ఎదగాలని అనుకుంటాయి. నీవు రెండు మొక్కలను పక్క పక్కనే నాటితే, ఎటువైపు పెరిగితే వాటికి ఎక్కువ వెలుతురు వస్తుందో తెలుసుకోడంకోసం రెండూ ప్రయత్నిస్తాయి. ఎక్కువ గాలికోసమని, వెలుగుకోసమని జాగా కోసం పెరగాలనే ఆవశ్యకతే ప్రేమ... (శ్రీమాత చదవడం కొనసాగిస్తారు):

> ప్రేమవికసనముగా పుష్పించడం వల్లనే పూవు సౌందర్యసౌరభాలను వెదజల్ల గలుగుతోంది. జంతువులలో కూడా క్షుత్పిపాసల ఆవశ్యకత, స్వాయత్తీకరణ, జాతి విస్తరణ, సంతానోత్పత్తి మొదలైన చలనాలకు, కోరికలకు వెనకాల పనిచేసేది చైతన్యవంతమైనా కాకపోయినా ప్రేమే కదా ? ఉత్తమ జాతులలో పిల్లలకోసం తల్లులు చేసే త్యాగము, అర్పణల రూపంలో కనిపించేది అదే కదా !

మానవజాతిలోని తల్లిప్రేమ అదే. అయితే ఇక్కడ ఇది చైతన్యాత్మకము. మానవులలోకంటె జంతువులలో ఇది ఒక్కొక్కప్పుడు నిర్మలంగా ఉంటుంది. అపురూపమైన శ్రద్ధ, జాగ్రత, నిస్వార్థ చింతన కూడా కొన్ని సందర్భాలలో చూపిస్తాయి. అది వాటిలో అనాలోచితంగా, స్వతస్సిద్ధంగా కలుగుతుంది. ఆజంతువు తను చేసేదానిని గురించి ఎప్పుడూ ఆలోచించదు. కాని, మానవుడు ఆలోచిస్తాడు. దానివల్ల, సాధారణంగా ఈ ప్రేమచలనం కళంకపడుతుంది. ఒక్కొక్కప్పుడు దాని విలువ పెరుగుతుంది కూడ. కాని, అలా పెరగడం అరుదు. జంతువులలో కంటె మానవునిలో స్వతస్సిద్ధంగా వచ్చే చలనాలు తక్కువ.

మాపిల్లి మొదటిసారి పిల్లలను పెట్టినప్పుడు, అక్కడనుంచి కదలడానికి కూడా యిష్టపడేది కాదు. ఆహారం తినేదికాదు, ప్రకృతి అవసరాలకు కూడా కదిలేది కాదు. ఆ పిల్లలదగ్గరే కూర్చొని కదలకుండా, మెదలకుండా వాటికి

పాలిస్తూ కూర్చునేది; ఆ పిల్లలకేమి జరుగుతుందో నని అది విపరీతంగా భయ పడేది. ఆ భయం స్వతస్సిద్ధంగా కల్గిందే కాని ఆలోచనవల్ల కలిగింది కాదు. ఆ సహజాతభయంవల్ల అది కదలడానికే యిష్టపడేది కాదు. ఆ కూనలు పెద్ద వైన తరువాత వాటికి విద్యలు నేర్పడానికి అది శ్రమ తీసుకున్న విధానం ఇంకా అద్భుతము. ఎంత ఓరిమి! గోడమీదనుంచి గోడమీదకు ఎలా దూకాలో, తినే వాటిని ఎలా పట్టుకోవాలో అది పిల్లలకు నేర్పేవిధానం చూచి తీరాలి: ఒక్కొక్క సారి అవసరాన్నిబట్టి అది వందసార్లుకూడా చేసి చూపించేది. పిల్లలకు పట్టుబడే దాకా అది అలసిపోయేది కాదు. అది అద్భుతమైన బోధన. గోడల అంచులు పుచ్చుకొని ఒక ఇంటినుంచి ఇంకొక ఇంటికి పోవడం, పడిపోకుండా నడవడం, గోడకీ గోడకీ మధ్య దూరం ఎక్కువైనప్పుడు దూకే విధానం అది నేర్పేది. ఆ మధ్య దూరం చూచి అ కూనలు భయపడేవి, దూకేవి కాదు (దూకడానికి దూరం కాకపోయినా ఖాళీ చూచి భయపడేవి). అప్పుడు తల్లి దూకి అవతలి గోడ చేరి పిల్లలను రమ్మని పిలిచేద. అవి కదలకుండా వణుకుతూ కూర్చునేవి. అది వెనక్కివచ్చి వాటికి కొంత బోధించి, నాలుగు దెబ్బలు కొట్టి, నాకినప్పటికీ అవి కదిలేవి కాదు. అది మళ్ళీ దూకి అవతలకు వెళ్ళేది. ఈవిధంగా ఒకసారి అరగంట సేపు దూకింది. అరగంట పోయాక, పిల్లలు నేర్చుకున్నాయని అను కున్నాక, వాటన్నిటిలో బాగా నేర్చుకున్న కూన దగ్గరకు వెళ్ళి, వెనకనుంచి తలతో దాన్ని ముందుకు నెట్టింది. అప్పుడు ఆకూన స్వతస్సిద్ధంగా ముందుకు దూకింది. ఒకసారి దూకడం రాగానే అదే పనిగా దూకడం సాగించింది....కాని, ఇంత ఓరిమి ఉన్న తల్లులు చాలా అరుదు.

2 సెప్టెంబరు 1953

అన్ని మతాల కథా ఒకటే. ఒక పరమగురువు దివ్య సత్యపు అవతారంగా వచ్చి ఆ సత్యాన్ని వెల్లడించడంతో మతం ప్రారంభమౌతుంది. ఆ తర్వాత కొంతమంది దానిని తమ ఆధీనంలోకి తీసుకొని వ్యాపార సరళిలో ఇంచుమించుగా ఒక రాజకీయ సంస్థగా తయారుచేస్తారు.

ఆ మతానికొక పాలకసంఘం ఏర్పరిచి ప్రణాళికలు, సూత్రాలు తయారుచేసి దాన్ననుసరించే వారందరకు, కొన్ని కర్మకాండలు, క్రియకలాపాలు, నియమాలు, నిబంధనలు విధించి అవి అతిక్రమించకూడదని చెపుతారు. రాజ్యాంగం మాదిరిగా నిజాయితీ గలవారికి పారితోషికాలిచ్చి, ఎదురుతిరిగిన వారికి, దుర్నడతతో తప్పుదారులు పట్టినవారికి శిక్షలు విధిస్తారు.

"ఈ విధంగా ఏర్పడి, స్థిరపడిన మతాలన్నిటిలో "నేను చెప్పేదే ఏకైక పరమసత్యం, మిగిలినవన్నీ అసత్యములు, అల్పములు," అనేదే ప్రధానాంశము.

మతమే ప్రధాన మనుకునేవారికి ఈ ఉద్దేశ్యం సహజమే కాని, ఆధ్యాత్మిక జీవితం గడపాలనుకునే వారికి ఇదొక ప్రతిబంధకము. కేవలం మానవకల్పితాలే అయిన ఈ మత నియమాలను, ఆచారాలను పట్టుకొని వ్రేలాడుతూ అందులో చెప్పిన జీవిత విధానాన్ని గుడ్డిగా అనుసరిస్తూ జీవితం గడిపితే, ఈ మూఢాచారాలకు అతీతంగా, అతి విశాలము, అనంతము, సర్వస్వతంత్రము అయిన యథార్థాన్ని ఎన్నటికీ గ్రహించలేవు. ఒక మతాన్ని నమ్మి, అదే ప్రపంచంలోని ఏకైక సత్యంగా చేసుకొని జీవితం గడిపితే, నీ ఆంతరిక పురుషుని పురోగమనాన్ని, అభివృద్ధిని, ఆటంకపరుస్తావు.

ప్రశ్నోత్తరములు 1929 (9 జూన్)

శక్తిసామర్థ్యాలున్నవారు ఏదో ఒక మతాన్ని అనుసరిస్తూ పురోగమించి దైవంతో సారూప్యాన్ని పొందగలరా ?

అది అసంభవము.

మతం ఆత్మపురోగతి నెప్పుడూ పరిమితమొనర్చునదే. మానవుడు తన మానసిక అభిప్రాయాలనూ, తన జీవిత పరిమితులనూ వదలి ఆధ్యాత్మిక జీవితం మొదలుపెడితే, తద్వారా మతసూత్రాలను అధిగమించి ఉన్నత భూమికలలోకి ప్రవేశించగలడు. ఆ విధమైన అర్పణ లోపలినుంచి రావలసిందేగాని బాహ్యాచారాల ద్వారా కాదు. అది కేవలం బాహ్యాచార ప్రధానమే అయితే హద్దులు మరీ ఎక్కువై ఒక్క అడుగైనా ముందుకు వేయలేరు.

పురోగతి ఆగిపోవడం యిష్టం లేనపుడు, కొంతమంది తప్పనిసరిగా మతంలోనుంచి బయటకు రావలసి వస్తుంది. మానసికమైన చురుకుతనం లేకుండా తమను తాము ఎక్కువ ప్రశ్నించుకోకుండా, హృదయంలో మాత్రం మిక్కుటమైన భక్తి ప్రపత్తులు కలిగి, కేవలం అనంతమైన గొప్ప శక్తికి తమను తాము సమర్పించుకోవాలని ఉత్కాంక్షించేవారికి మతం ఉన్నా, లేకపోయినా ఒకటే. బాహ్యాచార విధులంటే మమకారం గలవారు ఎన్నటికీ పురోగమించలేరు.

మనస్సు సర్వస్వతంత్రమై జ్ఞానవంతంగా ఉంటే తప్ప అంతవరకు వెళ్ళలేము. పురోగతికి తప్పనిసరి అవసరాలలో ఇది ఒకటి. ఏమాత్రమూ మానసిక శక్తి లేనివారు కొందరు ఏమీ వాదించకుండా బాహ్యాచార విధుల నన్నిటినీ అనుసరిస్తారు. అవే దైవంతో తమకు సాన్నిహిత్యం కల్పించగలవనీ, వాటియెడ తమకు ఏర్పడిన యీ ఆంతరికాభినివేశం దేనివలననూ నిరోధింప బడదనీ వీరి భావన. కాని, నిజానికి వీరికి మానసిక జీవితం లేదు: అది చాలా పరిమితము.

అధ్యాత్మిక జీవనంలో కులాలకు ఏదైనా ప్రాధాన్యం ఉన్నదా ?

కులాలకూ, ఆధ్యాత్మిక జీవనానికీ సంబంధం ఏమిటి? కులాలనేవి కేవలం సాంఘిక వ్యవస్థలు, అంతే.

దైవాన్ని సేవించడంలో బ్రాహ్మణులు చాలా పురోగమించారని చెపుతారు గదా ?

అటువంటివి చాలా చెపుతారు.

ఆధ్యాత్మికజీవితం ఈ కుల విచారణలమీద ఏ మాత్రం ఆధారపడదు. కాని, కొన్ని సాంఘిక విలువలు వాటిమీద ఆధారపడతాయి. దానికి కారణం కొన్ని కొన్ని పరిసరాలలో విద్యాభ్యాసానికి ప్రత్యేకమైన సంప్రదాయాలు ఏర్పడినప్పుడు అందులో ఒక పద్ధతి మిగతావాటికంటె ఉత్తమంగా తోచవచ్చు. అంతకంటే ఇంకేమీ లేదు.

కులాలుండడంవల్ల రక్తమిశ్రమాలు ఏర్పడవంటారు. కాని, అది చర్చనీయాంశమే. ఉదాహరణకు, అనేకరకాల కుక్కలను చూడండి (క్షమించండి అనుచితమైన ఉపమానం చెపుతున్నాననుకోండి.) ఒక జాతిని నిలబెట్టాలనుకొని ఎంతో శ్రద్ధతీసుకొని ప్రయత్నించినప్పుడు, అది రానురాను బుద్ధిహీనంగా తయారౌతుంది. నానాజాతుల మిశ్రమమైన ఊరకుక్క చూడడానికి అసహ్యంగా, భయంకరంగా కనిపించినప్పటికీ అదే ఎక్కువ తెలివితేటలతో ప్రవర్తిస్తుంది. అయినప్పటికీ ఈ విషయంలో చెప్పలేము. చిన్నచిన్న తెగలలో, వారివారి కులాలలోనే వివాహాలు చేసుకుంటూ మిశ్రమం రాకుండా చూచుకున్నచోట్ల సామాన్యంగా, మేధాశక్తి క్రమేణా క్షీణిస్తుంది. ఇది ఏమంత మంచిది కాదు. పురోగతి సాధించే సమర్థత గల నూతనసృష్టి రావాలంటే, నూతన సమ్మిశ్రమాలు చాలా అవసరము.... సాంఘికదృష్ట్యా సజాతి వివాహాలు సమర్థ

నీయములే. అవి చాలా వీలు, సులభం, వ్యవస్థీకరణానికి అనువైన చట్రం ఏర్పడుతుంది. ఈ సజాతి వివాహాల మేలు అంతవరకే.

దేశం మాదిరిగా కులాలలోకూడా ప్రతి కులమూ తాను సాధించవలసిన గరిష్ఠ ప్రగతిని సాధించాననుకుంటుంది. జనం మాట్లాడుకుంటున్నప్పుడు వింటే తెలుస్తుంది. కులానికి వెలి అయినవారుకూడా మిగిలినవారిని అసహ్యించుకుంటూ తామే అధికులమని అనుకుంటారు.

...

ఒక సిద్ధాంతాన్ని నమ్మినవారు, ఏదో కొంత సత్యం తెలుసుకున్నవారు, పూర్ణసత్యాన్ని తామే కనుక్కున్నామన్న ధోరణిలో మాట్లాడుతారు. అది మానవస్వభావము. మానవులు పరాధినులు కాకుండా తమ మార్గంలో తాము సాగడానికి ఒక విధమైన అబద్ధపు మిశ్రమం అవసరమేమో అని తోస్తుంది. వారికి పరమసత్యం ఆకస్మికంగా దర్శనమిస్తే ఆ భారంకింద వారు అణగారి చితికిపోతారు.

ప్రశ్నోత్తరములు 1929 (9 జూన్)

మానవులు క్రమంగా దైవం వైపుకు పురోగమిస్తున్నారా ?

అది చెప్పడం కష్టం. తార్కికంగా చెప్పాలంటే, అదే అంతిమగమ్యం కాబట్టి, వారు దైవం వైపుకు పురోగమించక తప్పదని చెప్పాలి. కాని, వాస్తవానికి ఇదొక విచిత్ర గమనము; రెండడుగులు ముందుకు వేస్తే ఒక అడుగు పక్కకి వేస్తారు. కాబట్టి వారు గమ్యం చేరుకోడానికి అంతులేని కాలం కావాలి. ఆ విధంగానే కనిపిస్తోంది.

సంవత్సరాల లెక్కను గాక మొత్తంమీద కొన్ని యుగాల అనువర్తనతో పరికించిచూస్తే, ఈ సాధారణ సూత్రానికీ, వ్యవహారంలో జరిగేదానికీ చాలా తేడా కనిపిస్తుంది. సృష్టి అంతా సృష్టికర్తతో ఐక్యమవడం కోసం పయనిస్తున్నదని చెప్పవచ్చు. కాని, పరిణామగతి అంతా సర్పిలగతిలో (Spirally) పురోగమిస్తుంది, ఈ సర్పిలంలో పురోగతి స్థానాలు అనేకం ఉన్నాయి, ప్రతిచోటా పురోగతి విచిత్రంగా జరుగుతుంది. కాని, ఎవరైనా అదే స్థానానికి రావాలంటే ఒక పూర్తి భ్రమణం చేయాలి. ఆ స్థానం వెనుకటి దానికంటే కొద్దిగా పైన ఉంటుంది..... అందువల్ల నీవు యితర పనులలో కాలం గడుపుతూ ఇతర స్థానాలు చేరుతుంటే మొదటి స్థానం మరిచిపోతావు. మానవ చరిత్రలో ఆ సర్పిలగతిని ఈ విధంగా అన్వయించి చెప్పవచ్చు.

విజ్ఞానశాస్త్ర దృష్ట్యా, కళాత్మక దృష్ట్యా, రాజకీయ, వ్యవస్థీకృత, సాంఘిక దృష్ట్యా చూచినప్పటికీ అన్నిరకాల అసాధారణ ఫలితాలలో ఒకానొక అద్భుతమైన నాగరికత (ఈ పుడమిపై పూర్వం) విలసిల్లినది. ఆఫ్రికా, ఇండియా, ఏక ఖండంగా కలిసిఉన్నట్లు ఒకరకమైన గుప్తస్మృతిని యిచ్చి వెళ్ళిన (అలాంటి) ఉత్తమ నాగరికతలు (ప్రస్తుతం లేక పోయినా) ఎన్నో ఉండేవి.. కొన్ని మానవజాతులు ఆ నాగరికతా చిహ్నంగా కనుపించడం తప్ప ఇతర చిహ్నాలు ఇప్పుడేమీ లేవు. ఈ విధమైన నాగరికతలు ఉన్నట్లుండి అదృశ్యమైపోయినాయి. ఆ తరువాత, పూర్తిగా అంధకారంతో అచేతనత్వంతో నిండినవారి చరిత్ర, తర్వాత జంతుజీవితానికి అతి సన్నిహితంగా ఉండి చూస్తే ఏమీ తేడా లేనట్లు కనిపించే ఆదిమజాతుల చరిత్ర అదృశ్యమైపోయాయి. ఈ విధంగా అన్నిరకాల అపక్రమాలతో గూడిన ఒక చీకటి గుహ ఏర్పడింది. మళ్ళీ హఠాత్తుగా పూర్వం కంటె ఉన్నతంగా, గొప్పగుణాలతో, గొప్ప సిద్ధులతో గూడిన నాగరికత పైకి వచ్చింది. ఇదంతా చూస్తే, అంధకారమయమైన ఆ రాత్రులు ఉన్నతమైనదానిని వ్యక్తం చేసేటట్లుగా జడపదార్థాన్ని తీర్చిదిద్దినాయా అనిపిస్తుంది. మళ్ళీ అంధకారం, విస్మృతి: భూమి అంతా అనాగరికత, చీకటి, అజ్ఞానం, బాధలతో వ్యాప్తం అయింది. ఆ తరువాత మళ్ళీ కొన్నివేల సంవత్సరాలకు హఠాత్తుగా యింకొక నవనాగరికత ఆవిర్భావం....

క్రిందనుంచి చూచి నీవు "పురోగతి ఎక్కడుంది" అనుకుంటావు. అది ఎప్పుడూ అదృశ్యమౌతూ, బలహీనమైపోతూ, కూలి విస్మృతమై పోతున్నది కదా. మానవజాతి ఎప్పటికప్పుడు అతిసామాన్య రీతిలో, నామరూపాలు లేకుండా అర్ధాంధకారంలోనే కొట్టుమిట్టాడుతూనే ఉంది. తిరిగి మధ్యమధ్యలో వెలుగు వచ్చి ప్రకాశిస్తూనే ఉంది. వెలుగులో ఉన్నప్పుడు, "ఇప్పటికి దొరికింది, అసలైనది ఇదే. ఇక మళ్ళీ పతనం కాకూడదు...." అనుకుంటారు.

కాని, ఇలా ఇప్పటివరకూ మళ్ళీమళ్ళీ తిరగబెడుతూనే ఉంది. ముందు ఏమి జరిగేదీ చూడాలి.

మళ్ళీ పతనావస్థ కలుగుతుందా ?

దానిని గురించి నేనేమీ చెప్పలేదు. "ముందు ఏమి జరిగేదీ చూడాలి'' అన్నాను తప్ప ఇంకేమీ అనలేదు.

యథార్థంలో, ఇది మనందరిమీదా, మన ఆకాంక్షమీదా, ఆధారపడి ఉంటుంది. ప్రతివారూ అవసరమైనదంతా, చేయగలిగినదంతా చేస్తే స్థిరమైన దశకు చేరగలము. అప్పుడు అంతా పునఃప్రారంభించడంకోసం ఉన్నదాన్ని కూల ద్రోయవలసిన అగత్యం లేకుండా అంతా ఊర్ధ్వచలనంగా సాగిపోతుంది.

ఈ విధంగా పతనంకావడం తప్పనిసరి కాదు గాని, ఇప్పటివరకు అంతా ఆ విధంగానే జరుగుతోంది. ప్రకృతిమాత తిరిగి అందులో ఉత్సాహం చూప కుండా ఉంటుందేమో నాకు తెలియదు....

ఇంతవరకూ పనిచేస్తూఉన్నది ప్రకృతే కాబట్టి, మనం ఆమె చేసినదాని మీదనే ఆధారపడవలసిన అవసరం ఏర్పడింది. కాని, మనకు ఆమె పనిచేసే విధానా లంతగా నచ్చడంలేదు. దానివల్ల, ఒక చిన్న అంతఃకలహం ఏర్పడుతున్నది (కుటుంబంలో అని చెప్పవచ్చు); ఆమె మార్గంలో ఆమెను సాగనీయకుండా మనం కలతపెట్టడం ప్రకృతికి నచ్చకపోవడంవల్ల ఇందులో కష్టం చాలా ఉన్నది.

అట్లాగని ఆమె కోరిన విధంగా మనం చేస్తూపోతే, ఎప్పుడూ పాడిన పాటగానే జరుగుతుంది: ఎప్పటికప్పుడు అదృశ్యమౌతూ, పునఃప్రారంభించడం తప్పదు. అది ఆమెకొక ఖేల. ఇదంతా ఆమె భగ్నం చేయకుండా చూడాలి. మన అదృష్టం బాగుండి, మనం అనుకున్నదానితో ఆమె కూడా సహకరించేటట్లు చేసుకోగల ఉత్తమమార్గం గోచరిస్తే, ఆమె సహకారంతో మనపనిలో సఫలీకృతులం కావచ్చు.

చేయవలసిందల్లా, తన పద్ధతి ప్రకారం కాకుండా ఇంకొక విధంగా కూడా చేయవచ్చునని ఆమెకు నమ్మకం కలిగించాలి.

ఆమెది ఎంతగొప్ప నేర్పు, ఎంతచిత్రమైన ఊహాశక్తి (నీవు గమనించినట్లు)! ....నీవు జంతువులను చూచినా, లేక ఫోటో తీసినా, తెలుస్తుంది. ఒక చిన్న ఎలుకను పెద్ద జిరాఫీతో పోల్చి చూచినా, ఒక పిల్లిని ఏనుగుతో పోల్చి చూచినా తెలుస్తుంది. ఒకప్పుడుండినటువంటి విపరీతాకృతి గల జంతువులనూ, ఇప్పటికీ కనిపించే కొన్ని విపరీత జంతువులనూ చూచినా కూడా ఆమె ఊహాశక్తి ఎంత అద్భుతమో తెలుస్తుంది. భూమిపై గల జంతువులన్నింటినీ నీవే సృష్టించ వలసి వచ్చిందనుకో, అది ఎంత కష్టమో అప్పుడుగాని నీకు తెలియదు. ఇప్పుడు ఇలా చూస్తుంటే అంతా నీకు చాలా సహజంగానే కనిపిస్తుంది. ఒకరోజు ఒక జిరాఫీ చెట్టుపై చిటారు కొమ్మన గల పళ్ళు అందుకొని తింటున్నట్లున్న బొమ్మను ఒక పుస్తకంలో చూచాను. వెంటనే నాకు ''చెట్టుమీద ఎక్కడో పైన ఉన్న ఫలాలను అందుకొని తినడానికి వీలుగా ఉన్న మెడతో ఒక జంతువును సృష్టించాలంటే ఎంత ఊహాశక్తి కావాలో కదా!'' అనిపించింది. అది నిజంగా అద్భుతము. అన్నీ అంతే. మనం పుట్టినప్పట్నించీ వాటితోనే గడపడం వల్ల అదంతా మనకు చాలా సహజంగా కనిపిస్తుంది. నిజంగా అద్భుతమైన తెలివి ఉంటే తప్ప అది సాధ్యం కాదు....

అద్భుతమైన తెలివితేటలుండి, తను ఊహించినవన్నీ సిద్ధింప జేసుకోగల వ్యక్తి ఇతరులు తన వ్యవహారాల్లో జోక్యం కల్పించుకోడం ఇష్టపడదు, నిజమే! ఆమె "నేను చేసిందంతా మీరు చేయగలరా?'' అంటుంది.

ఆమె చేస్తున్నదానిని పాడుచేయాలని మీరు కోరడంలేదనీ, దానికింకా మరికొంత చేర్చడమే మీ అభిమతమనీ ఆమెకు నమ్మకం కలిగించాలి. ఆవిధంగా నమ్మించడానికి ఒకటే మార్గం ఉంది: చేసిచూపడం. అది కేవలం ఆకాంక్షగానే ఉంటే, ఆమె నవ్వి, దానిని తేలికగా తీసివేసి, "చూద్దాంలే, ఇంతకీ మీరు చేయబోయే దేమిటి?" అంటుంది.

కాని, అది మనం చేసి చూపినప్పుడు, "ఆ, సరే, బాగానేఉంది" అని అంటుందని నానమ్మకము.

కాబట్టి, ఒకే ఒక మార్గం ఉంది; అది చేసేయడమే.

9 సెప్టెంబరు 1953

దివ్యసత్యమునకు, దివ్యశక్తులకు చెందిన దేదైనా భూమిపై అవతరించడానికి దిగి వచ్చినప్పుడు, ప్రతిసారీ పృథ్వీ వాతావరణంలో ఏదో ఒక మార్పు కలుగుతుంది. గ్రహణశీలులైనవారు ఆ అవతరణ నుంచి వచ్చే ఒక ప్రేరణవల్ల, ఒక సంస్పర్శవల్ల, ఒక దర్శనంవల్ల ఉద్బోధితులౌతారు. వారు గ్రహించినదానిని నిలుపుకొని వ్యక్తం చేయడానికి తగిన సామర్థ్యం కలవారైతే, "ఒక గొప్పశక్తి అవతరించింది. నేను దాని సంస్పర్శ పొందాను. నే నర్థం చేసుకున్నంతవరకు దానిని మీకు వివరిస్తాను", అని అంటారు. కాని, చాలామంది అల్పమనస్కులవడంవల్ల ఆ విధంగా చేయలేరు. వారు తేజః పూరితులై, ఆవిష్టులైనవారి మాదిరిగా, "దివ్య

సత్యం నాకు లభించింది. దానిని సంపూర్ణముగా నేను పొందాను" అని కేకలు వేస్తారు....

"ఒక దివ్యచైతన్యం ఇక్కడున్న జీవులన్నిటి ద్వారా పనిచేస్తూ, ఈ సృష్టిద్వారా తన మార్గం సుగమం చేసుకుంటోంది. ఇంతకు ముందు ఎన్నడూ లేనంత శక్తిమంతంగా ఈనాడు అది ఇక్కడ పని చేస్తున్నది. ఏదో ఒక రకంగా కొంతవరకూ దాని సంస్పర్శ పొందినవా రున్నారు, కాని, వారు గ్రహించిన దానిని మార్చేసి, తమ కిష్టం వచ్చినట్లు చేశారు. మరికొంతమంది, ఆ సంస్పర్శను పొందుతారు కాని, ఆశక్తిని భరించలేక, ఆ ఒత్తిడికి నలిగి పిచ్చివారై పోతారు. అయితే, గ్రహించగల సమర్థులై, శక్తిని భరించగల బలం కలవారు కొందరుంటారు; వారే సంపూర్ణ విజ్ఞానానికి వాహకులై దివ్యచైతన్యానికి ఉపకరణాలుగా, ప్రతినిధులుగా పని చేస్తారు.

ప్రశ్నోత్తరములు 1929 (9 జూన్)

ఆ దివ్యశక్తి తన అభివ్యక్తికి కావలసిన ఉపకరణాన్ని ఎలా ఎంచుకుంటుంది ?

అది బంధుత్వం ద్వారా జరుగుతుంది. చైతన్యపు స్వభావం,—దాని తత్త్వం, దివ్య పరిధిలో దృగ్గోచరమౌతుంది. ఆ విధంగా అనుకూల్యం ఉన్నచోట, ఒక ప్రత్యేక ప్రకంపనమూ, ఒక ప్రత్యేక జ్యోతీ పైకి కనుపిస్తాయి. ఈ విధమైన

బంధుత్వం (ఒక్కొక్కసారి కేవలం బంధుత్వము, ఒక్కొక్కసారి సారూప్యము ఆవ్యక్తి పరిపూర్ణత ననుసరించి గోచరిస్తుంది.) గమనించి దివ్యశక్తి అక్కడ దిగుతుంది. చైత్యపురుషుడు ఒక మాదిరిగా వికాసం పొంది పరిపూర్ణతను క్రమంగా అందుకోగలవారిని,— వారి ప్రకంపనాలనూ, అచట ఉండే జీవిని,— గుర్తించి, దాని ప్రకారం ఏ స్థాయిలో ఆవిర్భవింపవలసినదీ, దేనిద్వారా వ్యక్తం కావలసినదీ. దానికి అనువైన పరిస్థితులూ, దాని ప్రాముఖ్యమూ మొదలైనవి నిర్ణయిస్తుంది. ఇదంతా అంతర్ దృష్టి ద్వారా జరుగుతుంది.

ఒక్కొక్కసారి ఆ ఉపకరణం అర్థంచేసుకోలేక పోతే అంటే దివ్యశక్తి ఎవరిద్వారా వ్యక్తమౌతోందో వారు దానిని తెలుసుకోలేక, నిలుపుకో లేకపోతేనో?

అలా జరుగవచ్చు, ఏదైనా సంభవమే. కాని, సాధారణంగా.... నేను చైత్యజీవుల పునర్జన్మలనుగురించి మాట్లాడినప్పుడు చెప్పాను గదా, వారుండే పరిధినుంచి, ఒక రకపు ప్రకంపనాన్ని, వెలుగును చూచి దాని ప్రకారం దిగవల సిన చోటు గుర్తిస్తారని చెప్పాను కదా. కాని, వారు దిగివచ్చేటప్పుడు సాధార ణంగా అచేతనంలోకి వెళ్ళి తమ శక్తిని (తాత్కాలికంగానైనా) కోల్పోతారు. తిరిగి చైతన్యాన్ని పొందుతారు గాని, ఆవిధంగా పొందడానికి కొంతకాలం పడు తుంది. పురోగమిస్తున్నకొద్దీ క్రమక్రమంగా జ్ఞానం కలిగి దానిని తెలుసుకో గలుగుతారు.

ప్రాణమయ సత్త, మనోమయసత్త- ఈ రెండిం టిలో సాధారణంగా త్వరగా పురోగమించేది ఏది ?

అది మనుష్యులను బట్టి ఉంటుంది. ప్రాణమయసత్త దృఢంగా ఉంటే అదే ముందు పురోగమిస్తుంది, మనోమయసత్త బలంగా ఉంటే అది ముందు పురోగమిస్తుంది. నీ వడిగింది ఒక వ్యక్తిలోనే కదా? వ్యక్తిలో ఏది ప్రబ లంగా, క్రియాత్మకంగా ఉంటే దానినిబట్టి తెలుస్తుంది. అంటే ఏవిధంగా?

ప్రతివారిలోనూ ఈ కూర్పు భిన్న భిన్న రూపాలలో ఉండడం వల్ల, దానిని సామాన్యసూత్రంగా చెప్పలేము. అది కొన్ని సందర్భాలలో ఇలాఉంది. మరికొన్ని సందర్భాలలో ఆ విధంగా ఉంది, అని చెప్పవచ్చు. కాని, నిజం చెప్పాలంటే, అవి రెండూ సామరస్యంగా లేనప్పుడు పురోగతి బాగా కొనసాగుతుందని నే నను కోను. ఒకటి ఒక వైపుకి. ఇంకొకటి రెండవవైపుకి లాగితే, ఎప్పుడూ కష్టమే. సాధారణంగా మనస్సునే ముందు మార్చడం మంచిది. ఎందుకంటే, మిగిలిన భాగాలను వ్యవస్థీకృతం చేయగల శక్తి ఒక్క మనస్సుకే ఉండాలి.

(హఠాత్తుగా శ్రీమాత మాటలు ఆపి శిష్యులందరివంకా చూస్తారు.) ఇప్పుడే ఇక్కడున్నవారిలో ఒకరు ఒక మానసిక రూపాన్ని బయటకు పంపించారు.... ఏవో అక్షరాలున్న ఒక నీలపు కాగితంగా అది ఆకృతి నేర్పరుచుకుంది. అది సుళ్ళు తిరుగుతూ మీలో ఒకరిపైన పడింది. మీలో ఎవరైనా హఠాత్తుగా ఏదైనా ఉత్సాహకరమైన సమాధానం గ్రహించారేమో చెప్పండి.... ఎవరూ లేరా? అది గిరగిర తిరుగుతూ పడడంవల్ల ఎవరిమీద పడిందో నేను సరిగా చూడలేదు.... అదీ వచ్చిన చిక్కు. కాని, మీ మీద పడింది. అది ఒక నీలం కాగితంగా ఏర్పడింది, దానిమీద ఉత్సాహభరితమైన సమాధానం ఉంది. ఎవరూ ఏమీ గ్రహించలేదా? ఉన్నట్లుండి ఏదో ఆలోచన మీలో ప్రవేశించలేదా? చెప్పండి.

(ఎవరూ సమాధానం చెప్పరు)

### ప్రాణమయసత్త మారకుండా మనస్సు మాత్రం ఆమోదిస్తే ?

నీతో నీవు తగాదాలాడుతూ జీవితం గడపవలసి వస్తుంది. ఒకటి ఒక వైపుకు లాగుతుంది, రెండోది నీకు హితం చెప్పాలని ప్రయత్నిస్తుంది. కాని, నీవు దాని మాట వినవు. అందువల్ల నిన్ను అందరూ అన్నివైపులనుంచీ లాగుతున్నట్లు భావిస్తావు. నీవు చేయవలసింది నీకు తెలుసు, కాని చేయవు. చేయగూడదని తెలిసినప్పటికీ చేస్తావు. బుద్ధి తక్కువ పనులు చేసి విచారిస్తావు. నీవు విచారించడానికి రెండు కారణాలుంటాయి. మొదటిది నీవు చేసిన తెలివి

తక్కువ పని, రెండవది విచారించడంవల్ల కలిగినది. మొత్తంమీద బాధాకర మైన పరిస్థితే....

## ప్రాణమయసత్తను మార్చలేమా ?

ప్రాణమయసత్తను మార్చడమా? తప్పకుండా మార్చవచ్చు. కష్ట మైనప్పటికీ సాధ్యమే. అది నిజంగా చేయలేనిదైతే ఇంక ఏమీ చేయలేము. కాని, దానికి మనస్సు సరిపోదు. బాగా చూడగలిగి, బాగా తెలుసుకోగలిగి, మానసికంగా పూర్తిగా నమ్మి, అసాధారణ విషయాలు నీకు వివరించి చెప్పగలిగి, ఇతరులకు నీతులు బోధించగలిగినవారిలోకూడా వారి ప్రాణమయసత్త అన్ని రకాల యుక్తులూ చేసి వారు చెప్పేది వినదు; నీవేమి చెప్పినా సరే, నా దారి నాదే" అంటుంది.

చైత్యసత్తతో సంబంధం ఏర్పరుచుకున్నప్పుడు మాత్రమే ప్రాణమయ సత్తను ఒక క్షణంలో మార్చగలుగుతాము. అధముడైన నేరస్థుని విషయం కూడా అంతే. ఆ క్షణాలు మెరుపుల మాదిరిగా వచ్చి నిన్ను ఆకట్టుకొని పూర్తిగా లోపలనుంచి మార్చివేస్తాయి. దాని తర్వాత అంతా బాగానే జరుగు తుంది. మార్పులకు సర్దుకోడం కొంచెం కష్టమే అయినప్పటికీ అంతా సవ్యం గానే జరుగుతుంది.

బోధించే స్వభావం మనస్సుకు ఉంది. మతబోధకుల మాదిరిగా అది పెద్ద పెద్ద ఉపన్యాసాలిచ్చి, నీతులు బోధిస్తుంది. ప్రాణమయసత్తకు చికాకు కలిగి మనస్సుతో "నీవు ఇలా పీడిస్తున్నావేమిటి? నీవు చెప్పేది నీకు బాగానే ఉంది కాని, అది నాకు పనికిరాదు" అని విసుక్కుంటుంది. అట్లా కాకుండా మనస్సు ప్రత్యేక సామర్థ్యాలు కలిగినదై, ప్రాణమయ సత్త కొంచం ఉన్నత స్థాయిలో ఉంటే, అప్పుడు "నీవు చెప్పేది ఎంత బాగుంది, కాని, నేను చేయలేకపోతున్నాను. అది చాలా బాగుంది కాని నాశక్తికి మించింది" అంటుంది.

ఈ ప్రాణమయ సత్తకు కుతూహలం ఎక్కువ. ఉద్రేకం, ఉత్సుకతతే కాకుండా సహజంగా దానికి వాంఛ లెక్కువ. ఉదాహరణకు, ఏదైనా అందంగా కనిపించినా, తనకంటె మిన్న అయినది కనిపించినా, మెచ్చుకొని బాగా ఉత్సాహ పడగలదు. జీవిలో ఏదైనా మనోహరమైన సంగతి జరిగినా, అసాధారణమైన విలువ కలిగిన విషయం జరిగినా, దానికి ఉత్సాహం ఎక్కువౌతుంది. దాని కోసం తనను తాను పూర్తిగా అర్పించుకోగలదు. ఈ విధమైన ఉదాత్తగుణం మానసిక పరిధిలోగాని, భౌతిక పరిధిలోగాని కనిపించదు. అది ఎంతగా ఉత్సాహం పొందు తుందో అంతగా కార్యాచరణలో నిమగ్నంకాగలదు: ఏ విధమైన అరమరికా లేకుండా పని చేయగలదు. దృఢమైన ప్రాణమయ సత్త ఉండడం మహాపురు షుల లక్షణము, ఉత్సాహం కలిగినప్పుడు ప్రాణమయ సత్త ఒక వీరుడే. పూర్తిగా కార్యాచరణకు దిగినప్పుడు, అది అసాధారణ కృత్యాలను చేస్తుంది. ఎందువల్లనంటే, అది లెక్కలు కట్టదు, తర్కించదు, "జాగ్రత పడాలి, ఇది చేయకూడదు, అది చేయకూడదు" అనుకోదు. అది ముందువెనుకలు చూడ కుండా ప్రజ్వరిల్లుతుందని అంటారు. దానిని సరియైన తోవలో పెడితే అద్భుత మైన పనులు చేస్తుంది.

మార్పు చెందిన ప్రాణమయ సత్త అతి శక్తిమంతమైన ఉపకరణ మౌతుంది. నైతికంగా గాని, భౌతికంగా గాని అసాధారణంగా ఆహ్లాదకరమైన విషయం జరిగితే దానివల్ల ప్రాణమయ సత్త మారుతుంది. ఉదాహరణకు, స్వార్థత్యాగం, అంచనాలు గట్టని ఆత్మార్పణలతో కూడిన దృశ్యం చూచినప్పుడు —ఇవి చాలా అరుదుగా తటస్థపడే అత్యంత కమనీయ దృశ్యాలు— పరవశించి పోయి, తను కూడా అలాగే చేయాలని కాంక్షిస్తుంది. ఆ విధంగా కాంక్షతో ప్రారంభమై, అర్పణతో అంతమౌతుంది.

ప్రాణమయ సత్త అసహ్యించుకొనేది ఒకటుంది; మందకొడిగా, ఒకటే పద్ధతిలో చప్పగా, ఉత్సాహం లేకుండా జీవితం గడపడం దీనికి గిట్టదు. అటు వంటి జీవితం గడపవలసివస్తే, అది నిద్రాణస్థితిలో జడమైపోతుంది. దానికి ఔద్ధత్యం అంటే ఇష్టము. అవసరమైనప్పుడది క్రూరంగా, కుటిలంగా మార గలదు; అతి ఉదారంగా, అతి మంచిగా, ధీరంగా కూడా ఉండగలదు. మంచి

గాని, చెడుగాని ఏదైనా విపరీతమే. ఈ ప్రాణమయ సత్తను చెడ్డ పరిసరాలలో ఉంచితే అది ఆ పరిసరాల ననుకరిస్తూ విపరీతమైన చెడుపనులు చేస్తుంది. దానిని ఎంతో మనోహరం, ఉదాత్తం, ఉన్నతం, దైవికం అయిన పరిసరాలలో ఉంచితే, అదే పట్టుకొని, మిగిలినవన్నీ మరచిపోయి, దానిలోనే లీనమౌతుంది. అది లెక్కలు కట్టదు కాబట్టి జీవిలో మిగిలిన భాగా లన్నిటికన్నా పూర్తిగా సమర్పించుకోగలదు. తన ఉద్రేకాన్ని, ఉత్సాహాన్ని అనుసరించి ప్రవర్తిస్తుంది. దానికి, కోరికలు కలిగినప్పుడు అవి తీవ్రంగా, నిర్హేతుకంగా ఉంటాయి; ఇతరులలోని మంచినిగాని, చెడునుగాని లక్ష్యపెట్టదు. ఆ విధంగానే తనను తాను అర్పణ చేసుకొన్నచోట కూడా లెక్కలు గట్టకుండా చేస్తుంది; దానివల్ల తనకు మేలు కలుగుతుందా, కీడు కలుగుతుందా అని ఆలోచించదు. అది చాలా అమూల్యమైన ఉపకరణము.

అది మేలుజాతి అశ్వం వంటిది. రౌతును అది తనను సరిగా నడిపించనిస్తే అన్ని పందాలూ గెలుస్తుంది, ప్రతిచోటా ప్రథమ శ్రేణిలోనే వస్తుంది. అది మచ్చిక కాకపోతే అంతా చిందరవందర చేసి, మనుష్యుల నందరిని తొక్కి తన నడుమే విరగ్గొట్టుకుంటుంది. అది ఏవైపు మళ్ళేదీ మనం ముందు తెలుసుకోవాలి. అసాధారణంగా ఉండేదంటే దానికి ఇష్టము. అది మంచైనా సరే, చెడైనా సరే. సాధారణ జీవితం దానికి ఇష్టం ఉండదు. ఆ అసాధారణత్వం లేనిచోట అది మందకొడిగా, జడస్వరూప మౌతుంది. దానిని ఓమూల కూర్చోబెట్టి "నోరుమూసుకొని కూర్చో" అంటే అది అక్కడే ఉండిపోయి, క్షీణించి నిర్జీవమై పోతుంది. చేయదలచుకున్నది చేయడానికికూడా ఓపికుండదు. అందువల్ల చాలా సునిశితమైన ఊహలు, అద్భుతమైన ఉద్దేశ్యాలు ఉన్నప్పటికీ, వాటిని కార్యరూపంలోకి తీసికొని రావడానికిశక్తి చాలదు.

నీలో శక్తిమంతమైన ప్రాణమయసత్త ఉంటే, దానిని చూచి విచారించకు. దానిని గట్టిగా పట్టుకొని స్వారీ చేయడానికి గట్టి కళ్ళేలు ఏర్పాటు చేసుకో. అప్పుడంతా బాగుంటుంది.

క్రుంగిపోవడమనేది ప్రాణమయసత్త వల్లనే సంభవిస్తుందా ?

అవును. నీ కష్టాలు, వ్యాకులపాటు, క్రుంగుబాటు, అధైర్యం, విసుగు, క్రోధం మొదలైనవన్నీ ప్రాణమయ సత్తవల్లనే కలుగుతాయి. ప్రేమను ద్వేషంగా మార్చేది అదే. ప్రతీకారాగ్నిని, పగ, దుస్సంకల్పం, నాశనం, హాని చేయాలనే తలంపులు మొదలైనవాటినన్నిటినీ అది ప్రోద్బలం చేస్తుంది. ఏదైనా కష్టంగా ఉండి, దానికి నచ్చకపోతే నిన్ను నిరుత్సాహపరచేది అదే. మొండికెత్తి పని చేయకపోవడంలో దానికి అసాధారణమైన ప్రజ్ఞ ఉంది. దానికి సంతృప్తికరంగా లేనప్పుడు ఒక మూల నక్కుతుంది; కొంచెమైనా చలించదు. అప్పుడు నీకు శక్తి, దార్ఢ్యం, ధైర్యం మొదలైన వేవీ ఉండవు. నీ సంకల్పం ఎండిపోతున్న చెట్టు మాదిరిగా అయిపోతుంది. వ్యతిరేకత, విసుగు, దురాగ్రహం, నిరాశ, విషాదం, కోపం మొదలైనవి ఈ ప్రాణమయ సత్త మూలంగానే కలుగుతాయి. ఎందువల్లనంటే, ప్రాణమయ సత్త అంటే క్రియాత్మక శక్తే గదా!

అది ఏవైపు మళ్ళుతుందో దానిమీద అంతా ఆధారపడి ఉంటుంది. దానిది మొండికేసే స్వభావం అని చెప్పాను గదా! అదే దానికి బలమైన ఆయుధము. "నేను చెప్పినది నీవు చేయలేదుగదా, సరే, నేనిక్కడనుంచి కదలను, చచ్చినట్లు నటిస్తాను," అంటుంది. ఏ చిన్న సాకుతోనైనా అది అలా ప్రవర్తిస్తుంది. దానిది చాలా దుష్ట స్వభావము. ముక్కోపితనం, అసూయ దాని లక్షణాలు. దాని శక్తి దానికి బాగా తెలుసు. తనను తాను సమర్పించుకున్న చోట ఆశక్తిని నిరోధించేది ఏదీ లేదని దానికి బాగా తెలుసు. "నేను కోరినది నీవు చేస్తే, నా శక్తినంతా ఇస్తాను. నే నడిగింది నీవియ్యకపోతే నాశక్తిని నేను తీసేసుకుంటా" నని అందరి మాదిరిగానే ప్రాణమయసత్త కూడా బేరం చేస్తుంది. దానితో నీవు చప్పబడిపోతావు. అదంతా నిజమే, అలాగే జరుగుతుంది.

దానిని క్రమపద్ధతిలో పెట్టడం కష్టము. అయినప్పటికీ దానిని, మచ్చిక చేసుకోగలిగితే, సిద్ధి పొందడానికి నీకొక శక్తిమంతమైన సాధనం దొరికినట్లే. పెనుగాలి మాదిరిగా ఎటువంటి ఆటంకాలనైనా తొలగిస్తుంది. మూర్ఖుణ్ణి గూడా

మేధావిగా చేయగల శక్తిసంపన్నత దానికొకదానికే ఉంది. ఎవరైనా పురోగతి పొందాలని తీవ్రంగా ఆకాంక్షించినప్పుడు, అలా పురోగమించాలని వారి ప్రాణమయ సత్తలో బాగా నాటుకుంటే, ఎంతటి మూర్ఖుడైనా మేధావి కాగలడు. ఇవి వినికిడి వల్ల చెప్పిన మాటలు గావు, నా అనుభవంలో నేను చూచాను. కొంతమంది చాలా మందకొడిగా, తెలివితక్కువగా, ఏమీ అర్థం చేసుకోలేనట్టుగా, ఉంటారు. వారితో ఏం మాట్లాడుతున్నా చెవిటివాని చెవిలో శంఖం ఊదినట్లు ఇసుమంతైనా అర్థంచేసుకోలేరు. ఉన్నట్లుండి వారి ప్రాణమయ సత్త ఉద్వేగం చెందుతుంది. ఒకరిని మెప్పించవలసి రావడమో, ఒక పని కావలసి రావడమో జరుగుతుంది, దానివల్ల తప్పనిసరిగా తెలుసుకోవలసిన అగత్యం కలుగుతుంది. దానితో చలనం ప్రారంభమై, నిద్రిస్తున్న మనస్సును జాగరితం చేస్తుంది. మారుమూలల, ఇదివరకు లేనిచోటకూడా శక్తి ప్రవేశించగానే వారు అర్థం చేసుకొని తెలివిమీరుతారు. ఒకతను ఆవిధంగా ఏమీ తెలియకుండా ఎందుకూ కొరగాకుండా పడిఉండి, మనస్సు వికసించి, పురోగతి పొందాలనే ఆకాంక్ష కలగగానే అద్భుతమైన రచనలు ప్రారంభించాడు. అవి నాదగ్గరున్నాయి. ఆ చలనం ఆగిపోగానే ప్రాణమయసత్త పని ఆపేసింది. అది కొంతకాలం మొండికేసి తర్వాత ఉపసంహరించుకుంది. ఆ మనిషి మళ్ళీ తన జడత్వస్థితికి వచ్చేశాడు.

బాహ్యంగా ఉండే భౌతిక చైతన్యానికీ, చైత్యసత్తకూ నిరంతరమైన సంబంధం ఏర్పరుచుకోడం చాలా కష్టం. భౌతిక చైతన్యానికి సత్సంకల్పం ఎక్కువ. అది క్రమబద్ధంగా ఉండి, ఎంతో ప్రయత్నం చేస్తుంది. కాని, అమిత నిదానమూ, భారమూ కావడంవల్ల ఎక్కువ కాలం పడుతుంది; అది కదలడమే కష్టము. దానికి అలుపురాదు కాని, అది ప్రయత్నించదు. దాని దారిన అది మెల్లిగా వెడుతుంది. బాహ్యచైతన్యాన్ని చైత్యసత్త సంస్పర్శలోకి తీసికొని రావడానికి కొన్ని శతాబ్దాలు పట్టవచ్చు. కాని, ఏదో కారణంతో ప్రాణమయ సత్త సంబంధం కల్పించుకుంటుంది, ఉద్వేగపూరితమై ఈ సంస్పర్శను అభిలషిస్తుంది. (ఏదో కారణం కావచ్చు, అది ఎప్పుడూ ఆధ్యాత్మిక కారణమే కానక్కర లేదు) తన బలం, శక్తి, ఉద్వేగం, ఉత్సుకత, అన్నిటితో ఆ సంస్పర్శను కోరుతుంది. అది మూడు నెలలలో సిద్ధిస్తుంది.

కాబట్టి, దాని విషయంలో బాగా జాగ్రత వహించు. దానికి అనువుగా మసులుకో గాని దానికి లోబడకు. దానికి లోబడ్డావంటే నిన్ను అన్నిరకాల ఇబ్బందులకూ గురిచేసి, ఊహించలేని ప్రయోగాలలో నిన్ను ఇరికిస్తుంది. ఏదో రకంగా నచ్చచెప్పి దానిని మంచి చేసుకోగలిగితే, పెద్దపెద్ద అంగలతో నీవు పురోగమిస్తావు.

16 సెప్టెంబరు 1953

యోగసాధన చేసేవారిలోకి అవతరించే శక్తి వారి పరివర్తన కార్యంలో సహాయం చేసి, ఇంకా అనేక రకాలుగాకూడ పని చేస్తుంది; దాని ఫలితాలు దానిని గ్రహించుకున్నదాని స్వభావాన్ని బట్టి, చేయ వలసిన పనిని బట్టి మారతాయి. మొదట, పరివర్తన పొందడానికి సిద్ధందాఉన్న భాగా లన్నిటిలోనూ పరివర్తన త్వరగా కలుగదానికి తోడ్పడుతుంది. సాధకుడు ఉన్మీలుడై, మానసికంగా సంసిద్ధుడైతే, యోగశక్తి సంస్పర్శవల్ల మారడం ప్రారంభించి త్వరగా పురోగమిస్తాడు. ప్రాణమయ చైతన్యం, భౌతిక శరీరం సంసిద్ధమై ఉంటే అవి కూడా శీఘ్ర గతిలో పరివర్తన చెందుతాయి. కాని, భౌతిక శరీర పరివర్తనలో యోగశక్తి కొంతవరకే పని చేస్తుంది. ఎందువల్లనంటే, శరీరానికి గ్రహణశీలత చాలా తక్కువ, విశ్వమందు అత్యంత భౌతిక స్థాయిలో గ్రహణ శీలత ఇంకా అత్యంత నిరోధక శక్తితోనే కూడిఉంది.. జీవికి ఒక భాగంలో వచ్చిన

శీఘ్రపురోగతి మిగిలిన భాగాలలో కూడా కనిపించక పోతే, అది ఎక్కడైనప్పటికీ, ఎప్పుడైనప్పటికీ స్వభావంలో సమతకు భంగం కలుగజేసి, అస్వస్థతకు దారి తీస్తుంది. ఈ భంగపాటు ఏవిధమైనది, అనేదానిని బట్టి ఈ అస్వస్థత ఏర్పడుతుంది.

ప్రశ్నోత్తరములు 1929, 16 జూన్

శరీరం గ్రహణశీలత ఎందువల్ల పరిమిత మౌతుంది ?

ఎందువల్లనంటే, ఈ ప్రపంచంలో అన్నీ కలగాపులగం కాకుండా ఉండాలంటే, అవి ఒక పద్ధతిలో స్థిరత్వం పొందడం అవసరం. ఉదాహరణకు, నీ శరీరం అతి సున్నితమై, అతి నమ్యమై, ఎవరైనా దగ్గరకు వచ్చేసరికి కరిగిపోతే నీకు చాలా చిరాకు కలుగుతుంది కదా! నీవు అతనికి దగ్గరగా వెళ్ళినప్పుడు ఇద్దరూ కలిసిపోతే ఏమి బాగుంటుంది? అందువల్ల, ఒక వ్యక్తినుంచి మరొక వ్యక్తిని వేర్పాటుచేసే (కేవలం వేరుచేయడానికి) శక్తిలో ఒకరకమైన స్థిరత్వం ఎక్కువగా కేంద్రీకృతమై ఉన్నది. శరీరం పురోగమించ గలిగినంతగా, పురోగమించవలసిన వేగంతో పురోగమించకుండా అడ్డుపడేది ఈ స్థిరత్వమే. పెరిగే దశలో కూడ పెరగవలసినంత ఎత్తు పెరిగి శరీరానికి ఒక తత్వం ఏర్పడగానే. నమ్యత తగ్గి కాఠిన్యం ఎక్కువౌతుంది. ఎదిగే పిల్లలలో నమ్యత ఎక్కువ కావడంవల్ల వారి పెరుగుదల కనిపిస్తుంది. వారు చిన్నగా ఉండి, పెరుగుతూ వృద్ధిపొందుతున్నంత కాలం, వారిలో ఆ నమ్యత కనిపిస్తుంది. నీకు నలభై సంవత్సరాలు దాటి, జీవితంలో స్థిరపడి, స్థిమితంగా నీ గమ్యం చేరావనుకొని, నీ శ్రమ ఫలితంగా వచ్చిన ఫలాలన్నిటినీ అనుభవించాలనుకుంటే. నీవు శిల మాదిరిగా గట్టిపడిపోతావు. అప్పుడిక నీ శరీరం ఆంతరికంగా జరిగే పరివర్తనను అనుసరించలేక, నీరసించి, చివికిపోయి, క్షీణిస్తుంది.

మరణించిన తర్వాత ఆంతరిక పురుషుని పురో
గమనం కొనసాగుతుందా ?

అది పూర్తిగా ఆ వ్యక్తిమీద ఆధారపడుతుంది. ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా ఉంటుంది. ఉదాహరణకు, కవులు, గాయకులు మొదలైన మేధావంతులు కొంతమంది తాము చేయదలుచుకొన్న పని పూర్తికాలేదని, చేయవలసినది ఇంకా చేయదలచుకున్న గమ్యం చేరలేదని భావించి, ఇంకా పృథ్వీ వాతావరణం లోనే కొంతకాలం ఉండిపోవడానికి సిద్ధపడతారు. ఆ విధంగా వారు భూమి మీద సాధ్యమైనంత ఎక్కువకాలం ఉండి, ఇతరుల శరీరాలద్వారా వ్యక్తమై, పురోగమనం కొనసాగించాలని ప్రయత్నిస్తారు. అటువంటి సందర్భాలు నేను చాలా చూచాను. నాకు తెలిసిన ఒక ప్రసిద్ధ పియానో విద్వాంసుడు, చిన్న వయసులోనే మరణించాడు. అతని చేతులలో అద్భుతమైన లాఘవం, కూర్పు, నేర్పు, వేగం, బలం ఉండేవి. తాను బ్రతికిఉంటే సంగీతంలో గొప్ప ప్రగతిని సాగించగలననే భావంతోనే అతను మరణించాడు. తీవ్రమైన అతని ఆకాంక్షవల్ల, మరణించినప్పటికీ అతని సూక్ష్మహస్తాలు విఘటితం కాకుండా నిలిచి, ఎక్కడైనా మంచి విద్వాంసులు గ్రహణశక్తి గలిగి, ఉదాసీనులై పియానో వాయిస్తుంటే అక్కడికి వెళ్ళి వారి చేతులలో ప్రవేశించేవి. వాటి మూలంగా సహజంగా బాగా వాయించగల ఆ విద్వాంసుని గానం ఇంకా అమోఘంగా, అద్భుతంగా సాగేది. ఈ విధంగా చేతులు వెళ్ళి ఆవహించి పనిచేయడం మరొక చిత్రకారుని విషయంలో కూడ జరిగింది. కొంతమంది రచయితల మెదడులు కూడా ఈ విధంగానే విఘటితం కాకుండా నిలిచి, తగినంత గ్రహణశక్తితో ఎవరైతే ఉంటారో వారిలో ప్రవేశించి, పూర్వం వారు వ్రాసే దానికంటే అసాధారణ ప్రజ్ఞతో అద్భుత రచనలు చేయించేవి. ఆ విధంగా అవి ఆవహించడం నేను చూచాను. ఒక సంగీత విద్వాంసుని విషయంలో అలా జరిగింది. అతను కేవలం సంగీతం వాయించడం కాకుండా సంగీత రచనలు చేసేవాడు. (బీథోవన్, బాహ్ మొదలైనవారి మాదిరిగా) అది చాలా మేధావైశిష్ట్యంతో కూడిన పని. అతనిలో ఒక గొప్ప విద్వాంసుని మేధాశక్తి ప్రవేశించి, అద్భుతమైన రచనలు చేయించేది. ఆ విధంగా అతను ఒక సంగీత రూపకం తయారుచేస్తుంటే ఆ మనోభావాన్ని వ్యక్తం చేయడం గాయకులకు చాలా క్లిష్టంగా ఉండేది. అతను

ఈ విధంగా గ్రహించగలిగినప్పుడు, ఒక పెద్ద తెల్ల కాగితం ముందుంచుకొని పంక్తులు కూరుస్తూ, అంకెలు వేస్తూ, గుణించుకుంటూ వ్రాస్తే, పేజీ పూర్తయే సరికి ఆర్కెస్ట్రేషన్ (అంటే, పాల్గొనే వివిధ సంగీత వాద్యాలకు వాటివాటి కూర్పును నిర్ణయించడం) కూడా పూర్తయేది. ఇది చాలా కష్టమైన పని. కాని అతను చాలా సుళువుగా కాగితంపై ముగించడం నేను కళ్ళారా చూచాను. అది అతని మనశ్శక్తే కాకుండా, అతనిలోకి అవతరించిన సంగీత కళావిశిష్ట మనస్సు వల్ల కలిగిన శక్తి. ఆ కూర్పంతా అతను గంటలోపుగా ముగించ గలిగేవాడు. పెద్దపెద్ద సంగీత విద్వాంసులుకూడా సంగీత నిర్వహణ కోసం తమ రచనలను ఇతని దగ్గరకే తీసుకొని వచ్చేవారు. అతనిని మించినవారు లేరనేటంతగా అతని ప్రతిష్ఠ పెరిగింది. ఏమీ విననక్కర లేకుండా, కేవలం కాగితంమీదనే సంగీత నిర్వహణ పూర్తి చేసేవాడు. ఆ తర్వాత అది వాద్యాలమీద వాయించి చూచినప్పుడు చక్కగా సరిపోయేది. అనేక వయొలిన్‌లు, సెల్లోలు, ఆల్టోసులు (ఒక సంగీత వాద్యం), ఇంకా అనేక వాద్యాలమీద కొందరు కొన్ని వాయిస్తూ, మరికొంతమంది మరికొన్ని వాయిస్తూ, ఒకప్పుడు అందరూ కలిసి వాయిస్తూ, ఒక్కొక్కసారి ఒకరి తర్వాత ఒకరు వాయిస్తూ ఉంటే, అంతా చాలా గజిబిజిగా ఉండేది. ఆవిధంగా అతను వాయిస్తున్నప్పుడు, వింటున్నప్పుడు, చదువుతున్నప్పుడు కూడా (ఒక్కొక్కసారి అక్కడున్నది తీసి చదివేవాడు)—ఏరాగం ఎక్కడ విస్తరించాలో, దానిని ఏ వాద్యంమీద ఆలాపించాలో, మిగిలినవాటిమీద ఏవి ఆలాపించాలో స్పష్టంగా చెప్పేవాడు. ఆ విధంగా చేసేటప్పుడు ఏదో అతనిలో ఆవహించి, సహాయం చేస్తున్నట్లు స్పష్టంగా అతనికి తెలిసేది.

తమ్ము దాము వ్యక్తం చేసుకొనగోరే ఈ జీవులు,
పునర్జన్మ దాల్చేటప్పుడు అదే కోరికతో పుడతాయా?

అదీ ఇదీ ఒకటి కాదు. జీవి అంతా కాకుండా దాని ప్రత్యేక సామర్థ్యం మాత్రమే, వ్యక్తమవాలనే కోరికతో, భూమి వాతావరణం వదిలి వెళ్ళిపోకుండా, ఇక్కడే నిలిచిపోతుంది. చైత్యసత్తమాత్రం చైత్యలోకానికి తిరిగి వెళ్ళిపోతుంది. తిరిగి శరీరం దాల్చేది అదే. శరీరం వదిలిపెట్టి వెళ్ళేముందు తన తర్వాతి జన్మ ఏదో, ఏ పరిసరాలలో జన్మించాలో, ఏ వృత్తి అవలంబించాలో చైత్యసత్త

(పురుషుడు) నిర్ణయించుకుంటుందని లోగడ చెప్పుకున్నాము కదా! దాని అనుభవానికి తగిన క్షేత్రం అది నిర్ణయించుకుంటుంది. ఆప్రకారం గొప్ప రచయితలు, విద్వాంసులు తర్వాతి జన్మలో మూర్ఖులుగా పుట్టవచ్చు. అటువంటిది 'అసంభవం' అని నీవంటావు. ఎప్పుడూ అలాగే జరుగుతుందని కాదుగాని అది సంభవమే. దీనికి భిన్నమైన సందర్భం ఒకటి గుర్తుకు వస్తోంది. బెల్జియం దేశానికి చెందిన ఒక ప్రఖ్యాత వయొలిన్ విద్వాంసుడు నాకు తెలుసు. 'యసాయి' అనే పేరుగల అతను ఆకాలంలో చాలా గొప్పగా వయొలిన్ వాయించేవాడు. అతనిలో బీథోవన్ పునర్జన్మ దాల్చాడనేది నిశ్చయము. పునర్జన్మ దాల్చినది బీథోవన్ పూర్తి చైత్య పురుషుడు కాకపోయినా అతని సంగీత సామర్థ్యమే కావచ్చు. అతను చూడ డానికి బీథోవన్ మాదిరిగా కనిపించేవాడు. అతను పాడగా కూడా విన్నాను. (అంతకు పూర్వం నాకు అతనితో పరిచయం లేదు. ఎన్నడూ చూడలేదు. మొదటిసారి, పారిస్‌లో సంగీత కచేరికి వెళ్ళాను). అతను వేదికమీదకు వస్తుండగా నేను చూచి "ఎంత విచిత్రం, ఇతను బీథోవన్ మాదిరిగా కనుపిస్తున్నాడే, అచ్చంగా అలానే ఉన్నాడు" అనుకున్నాను. అతను వాయించడం ప్రారంభించేసరికి పరిసర వాతావరణ మంతా మారిపోయింది. మూడు స్వరాలు ప్రారంభించాడు. ఏమి శక్తి, ఏమాశ్చర్యం! ఎవరూ కదలలేదు. అంత బాగా అర్థం చేసుకొని మొదటినుంచి చివరివరకు అంత బాగా వాయించినవారిని నేనెక్కడా చూడలేదు. బీథోవన్ సంగీత నైపుణ్యం ఇతనిలో ఉన్నట్లు అప్పుడు గమనించాను.... బీథోవన్ చైత్యపురుషుడు ఏ చెప్పులు కుట్టేవాడిగానో, మరి ఎవరిగానో జన్మించి యుండవచ్చు, మనకు తెలియదు. అది ఇంకొకరకమైన అనుభవం కోరుకొనియుండవచ్చు:

ఎందువల్లనంటే, ఈ విద్వాంసునిలో నేను చూచింది పృథ్వీస్థాయికి సంబంధించిన మానసిక— ప్రాణిక రూపకల్పన. బీథోవన్ తన మానసిక, ప్రాణిక, భౌతిక ప్రజ్ఞనంతటినీ క్రమశిక్షణలో పెట్టి సంగీత సామర్థ్యాలకే వినియోగించాడు. అందువల్ల అది విఘటితం కాకుండా, జీవంతో యథాతథంగా మరొకరిలో జన్మించింది, అంతే కాని. అది బీథోవన్ చైత్య పురుషుడు కాదు. మొదట్లో మిగిలినవాటి నన్నిటినీ రూపొందించి క్రమశిక్షణలో తన సంగీతసృష్టిచుట్టూ నిలిపింది బీథోవన్ చైత్యసత్తయే. కాని, అతని

మరణానంతరం అతని చైత్యసత్త అక్కడ నిలిచిందో లేదో చెప్పలేము. మామూలు వాడుక ప్రకారం అది చైత్యలోకానికి తిరిగి వెళ్ళి యుండవచ్చు. ఏమైనప్పటికీ, ఆ ప్రజ్ఞ రూపొందింది. తన ప్రత్యేక జీవితం తను గడిపింది. ఒకానొక వ్యక్తీకరణ కోసం రూపొంది అది వ్యక్తమయ్యేవరకూ నిలిచింది. సరియైన ఉపకరణం దొరకగానే వ్యక్తం కావడానికి అందులో ప్రవేశించింది.

### చైత్యపురుషుడు ఒకేసారి రెండు దేహాలలో జన్మను పొందగలడా ?

అది ఏమంత సులభం కాదు. భౌతికజగత్తును నెమ్మదిగా లేవనెత్తి, దైవ సన్నిధికి తిరిగి రావడానికి తగినట్లు దానిని తీర్చిదిద్దడం కోసమై భౌతిక జగత్తులో వ్యాపించిన దివ్యచైతన్యం పరిణామం చెందగా చైత్యపురుషసత్త ఏర్పడింది. ఈ దివ్యాంశవల్ల జన్మద్వారా చైత్యసత్త అభివృద్ధి చెందుతుంది. ఆ విధమైన దాని ప్రగతి పరిపూర్ణమయే సమయం ఒకటి ఆసన్నమౌతుంది. అది సిద్ధి పొంద డానికి ఇంకా ఎక్కువ పరిపూర్ణత పొందాలని ఆకాంక్షిస్తుంది. దాని కోసమని అది అంతర్వలనం (Involution) నుంచి ఒకజీవిని తన చేరువకు ఆకర్షించుకుంటుంది. అటువంటి వాటిని శ్రీఅరవిందులు అధిమనస్సుకు చెందిన అంశలన్నారు. ఇవే చైత్యపురుషునిలో అవతరిస్తాయి. వాటిని మానవులు ఒక రకమైన దేవత లంటారు. ఈ రకంగా విలీనత (fusion) పొందినప్పుడు చైత్యపురుషుడు విశి ష్టతను సంతరించుకొని తనలో అవతరించిన జీవి స్వభావాన్ని పొందుతుంది. అప్పుడు దానికి విభూతుల నుద్భవింప జేయగల శక్తి లభిస్తుంది. విభూతులను పంపడమంటే వారిలోనుంచి కొంతభాగాన్ని బయటకు ప్రక్షేపిస్తారు. అది ఆధారంనుండి విడిపోయి, దానంతట అది అవతరించడానికి ఇతరులలో ప్రవే శిస్తుంది. ఆ విధంగా కేవలం రెండే కాకుండా, మూడు, నాలుగు, అయిదు విభూతులను కూడా పంపవచ్చు. అది సందర్భాన్ని బట్టి ఉంటుంది. ఆవిధంగా జరిగినవాటి ఉద్భవం చైత్య-దైవ సంబంధమని చెప్పవచ్చు. సాధారణంగా విభూతులుగా వెలువడిన వ్యక్తులంతా ఆ దివ్యజీవి తామే ననుకుంటారు, దైవత్వంలో కొంతభాగం వారిలో ఉంటుంది కదా ! దైవత్వంలో ఒకభాగం బహిర్గతమై, వేర్పాటై, అదే వేరొక జీవిలో స్వతంత్రం పొందింది. అది

రెండుగా రూపొందడం కాదు గాని ఒకరకమైన స్వయంప్రక్షేపణము. (ప్రశ్న వేసినవారివైపు తిరిగి) ఏదైతే రెండుగా రూపొందిందో, దానిశక్తిలో కొంతభాగం పోయిందనే భావం మనకు కలుగుతుంది. నీ శరీరాన్ని రెండుభాగాలు చేస్తే, ఒక సగమే నీకు మిగులుతుంది. కాని, నీలోనుంచి విభూతులను పంపగల శక్తి నీ కుంటే, నీ సంపూర్ణత కొనసాగిస్తూనే, ఏకకాలంలో యింకొక వ్యక్తిలో ఇంకొక తార (Tara) గా విలసిల్లగలవు. అర్థమైందా ?

సూక్ష్మదేహపు హస్తాలు పియానో వాయించే వారి చేతులలో ప్రవేశించాయన్నారు కదా ! వారు పియానో మామూలుగానే వాయించ గలిగారా ?

నా కర్థం కావడం లేదు. పియానో వాయించేవారు చనిపోయిన తర్వాత పృథ్వీ వాతావరణంలో మిగిలిపోయినవే ఈ సూక్ష్మహస్తాలు. పరిపూర్ణంగా రూపొందిన ఈ 'హస్తాలు' చైతన్యవంతంగా సజీవ, స్వతంత్ర జీవాంశల మాదిరిగా మారి భౌతికమైన చేతులలోకి ప్రవేశించాయి. అవి నిజంగా పియానో వాయించాలనుకొని అలా చేశాయి: ఆవిధంగా పియానో బాగా వాయించగలవారి చేతులద్వారా వాయించాయి. మామూలుగా మంచి విద్వాంసుడైన ఆ గాయకుడు ఆ 'హస్తాలు' వాయించినంత సేపూ ప్రతిభావంతుడు అయినాడు.

ఆ యితరవ్యక్తి సజీవంగా ఉన్నాడనుకున్నాను,

సజీవంగా ఉన్నాడనా ? ఇతరవ్యక్తి అంటే ఎవరు ? మొదటి వ్యక్తియేనా? లేడు, లేడు. (నవ్వులు)

**ఈ ప్రపంచమంతా క్రమానుగత పరివర్తన ప్రక్రియ*గా ఉన్నదన్నారు గదా! మరి మనుష్యులు వారిలో వారు ఎందుకు పోట్లాడుకుంటారు ?**

అది బహుశా పురోగతి చెందడానికి వారి విధానమేమో! (నవ్వులు) ఎప్పుడూ సామరస్యంగా కనిపించే పద్ధతిలోనే నీవు పురోగమించలేవు. అంతా ఎప్పుడూ సామరస్యంగా, శాంతంగా కొనసాగదని యోగసాధన చేసేవారందరికీ బాగా తెలుసు. ఒక్కొక్కప్పుడు పురోగమనానికి అడ్డుతగిలే అంతఃశత్రువుల నెదుర్కోవలసి వస్తుంది. అది ఒక యుద్ధమే. యావత్ప్రపంచమూ పురోగమిస్తూ ఉన్నప్పుడు, మారడానికి ఇష్టపడనివి నీలో నిరోధిస్తుంటే, వాటితో నీవు యుద్ధం చేయవలసి వస్తుంది. ధ్యానంలో కళ్ళు మూసుకొని కూర్చోడమే పురోగతి అనుకోరాదు. కష్టాలను జయించవలసి వస్తుంది. జయించడమంటే అర్థం ఏమిటి? దేనినో ఒకదానిని ఎదుర్కోవాలి కదా! అంటే యుద్ధమే. కొన్ని చిన్న యుద్ధాలు, కొన్ని పెద్ద యుద్ధాలు. మానవులు చీమల మాదిరిగా కనబడే రాక్షసులుంటే, వారి దృష్టికి భూమిమీద మానవులుచేసే యుద్ధాలు ఏపాటి? చీమల యుద్ధం చూచినప్పుడు అది నీకు సహజంగా కనుపిస్తుంది. ఒక్కొక్క సారి అది నీకు ఆసక్తిని కూడా కలిగిస్తుంది. "చూడు! ఈచీమలు దెబ్బలాడుకుంటున్నాయి" అంటావు. విశ్వంలోని బ్రహ్మాండమైన శక్తులకు మానవ సంఘర్షణ చీమల పోరులాగ కనిపిస్తుంది. అందువల్ల మానవచైతన్యాన్ని

---

* జీవిలో ఏ భాగాలైతే తమపై పనిచేస్తున్న శక్తిని గ్రహించుకొని ప్రతిస్పందనకు సంసిద్ధమౌతాయో, వాటి పరివర్తనపు కదలికలను పెంపొందింప చేసేది యోగశక్తి ప్రభావము. ఈ విధంగా యోగశక్తి కొంతకాలాన్ని కూడ దీస్తుంది. ఈ ప్రపంచమంతా క్రమానుగత పరివర్తన ప్రక్రియలో ఉన్నది. నీవు యోగశిక్షణ ననుసరిస్తే నీలోని ఈ ప్రక్రియను త్వరితం చేయగలవు. మామూలు పద్ధతిలో కొన్ని సంవత్సరాలు పట్టేపని యోగమార్గంద్వారా కొన్ని రోజులలోను, కొన్ని గంటలలోనుకూడా చేయవచ్చు.

ప్రశ్నోత్తరములు 1929 (16 జూన్)

కొలబద్దగా తీసుకొని తీర్మానాలు చేయకూడదు.... మానవునికి ప్రకృతి ఒక ఘోరశక్తిగాను, స్వాధీనం చేసుకోలేని అతీతశక్తిగాను కనిపిస్తుంది. ఆమె అధీనంలో పనిచేసే సకల శక్తులు, సర్వచలనాలు, ఆమె సృష్టించినవే. ఈ భూమి మీద జరిగేవి మాత్రమే మనకు తెలుస్తాయి. మిగిలిన విశ్వంలో సంభవించేవి కూడా మనకు ప్రత్యక్షంగా గాని ఊహాజ్ఞానంగా గాని తెలుస్తున్నాయి. అవన్నీ కూడా మానవచైతన్యానికి బ్రహ్మాండంగా తోచే ఈ శక్తుల కేళీ కలాపాలు, సంఘర్షణలు. మానవ జీవన గతికి పోలిస్తే ఇది శాశ్వతమే: కాలంలో అపారము, మానంలో బ్రహ్మాండము, మానవ చైతన్యానికి అనూహ్యము. పుట్టలు పుట్టలుగా ఉండే చలిచీమల చైతన్యానికీ, మానవచైతన్యానికీ ఎంత అంతర ముందో, ఈ శక్తులకు, మానవ పరిణామ చలనాలకూ అంత తేడా ఉంది. నార్వే, స్వీడన్ దేశ పౌరాణిక గాథలలో అటువంటి బ్రహ్మాండమైన విశ్వశక్తులను గురించి వ్రాశారు. పిల్లలకు తేలికగా అర్థం కావడానికి ఇవి కథలుగా చెపుతారు. ఇద్దరు రాక్షసులున్నారట. వారు భూమి మీద కాకుండా విశ్వంలో ఎక్కడో ఒక అగ్రం మీద కూర్చున్నప్పుడు ఒక రాక్షసు డొక నిట్టూర్పు విడిచాడట. వెయ్యి సంవత్సరాల తర్వాత రెండవ రాక్షసుడు "ఎందుకు నిట్టూర్పు విడిచా" వని అడుగు తాడు. మరొక వెయ్యి సంవత్సరాలకు మొదటివాడు "నాకు విసుగుగా ఉం"దని చెపుతాడు. మళ్ళీ వెయ్యి సంవత్సరాలు గడిచాయి....కథ ఇలా సాగుతుంది. వారిని గురించి మనకొక భావన కల్గడానికి చెప్పిన కథ ఇది. విసుగ్గా ఉందని చెప్పడానికి రాక్షసులకు వేయి సంవత్సరాలు పట్టి ఉండవచ్చు. కాల ప్రమాణాలు వేరు కదా!

## శరీరం కరుడు (Rigid) బారకుండా యోగ శక్తితో నిరోధించడానికి సాధ్యం కాదా ?

సాధ్యమే! నీవు వ్యాయామ క్రీడలలో పాల్గొనడం శరీరానికి నమ్యత చేకూర్చడం కోసమే కదా! మీరు ప్రయోగమిస్తూ సాగినపుడు మొదటి సంవత్సరం చేయలేనివి కొన్ని సంవత్సరాల తర్వాత చేయగలుగుతున్నారు. కొంతమందికి శరీరం గ్రా ర్తిగా నమ్యంగా, ఎటుపడితే అటు వంగుతుంది. యోగాసనాలు వేసేవారి మాదిరిగా శరీరాన్ని నమ్యంగా చేసుకోవచ్చు. సాధారణ మానవుడు ఈశరీర

శిక్షణలో పాల్గొంటే కాలో, చెయ్యో విరగ్గొట్టుకుంటాడు. మనస్సుతో కూడా ఇలాగే జరుగుతుంది. వ్యాయామ క్రీడల ద్వారా నీదేహాన్ని నమ్యంగా చేసుకుం టున్నావు. అది క్రమశిక్షణకు, అభివృద్ధికి సంబంధించిన విషయము.

ఒకరు ఈ జీవితంలో గొప్పమేధావి కావడానికి
కృషి చేస్తా రనుకుందాము, మరుజన్మలో వట్టి
జడుడుగా జన్మిస్తే ఈ కృషివల్ల ప్రయోజనమేమిటి ?

కాదు. నేను క్లుప్తంగా చెప్పాను గాని, అసలు సంగతి అది కాదు. అతని చైత్యసత్త రచయితగా జీవించి ఒక అనుభవం పొందినదనుకుందాము. ఆ రచయిత పుస్తకరచనలు, ఉపన్యాసాలు మొదలైనవాటి ద్వారా తన అనుభవాన్ని వ్యక్తంచేయడం వల్ల ఈ చైత్యజీవి ఒక ప్రత్యేక పరిధిలో అనుభవాన్ని సంపా దించుకుంటుంది. కాని వేరొకరకపు అనుభవం అది పోగొట్టుకొన్నట్లే కదా ! ఉదాహరణకు, "నేను మెదడు నుపయోగించి, మేధావంతమైన ప్రతిచర్యలతో ఇంతవరకూ జీవించాను. ఇప్పుడు యింకొక అనుభూతి పొందుతూ జీవించాల నుంది," అని అనుకుంటాడు. మామూలు జీవితంలో మేధకు క్రియాశీలత ఎక్కువగా ఉంటే, అనుభూతి పొందగల శక్తి తగ్గిపోతుంది. అందువల్ల అతను ఇంకొక పరిధిలో అనుభవం పొందేటందుకు, ఇంకొకరకమైన పురోభివృద్ధి సాధించేటందుకు మేటియైన తన మేధాజీవితం త్యజిస్తాడు. ఇక అప్పుడతను ప్రజ్ఞావంతుడు కాదు. ప్రతిభావంతుడైన రచయిత కాదు. అతి సాధారణ మానవుడే. కాని అతి దయార్ద్రహృదయంతో, ఉదారస్వభావుడౌతాడు. నేను 'జడుడు' అనడం వారి అనులోమ సంబంధాన్ని తెలియజెప్పడం కోసమే: ఎక్కువగా అభివృద్ధి పొందిన చైత్యపురుషుడు, అధికారం హస్తగతమై ఆనం దించే అనుభవం పూర్తయినపిమ్మట (ఒక చక్రవర్తిగా అనుభవం పొందిన తర్వాత) ప్రభుత్వమర్యాదలకు బందీగా కాలం గడుపనక్కరలేని అనామక జీవితం కోరుకో వచ్చు. దానికోసం అతను అతి సాధారణ పరిసరాలలో మధ్యతరగతి కుటుంబ జీవితం ఎంచుకుంటాడు. అప్పుడిక రాచమర్యాదల ప్రమేయం లేకుండా నిర్వి ఘ్నంగా, అజ్ఞాతంగా పని చేసుకోడానికి వీలౌతుంది. నీవు ఒక దృక్పథంతో చూచి, "అదేమి ! ఇలా పతనమయాడు" అంటావు. కాని అది పతనం కాదు.

దానిని ఇంకొక దృక్పథంలో చూడాలి. చైతన్యానికి (సత్యచైతన్యానికి, దివ్య చైతన్యానికి) జయాపజయాలు రెండూ ఒకటే, అద్వితీయమైనా, అతి సామాన్యమైనా భేదంలేదు. చైతన్యాభివృద్ధి ముఖ్యము. మానవకోటికి అనుకూలంగా కనబడే కొన్ని పరిస్థితులు చైతన్యాభివృద్ధికి ప్రతికూలం కావచ్చు. నిన్ను నీవు పరిశీలించుకుంటే తెలుస్తుంది. నీవు ఎప్పుడూ ఉచ్ఛస్థితిలోనే ఉండడానికి జాగ్రత్త వహిస్తే ఈ పొరపాటు చేయవు. కాని నీ మామూలు ఆలోచనలతో, నీ సాధారణ ప్రతిచర్యలతో జయాపజయాలను బట్టి ప్రతిదానినీ నిర్ణయిస్తావు. అలా నిర్ణయించడం నీచము. ఎందుకంటే, అది అతి కృత్రిమంగా పైపైన ఉండి సత్యాన్ని వ్యతిరేకిస్తుంది. ప్రస్తుతం ఒక రకంగా వ్యవస్థీకృతమైన మానవ జీవితంలో పదిలక్షలకి ఒకసారైనా అసలు విలువ గుర్తింపుకు రాదు. కొద్ది డాంబికం (Cabotinage) సర్వత్రా అవసరమౌతుంది. ఎవరైనా స్వల్పవిజయంగాని, ఘన విజయం గాని పొందితే, అది ఎందులోనైనా సరే కొంతనటన ఉందని నీవనుకోవచ్చు.

## డాంబికం అంటే ఏమిటి ?

హాస్య నాటకాలలో బాగా ప్రదర్శించే పాత్రధారులకు ఇది వర్తిస్తుంది. ఇంకా తమ విలువలను ఎవరైతే గోరంతలు కొండంతలుగా చెప్పుకుంటారో, ఉన్నదానికంటె మిన్నగా కనిపించాలని ఎవరైతే ప్రయత్నిస్తారో, తనకు లేనిదానిని ఉన్నట్లు ప్రదర్శించి అందరూ తననే మెచ్చుకోవాలని ఎవరైతే తహతహలాడుతారో అటువంటివారికి కూడా ఇది వర్తిస్తుంది. వారికి ఇతరుల మెప్పే అన్నిటికంటే ముఖ్యము.

## జ్ఞాపకశక్తిని ఎలా అభివృద్ధి చేసుకోగలము ?

నీ చైతన్యాన్ని విశాలం చేసుకో, జ్ఞాపకశక్తి పెరుగుతుంది. యాంత్రికమైన 'మెదడు జ్ఞాపకం' కంటె ఉన్నతమైనది 'చైతన్య స్మృతి'. నేను ఈ మధ్యనే దీనిని గురించి చెప్పాను. యాంత్రిక మెదడు తాను గుర్తుంచుకున్నది మరచిపోవచ్చు, ఒకదానికొకటి పొరపడవచ్చు, విరూపము చేయవచ్చు. కాని

ఒకానొక క్షణంలో నీ చైతన్యస్థితి ఎలా ఉన్నదో దానిని తిరిగి నీలో నిలుపుకో గలిగితే, అనుభవం అంతా పునరావృత్తమౌతుంది. అదే నిజమైన జ్ఞాపకము. ఇది నీ చైతన్యాభివృద్ధిపై ఆధారపడి ఉంటుంది.

భౌతిక స్థాయిలో గ్రహనశీలత చాలా వరకు నిరోధకశక్తి * తో మిళితమై పోయిందని చెప్పారు కదా ! ఈ నిరోధకశక్తి అంటే ఏమిటి ?

నీ శరీరంలో నిరోధకశక్తి లేదా ? నీవు ఏ వ్యాయామమైనా చేద్దామనుకుంటే అనుకున్నదనుకున్నట్లు నీ శరీరంతో చేయగలవా ? నీవు మంచి ఆరోగ్యంగానే ఉండాలంటే నీ శరీరం దాన్ని ఎల్లప్పుడూ శిరసావహిస్తోందా ? నీవు పాఠం నేర్చుకుందా మనుకుంటే నీ మెదడు కష్టం లేకుండా అర్థం చేసుకోగలుగుతుందా ? అదే నిరోధకశక్తి. దురదృష్టవశాత్తూ గ్రహణ శీలతకన్నా ఈ నిరోధకశక్తే ఎక్కువ. గ్రహింపు కావాలంటే బాగా కష్టపడి పని చేయాలి.

నీ కందుబాటులో ఉన్న అపరిమిత శక్తి ప్రవాహాన్ని నీవు ఊహించలేవు. ఒకనాటికి నీవు తెలుసుకోవచ్చు. ఎవరైనా వచ్చి నీ కర్థమయేటట్లు వివరించి చెప్పవచ్చు. కాని నీవది ఊహించలేవు. నీవు ఆ అనుభూతి పొందితే అది నీకు మించింది కావడంవల్ల వెనక్కి తగ్గుతావు. అది దేహకణాల్లో ఒక రకమైన సహజాతభయం కలిగిస్తుంది. నీవు దానిని పొందితే, దానిలో మూడువంతులకు పైగా, గిన్నె నిండితే పొర్లిపోయినట్లుగా పోతుంది. ఆ విధంగా పొంగిపోవ డానికి కారణం నీవు దానిని నిలుపుకోలేక పోవడమే. ఏమీ గ్రహించుకోలేక పోతున్నామని చెప్పినవారిని చాలామందిని నేను కలుసుకున్నాను, అంటే వాళ్ళు, తామనుకున్న శక్తులు తమకు లభించడం లేదని చెప్పారు. వారు ఏమాత్రం గ్రహించుకోలేకపోవడమే అందుకు కారణము. వారు గ్రహించుకోగలిగినదాని కంటె కొన్ని వేలరెట్లు అధికంగా ఆ శక్తి ఉంది. మీరంతా అపరిమితమైన ప్రకంపనాజలధిలో మునిగి తేలుతున్నారు. గ్రహణశీలత లేకపోవడంవల్ల

ఆ సంగతి మీకు తెలియదు. మీ దగ్గర నిరోధకశక్తి ఎంత ఎక్కువగా ఉన్నదంటే, మీలోకి ఏదైనా ప్రవేశిస్తే, ప్రవేశింప దానిలో మూడు వంతులకు పైగా బహిర్గతమైపోతుంది. దానిని పొందుపరచుకోలేరు గదా! సాధారణంగా నేను ఈ విషయంగురించి మాట్లాడను. కాని, ఈ అంశం ప్రస్తావనకు వచ్చింది గాబట్టి చెప్పాను. ఒకరోజు దీని విషయమై మీకు కొన్ని ఉదాహరణలు చెపుతాను. అది నమ్మశక్యం కాదు. ఉదాహరణకు, పరాశక్తివిశేషముల చైతన్యం సంగతి చూడు. ప్రేమశక్తి, అవగాహనశక్తి, సృజనశక్తి (అన్నింటికీ ఒకటే వర్తిస్తుంది: పరిరక్షణశక్తి, ప్రగతిశక్తి, అభివృద్ధి శక్తి) మొదలైన వాటిని చూడు. ప్రతిదాన్నీ ఆవరించి, ప్రతిదానిలో ప్రవేశించి, ప్రతిచోటా వ్యాపించి, ప్రతిదానిలో కన్పించే పరాచైతన్యం చూడు. భరించి, నిగ్రహించలేని జీవికి అదంతా తనపై విధించబడే ఒక ఘాతుక కృత్యంగా కనుపిస్తుంది. నేను చాలా మంచివారి సంగతే మాట్లాడుతున్నాను. కాని, ప్రతివారిలోనూ సామాన్యంగా ఒక మాదిరి పెద్ద భాగం, కొంత ముఖ్యమైన భాగం, సత్సంకల్పం ఇంకా కలుగని ఒక భాగం, దుస్సంకల్పానికి సరిహద్దులో నిలిచి, ఏది ఏమైనా ఇష్టపడకుండా, వచ్చినవా టన్నిటినీ నిరాకరించడం జరుగుతూ ఉంటుంది. కాని, ఎవరైనా విప్పృతులైనవారుంటే, ఆ పరమచైతన్యాన్నీ, వెలుగునూ, జ్ఞానాన్నీ, పరమ శక్తినీ, పరమ ప్రేమనూ—అంతటినీ ఆస్వాదించ గలరు. ఈ భూమిపై అంతా వృథా అవుతోంది. ఎందువల్లనంటే, భూమాత గ్రహించడానికి ఇంకా సంసిద్ధం కాలేదు.

సెప్టెంబరు 23, 1953

శరీరంలోని ప్రతి అంశం ఒక ఆంతర చలనానికి ప్రతీకగా ఉంది. ఆ విధంగా అనుగుణమైన సూక్ష్మ ప్రపంచం ఒకటి మనలో ఉంది. ఆ విషయం చాలా పెద్దది, సంక్లిష్టమైనది కావడం వల్ల, దాని వివరాలలోకి ఇప్పుడు వెళ్ళలేము. శరీరంలో ఎక్కడైనా ఒక భాగంలో అస్వస్థత కలిగితే, లోపల

దానికి అనుగుణమైన అంశంలో అసామంజస్యం ఏర్పడిందని సూచనగా గ్రహించాలి. అదే అస్వస్థతకు మూలం, పైకి కనుపించేది దాని సూచన. జీవిమొత్తం ఒకే విధమైన శీఘ్రగతిలో పురోగమించకుండా అడ్డుపడిన అవరోధపు స్వభావం ఎటువంటిదో ఈ అస్వస్థత తెలియజేస్తుంది. ఇంకా రోగ నిదానాన్నీ, నివారణనూ కూడా తెలియజేస్తుంది. తప్పు ఎక్కడుందో నిర్దుష్టంగా తెలుసుకొని, గ్రాహ్యత లేనిదేదో వెతికి కనుక్కొని, దానిని వివృతంచేసి శక్తి ప్రకాశాలను అక్కడ నిలిపితే, చెడిపోయిన సామంజస్యాన్ని క్షణాలమీద పునరుద్ధరించవచ్చు. వెంటనే అస్వస్థత తొలగిపోతుంది.

ప్రశ్నోత్తరములు 1929 (16 జూన్)

"శరీరంలో ప్రతి అంశం ఒక ఆంతర చలనానికి ప్రతీకగా ఉంది." అది ఎందువల్ల ?

భౌతిక ప్రపంచమంతా విశ్వచలనాలకు సాంకేతికం కావడమే దీనికి కారణము. అందువల్లనే మన ఆంతరిక చలనాలకు శరీరం ప్రతీకగా ఏర్పడింది. ఈ భౌతిక ప్రపంచమంతా స్ఫటికీకరణం మాదిరి ఏర్పడింది. అంటే విశ్వపు ఇతరస్థాయిలలోని చలనాలు స్ఫటికీకృతమయినాయి, లేదా భౌతిక పదార్థంగా మారాయని చెప్పవచ్చు. అది చివరి స్థాయి అనీ, ఏదైతే ప్రతిరూపాన్ని నిలుపుతుందో దానిపై ఈ చలనాలు ప్రక్షేపణమైనాయని చెప్పుకోవచ్చు. అందువల్ల ప్రతి అంశంలోను భౌతిక విశ్వంలో జరిగినట్లే జరుగుతుంది.

భౌతిక పదార్థం కూడా ఒకస్థాయి అన్నమాట ?
కాదా ?

అవును. అది తుది ఫలితము. తరుగుతూ, పెరుగుతూ ఉన్న పదార్థ తత్వంలో భౌతికస్థాయి కేంద్రస్థంగా ఉంటుంది. అది ఒక తెర వంటిది. దానిపైన అన్నిరకాల ప్రకంపనాలూ ప్రక్షేపమౌతాయి—అంటే. జరుగుతున్న వాటన్నిటి ప్రతిరూపమే అది అని చెప్పవచ్చు. అది పూర్తి అయిపోయి. స్వరూపాన్ని పొందింది కాబట్టి దానిని మనం గుర్తించగలము. ఇంకా చెప్పాలంటే, విశ్వాన్నంతా ఒక శక్తి చలనంగా తీసికొని, ఆ చలనాన్ని తెరమీదకు ప్రక్షేపించినట్లుగా భావిస్తే, అది ఆ తెరమీద ప్రతిరూపాన్ని కలుగజేస్తుంది. ఆ తెరమీది ప్రతిరూపమే భౌతిక ప్రపంచము. అది కేవలం ప్రతి రూపము. మనం అదృశ్యమానమని చెప్పుకునేదానిలో జరిగే విషయానికి ప్రతిరూపము. ఆ తెర ఒకటి దానిని అడ్డుకొని ఆ ప్రకంపనాలను ఆపుచేయడంవల్ల అది ప్రతిబింబించి మనకు దృశ్యమానం అవుతున్నది. అక్కడ తెర అడ్డురాకపోతే ఆ ప్రకంపనాలు సాగిపోయి మనకేమీ కనుపించేది కాదు. అయినప్పటికీ ఆ చలనాలన్నీ ఉనికి ఏర్పరుచుకునేవే. కాని, తెర లేకపోయినట్లయితే అవి మనకు కనుపించేవి కాదు.

సాధారణ చైతన్యానికి ఆ ప్రతిరూపమే వాస్తవము. దానివెనకాల జరిగేదంతా ఇంచుమించు సందిగ్ధమే. యథార్థ చైతన్యానికి ముందు. వెనుక జరిగేదంతా వాస్తవం, బాహ్యంగా కనుపించేది ప్రతిరూపము. అంటే. తెరమీద చూచేది సర్వస్వతంత్రమైన ఉనికి గలదాని ప్రక్షేపణగా వారు గుర్తిస్తారు. మన శరీరం ఆ విధంగా ప్రక్షేపించిన ప్రతిరూపాల సముదాయంలో ఒక చిన్న అంశమే. ఈ చిన్న అంశానికి అనుగుణంగా ఉన్న అంతర్గతస్థితిలోని ప్రకంపనాలను అది యథాతథంగా వ్యక్తీకరిస్తుంది.

జంతువులలో అస్వస్థతకు కారణం ఏమిటి ?

మానవుల మాదిరిగానే జంతువులలో కూడా ఎన్ని రకాల అస్వస్థతలు ఉన్నాయో అన్ని కారణాలు ఉన్నాయి. ఇవి బహుశా మానసిక చలనాలు కావచ్చు.

జంతువులకు మానసిక చలనాలు ఉంటాయికదా! అవి ప్రమాదాలు కావచ్చు. ఎందు వల్లనంటే, జంతువులలో హెచ్చు ప్రమాదాలు సంభవించే పూర్తి పరిధి కూడా ఒకటి ఉంది. మరణంతో సహా అన్ని రోగాలూ ప్రమాదాలేనని పండితులు చెప్తారు. కాబట్టి, జంతువులకు అదే కావచ్చు, బహుశః మానసిక పరిస్థితి కూడా కావచ్చు.

మానవులతో జీవిస్తున్న జంతువులలో అది పూర్తిగా వాస్తవము. మానవులతో జీవించడం వల్ల వాటికి మేధాశక్తి రాకపోయినా, మానవులమాదిరిగా సున్నితత్వం అలవరచుకొని సమస్థాయిని పోగొట్టుకుంటున్నాయి. ఉదాహరణకు, జంతువులకు సహజాత జ్ఞానం ఎక్కువ. పశువులను మేతకోసం అనేక రకాల గడ్డి ఉన్న చోటుకు పంపినప్పుడు (మంచి. చెడు గడ్డి జాతులే కాకుండా, విషపూరితమైనవి కూడా), అందులో విషపు మొక్కలను ఏ పశువూ ముట్టుకోదు. దాని నాలుక కొసతో మంచిదేదో చూచుకొని దానిని మాత్రమే తిని మిగిలినవాటిని వదిలేస్తుంది. నీవు ఆ గడ్డిని కోసి మంచిదాన్నీ చెడుదాన్నీ కలిపేసి ఆవుముందు వేస్తే మాత్రం విషపుగడ్డితో సహా అంతా తినేస్తుంది. దానికి కారణం గుడ్డి నమ్మకమే. మానవులపై దానికిగల నమ్మకంవల్ల తన ముందు వేసినదంతా తిన డానికే ననుకొని తినేస్తుంది. ఆవిధంగా దాని సహజాత జ్ఞానం తగ్గిపోతుంది. సహజస్థితిలో జంతువులు ఎప్పుడూ మితిమీరి తినవు. వాటి ఆకలి ననుసరించి కావలసినదానిని తిని, ఇంకా మిగిలిపోయి అది ఇక తినగూడదనుకుంటే ఎక్కడైనా గొయ్యి తీసి పాతిపెడుతుంది. మళ్ళీ దానికి అకలి వేసినప్పుడు కనుక్కునేటట్లు జాగ్రత్తగా పాతిపెడుతుంది. కాని, మానవులతో కలసి జీవిస్తున్న జంతువులు ఈ సహజాత జ్ఞానాన్ని కోల్పోవడం వల్ల దానికి వేసినదానినే కాకుండా, అందుబాటులో ఉన్న ప్రతిదానినీ తినేస్తుంది. నేను ఫ్రాన్సులో ఉండగా ఒకసారి ఇలాగే జరిగింది. ఒక షావుకారు కొన్ని గొర్రెలను పెంచేవాడు. ఒకనాడు అప్పుడే వచ్చిన బెల్లంఅచ్చును ఊడదీసి పొరపాటున అలా ఉంచేశాడు. అక్కడే తిరుగుతున్న గొర్రె ఒకటి దానిని చూచి అది తనకు అందుబాటులో ఉన్నది కాబట్టి అది చాలా మంచి వస్తువు కాబోలుననుకొని తినడం మొదలుపెట్టింది, రుచి తెలుసుకొని అంతా తినేసింది. దానికి సహజాత జ్ఞానం నశించింది కదా—అది

చచ్చేవరకూ ఆవిధంగానే తిన్నది. అడవి జంతువులు ఎన్నటికీ అలా చేయవు. ఇవే మానవ సంపర్కంతో జంతువులకు కలిగిన ఉపయోగాలు!

ఇంకేమీ ప్రశ్నలు లేవా?

అయితే ఈ విషయం ఇక్కడితో ఆపు చేద్దాము. ఈమె * మాత్రం అస్వస్థలతో బాధపడుతున్నట్లు కనిపిస్తోంది.

> అదృశ్య ప్రపంచాల ప్రక్షేపణే ఈ భౌతిక ప్రపంచమని మీరు చెప్పారు. అయితే, దీనిని పరివర్తింప జేయడంకోసం దైవాంశలు ఎందుకు ఇక్కడ అవతరిస్తున్నాయి? అవి అదృశ్యస్థాయిలో పని చేస్తే సరిపోతుంది కదా? అప్పుడు ఆ ప్రక్షేపణే బాగుంటుంది.

నిజానికి యిది ఒక జటిల సమస్య!....ఈ విశ్వం అంటే ఏమని చెపుతారో నీవు విన్నావా? తనతోకను తనే కబళిస్తున్న సర్పము! అది అనంతానికీ, విశ్వానికీ ఒక ప్రతీక. అది వాస్తవము. సృష్టి అధికాధికముగ ఎక్కువ స్థూలంగా మార్పుతోంది. మనం ఇంకొక రూపకల్పనను తీసుకుందాము (సుమారుగా ఉండే రూపకల్పన.) ఈ విశ్వం ఒక వలయం, లేదా గోళం కదా! (వలయం అనుకుంటే వీలు, అందుకని వలయం అనే చెప్పుకుందాం.) అతిసూక్ష్మం నుంచి అతి స్థూలం దాకా ఒక ప్రవర్ధమాన అవతరణ జరుగుతోంది. అన్నిటి లోకి అత్యంత స్థూలమైనది అత్యంత సూక్ష్మమైనదాని మూలాన్ని స్పృశిస్తుంది. నీవు ఈ ప్రతిరూపాన్ని అర్థం చేసుకుంటే పదార్థాన్ని మార్చడానికి, చుట్టు తిరిగి రానక్కరలేకుండా సూటిగా మార్చడం ఎంతతేలికో బోధపడుతుంది. ఎందువల్ల

నంటే అది ఒక వలయం కాబట్టి రెండు కొనలూ కలిసిపోతాయి. అంటే అతి సూక్ష్మమైనదీ. అతిస్థూలమైనదీ రెండూ కలుస్తాయి. అందువల్ల ఆ తిరుగుడు లేకుండా (శ్రీమాత వలయం గీసి చూపుతారు). ఇలా చేయడం తేలిక (శ్రీమాత వలయంలో అతి స్థూలపు కొనను చూపుతారు.) మానసికంగా ఇలా జరుగుతుంది. ఇలాచేస్తే మిగిలినదంతా దానంతట అదే మారుతుంది. కొంతకాలానికి అంతా స్థిరపడుతుంది. అంతేకాదు! పని వీలును బట్టి కూడా అంతా ఒకేచోట కేంద్రీకృతం చేస్తే, మార్పు చేయడం కోసం ఒక్కరే అనంతంలో విస్తరించడానికి బదులు విశ్వానికంతటికీ ప్రతీకగా నిలిచిన ఒక స్థానం దగ్గర పనిచేస్తే సరిపోతుంది. (ఖగోళశాస్త్రి దృష్ట్యా భూమి చెప్పుకో తగ్గది కాదు. అనంతమైన ఆకాశాలలో భూమి ఆసక్తిని కలిగించదు, దానికి ప్రాముఖ్యం లేదు). తాంత్రిక, ఆధ్యాత్మిక దృష్ట్యా అది విశ్వానికి కేంద్రీకృత ప్రతీక. అందువల్ల పలచబడ్డ ఆకాశంలో కాకుండా ఒక స్థానంలో పనిచేయడం చాలా తేలిక. పనిచేసేవారందరికీ ఈ విషయం తెలుసు. అందువల్ల పనివీలు, అవసరాల ననుసరించి ఈ విశ్వమంతా భూమి అనే ఇసుక రేణువులో కేంద్రీకృతమైన ప్రతీకగా ఘనీభవించింది. అది అన్నిటికీ చిహ్నమే; మార్చవలసినవాటన్నిటికి, పరివర్తింప చేయవలసినవాటన్నిటికికూడా అది చిహ్నంగా ఏర్పడింది. అంటే ఈ పనిమీదనే కేంద్రీకరించి అక్కడే పనిచేస్తే మిగిలినదంతా స్వయంచాలకంగా దానిని అనుసరిస్తుంది. ఇంకో విధంగా దీనికి పరిష్కారం లేదు.

అందువల్లనే ప్రత్యేకించి ఈ కేంద్రం చెడ్డగా కనిపిస్తుంది. అంతా అక్కడే కేంద్రీకృతమైంది కదా! అదే మంచిగా కూడా కావచ్చు. ఎందువల్లనంటే ప్రతి చోటా ద్వంద్వాలు, పరస్పర విరుద్ధాలు కలిసి ఏర్పడతాయి. అతిచెడ్డనానుకొని అతిమంచి, అతిమంచిని అంటిపెట్టుకొని అతిచెడ్డ (నీవు ఎటువైపునుంచి చూస్తున్నావో దానిని బట్టి) నీకు కనిపిస్తాయి. ఆ అతిచెడ్డవల్లనే నీవు మంచిని తెలుసుకోగలవు. అతి ఉత్తమమైనవాటి వల్లనే చెడును పరివర్తన చేయగలవు. ఇవి రెండూ ఒకదానిపై ఒకటి చర్య, ప్రతిచర్యలు జరుపుతాయి....ఇదంతా 'బులె

టిన్' లో ప్రకటించారు: "ఈవిల్ పర్సనా" అంటే "దుష్ట వ్యక్తిత్వం"* అనే పేరుతో ప్రకటించారు. అందువల్లనే నక్షత్రాలకు అంధకారం ద్వంద్వం, గ్రహాలకు ప్రకాశద్వంద్వం ఉన్నాయని చెపుతారు. తాంత్రికశాస్త్రంలో తేజోమయ పృథ్వికూడా ఉన్నదని చెపుతారు. అదంతా ఆ తేజోమయ పృథ్వికి సంబంధించిన అనుభవమే. శ్రీ అరవిందులు ఆ అనుభవాన్ని వివరించారు.

---

* "ఈవిల్ పర్సనా" — దుష్టవ్యక్తిత్వం

"దుష్టవ్యక్తి" అని నీవు చెప్పిన విషయం చాలా ఆసక్తిని కలిగిస్తోంది. ఇది నా అనుభవాన్ని దృఢపరుస్తోంది నా అనుభవం ప్రకారం ఒక వ్యక్తి ఆ కార్యాచరణలో నిమగ్నుడై యున్నప్పుడు ఇంచుమించు ఎప్పుడూ ఒకజీవి అతనితో అనుబంధంగా చేరి ఉండడం కనిపిస్తుంది. మనం దీనినొక సార్వత్రిక సిద్ధాంతంగా చేయగూడదేమో— ఆ జీవి ఒక్కొక్కప్పుడు వ్యక్తిలో భాగంగా కనుపిస్తుంది. అందువల్ల చేయవలసిన పనిలో అతని పాత్ర పూర్తిగా వ్యతిరేకంగా ఉన్నట్లు కనిపిస్తుంది. ఆ జీవి మొదట్లోనే చేరి లేకపోయినా, అతని వ్యక్తిత్వంతో చేరి లేకపోయినా, అతను పని ప్రారంభించగానే ఈ రకమైన శక్తి ఒకటి అతని వాతావరణంలో ప్రవేశిస్తుంది. వ్యతిరేకించడం, అవరోధాలు కల్పించడం, ప్రతికూల పరిస్థితు లేర్పరచడం దీని పనిగా కనిపిస్తుంది. ఒక మాటలో చెప్పాలంటే, అతను చేయవలసిన పనినే ఒక సమస్యచేసి అతని ముందర పెడుతుంది. తాంత్రిక పరిభాషలో చెప్పాలంటే, ఈ కష్టాన్నంతటినీ తనదిగా స్వీకరించడానికి నిర్ణీతమైన ఉపకరణం ద్వారా తప్ప మరి ఏరకంగానూ ఈ సమస్యా పరిష్కారం సాధ్యంకాదన్నట్లు తోస్తుంది. పైపైన చాలా కలవరపాటు కలిగించే అనేక విషయాలను ఇది వివరిస్తుంది.

శ్రీఅరవిందుల 'లెటర్స్ ఆన్ యోగా' సెంటినరీ వాల్యూమ్ 24 పేజీ 1660; ఆగస్టు 1953 బులెటిన్.

ఆ అనుభవం ఏమిటి ?

అది నాకు కలిగిన అనుభవమే. నేను శ్రీఅరవిందులకు దానిని గురించి వ్రాశాను. అది వేదకాలానికి సంబంధించిన అనుభవమని, పృథ్వియొక్క తేజో మయ ద్వంద్వంలో జరిగిన అనుభవమని వారు చెప్పారు.... అది కూడా ఎక్కడో ఒకచోట ఏదోఒకరోజున వెలువడవచ్చు. *

30 సెప్టెంబరు 1953

మనస్సులోని ఒకానొక స్థాయిలో జ్ఞాపకాలన్నీ చేరి ఎప్పటికీ అక్కడే నిలిచిపోతాయి. పృథ్వీ జీవితానికి సంబంధించిన మానసిక చలనాలన్నీ ఈ స్థాయిలో నమోదై ఉంటాయి. అక్కడికి వెళ్ళగలవారు కష్టపడి అది చదువుకొని వారి కిష్టమైన దానిని తెలుసుకోవచ్చు. కాని, ఈ స్థాయే అతి మానసిక స్థాయి అని పొరపడకూడదు. అయితే, ఇక్కడికి చేరాలన్నా, భౌతిక మనస్సు చలనాల నన్నిటిని అరికట్టగలగాలి. నీ సంవేదనలన్నిటినీ పక్కకునెట్టి, నీ సాధారణ చలనాలన్నిటినీ (అవి ఏవైనాసరే) ఆపుచేయాలి. ప్రాణమయ దేహాన్నుంచి

* 1915 వ సంవత్సరం నవంబరు 26 న శ్రీమాతకు జరిగిన అనుభవం అది. ఇదంతా 'ప్రార్థనలు— ధ్యానములు' అనే పుస్తకంలో వివరించారు. 1915 లో డిశంబరు 31 న శ్రీఅరవిందులు శ్రీమాత కిచ్చిన సమాధానం శ్రీఅరవిందుల 25 వ శతవార్షిక గ్రంథంలో 'శ్రీమాత' పుస్తకంలో 384 వ పేజీలో ప్రచురించారు.

బయటకు రావాలి. శరీర బానిసత్వంనుంచి విము క్తుడివి కావాలి. అప్పుడే ఆ స్థాయిని ప్రవేశించి చూడగలవు. నీకంత శ్రద్ధ ఉంటేనే అక్కడికి చేరి పృథ్వీస్మృతులలో రాసిపెట్టినదంతా చదువుకో గలవు.

ప్రశ్నోత్తరములు 1929 (23 జూన్)

పృథ్వీ జీవితానికి సంబంధించిన మానసికచలనా లన్నీ నమోదుచేసి భద్రపరచిన స్థానానికి చేరా లంటే పదార్థమయ, భౌతిక మనస్సు చలనాలనన్ని టినీ నిశ్శబ్దపరచి.... సాధారణ మానసిక చలనా లను నిలుపు చేయాలని అన్నారు కదా. ఈ చల నాల నన్నిటినీ ఆపుచేస్తే ఏం జరుగుతుంది? రోజంతా ఏదో ఒకటి చేయాలి కదా.

అలాకాదు, అది ఆక్షణంలో మాత్రమే. ఎప్పటికీ కాదు.

మరచిపోతేనో? ఏదో పనిలోబడి రెండు గంటలకు ఈ పని చేయాలి, పదిన్నరకి ఆ పని చేయాలి అంటూ మరచిపోతే....

అబ్బే, నీకు అర్థంకాలేదు. ఆ స్థానానికి వెళ్ళాలంటే, ఆ వెళ్ళేసమయంలో మాత్రం నీ మానసిక చలనాలను పూర్తిగా నిశ్శబ్ద పరచాలి. (నేను చెప్పిన మిగి లినవన్నీ). అక్కడికి చేరేవరకే. ఉదాహరణకు, నీవు "పృథ్వీ చరిత్రలో ఫలాని అధ్యాయం చదువబోతున్నాను" అని నిశ్చయించుకుంటావనుకో. ఇక

అప్పుడు పడక కుర్చీలో హాయిగా విశ్రమించి, నిన్ను కదిలించవద్దని దగ్గరున్న వారితో చెప్పి, నీలోకి వెళ్ళి మనస్సును పూర్తిగా ఆపుచేస్తావు. నీ మానసిక దూతను ఆ స్థానానికి పంపతావు.... నిన్ను అక్కడికి తీసుకువెళ్ళడానికి మార్గ దర్శకు లెవరైనా కావాలి. లేకపోతే దారితప్పి ఇంకోచోటికి వెడతావు. ఆవిధంగా అక్కడకు వెళ్ళుతావు. అది చిన్న చిన్న అరలతో కూడిన పెద్ద లైబ్రరీ మాదిరిగా ఉంటే, నీకు కావలసిన సమాచారంగల అర దగ్గరకు వెళ్ళుతావు. అక్కడ మీట నొక్కేసరికి అర తెరుచుకుంటుంది. అక్కడ మానసిక రూప కల్పన చుట్టచుట్టుకొన్నట్లుండి విప్పుకుంటుంది. నీవు చదువుతావు. నీకు కావలసిన సమాచారం గుర్తుంచుకొని, ఆ కొత్తజ్ఞానంతో మెల్లగా నీ శరీరం లోకి తిరిగి వచ్చేస్తావు. నీవు ఆవిధంగా కనుక్కొన్న దానిని చేతనైతే బాహ్య మనస్సుతో తర్జుమా చేసుకొని లేచి నీ పనులు నీవు చూచుకుంటావు. .... ఇది ఒక పది నిముషాలుకాని, అరగంటకాని నీ శక్తిసామర్థ్యాల ననుసరించి చేయగలవు. కాని, ఆ దారి తెలుసుకోవడం ముఖ్యము. లేకపోతే పొరపాటులు వస్తాయి.

అయితే, పుస్తకాలు చదవడం మానేసి అలాగే ఎందుకు చేయము ?

అలా చేయడం చాలా కొద్దిమందికే సాధ్యము. పుస్తకాలైతే చాలామంది చదవ గలరు (అర్థం చేసుకొనేవారు తక్కువే అయినా ఎక్కువమంది చదవగలరు గదా!) పుస్తకం అర్థం చేసుకున్నదానికంటె ఇది చాలా కష్టము.

పిల్లలకు చాలా చిన్నతనంలోనే అది నేర్పిస్తే ?

పుస్తకాలు చదవనక్కరలేకుండా ఇలా చేయడం నేర్పించవచ్చు. అది సాధ్యమే.

భూమి పుట్టినప్పటినుంచి ఇప్పటివరకు జరిగిన చలనాలన్నీ, మనస్సు చల నాలన్నీ, సమస్తం యథాతథంగా అక్కడ లిఖితమైనాయి. నీకు ఖచ్చితమైన

సమాచారం ఏది కావాలన్నా దారి తెలుసుకొని అక్కడకు వెళ్ళితే చాలు, అది చాలా విచిత్రమైన ప్రదేశము; పావురం గూళ్ళవంటి చిన్న చిన్న అరలతో నిర్మించినట్లు కనిపిస్తుంది. అర్థం అయేటట్లు చెప్పడం కష్టము. అటువంటి లైబ్రరీలు నిజంగా ఉన్నాయి. న్యూయార్కులో ఉన్న ఒక లైబ్రరీని ఒక సినిమాలో చూచాను. ఇంచుమించు అలానే కనపడింది. ఆ ఏర్పాటు అంతా అదే. అందుకే ఆ సినిమాలో దానిని చూచినప్పుడు నాకు సరదా కల్గింది. కాని, పుస్తకాల బదులు ఇవి చిన్న చదరల మాదిరిగా ఉండి మూసేసి కనిపిస్తాయి. వ్రేలితో అక్కడున్న బొత్తాము నొక్కితే అది తెరుచుకుంటుంది. అందులోనుంచి ఒక కాగితపు చుట్ట లాటిది బయటకు వస్తుంది. నీవు దానిని విప్పి చదువుకోవడమే. ఒక విషయాన్ని గురించిన సమాచారం అంతా అందులోనే దొరుకుతుంది. ఇటువంటివి కోట్లకొద్ది అక్కడ ఉంటాయి. అదృష్టవశాత్తూ మనస్సులో కిందికి, పైకి, మీదకు యథేచ్ఛగా వెళ్ళవచ్చు. నిచ్చెన అక్కరలేదు.

అది చదవడం ఎలాగ? పుస్తకం చదివినట్లేనా?

ఆ, అది ఒకరకమైన మానసిక గ్రహణము. నీకు సమాచార మంతా చక్కగా కనిపిస్తుంది. అది ఏవిషయం అనేదాన్నిబట్టి ఒక్కొక్కసారి బొమ్మలు కూడా ఉంటాయి: ఒక బొమ్మనే అక్కడ భద్రపరచినట్లుగాను, ఒక్కొక్కసారి ఒక కథగాను, ఒక్కొక్కసారి ప్రశ్నకు సమాధానంగాను చూడవచ్చు. సాధ్యమైనవి, ఊహించ గలిగినవి మానసికంగా నమోదౌతాయి. కొన్ని దిద్దుబాటులు కూడా కనిపిస్తాయి (పుస్తకాలలోని తప్పు విషయాలకు). అక్కడ నీవు నడవనక్కరలేదు, పైకి ఎక్కనక్కర లేదు: చాలా తేలికగా ఒక కేంద్రీకృత మానసిక చైతన్యాన్ని పంపిస్తే అది కావలసినదానిదగ్గరకు వెళ్ళుతుంది. కాని నీ మానసిక చర్యల నుంచి పూర్తిగా విముక్తుడవై ఇలా చేయకపోతేమాత్రం, నీ మనస్సులో ఉన్నదాన్నే అక్కడా చూస్తావని నా భయము. అక్కడికివెళ్ళి దానిని చూచే బదులు, నీ మెదడులోనే పచార్లుచేసి అక్కడున్నదానినే చూస్తావు—— అది చాలా అపాయము. నీ తలంతా పూర్తిగా ఖాళీ అయిపోయి స్వేచ్ఛను పొందాలి. (ఉదాహరణకు నీవొక సమస్యకు పరిష్కారం వెతుకుతుంటే) నీకు చాలా మంచిదిగానూ, ఉపయోగ్యమైనదిగానూ, తోచే ఏవిధమైన పరిష్కారమూ నీ మనస్సులో

ఉండగూడదు. నీవు పూర్తిగా తెల్ల కాగితం మాదిరి కావాలి. నిజం తెలుసుకోవాలనే విధేయతతో, ఆకాంక్షతో, పరిష్కారం ఈవిధంగా ఉంటుందని ముందుగా ఏమీ అనుకోకుండా, ఈవిధానం అనుసరించాలి. లేకపోతే నీ స్వంత రూపకల్పననే నీవు చూస్తావు. ఈ పరిశీలనకు, నిశ్శబ్దమైన మనస్సు అన్నిటికంటె ముఖ్యము.

ఇంకా నమ్మకంగా (ఇలా చేయడానికి ఎంతో శిక్షణ, మంచి విద్యాసంపత్తి అవసరం), గ్రహించినజ్ఞానాన్ని ఏమాత్రం మార్చకుండా చెప్పగలగాలంటే, అదంతా పైకి చదవడం మంచిది. (చదవడం అంటున్నప్పటికీ అది గ్రహించడమే), అంటే, నీవు గ్రహించినది పైకి చదువుతుంటే వేరొకరు దానిని రాయాలి ....మళ్ళీ చెపుతాను: వాలుకుర్చీలో సుఖంగా విశ్రమించి, ఏమాత్రం కదలకుండా నిశ్చలంగా నీ తలలో నుంచి ఒక వార్తాహరుణ్ణి పంపించు. నీవు వెళ్ళి తలుపు తీసి అక్కడి వ్రాతప్రతిని తీసి పైకి చదవడం (కళ్ళతో చదవడం కాక పోయినా తెలుసుకున్నదానిని వివరించడం) ప్రారంభించు. ఆ విధంగా పైకి మాట్లాడడం అలవాటు చేసుకుంటే, అక్కడ పరిశీలిస్తున్నప్పుడే ఇక్కడ వాగింద్రియంతో మాట్లాడుతావు. విశాలమైన ఆ గదులలోనుంచి నీవు ఎలా ప్రయాణంచేసిందీ, ఆ ప్రదేశం చేరిన తర్వాత నీకు కావలసిన విషయం ఒక చిహ్నం మాదిరిగా నీకు ఎలా కనిపించినదీ నిశ్చితంగా వివరించు. ఆ అరలో నీకు కావలసిన కాగితపు చుట్ట తీసి చదవడం ప్రారంభించు. నీ ప్రక్కన కూర్చున్నవారు (నీవు ముందుగా ఆ ఏర్పాటు చేసుకోవాలి) అదంతా వ్రాస్తారు. దీనివల్ల నీవు తిరిగి వస్తూండగా ఆ విషయం మారిపోయే అవకాశం కలగదు. ఎందువల్లనంటే, ఆక్షణంలో అక్కడ పాల్గొంటున్న నీలోని అంశానికి ఆ అనుభవం చాలా స్పష్టంగా, నిశితంగా తెలిసినప్పటికీ, తిరిగి భౌతిక ప్రపంచంలోకి వచ్చేటప్పుడు ఏదోఒకటి అందులో తగ్గుతుంది. నీవు అక్కడే పైకి చదివితే అలా జరుగదు. ఈ విధంగా చాలా జాగ్రత్తలు పాటించాలి: అంతేకాని, లైబ్రరీకి వెళ్ళి పుస్తకం తీసి చదువుతున్నట్లు కాదు: అది అందరూ చేయగలరు. కాని ఈ పని చేయడం కష్టము.

## సాపేక్ష సిద్ధాంతం అనేది ఏమిటి ?*

(శ్రీమాత ఒక గణితశాస్త్రవేత్త వైపు తిరిగి) పవిత్ర : దీనిని గురించి పిల్లలకు వివరించు.

పవిత్ర: ఒక వాక్యంలో చెప్పాలంటే, ఈవిశ్వాన్ని ఎవరు చూచినట్లుగా వారు వివరిస్తారు.

అంతేనా ! అయితే దాని ఆవిష్కారంపై అంత ఆర్భాటం ఎందుకు ?

పవిత్ర : అది ఒక విప్లవమేనమ్మా !

విప్లవమా ? చూచేవారిని బట్టి చూస్తున్నది ఉంటుందా ? అయితే....

---

* యోగులైన వారు సాధారణ పద్ధతిలో కొంతవరకు అన్ని విషయాలను తెలిసికొని, తమ దృష్టికి, చైతన్యానికి అందినంతవరకు ప్రశ్నలకు సమాధానం చెప్పగలరు గాని, అంతమాత్రంచేత వారికి తెలియనివి, చెప్పలేనివి ఉండవని అనుకోకూడదు. వస్తువులను గురించి యధార్ధసత్యం తెలుసుకొని సూటైన జ్ఞానంకల యోగులు, కేవలం మానవ మనోనిర్మాణాల పరిధికి చెందిన ప్రశ్నలకు సమాధానం చెప్పాలంటే కొంచెం కష్టమే. లేకపోతే పూర్తిగా బాహ్యపరిధికి చెంది, మాయతో కూడిన ప్రశ్నలను, సమస్యలను వారి ముందుంచినప్పుడు, వాటికి సమాధానం చెప్పడం వారి కిష్టంలేకపోవచ్చు. ఆ విషయ పరిశీలన వారి మనస్సుకు సంబంధించినది కాదు. అందువల్ల, మనస్సుకు చెందిన బుద్ధితక్కువ విషయాల నడిగితే, వారు సమాధానం చెప్పకపోవచ్చు. నీకు తెలియని విషయాలన్నీ, ఏదో ఒక స్కూలు మాస్టరు చెప్పినట్లు చెప్పాలనీ, భూతభవిష్యద్వర్త మానాలను గురించి వివరాలన్నీ చెప్పితీరాలనీ అనుకుంటే అది అవివేకపుటూహే. అద్భుతలీలలు చేసే ఆధ్యాత్మిక వ్యక్తి మామూలు మనస్సుకు చెందిన మొరటు కుతూహలాన్ని సంతృప్తిపరచి ఆశ్చర్యంలో ముంచెత్తేటట్లు చేయడం మాదిరిగానే ఇదికూడా కానిపని.

పవిత్ర : మానవ పరిమాణాలన్నీ భౌతిక విశ్వా
న్ననుసరించీ, భౌతికశాస్త్రాల ననుసరించీ ఉంటాయి.

అవును. భౌతికశాస్త్రాల ననుసరించే ఎవరి పద్ధతి ప్రకారం వారు విశ్వ పరిమాణం తెలుసుకుంటారు.

పవిత్ర : పరిశీలించే వారితో సంబంధంలేనిది
కూడా ఇంకా కొంత దీనికి వెనుక ఉన్నదని కను
గొన్నారు.

ఆ! దానిని కనుక్కొన్నారా? (నవ్వులు) ఇంకాగొప్ప విప్లవమే !.... (గట్టిగా నవ్వుతారు) బాగానే ఉంది.

జననీ ! మానసిక, అతిమానసిక స్థాయిలకు
మధ్య చాలా మధ్యస్థ స్థాయిలున్నాయని, * సాధా
రణ మానవుడు ఈ మధ్యస్థ స్థాయిలతో సంస్పర్శ
పొందితే దిగ్భ్రాంతుడౌతాడనీ చెప్పారుకదా, మాన
వుడు అంత వెనుకబడిన స్థితిలో ఉండగా, మనం

---

* "మానవులు సాధారణ స్థాయిని మించగానే తాము పూర్తిగా దివ్యమైన స్థాయిలకు అధిరోహించామని నమ్ముతారు. సాధారణ మానవ మనస్సుకి అతి మనస్సుకూ మధ్య అనేక స్థితులు, అనేక శ్రేణులు, అనేక మధ్యస్థ స్థాయిలూ ఉన్నాయి. సాధారణ మానవుడు ఈ మధ్యస్థస్థాయిలలో ఒకదానితో సూటి సంపర్కం పెట్టుకుంటేనే ఆ కాంతికి దిగ్భ్రాంతుడై పోతాడు. ఆ బరువుతో నలిగి పోవడమో, చలించిపోవడమో జరుగుతుంది. అప్పటికీ అది అతిమనస్సుకాదు."

ప్రశ్నోత్తరములు 1929, (23 జూన్)

## మధ్యస్థస్థాయిల అవతరణ గురించి మాట్లాడకుండా అతిమానసికావతరణ సంగతి మాట్లాడుతామెందుకు?

దానికి కారణం సులభగ్రాహ్యమే. ఇప్పటివరకు భౌతిక, పదార్థమయ జగత్తు అంతా, పృథ్వి అంతా, శ్రీఅరవిందులు చెప్పే అధిమనస్సుకు చెందిన శక్తులకు, చైతన్యానికి లోబడి నడచుకుంటోంది. దేవుడు అని అందరూ చేప్పేదికూడా ఈ అధిమనస్సుకు చెందిన ఒక శక్తి. ఈ విశ్వం సంపూర్ణంగా అధిమనస్సు అధీనంలోనే ఉంది. అక్కడకి వెళ్ళాలంటేనే చాలా మధ్యస్థాయిలు దాటి వెళ్ళాలి. దిగ్భ్రమ చెందకుండా చాలా కొద్దిమంది మాత్రమే అక్కడకు వెళ్ళగలరు. శ్రీఅరవిందులు చెప్పిన ప్రకారం అధిమనస్సు పాలన అంత్యదశకు వచ్చింది. దాని స్థానాన్ని అతిమనస్సు ఆక్రమిస్తుంది. ఆధ్యాత్మిక అనుభవాలు పొందినవారికి, దైవాన్ని తెలుసుకొని తాదాత్మ్యం పొందినవారికి ఈ అధిమనస్సు అంటే తెలుసు. ఈ అధిమనస్సుకు పైన వేరే ఏదో ఉన్నదని, పృథ్వీపాలన కోసం భూమిపై అవతరించడం ఇప్పుడు దాని వంతని శ్రీఅరవిందులు తెలిపారు. అందువల్ల అధిమనస్సును గురించి మాట్లాడవలసిన అగత్యం లేదు. ఇప్పటికి చాలామంది ఆ అనుభవం పొందారు. దానిని గురించి చెప్పారు. కాని, అతి మనస్సును గురించి ఇప్పటిదాకా ఎవరికీ తెలియదు, అందరికీ కొత్త. అది ఒక కొత్త పద్ధతిలో భూమిపై అవతరించబోతోంది.* పూర్వవిషయాలను గురించి మాట్లాడే వారు, ఆ అనుభవం పొందినవారు, దానిని గురించి పుస్తకాలు రాసిన వారు, చాలామంది ఉన్నారు. వారు చెప్పినవి మనం పునరుద్ఘాటించ వలసిన పని లేదు. కొత్తవిషయాలు చెప్పడానికే శ్రీఅరవిందులు అరుదెంచారు. పూర్వం పొందిన అనుభవాలను గురించి తెలుసుకొన్నవారు, విన్నవారు ఆ భావాన్ని త్రిప్పు కోలేక, శ్రీఅరవిందులు అతిమానసిక శక్తి అని చెప్పినదానిని, ఈ అధిమన స్సుతో సహా తమ అనుభవంలోని మధ్యస్థస్థాయిలతో ఒకటిగా సరిపోల్చడానికి ప్రయత్నిస్తారు. వారి అనుభవానికి మించినది వేరొకటి ఉన్నదని వారు ఊహించ

---

* 1956 లో అవతరించింది. (1956—2—29)

లేకపోతున్నారు. ఇంతవరకు పరిపాటిగా ఉన్న యోగాలు ఎక్కడైతే పరిపూర్తి అయినాయో అక్కడనుంచీ తమ యోగం ప్రారంభిస్తుందని శ్రీఅరవిందులు చెప్పేవారు. తమ యోగసిద్ధి బడయాలంటే పూర్వపుయోగాలలో చరమావస్థ, అనగా పరమాత్మ దర్శనం, ఏకత్వం, తాదాత్మ్యాలు సిద్ధించాలనికూడా వారు చెప్పే వారు. ఆ దైవం అధిమనస్సు దైవమని, మానవ చైతన్యానికి అది అందడమే కష్టమని, అక్కడకు చేరాలంటే అనేక మధ్యస్థస్థాయిలు దాటాలని, ఆ మధ్యస్థ స్థాయిలలోనే మానవుడు దిగ్భ్రమ చెందుతాడని శ్రీఅరవిందులు చెప్పారు.

ప్రాణికలోకానికి సంబంధించిన జీవులు మానవులకు కనిపించినప్పుడు, వాటినే పరదైవాలని వారు అనుకుంటూ వచ్చారు. వాటిని మనం మారువేషాలు అని చెప్పుకోవచ్చు. వాటిని చూచినవారు అదే పరదైవం అని గాఢంగా నమ్మే వారు కాబట్టి ఆవేషం ఫలించినట్లే. కాని అవన్నీ ప్రాణికలోక జీవాంశలే. అధిమనస్సుకు చెందిన జీవాంశలు మానవులతో పోలిస్తే చాలా గొప్పవి కాబట్టి, మానవులు వాటి సంపర్కంలోకి వస్తే దిగ్భ్రాంతులౌతారు.

దివ్యకృపవల్ల ఇతరుల అనుభవాలనుంచి మనం నేర్చుకునే అవకాశం కలుగుతోంది. అది విజ్ఞానశాస్త్రం నేర్చుకున్నట్లే ఉంటుంది. పూర్వపు అనుభ వాలను పరిగణించకుండా ఇతరులు చేసి చూసినదంతా తిరిగి తానుచేసి, తర్వాత నూతన ఆవిష్కారాలు చేయాలంటే శాస్త్రజ్ఞులకు జీవిత కాలమే సరిపోదు. ఆ విధంగానే ఇప్పుడుకూడా అదంతా చేసి చూడనక్కర లేదు. పుస్తకం తెరిచి ఫలితాలు చూసుకొని అక్కడనుంచి ముందుకు కొనసాగించవచ్చు. శ్రీఅరవిం దులు ఆ విధంగానే చేద్దామనుకున్నారు. శ్రీఅరవిందులకు పూర్వం ఇతరులు సాధించిన విజయాలు నీకు ఎక్కడ లభ్యమౌతాయో వారు చెప్పారు. వాటి ప్రకారం నీవు ఏ స్థానంలో ఉన్నదీ తెలుసుకోవచ్చు. ఆధ్యాత్మిక చరిత్రలో నీ స్థానం ఎక్కడుందో నీకు తెలిస్తే, అక్కడ నీ ఆధారాన్ని దృఢంచేసి ఆతర్వాత నీచేత ఉన్నత శిఖరాలను అధిరోహింప జేస్తారు.

అయితే ఆశ్రమంలో అధిమానసస్థాయిని చేరిన వారు మాత్రమే ఉండవలెనుగదా, దాని బదులు....

మొదటినుంచి ఉన్నవారి సంగతీ, వారి అనుభవమేమిటో, వారి జ్ఞానం ఏమిటో నేను మాట్లాడను. మీ సంగతి చెప్పండి. మీరు ఏ వయసులో ఇక్కడకు వచ్చారు. అధిమానససిద్ధి కలిగేటంత వయసు కాదుగదా!

అమ్మా! మావంటి మొరటువారి బదులుగా మీ దగ్గర వివేకానందస్వామి వంటివారు ఉన్నట్లయితే మీపని చాలా సులభమయేది కదా? (నవ్వులు)

వారు ఇంతకంటే మొరటుగా ఉండేవారేమో!....ఎందువల్లనంటే, ఒక రకమైన సిద్ధి పొందిన వారికి తెలియచెప్పటమే కష్టము. వారు పురోగతినంతా సాధించేశా మనుకుంటారు.

అందువల్ల అనుభవం కలవారు బాగా అభివృద్ధి పొందినట్లు అనుకోకూడదు. సరళత, మన్నన, అభివృద్ధి చెందని వారిలో ఉండే నమ్రత వారిలో కనుపించదు. పెరిగి పెద్దవారౌతుంటే ఒక రకంగా బిగుసుకు పోతారు. ఎంతో కష్టపడి ప్రయత్నిస్తే తప్ప నీవు బిగిసిపోకుండా ఉండలేవు. సాధారణంగా జరిగేది అదే. ఏదో ఒక ఆధ్యాత్మిక సిద్ధికోసం ప్రయత్నించి అది సిద్ధించగానే అంతా పూర్తి అయినట్లనుకుంటారు. ఏది ఏమైనా అది వారి స్వీయ విషయం; అది వారు సాధించారు. అది అయిపోయింది, వారు ఇక అక్కడ నుంచి కదలరు. "అంతా తెలుసుకున్నాము, అది అంతే" అనుకొని ఇంక ఏమీ చేయరు. ఆ తర్వాత ఎంతకాలం గడిచినా అంతే. అటువంటి వారిలో ఇకముందు పురోగమించడానికి కావలసిన మృదుత్వం లోపిస్తుంది. అతి స్థిరంగాఉండి, మ్యూజియంలో ప్రదర్శించటానికి వీలుగా ఉంటారేకాని పని చేయడానికి కాదు. ఫలానా సిద్ధి పొందారు అని చెప్పుకునేటట్లు ఉంటారు. కాని ఇంకా కొనసాగించడానికి కాదు. నా అంతట నేను ఎన్నుకోవలసి వస్తే ఇంతవరకు ఎక్కువ పరిశ్రమ చేయకుండా, ఎక్కువ జ్ఞానం లేకుండా,

ఆకాంక్ష సమృద్ధిగాను, సత్సంకల్పం మెండుగాను ఏర్పడి, పురోగమించాలనే ఆవశ్యకత జ్వాలారూపంగా ఉన్నవారినే నేను నాపనికి కోరుకుంటాను. వారికి తెలిసినది చాలా తక్కువైనా, సిద్ధింప చేసుకున్నది స్వల్పమైనా పురోగమించాలనే ఆవశ్యకత ఉంటే చాలు. దానితోనే ముందుకు పురోగమించగలుగుతారు. అందుకుగాను ఆమార్గం తెలియాలి. (లైబ్రరీలో మాదిరిగానే). సాధారణంగా మనం ఏదైనా కొండనెక్కాలన్నా, తెలియని చోటుకు వెళ్ళాలన్నా, ముందుగా అక్కడకు వెళ్ళివచ్చినవారికోసం వెతుకుతాము. వారే మార్గదర్శకులుగా ఉండవలె నని కోరుతాము. ఇది కూడా అంతే. ఆమార్గదర్శకుల వెనకాల వెడితే స్వయం కృషితో చాలా ప్రయత్నం చేసి కొంత దూరం వచ్చామనుకొని గర్వపడేవారి కంటే త్వరగా పురోగమించగలరు. స్వయంకృషితో అనుకున్న చోటుకు చేరి అదే వారి గమ్యమనుకొని స్థిరపడిపోయినవారు ముందుకు కదలరు.

మొదట్లో ఇక్కడ పిల్లలుండే వారు కాదు, వారిని నిరాకరించేవారు. యుద్ధం తర్వాతే పిల్లలను తీసుకోడం మొదలు పెట్టారు. అందుకు నేను ఏమాత్రం విచారించలేదు. ఎందువల్లనంటే, భవిష్యత్తులో వారి అవసరం ఉంది. అంతా తమకే తెలుసు ననుకొనే పెద్దలకంటే ఏమీ తెలియని పిల్లలకే మంచి భవిష్యత్తు ఉంది....మీకు శిల్పంతో పరిచయం ఉందో లేదో కానీ శిల్పాలు చేయాలంటే ముందు ఒండ్రుమట్టిని తీసుకొని దానిని నీటిలో నానబెట్టాలి; చాలా మెత్తటి పొడి ఒండ్రు తీసుకొని నీటితో ఒక ముద్దగా చేయాలి. నీకు కావలసిన శిల్పాన్ని పూర్తిగాచేసేవరకూ ఆముద్ద తడిగానే ఉండాలి. పూర్తి అయినాక గట్టిపడడం కోసం దానిని కాలుస్తారు. ఆతర్వాత ఇక అది కదలదు. దానిని ఏవిధంగా మార్చాలన్నా పూర్తిగా బద్దలుకొట్టి మళ్ళీ చేయవలసిందే. ఎందువల్లనంటే, దానిలో మృదుత్వం ఏమాత్రం లేకుండా రాయిమాదిరిగా గట్టిపడిపోయింది కదా! జీవితం కూడా ఇంచుమించు అంతే. నీవు ఏదో కొంత సాధించి, ఇంక అయిపోయిందనుకొని నిశ్చలంగా, స్థిరంగా స్ఫటికీకృతంకాకూడదు. అలా అయితే, ఏమైనా మార్చాలంటే దానిని చితుకకొట్టాలి; లేకపోతే దానితో నీవు ఏమీ చేయలేవు.

ఆ విధంగా కాకుండా ఒండ్రుమట్టి ముద్ద మాదిరిగా మెత్తగా, సున్నితంగా, ఆకృతిరహితంగా ఉంటే ఏమైనా చేయవచ్చు. ఇంకా చిన్న పిల్లలుగా ఉన్నంత

కాలం....అది ఒక మధురానందస్థితి. నేను నిన్న చెప్పినది కూడా అదే. ఎంత సేపటికీ పిల్లల కెప్పుడూ, పెద్దవారై పోవాలనే ఊహే; కాని పెద్దవారైతే తమ విలువ మూడువంతులు తగ్గిపోతుందని తెలియదు. ఇంకా అభివృద్ధి పొందేటట్లుగా ఆకృతి ఏర్పరచవచ్చునన్నట్లుగా, మృదువుగా ఉండి పురోగమిస్తూ, మార్చవలె నంటే అంతా బద్దలు కొట్టవలసిన అవసరం లేనిస్థితిలో ఉన్న చిన్నపిల్లలకు తాము పెద్దవారు కాగానే తమ విలువ మూడువంతులు తగ్గిపోతుందని తెలియదు. పర్వతారోహణ చేయాలంటే, అడుగునుంచీ పైకి వచ్చేవరకు దాని చుట్టూ తిరుగుతూ ఎక్కేవారుంటారు, వారి జీవితకాలమంతా దానితోనే సరిపోతుంది. మరికొంత మంది సరైన మార్గం తెలిపి అడ్డుదారిన సూటిగా పైకి వెళ్ళుతారు. ఆవిధంగా పైకి వెళ్ళినవారింకా యువకులుగా, శక్తిమంతులుగా ఉండి, దిక్చక్రాన్నీ, ఆతరువాత ఎక్కవలసిన పర్వతాలనూ అవలోకించ గలరు. దానికి విరుద్ధంగా చుట్టు తిరిగే మొదటికోవకు చెందినవారు జీవితమంతా శ్రమించి పర్వతశిఖరం చేరి ఘన కార్యం చేశామనుకుంటారు. కాబట్టి పిల్లలూ, అన్నిటికంటె అతి దగ్గర మార్గం ద్వారా మిమ్మల్ని చాల కిందనుంచే పైకి తీసుకువెళ్ళే ప్రయత్నాలు చేస్తున్నాము. మీరు శిఖరాగ్రానికి వెళ్ళినప్పుడు చుట్టుపక్కల పరికించి ఎక్కాలనుకొన్న పర్వతాన్ని నిర్ణయించుకోగలరు.

అందువల్ల, చప్పున పెరిగిపోవాలని తొందర పడకండి. జీవితమంతా సాధ్యమైనన్నిరోజులు, సాధ్యమైనంతవరకు శిశువులుగానే ఉండిపోవాలి. ఆనందంగా, సంతోషంగా, శిశువులుగా ఉండడంలోని సంతృప్తితో శిశువులుగా నిలిచి పొండి; అంటే మలచడానికి వీలైన మెత్తటి ముద్దగా ఉండండి.

**కొంత పురోగమించిన వారిని మీరు మార్చ లేరా ? పెద్దవారైపోతుంటే వారిని మార్చలేమా ?**

మార్చవచ్చు. అలా మారుతున్నారు కూడా. అయితే అది కొంచెం కష్టము. ఏదో కొంత సాధించామని నమ్మకం ఎక్కువౌతున్న కొద్దీ మార్చడం కష్టం అవుతుంది. ఒక్కొక్కప్పుడు చాలా ఆలస్యమౌతుంది.

యుద్ధానికి ముందు పిల్లలను ఎందుకు అనుమతించేవారు కాదు ?

పిల్లలుంటే వారితోనే కాలమంతా సరిపోతుంది. వారికోసం అంతా వ్యవస్థీకరించాలి, వారిని దృష్టిలో పెట్టుకొని అన్ని ఏర్పాటులూ చేయాలి; దానితో జీవితసరళే మారిపోతుంది. పిల్లలు అందరికోకీ ప్రధానపాత్ర వహిస్తారు. అంతా వారిమీద ఆధారపడుతుంది. ఆశ్రమ వ్యవస్థనే పూర్తిగా మార్చేయాలి. అంతకంటెకూడా వారిపై ఏవిధమైన నియమాలూ రుద్దకూడదు. పెద్దవారికి కొంత నిష్ఠ, నిరాడంబరత అనుసరించమని చెప్పవచ్చు; ఎందువల్లనంటే, "స్వీకరించినా, వదలిపెట్టినా నీయిష్టం; నీకు యిష్టంలేకపోయినా, భరించలేకపోయినా, నీవు వెళ్ళిపోవచ్చు. ఇక్కడి పద్ధతి అదే. నీకిది అక్కరలేకపోతే వదలిపెట్టి వెళ్ళిపో, ద్వారం తెరిచేఉంది." అని వారితో చెప్పవచ్చు. కాని పిల్లలతో....వారి పెరుగుదలకు మామూలుగా సంబంధించని విషయాలను వారిపై రుద్దడానికి నీకు హక్కేమిటి? వారంతట వారు నిర్ణయించుకునే స్థితికి రావాలంటే వారికి కొంత వ్యక్తిత్వం కావాలి, వారికి ఆ విధంగా ఎన్నుకునే శక్తి వచ్చే వరకూ వారిని దేనికీ వత్తిడి చేయకూడదు. వారికి కావలసిన వన్నీ చాలా సహజంగా వారికి అందించాలి. దానితో జీవితమే మారిపోతుంది. నేను చాలా చోట్ల చూచాను. ఒంటరిగా పెద్దలు మాత్రమే ఉంటే ఎలా ఉంటుందో చిన్నపిల్లలను చేర్చుకుంటే ఎలా ఉంటుందో నాకు అనుభవమే. రెండింటిలో చాలాభేదం కనిపిస్తుంది. తనకు తానై నిర్ణయించుకొనే స్వేచ్ఛలేనివారిపై అధికారం చేయకూడదు. వారికి ఆ విధంగా నిర్ణయించుకునే వ్యక్తిత్వం వచ్చేవరకు వారిని వదలిపెట్టకూడదు. ఆ విధమైన వ్యక్తిత్వం వచ్చినపుడు వారే నిర్ణయించుకుంటారు. ఇక్కడున్న పిల్లలు వారంతట వారు వచ్చినవారు కాదు. మీరంతా ఇక్కడికి వచ్చినప్పుడు ఎంత వారు? కాలిబూటంత ఎత్తుగూడా లేరు....వారితో; "మీరు ఇక్కడికి వచ్చారు కాబట్టి, ఈ విధానం స్వీకరిస్తే స్వీకరించండి, లేకపోతే వెళ్ళిపొండి" అని చెప్పలేము కదా! వారిని ఇక్కడకు తీసికొనివచ్చారు కాబట్టి వారికి కావలసినవి ఇవ్వడం మన విధి. వారి అవసరాలు పెద్దవారి అవసరాల వంటివి కావు. అది మరీ సంక్లిష్టము.

ఇప్పటి పరిస్థితి వేరు; ఇప్పటివారికి "మీరు యోగసాధనకోసం ఇక్కడికి వస్తున్నారు'' అని కాకుండా, "పృథ్విపై పరిస్థితులు ఎలా మారితే బాగుపడతాయో అనేవిషయం తెలుసుకునే ప్రయత్నం మీరు చేయబోతున్నారు" అని చెపుతున్నారు. అలా వారు ఇక్కడికి వచ్చి తెలుసుకుంటారు. తాము నేర్చుకోవాలనుకున్నది పూర్తయిందనుకున్నప్పుడు వెళ్ళిపోతారు. భౌతిక జీవితంలోనే దైవాన్ని తెలుసుకోవాలనే ఏకైక ధ్యేయంతో వచ్చినప్పటి పరిస్థితి కాదు కదా. ఇది తప్ప ప్రపంచంలో మరి ఏ ఇతర లక్ష్యం ఉత్సాహాన్ని కలిగించదు అని అనుకొని ఇక్కడికి రావడం కాదు. నిర్ణయం చేసుకోవాలంటే ఏఏ అంశాలను చూపి నిర్ణయం చేసుకోవాలో, వాటిని గురించి తెలియాలి కదా. దానికిగాను ఆంతరికమైన ఒక ఏర్పాటు, ఒక సంస్కృతి అవసరము. ఏ కొద్దిమందో తప్ప సాధారణంగా అయిదు సంవత్సరాల వయసులో ఈ విధంగా ఉండరు. మీలో కొందరికి (నమ్మగలిగిన దానికంటే ఎక్కువగానే) మాటలతో చెప్పలేకపోయినా తామెందుకు ఇక్కడికి వచ్చిందీ తెలుసు. అది గాఢంగా వారిలో ఉంది. వారి తలిదండ్రులు వారిని ఇక్కడనుంచి తీసుకొని వెళ్ళిపోదామనుకుంటే వారు మొండిగా నిరాకరించి "ఇక్కడే ఉంటామని'' పట్టుపట్టారు. మెదడు పూర్తిగా ఏర్పడక పోవడంవల్ల వారికి తెలియకపోయినా, చైత్యపురుషుని చైతన్యంవల్ల వారు అలా భావించారు. వారు మామూలు మనుష్యుల కంటే పైస్థాయిలో ఉన్నట్లు లెక్క. మామూలు వారికి మూడువంతులకుపైగానే సాధారణ విద్యా బోధనతో మనస్సు మొద్దుబారిపోతుంది. వారు ఇక్కడికి వచ్చేటప్పటికి వారికి చాలా విషయాలు తమకు తెలుసునని, జీవితంతో తమకు చాలా అనుభవం ఉందని ఒక నమ్మకం ఏర్పడుతుంది. వారి శీలం ఒక పటిష్టమైన రూపం దాలుస్తుంది, చాలా దురలవాట్లుకూడా ఏర్పడతాయి.

## స్మృతి, జ్ఞాపకం రెండూ ఒకటేనా ?

అలా కాదు. జ్ఞాపకం కేవలం మానసిక సంబంధం, స్మృతి చైతన్య సంబంధం అనవచ్చు. మనలోని అన్ని పరిధులలోనూ మనం స్మృతి నిలుపుకోవచ్చు. ప్రాణిక, భౌతిక, చైత్య, మానసిక పరిధులన్నిటిలోనూ మనం స్మృతి నిలుపుకోవచ్చు, జ్ఞాపకం కేవలం మానసిక పరిధికే చెందుతుంది. దానిని రూపొం

దించుకోవచ్చు. అక్కరలేదనుకుంటే మరచి పోవచ్చు. చైతన్య విషయిక మైనది నికరము. నీ చైతన్యాన్ని వెనక్కి మళ్ళించి కావలసిన స్థితికి తీసుకొని వెడితే జరిగినవి జరిగినట్లు అన్నీ వస్తాయి. ఆక్షణంలో మళ్ళీ జీవిస్తున్నట్లే భావి స్తావు. ఆవిధంగా ఒకసారి కాదు, రెండుసార్లు కాదు, వందసార్లైనా దానిని మళ్ళీ మళ్ళీ పొందవచ్చు. నీ మెదడులో ఒకచోట రాసి అట్టేపెట్టుకొన్న జ్ఞాపకం వంటిది కాదు స్మృతి. మెదడులో ఏమాత్రం సంచలనం జరిగినా (నీ మెదడులో అనేకం ఉంటాయి. అది చాలా సున్నితమైన పరికరం) నీ జ్ఞాపకాలు చెదిరిపోయి అక్కడ కొన్ని ఖాళీలు ఏర్పడి వాటిని నీవు మరచిపోతావు. అట్లా కాకుండా ఒకానొక చైతన్యస్థితిని నీవు తిరిగి పొందగలిగితే అంతా జరిగినది జరిగినట్లు తెలు స్తుంది. స్మృతులు కూడా కేవలం మానసికంగా ఏర్పడగలవు. అది మెదడు క్రియాశీలతను కొనసాగించేదే కాబట్టి అది మానసికమైన స్మృతి. ఆవిధంగా నీ భావనల స్మృతులు, సంవేదనల స్మృతులు మొదలైనవి ఉంటాయి.

"నీ జ్ఞాపకశక్తిని వృద్ధిచేసుకోవాలంటే చైత న్యాన్ని వృద్ధిచేసుకోవా" లని మీరు చెప్పారు. స్మృతి కూడా అంతేనా ?

జ్ఞాపకశక్తికి సంబంధించినదానికి బదులుగా చైతన్య సంబంధమైనదిగా ఏర్ప రుచుకోవాలనేది నా ఉద్దేశ్యము. జ్ఞాపకం అనేదానిని ఎప్పుడు ఏఉద్దేశ్యంతో వాడానో తెలియదు, కాని, ఇదే అయి ఉంటుంది.

చదువులో జ్ఞాపకశక్తి.

అ: అవును. నా ఉద్దేశ్యం అదే; మానసిక జ్ఞాపకశక్తి స్థానంలో చైతన్యస్థితిని స్థాపించు. నీవు ఏదైనా విషయాన్ని కంఠస్థం చేయాలని ప్రయ త్నిస్తే కొంత కాలానికి దాన్ని తప్పక మరచిపోతావు. లేకపోతే కొన్ని ఖాళీలు ఏర్పడతాయి. కొంత గుర్తుంటుంది, కొంత మరచిపోతావు. అట్లా కాకుండా ఒకానొక విషయానికి ఒకరకపు చైతన్యంతో సంబంధం పెడితే ఎప్పుడు కావా లంటే అప్పుడు దానిని తెచ్చుకోవచ్చు.

7 అక్టోబరు 1953

నీవు ఘనవిజయం సాధించే పద్ధతి నీ చైతన్యాభివృద్ధిపైనా, నీ అధీనంలోని శక్తుల పరిధిపైనా ఆధారపడుతుంది. దోషరహితమైన, లేదా పూర్తిగా మారిన చైతన్యంలో నీవు జీవించవచ్చు. నీ ఆంతరిక రూపకల్పనల శక్తివల్ల బాహ్యమైన మార్పును నెమ్మదిగా తీసుకొని రావచ్చు. ఈ మార్పు తీసుకొని రాగల శక్తిని గురించి నీకు తెలిసినా, నీకు దానిని ఉపయోగించుకోగల నేర్పుఉన్నా, నీవు దానిని అవతరింప జేసుకొని అవసరమైన చోట దానిని వాడుకుంటే, అదే మార్పు చేస్తుంది. లేకపోతే, నీ సమస్యలను దైవం ముందుపెట్టి ఆ దైవశక్తిపై పూర్తిభారం వేసి తన్నివారణ మార్గం కోసం అభ్యర్థించు.

ప్రశ్నోత్తరములు 1929 (23 జూన్)

"దోషరహితమైన చైతన్యం" అంటే ఏమిటి ?

అంటే దోషరహితమైన ప్రత్యేక చైతన్యం ఉంటుందని కాదు, "పూర్తిగా దోషరహిత చైతన్యానికి పరి సమానమైన చైతన్యస్థితిలో ఉండడం" అని దాని అర్థము. ఇంకా విడమర్చి చెప్పాలంటే, దోషరహితమై సంపూర్ణం కావడానికి అవసరమైన అంశాలను, సంబంధాలను సిద్ధింపచేసుకోగల ఒక ఊహ కాని, కల్పనగాని, ఏర్పాటు కాని నీ మనస్సులో కలుగుతుంది. దానినే "పూర్తి స్వస్థత కలిగిన చైతన్యస్థితి" అంటారు. అంతేకాని తనంతట తనే స్వస్థితిలో చైతన్యా

స్థితి ఉంటుందని. ఆ స్థితిని పొందితే అదే దోషరహితమౌతుందని కాదు. రెండింటికి తేడా తెలుసుకోవాలి.

"ఆకాంక్ష కొంతమందిలో మానసికస్థాయిలో కాని, ప్రాణమయ పరిధిలోకాని ఉంటుంది, మరికొంత మందికి ఆధ్యాత్మికమైన ఆకాంక్ష ఏర్పడుతుంది. ఆకాంక్ష స్వభావాన్ని బట్టి అవరోహించే శక్తి, అది చేయవలసిన పనికూడా ఏర్పడతాయి. ధ్యానంలో నిన్ను నీవు ఆలోచనా రహితంగా చేసుకోగలిగితే అంతర నిశ్శబ్దం ఏర్పడుతుంది; అంటే నీవు ఏమీలేకుండా మృతప్రాయంగాను, జడపదార్థంగాను తయారౌతావని కాదు. నిన్ను నీవు ఖాళీపాత్రగా చేసుకొని దానిని నింపవలసిన దానిని ఆహ్వానిస్తావు. ఆ విధంగా నీవు సిద్ధికోసం నీ అంతర చైతన్యంలో ఏర్పడే బిగువును సడలిస్తావు. ఆ చైతన్యస్వభావం దాని బిగువును బట్టి దిగివచ్చే శక్తులు నిర్ణయమౌతాయి. అవి నీ సిద్ధికి సహాయపడతాయో, సహాయపడకుండా నీకు హానిచేసి ఆటంక పరుస్తాయో కూడా దానిమీదే ఆధారపడుతుంది.

ప్రశ్నోత్తరములు 1929 (23 జూన్)

మానసిక ఆకాంక్ష, ప్రాణమయ ఆకాంక్ష, ఆధ్యాత్మిక ఆకాంక్షలకు గల తారతమ్యం ఏమిటి ?

నీవు మనస్సులో గాని, ప్రాణిక శరీరంలో గాని, ఆధ్యాత్మికంగా గాని ఎలా ఆకాంక్షిస్తావు ?

మానసిక ఆకాంక్ష అంటే, జ్ఞానం కలగాలని గాని, తనను తాను బాగా వ్యక్తం చేసుకునే శక్తి కావాలని గాని, స్పష్టమైన ఊహలు, తర్కబద్ధమైన మీమాంస కావాలని కాని ఆలోచనాశక్తి ఆకాంక్షిస్తుంది. ఆ విధంగా ఎన్నో విషయాల కోసం ఆకాంక్షించవచ్చు; మానసిక శక్తి సామర్థ్యాలన్నీ అభివృద్ధిచెంది దైవసేవకు వినియోగపడాలని ఆకాంక్షించవచ్చు. ఇదే మానసిక ఆకాంక్ష.

నీకు ప్రాణసంబంధమైన ఆకాంక్ష కలుగవచ్చు. అంటే, నీకు కోరికలు, కల్లోలాలు మొదలైన అంతర్గత కష్టాలు వచ్చినప్పుడు శాంతి కోసం, నిష్పాక్షిక వైఖరి కోసం, వాంఛా రహితంగా, విధేయత కల్గిన ఉపకరణంగా, దైవం ఉపయోగించుకొనే నిమిత్తం ఎల్లప్పుడూ సంసిద్ధుడివిగా కావాలని ఆకాంక్షించ వచ్చు.

నీకు భౌతికమైన ఆకాంక్షకూడా కలుగవచ్చు. శరీరంలో అన్ని భాగాలూ సమస్థాయిలో నిలిచే సమతాస్థితి అవసరం గుర్తించగలగాలని, అస్వస్థతను నిరోధించడానికి, ఒకవేళ అది మోసంచేసి ప్రవేశించినా, దానిని శీఘ్రంగా తొలగించుకోడానికి శరీరాన్ని లావణ్యంగా, ఎప్పుడూ సరిగా పనిచేసేటట్లుగా, పరిపూర్ణ ఆరోగ్యవంతంగా ఉంచడానికి తగిన శక్తికోసం ఆకాంక్షించవచ్చు. అది భౌతిక ఆకాంక్ష.

దైవంతో ఏకత్వం కోసం తీవ్రమైన ఆవశ్యకతతో, సర్వసమర్పణ చేసి, దైవచేతననుంచి ఏమాత్రం వైదొలగకుండా, నీలో అంతా ఆ దైవమే నిండి పోయేటట్లుగా అయి, తాదాత్మ్యపు అవసరాన్ని అనుక్షణం గుర్తిస్తూ, ఆయన సన్నిధిని, నీ పనులన్నిటిలో ఆయన మార్గదర్శకత్వాన్ని అనుభవిస్తూ, నీ చలనాలన్నిటికీ సామరస్యం చేకూర్చెడి ఆయన చర్యలను గుర్తించడమే ఆధ్యాత్మిక ఆంకాంక్ష.

అమ్మా! ఆకాంక్ష చైత్య పురుషుని నుంచి వస్తుందా ?

ఆ విధంగానే రానక్కర లేదు. ప్రతి భాగానికీ స్వయంగా ఆకాంక్ష కలుగవచ్చు.

దైహిక ఆకాంక్ష ఎలా కలుగుతుంది? ఆలోచిం చేది మనస్సు కదా ?

ఆలోచించేది నీ మనస్సు అయినంతకాలం నీ భౌతికశరీర చైతన్యం మూడువంతులు జడమై తన చైతన్యం తనకు లేనిదౌతుంది. భౌతికచైతన్యం అంటే దైహికచైతన్యము. శరీరం చేతనంగానే ఉంటుంది, అది ఆకాంక్షిస్తుంది కూడాను. శరీరాన్ని గురించి ఆలోచించినంతకాలం ఎవరికీ భౌతికచైతన్యం కలుగదు. మనస్సుతో ఏమాత్రం సంబంధం లేకుండా దేహానికి స్వంతమైన చైతన్యం ఉంది. తను చేయవలసిన పనుల గురించి. తన సమస్థాయి, విషమ స్థాయి మొదలైనవాటి గురించి దానికి బాగా తెలును. ఎక్కడైనా ఏదైనా అవసవ్యం జరిగితే అది పూర్తిచేతనంతో, బాహ్యలక్షణాలేమీ లేకపోయినప్పటికీ ఆ జరిగిన చోట తన స్పర్శచేత భావించగలుగుతుంది. అంతా సక్రమంగా, సమానంగా జరగవలసిన రీతిలో జరుగుతున్నప్పుడు, శరీరం ఒక రకమైన సంపూర్ణత్వాన్ని పొందుతుంది: దార్ఢ్యస్థితిలోని సుఖం, జీవించడంలోని సంతోషం, శక్తిజీవా లతో గూడిన సమతాస్థితి మొదలైనవాటిని అనుభవిస్తూ, సుఖసంతోషాలతో చరిస్తూ, జీవిస్తున్న ఆనందాన్ని పొందుతుంది. ప్రాణమయ పురుషుడు, మనో మయ పురుషుడు దానిని సరిగా చూడకపోతే అది తెలుసుకోగలదు. అందు మూలంగా అది సమత చెడి బాధపడుతుంది. ఇంకా దానివల్ల ఎన్నో జరుగుతాయి.

ఈ భౌతిక చైతన్యాన్ని పెంపొందించుకోవచ్చు. మనం పూర్తిగా బాహ్యీ కరణం పొందినప్పుడూ, ప్రాణమయ పురుషుడు శరీరంలోనుంచి పూర్తిగా నిర్గ మించినప్పుడూ కూడా కదలడానికి, స్వతంత్రంగా అన్ని పనులూ చేయడానికీ తగి నంత స్వతంత్రచైతన్యం శరీరానికి ఉండేటట్లుగా భౌతిక చైతన్యాన్ని వృద్ధిచేసు కోవచ్చు. దేహమే మాట్లాడడం నేర్చుకోగలదు: మనోమయపురుషుడు, ప్రాణమయ పురుషుడు శరీరాన్ని వదలిపెట్టి ఎక్కడో దూరాన ఏదోపనిలో మునిగి యుండవచ్చు. కాని వాటిని పదార్థంతో కలిపే లంకెపల్ల (అవి లేకుండానే)

శరీరంతో వ్యక్తం చేసుకోగలవు. ఆ శరీరం మాట్లాడడం నేర్చుకోగలదు, ఇత రులు చెప్పినదానిని పునరుద్ఘాటించగలదు, ఎక్కువ పనులు చేయలేకపోయి నప్పటికీ ఇటూ అటు తిరిగి చిన్నచిన్న పనులు చేయగలదు. వ్రాయడం, మాట్లా డడం నేర్చుకోగలదు. చాలా నిదానంగా నేర్చుకున్నప్పటికీ ఎదుటివారికి అర్థ మయే తీరులో మాట్లాడగలదు. అ విధంగా మనోమయ. ప్రాణమయ పురుషులు శరీరాన్ని వదలిపెట్టి ఎటో వెళ్ళినప్పటికీ దైహిక చైతన్యం ఉంటుంది.

ఎవరైనా ఈ దైహిక చైతన్యాన్ని బాగా పెంపొందించుకున్నప్పుడు, వివిధ చైతన్యాలమధ్య ఏర్పడే వైరుధ్యాలను స్పష్టంగా గ్రహించగలుగుతారు. శరీరానికి ఏదో అవసరం కలిగి తనకు కావలసినదేదో అది తెలుసుకున్నప్పుడు, ప్రాణిక, మానసికములు మరొకటి కోరితే వాటిమధ్య చర్చలు జరిగి వైషమ్యా లకు దారితీయవచ్చు ఇటువంటి వైషమ్యాలేర్పడినపుడు శరీరంలోని సమత అంటే ఏమిటో తెలుసుకొని దానికి అవసరమైన శరీర పరిస్థితిని తెలుసుకొని దానికి ఏ విధంగా ప్రాణికం అడ్డువచ్చి సమస్థాయిని చెడగొట్టి అజ్ఞానంవల్ల దాని అభి వృద్ధికి అంతరాయం కలుగచేస్తున్నదో తెలుసుకోవచ్చు. ఆ తర్వాత మనస్సు వచ్చినప్పుడు, అప్పటికే భౌతిక, ప్రాణికముల మధ్య ఏర్పడిన గందరగోళానికి తోడు ఇంకా కొన్ని విభేదాలను జతచేస్తుంది. దాని ఊహలను, దాని పద్ధతులను, నియమాలను, సూత్రాలను ప్రవేశపెట్టి, ఎదుటివారి అవసరాలను గమనించకుండా, తానుకూడ తదితరములు చేసినట్లే చేయాలనుకుంటుంది. ఈ విధంగా మనస్సు ప్రతిదాంట్లోను కలుగచేసుకొని సమస్థాయిని చెడగొట్టడం వల్లనే జంతువులకంటె మానవుల ఆరోగ్యం అర్భకంగా తయారైంది. శరీరానికి నమ్మకమైన సహజ జ్ఞానం ఉంది. ఉదాహరణకు చెప్పాలంటే, శరీరాన్ని దానిని దానికి వదిలేస్తే ఎప్పుడూ అవసరానికి మించిగాని. పడనివాటిని కాని తినదు. అవసరమైనప్పుడు నిద్రిస్తుంది, అవసరమైనపుడు పనిచేస్తుంది. శరీరానికి గల సహజజ్ఞానం చాలా కచ్చితమైంది. ప్రాణికము దాని కోరికలతోను, చంచలత్వంతోను, మనస్సు దాని నియమాలు, ఆచారాలు, ఊహలు మొదలైనవాటితోనూ శరీరాన్ని పాడు చేస్తాయి. ఈనాడు నాగరికత అని అనుకుంటూ, పిల్లలకు అందచేస్తున్న విద్యా విధానంతో వారి శరీరాలకుండే సహజజ్ఞానం పూర్తిగా నశింపచేయడం దుర దృష్టము: మిగిలిన వాటి ఆధిక్యత పెరిగింది. అందువల్ల వాటి ఇష్టప్రకారమే

జరుగుతోంది : హానికరమైనవాటిని భుజిస్తారు, శరీరం విశ్రాంతి కోరినప్పుడు విశ్రమించరు, లేదా అధికంగా నిద్రిస్తారు; ఈ విధంగా చేయకూడని పనులుచేసి, అరోగ్యం చెడగొట్టుకుంటారు.

> ఒక్కొక్కసారి పిల్లలు ఏదో ఒకదానిమీద ఆసక్తితో నిద్రవేళ అయినా పడుకోడానికి ఇష్ట పడరు, అప్పుడేమి చేయాలి? అంతకు ముందే నిద్రవస్తోందని చెప్పికూడా ఆటల ధోరణిలో పడి పడుకోడానికి పేచీ పెడతారు.

నిద్రవస్తున్నప్పుడు వారిని ఆడుకోనివ్వకూడదు. ప్రాణిక చలనాలు జోక్యం కల్పించుకోడం అంటే ఇదే. పెద్దవారితో ఎక్కువ పెరగని పిల్లలైతే (పెద్దవారితో ఎక్కువ కలసిమెలసి ఉండడం పిల్లలకు మంచిది కాదు) ఏమి చేస్తున్నప్పటికీ నిద్రమత్తు రాగానే పడుకుని నిద్రపోతారు. కాని ఎక్కువ భాగం పెద్దలతో గడిపే పిల్లలు పెద్దవారి అలవాట్లన్నిటినీ నేర్చుకుంటారు. ముఖ్యంగా : "చూడమ్మా, నీవు చిన్నవాడివి కాబట్టి ఇలాచేయకూడదు, నీవు కూడా పెద్దవాడి వైతే అన్నీ చేయవచ్చు. పిల్లవాడివి కాబట్టి యిది తినకూడదు, పెద్దయినాక తిందువుగాని, నీవు చిన్నవాడివి కాబట్టి పెందలాడే పడుకోవాలి...." అని వారికి చెప్పినపుడు అసలు చేయరు. వా రెట్లాగైనా పెరిగి పెద్దవారై పోవాలని, కనీసం పెద్దవారిగా కనిపించాలని అనుకోడం సహజము.

> నీ శ్రద్ధ (faith) యందలి ప్రాబల్యమునుబట్టి అది సూచిస్తున్నదానిని అమలు జరపడమే ఆదైవం అభి మతమని అర్థంచేసుకోవాలి. అచంచలమైన శ్రద్ధయే దైవసంకల్పం పనిచేస్తున్నదనడానికి నిదర్శనము.
>
> ప్రశ్నోత్తరములు 1929 (23 జూన్)

## ప్రబలమైన శ్రద్ధ, ఘనమైన విశ్వాసం (Trust) ఇవి రెండూ ఒకటి కాదా ?

అవి రెండూ ఒకటే కావలసిన అవసరంలేదు. శ్రద్ధకుగాని విశ్వాసానికి గాని, మూలం ఏమిటో తెలుసుకోవాలి. నీవు సాధారణ పరిస్థితులలో సామాన్యంగా—విపరీతపుటూహాలు, మాంద్యత కలిగించే చదువు లేకుండా—జీవిస్తుంటే నీ చిన్నతనంలో, అంటే ముప్పై సంవత్సరాలు వచ్చేవరకూ నీకు జీవితంపై సంపూర్ణమైన విశ్వాసం ఉంటుంది. ఉదాహరణకు, నీకు కొంచెం జలుబుచేయగానే కంగారుపడి డాక్టరు దగ్గరకు పరుగెత్తి అన్నిరకాల మందులూ నీ గొంతులో పోసేవారు నీ చుట్టుపక్కల లేకుండా సాధారణ పరిసరాల్లో నివసిస్తున్నపుడు నీకేమైనాజరిగితే— అపాయంగాని, అస్వస్థతగాని— అదే సరిదిద్దుకు పోతుందనే దృఢ విశ్వాసం నీ శరీరానికి ఉంటుంది. "అబ్బే, ఏం ఫర్వాలేదు. అంతా పోతుంది, రేపీపాటికిగాని లేదా కొద్ది రోజుల్లోగాని అంతా బాగుపడుతుంది. ఇది తప్పకుండా నయమౌతుంది."— నీకేమొచ్చినా అంతే. ఇది శరీరపు సాధారణ పరిస్థితి. అంటే జీవితమంతా ముందే ఉన్నదని, అంతా బాగా జరుగుతుందని సంపూర్ణమైన విశ్వాసం అన్నమాట. ఇది అమితంగా సహాయం చేస్తుంది. పదిలో తొమ్మిదిసార్లు యిలాగే తగ్గుతుంది. ఈ నమ్మకంతో చాలా తొందరగా తగ్గిపోతుంది; "అదేముంది, ఇంతకీ జరిగింది ఒక ప్రమాదమే కదా, అదే పోతుంది." కొంతమంది ఈ భావాన్ని చాలాకాలం నిలుపుకోగలరు. వారి కేమీ జరుగదనే దృఢనమ్మకమే వారిని కాపాడుతుంది. వారి కేమీ జరుగదు. జీవితమంతా వారి ముందరే ఉంది. వారి కేమి జరుగుతుందనేది ముఖ్యం కాదు. అంతా తప్పకుండా బాగానే జరుగుతుంది. అవాంఛనీయమైనవాటిని ఊహిస్తూ, ఘోరమైన, విపరీత సంఘటనలను తలపోస్తూ కాలం గడిపేవారి మధ్య నీవు నివసిస్తుంటే సహజంగా నీవుకూడా తప్పు ధోరణిలో ఆలోచిస్తావు. నీవు తప్పు ధోరణిలో ఆలోచిస్తున్నప్పుడు దాని ప్రభావం నీ శరీరంమీద పనిచేస్తుంది. అది లేకపోతే నలభై, యాభై ఏళ్ళు వచ్చే వరకూ శరీరానికి మంచి నమ్మకమే ఉంటుంది. అంతా మనుష్యులను బట్టి జరుగుతుంది. కొంతమందికి సాధారణమైన సమస్థాయిలో జీవనం గడపడం బాగా తెలుసు. శరీరానికి తన జీవితం విషయంలో నమ్మకం ఎక్కువ. కాని ఆలోచన ద్వారా అన్నిరకాల అవాంఛ

నీయమైన, అనారోగ్యపు టూహలూ చేస్తే అది పాడై పోతుంది. అటువంటి సందర్భాలు నేను అనేకం చూచాను. పిల్లలు పరుగులెత్తి ఆటలాడేటప్పుడు ప్రమాదాలు జరిగినా లెక్కచేయరు. దానిని గురించి ఆలోచించరు. దానంతటదే తగ్గిపోతుంది. అట్లాకాకుండా కొంతమంది పిల్లలకు చిన్నప్పటి నుంచీ, అంటే వారు అర్థంచేసుకోడం మొదలుపెట్టినప్పటినుంచీ ప్రపంచమంతా అపాయకరమనీ, ప్రతిచోటా సూక్ష్మజీవులు చేరతాయి కాబట్టి జాగ్రత్తగా మెలగాలనీ, దెబ్బ కొంచెమైనా అది 'సెప్టిక్' అయే ప్రమాదముంది కాబట్టి ఏమీ జరగకుండా జాగ్రత పడాలనీ వారి చెవులలో నూరిపోస్తారు.... వారి కేమాత్రం చిన్న దెబ్బ తగిలినా దానిని క్రిమి సంహారక ద్రావకాలతో కడిగి, పెద్ద కట్టుకట్టినప్పుడు వారు : "నాకేం జరుగుతుందో ఏమో, ధనుర్వాతమయినా, సెప్టెక్ జ్వరమైనా వస్తుందేమో" అంటూ ఆలోచించడం ప్రారంభిస్తారు. అటువంటప్పుడు సహజంగా జీవితం అంటే నమ్మకం పోతుంది, దాని ఫలితం శరీరం అనుభవిస్తుంది. దానితో రోగనిరోధకశక్తి మూడువంతులు నశిస్తుంది. సాధారణంగా ఆరోగ్యం నిలుపుకోవాలనుకోడం శరీరానికి సహజం. ఎదుర్కొనే శక్తి తనకి ఉన్నదనికూడా దానికి తెలుసు. దానికేమైనా జరిగితే ఆ జరిగినదానితో "అబ్బే అదేంలేదు, అదంతా అయిపోయింది, దానిని గురించి ఆలోచించకు" అంటుంది. అది వెళ్ళిపోతుంది.

సంపూర్ణమైన నమ్మకం అంటే ఇది.

నీవు ప్రబలమైన శ్రద్ధ అన్నావు కదా, అది వేరు. దైవకటాక్షమునందు శ్రద్ధ ఏర్పరుచుకొని, ఆ దివ్యకటాక్షం తమను గమనిస్తోందని అనుకుంటూ, తమ కేమి జరిగినా ఆ దివ్యకటాక్షం గమనిస్తుందని జీవితంలో ప్రతిక్షణం అనుకొని అట్టి శ్రద్ధతోనే గడపవచ్చు. అట్టి శ్రద్ధతోనే అన్నిరకాల అపాయాలనూ దాటవచ్చు, కష్టాల నెదుర్కోవచ్చు; నీకు శ్రద్ధ ఉందికాబట్టి నిన్నేదీ కదిలించలేదు. నీపై దివ్యకటాక్షం ప్రసరిస్తోంది కదా! అది అపారమైన శక్తి కలిగినది, చైతన్యవంతమైనది, ఎంతోకాలం నిలువకలిగినదీ. అది నీ దైహికబలంమీద కాని, మరి దేనిమీదకాని ఆధారపడకుండా కేవలం పరమసత్యాన్ని ఆసరా చేసుకుంటుంది కాబట్టి దానిని ఏదీ చెదరగొట్టలేదు. ధాని లక్షణమే వేరు.

ఒక్కొక్కసారి పిల్లలు మనం ఇక్కడ ఎందు కున్నామని అడుగుతున్నారు. వారి కేమి చెప్పాలి ?

వారి వయసును బట్టి, వా తత్వాన్ని బట్టి వారికి చెప్పాలి. వారి విధేయ తను బట్టి చెప్పవలసిందే కాని అందరికీ ఒకే సమాధానం చెప్పలేము.

మరీ చిన్నపిల్లలు కూడా ఆవిధంగా తాము ఎందుకున్నామని అడుగుతారా?

మరీ చిన్నవారు కాదు—పూర్ణిమ, తరులతా మొదలైనవారు.

అది బాగా ప్రశ్నలు, అనుమానాలు కలిగే వయస్సే.

కాని, చిన్నపిల్లలు యిలా అడిగితే అది మరీ ఆశ్చర్యము. వారికైతే ఇలా చెప్పాలి: "ఇది దైవ సంకల్పము. దైవ కటాక్షం వల్లనే మీరు ఇక్కడకు వచ్చారు. ఆనందంగా, నిశ్చింతగా, శాంతంగా గడపండి, ప్రశ్నలడగక్కర లేదు, అంతా బాగా జరుగుతుంది." ఇంకా పెద్దవారైనప్పుడు తర్కించడం మొదలుపెడతారు, అప్పుడంత బాగుండదు. అదంత తేలికగాదు. వారెంత తెలివైనవారో, ఎంతవరకు విస్తృతమైనారో అనేదాన్నిబట్టి చెప్పాలి. కొంతమంది విధికృతంవల్ల ఇక్కడకు వస్తారు. వారికి చెప్పడం తేలికే. వారితో "పిల్లలూ, నూతనంగా నిర్మాణం కానున్న భవిష్యత్తుకు మీరు చెందుతారు, ఆ నిర్మాణం ఇక్కడ జరుగుతోంది" అని చెపితే చాలు. కొంతమంది కేవలం తమ తలిదండ్రులు ఇక్కడకు రావడంవల్ల ఇక్కడ ఉండిపోతారు, వేరే కారణం లేదు, వారితో ; "మీ అమ్మ, నాన్న ఇక్కడ ఉన్నారు కాబట్టి" అని చెప్పేస్తే సరిపోతుంది. లేకపోతే కష్టము.

కాని మేము ఎలా అర్థం చేసుకోగలము ?

ఆ భారం నీమీదే ఉంది.

మొట్టమొదట, ఏకత్వం పొందడం నేర్చుకోవాలి. ఇతరుల బాధ్యతను వహిస్తున్నప్పుడు ఇది తప్పదు. ఇతరులకు మార్గదర్శకత్వం వహించడం నేర్చుకోవాలంటే ముందుగా వారి మనస్సులలో ప్రవేశించి వారిని అర్థంచేసుకోడం ముఖ్యము. వారి మనస్సులలో ప్రవేశించాలంటే ఆలోచనను వారిపై ప్రక్షేపించడం కాని, ఊహించడం కాని కాదు; నీలోనుంచి వారిలో ప్రవేశించి జరిగేది చూడాలి. ఈ విధంగా వారితో ఐక్యం పొందితేనే వారిని తెలుసుకోగలరు. ఎదుటివారితో ఏకంకాకుండా మనం మనంగానే ఉంటే ఏమీ తెలుసుకోలేము. పూర్తిగా పొరబడతాము. ఇదీ అదీ అని ఊహించుకోడం- బాహ్యానికి కనబడే దానినిబట్టి నిర్ణయించడం, లేకపోతే నచ్చింది ఎన్నుకోడం, ముందుగా అభిప్రాయాలను ఏర్పరుచుకోడం జరుగుతుంది గాని ఏమీ తెలియదు. ఎదుటివారిని గురించి తెలుసుకోవలసిన అవసరంలేని పరిస్థితి ఏమిటంటే వారుగా ఉండే అనుభూతి పొందడమే. వారంటే వారి ప్రక్షేపణే కదా! అది ఎలా చేయాలో తెలిస్తే తప్ప ఎదుటివారికి ఎవరూ ఏమీ చేయలేరు. వారు ఆలోచించినట్లే ఆలోచించాలంటే వారు భావించినట్లే భావించి, ఎదుటివారు తామే అనుకొని వారిలో ప్రవేశిస్తే తప్ప చేయలేరు. అది ఒకటే మార్గము. చలాకీ అయిన అల్ప మనస్సుతో తెలుసుకోవాలంటే సాధ్యం కాదు. ఊరికే వారిని చూచి "వారు ఈపని ఈవిధంగా చేశారుకాబట్టి వారు అటువంటివారై యుండాలి" అనుకున్నా ప్రయోజనం లేదు.

కాబట్టి, బాధ్యత కలవారు, అంటే పిల్లల విద్యాభారం వహిస్తున్న ప్రధానోపాధ్యాయులు, అధ్యాపకులు, గాయకులు మొదలైన వారు ప్రథమంగా ఎదుటివారితో ఏకత్వాన్ని పొంది, వారి భావాలనన్నీ అనుభవించడం నేర్చుకోవాలి. ఏమి చేయవలసిందీ ఆ తర్వాత బోధపడుతుంది. తను అంతర్జ్యోతిని, చైతన్యాన్ని ఉంచవలసిన చోట చాలా ఎత్తున వెలుగులో ఉంచి, అదే సమయంలో ఎదుటివారితో ఏకత్వాన్ని పొందాలి. అప్పుడు వారేవిధంగా భావిస్తున్నారో, వారి ప్రతిచర్యలేమిటో, వారి ఆలోచనలేమిటో తెలిపికొని వాటినికూడా వెలుగులోకి తీసుకొని వచ్చి చూడగలరు. దానిని బట్టి వారు ఎదుటి వారికి ఏమిచేయాలో పూర్తిగా తెలుసుకుంటారు. అలాచేస్తే నీవు ఎదుటి వారు ఏది వినవలసిన అవసరం ఉన్నదో అదే చెప్తావు, వారికి అర్థం కావాలంటే ఏమి చేయాలో అదే

చేస్తావు. అందువల్ల కొంతమంది బాధ్యత వహించడమనేది ఓ దివ్య కటాక్షంగా గ్రహించాలి. ఎందుచేతనంటే, దానివల్ల నీవు తప్పనిసరిగా పురోగతి సాధిస్తావు. కాని మాటికి తొంభైతొమ్మిది మంది ఆవిధంగా చేయడంలేదని నేను దృఢంగా చెప్పగలను. అందువల్లనే పరిస్థితులు ఈ విపరీతస్థితికి వచ్చాయి. ప్రత్యేకించి దేశపరిపాలనా బాధ్యత తీసుకొన్నవారు అసలు ఆలోచించరు. పైపెచ్చు వారి పద్ధతిలోనే చూడాలని, భావించాలని అభిలషించడమే కాకుండా తమ పాలనలోని ప్రజల అవసరాలను ఏమాత్రం గమనించరు అందువల్లనే గణనీయమైన ఫలితాలను ఎక్కడా చూడము. దీనినిబట్టి పరిపాలనా వ్యవస్థలు అసాధారణంగా పనిచేస్తున్నాయని మనం ఎప్పటికీ చెప్పకోలేమనేది నిశ్చయము. చిన్నచిన్న పాలకవర్గాలనుంచి పెద్దవాటి దాకా అన్ని స్థాయిలలోనూ ఇంతే. అన్నిటికీ సూత్రాలు ఒకటే. అందువల్ల నీవు పాఠం చెప్పేటప్పుడు అక్కడికక్కడ సంపూర్ణంగా ఆ వాతావరణాన్ని తీసుకొని వారి (విద్యార్థుల) దగ్గరున్న ప్రకంపనాల నన్నిటినీ పోగుచేసి, నీ దగ్గరకు కూడదీసుకొని వాటితో ఏం చేయాలో ఆలోచించాలి (ఆ ప్రకంపనలతోనే నీవు ప్రసారం చేయవచ్చు. నీవు పంపించగల శక్తులను పంపించవచ్చు. కొన్ని విద్యార్థులు గ్రహించవలసినవి, అర్థం చేసుకోగలిగినవి) నీవు ఇలా చేయకపోతే నీ కాలమంతా వృధాచేసినట్లే. ఏ కొంచెం పనిచేయాలన్నా అధికమైన పురోగతి సాధించవలసి వుంటుంది.

"అతిమనస్సు, మానసిక విషయాలలో మనస్సు కనబరిచే విధానంలో ఆసక్తి చూపదు. అది విశ్వంలోని విషయాలన్నిటిలోను స్వంతంగా అభిలాష పెంచుకుంటుంది. కాని ఆ దృక్పథం, ఆదృష్టి వేరు. ఈ ప్రపంచమే దానికి వేరుగా కనిపిస్తుంది; అంతా తిరగవేసినట్లుగా కనపడే దాని దృష్టికి అన్నీ మనస్సుతో చూచే దానికన్నా భిన్నంగా కనిపిస్తాయి. అన్నిటికీ అర్థంమారుతుంది; ఒక విషయాన్ని గురించిన అభిప్రాయం, చలనం, ప్రక్రియలు మొదలైనవన్నీ

వేరుకళ్ళతో చూచినట్లుగా కనిపిస్తాయి. అతిమనస్సు అన్నిటినీ పర్యవేక్షిస్తుంది. ఒక మానసిక చలనాలే కాకుండా, ప్రాణిక, స్థూల చలనాలు మొదలైన విశ్వ లీలలన్నీ దానికి గాఢమైన అభిలాషను కలిగిస్తాయి కాని అది వేరుగా ఉంటుంది.

(ప్రశ్నోత్తరములు 1929 (23 జూన్)

అతిమనస్సు ఏవిషయంలో ఆసక్తి చూపుతుంది?

ఈ విశ్వపరివర్తన కార్యంలో దానికి ఆసక్తి ఎక్కువ. భౌతిక ప్రపంచం లోకి శక్తులు దిగిరావడంలోను, దాని పరివర్తనలోను, అతీతమానస శక్తులను గ్రహించడానికి వీలుగా భౌతిక ప్రపంచాన్ని సంసిద్ధం చేయడంలోను అది ఆసక్తి చూపుతుంది. ప్రస్తుత ప్రపంచ పరిస్థితికి, అది ఉండవలసిన తీరుకి మధ్యగల తారతమ్యం దానికి తెలుసు. ఇప్పుడున్నదానికి, అది ఉండవలసిన తీరుకి; సత్యానికి, ఇప్పుడు ప్రకటితమౌతున్న అసత్యానికి మధ్యగల అగాధాలను అది ప్రతిక్షణం పరిశీలిస్తుంది. ఈ అతిమనస్సు ఏ చిన్న వివృతి కనిపించినా అవరోహించి వ్యక్తమవడానికై ప్రపంచాన్ని అంటిపెట్టుకొన్న పరమ సత్యాన్నే దృష్టిలో నిలుపుకుంటుంది. సాధారణ ఎరుకకు అతి సహజంగా కనబడేవన్నీ దీనికి అజ్ఞానబంధురమై, పూర్తిగా అచేతనత్వపు శక్తుల కేళిగా కనిపిస్తాయి. దానికి ఆ కేళి స్వాభావికమని తోచదు. అది గర్హింపదగిన ఒక అకస్మిక పరిణామమనుకొని తన శక్తినంతా కూడతీసుకొని దానికి విరుగుడు ఆలోచిస్తుంది. ఎక్కడైనా కొంచెము గ్రహణశక్తి కనిపిస్తుందేమోనని వెతికిచూచి అక్కడ తీవ్రంగా పనిచేస్తుంది. మానవుల బాహ్య ఆకృతినిబట్టి కాకుండా వారి ప్రకంపనాలను బట్టి చూస్తుంది. ఏ ప్రకంపనంలో కొద్దిపాటి గ్రహింపు కనిపిస్తుందో. ఏ ప్రకంపనలు అంధకారంగా ఉన్నాయో, ఏవి ప్రకాశిస్తున్నాయోనని పరిశీలించి, ప్రకాశించే చోటుకు తన శక్తిని బాగా ప్రతిభావంతంగా పనిచేసేటట్లు ప్రక్షేపిస్తుంది. ఈ అతిమనస్సు మానవులను చదరంగపు పావుల మాదిరిగా కాకుండా చక్కగా స్పష్టమైన వ్యక్తి

త్వంతో శక్తులు వారిలో ఎలా ప్రవేశిస్తున్నాయో, బయటకు వెళ్ళుతున్నాయో, వారిని ఎలా కదిలిస్తున్నాయో, అన్నిటినీ కదిలేటట్లు చేస్తున్నాయో చూస్తూ ఆ ప్రకంపనలు పనిచేసే విధానాన్ని గమనిస్తుంది. పైకి ఆరోహించి పురోగతికి దారితీసే ప్రకంపనాలను, పతనమయేటట్లు క్రిందికి అంధకారంలోకి దిగజార్చే ప్రకంపనాలను గూడ అది గమనిస్తుంది. ఒక్కొక్కప్పుడు కొందరు చిలుక పలుకుల మాదిరిగా కొన్ని మాటలు పుస్తకాలు చూపి నేర్చుకుంటారు. అవి ఆకాంక్షకు, సత్సంకల్పానికి సంబంధించిన మాటలే కావచ్చు; వాటిని ఎవరి దగ్గరైనా ప్రయోగించినపుడు, "ముందు నీవు విధేయత అలవరచుకో'' అని వారికి గట్టిగా చెప్పడం జరుగుతుంది. కాని, విధేయత అంటే వారికి అర్థంకాదు. దానికి కారణం వారిలో విధేయత లేకపోవడమేనని పరమశక్తి (అతిమానసశక్తి) గ్రహిస్తుంది. ఆ శక్తి వారిమాటలు వినదు, చూడదు, వారి ఆలోచనలనుగూడ చూడదు, కేవలం వారి చైతన్యస్థితిని గమనించి అది విధేయతగా ఉందో లేదో చూస్తుంది. మరి కొంతమంది బుద్ధిహీనుల మాదిరిగా పనికిరాని పనులు చేస్తూ మూర్ఖంగా కాలయాపన చేస్తున్నప్పటికీ, ఒకానొక సమయంలో ఆకస్మికంగా ఎవరో ఒకరువచ్చి, ప్రోత్సహించి, సోదరభావం కనబరిచి వారికి సహాయం చేస్తారు. దానికి కారణం వారి హృదయాంతరాళంలో మినుకు మినుకు మంటున్న విధేయత. పైకి ఆకతాయిగా కనిపించినా, వారిలో ఆకాంక్ష దాగి ఉంటుంది; ఒక్కొక్కప్పుడు అది మరీ స్పష్టంగా కనిపిస్తుంది. అటువంటి వారికి చాలా మంచి జరుగుతుంది కాని ప్రజలు దానికి కారణం అర్థం చేసుకోలేరు, వారు బాహ్య విషయానికి వెనుకగల యథార్థం చూడలేరు కాబట్టి. అందువల్లనే అతిమనస్సు ఆసక్తి చాలా భిన్నమైనదని, అది చూసే తీరు, తెలుసుకొనే తీరుకూడా చాలా భిన్నమైనదని చెపుతున్నాను.

ఇతరులను అర్థంచేసుకోవాలని ప్రయత్నించడం
కంటె మనని మనమే తెలుసుకోడం ముఖ్యం కదా ?

అవును. అది చాలా ముఖ్యము. ప్రతివారు పనిచేయవలసిన పరిధి అదే. ప్రతివారూ ఈ విషయాన్ని అర్థం చేసుకోవాలి. ప్రతివారి బాహ్యాంతర్దేహ నిర్మాణ పదార్థమంతా, జీవి లోపలినుంచి పైదాకా ఏర్పడిన పదార్థమంతా మనం పని చేయవలసిన పరిధిగా తెలుసుకోవాలి. ప్రతివారు కొన్ని ప్రకంపనాలను

పోగుచేసుకొని వాటిమీద పనిచేయడంకోసం అందుబాటులో పెట్టుకున్నట్లుగా కనిపిస్తుంది. రాత్రనక, పగలనక, నిద్రలోను, మెలుకువలోను అన్ని సమయాలలో కూడా నీకు అందుబాటుగా, నీవు పనిచేయడానికి వీలుగా ఏర్పడిన ఒక క్షేత్రం అది. అది నీనుంచి ఎవరూ తీసుకోలేనిది, అద్భుతమైనది. నీవు దానిని ఉపయోగించడానికి నిరాకరించవచ్చు. (చాలామంది అలా చేస్తారు.) పరివర్తన కోసం నీచేతులలోకి వచ్చిన ఒకరాశి అది; పని నేర్చుకోడంకోసం దానిని నీకిచ్చారు. కాబట్టి ఆపని ప్రారంభించడం ముఖ్యము. నీలో నీవు ఆపని చేయలేకపోతే ఇతరులకు సంబంధించినదేమీ చేయలేవు. నీకు నీవు సలహాచెప్పుకొని ఆ ప్రకారం నడవలేకపోతే ఇతరులకెవరికీ మంచి సలహాల నివ్వలేవు. ఎక్కడైనా నీకు ఒక కష్టం ఎదురువచ్చినప్పుడు ముందు నీలో నీవు దానిని మార్చుకుంటే తప్ప బయట మార్చలేవు. ఎవరిలోనైనా, ఏదైనా లోపం కనిపిస్తే అది నీలో కూడా ఉన్నదని తెలుసుకొని, దానిని సరిదిద్దుకోడం ప్రారంభించాలి. అది నీలో సరిదిద్దుకున్నప్పుడు ఎదుటివారిలో గూడ సరిదిద్దగల శక్తి వస్తుంది. ఎంత విచిత్రము! ఈవిశ్వంలోని అతిస్థూల పదార్థం నుంచి అత్యుత్తమ ఆధ్యాత్మిక పదార్థందాకా అన్నిటిని పోగుచేసి కలిపి ఒక చిన్న వ్యక్తిగా రూపొందించి పరమ సంకల్పానుసారంగా దానిని నడిచేటట్లు చేసిన దివ్యకటాక్షం ఎటువంటిదో మానవులు గుర్తించడంలేదు. అదే నీవు పనిచేయవలసిన భూమిక, నీ స్వార్జితం, దానిని నీ దగ్గరనుంచి ఎవరూ తీసుకోలేరు. అందులో నీవు ఎంతవరకూ పని చేయగలవో అంతా ప్రపంచంలో సాధించగలవు. అది అంతవరకే పరిమితము. ఇతరులకొరకు చేయడమే కాకుండా తనకోసమే తాను ఎక్కువ కృషి చేయాలి.

మనలను గురించి మనం తెలుసుకోడానికి ముందు ఇతరులను గురించి తెలుసుకోగలమా ?

ఏదీ అసాధ్యంకాదు. అసాధ్యమని ఎవరూ చెప్పలేరు. తనలో తెలుసుకోలేని కొన్ని చలనాలను మిగిలిన వారిలో తెలుసుకోగలగడం అసాధారణమే అయినా అది జరుగవచ్చు, కొంతమంది వికేంద్రీకరణం వల్ల తమను గురించినదానికంటె ఎదుటివారిని గురించి సున్నితంగా గ్రహించగలుగుతారు. కాని, అటువంటి వారిని కొంచెం అనారోగ్యవంతులుగా పరిగణిస్తారు. దానివల్ల వారి సమత వృద్ధి

చెందకపోగా వారిలో విషమస్థాయి ఏర్పడుతుంది. కొంతమంది కేవలం సముద్రం లోని బెండుముక్క మాదిరిగా ఎటుపడితే అటు తేలిపోతూ కొట్టుకొనిపోతారు. వారి చైతన్యం ఒక పంథాలో నడవదు. అది అపేక్షణీయమైన స్థితికాదు. ఎవ రిని వారు ఉద్ధరించుకుంటే తప్ప ఇతరులకు సహాయం చేయలేరని నేను విశ్వాస పీయంగా నమ్ముతాను. నీవు అచేతనత్వంలో ఉంటే ఇతరులను ఏవిధంగా చైతన్య వంతంగా చేద్దామనుకుంటావు? ఇది ఒక తీరని సమస్యగా కనిపిస్తుంది. కాని సాధారణంగా అందరూ చేసేది అదే. అట్లాగని దానిని ఒప్పుకోలేము కదా. అందువల్లనే అంతా అపసవ్యంగా జరుగుతోంది. ఇతరులు పోట్లాడుకుంటుంటే వెళ్ళి వారికంటె బిగ్గరగా "అయ్యా శాంతించండి" అంటూ అరిచి కేకలుపెట్టి నట్లుగానే ఉంటుంది ఇది కూడా.

ప్రతి వ్యక్తికీ సాధించవలసిన సమస్య ఒకటి దత్తంగా ఉన్నట్లు మీరు చెప్పారు. కాబట్టి ప్రపం చంలో ప్రతివారు ఎవరికివారే జీవించాలి. ఎందువల్ల నంటే సామూహికంగా జీవిస్తే సామూహికసమస్యలు కూడా ఏర్పడతాయి కదా. అప్పుడు అది ఒకరి వ్యక్తి గత సమస్య కాదు.

అవును. కాని మానవుడు సంఘజీవి కాబట్టి సంఘాలు సహజంగా ఏర్పడ తాయి. అందువల్ల త్వరగా పురోగమించుదా మనుకునేవారు, అంత దృఢ ౦ం లేదనుకునేవారు ఏకాంతంలోకి వెళ్ళిపోయేవారు. సన్యాసం స్వీక చి ఏకాంతంలోకి వెళ్ళి బాహ్యప్రపంచంతో సంబంధం తెగతెంపులు చేసు నేవారిని సంఘం కాదనలేదు. అయితే దీని పరిమితులు దీనికి ఉన్నాయి. ఆ విధంగా బాహ్యంగా తెగతెంపులు చేసుకోడం కొంతవరకే గాని పూర్తిగా కాదు. సాధారణంగా బాహ్యజీవితం వదిలిపెట్టి ఒంటరిగా అడవిలో చెట్టు కింద కూర్చొని తపస్సు చేసుకుందామని వెళ్ళి అక్కడి జంతువులతో ఎనలేని అనుబంధం పెంచుకున్నవారిని అనేకమందిని గురించి విన్నాము. దానికి కారణం

ఇతర ప్రాణులతో భౌతిక సంబంధం మానవునికి అవసరం కావడమే. కొంత మందికి ఈ ఆవశ్యకత లేకపోయినా ఇది సర్వసాధారణ విషయమని చెప్పవచ్చు.

ఈవిధమైన సాంఘీభావం అక్కడితో ఆగిపోదు. ప్రాణిక సమైక్యత, మానసిక సమైక్యతలనేవాటిని ఎవరూ ఆపలేరు. అన్నిటినీ మించి (మానవులకు జంతువులకంటె వ్యక్తిత్వం ఎక్కువే అయినప్పటికీ) జాతి ఆత్మవల్ల కలిగే సామూహిక సూచనలను,—మాటలలో వ్యక్తం కాకపోయినా—వాతావరణాన్ని తప్పించుకోలేరు. మానవత అంతా కలిసి కొంత పురోగమిస్తేనే తప్ప వ్యక్తిలో ఒకానొక పరిపూర్ణత, పరివర్తనలు సిద్ధించవని (ఇది నా అనుభవం) నేను నిశ్చయంగా చెప్పగలను. ఇది అంతా అంచెలంచెలుగా జరుగుతుంది. స్థూల జగత్తులోని కొన్ని అంశాలు మారాలంటే ఆ స్థూల జగత్తు అంతా కూడా కొంతవరకు పరివర్తన చెందితే తప్ప సాధ్యం కాదు. ఎవరికివారు ఏకాంతంలోకి వెళ్ళిపోవాలంటే వీలుకాదు. పని చేయవచ్చు, ఆవిధంగా కోరుకోవచ్చు: కొంతమంది ఏకాంతం కోరుకొని వారు తెలుసుకున్న ఆదర్శాన్ని వారిలోనే సిద్ధింపచేసుకోడానికి ప్రయత్నించారు. వారు కొంత దూరంవెళ్ళి ఒకానొక స్థితిని చేరుకొని, ముందుకు వెళ్ళలేక, అక్కడే ఆగిపోయారు. అదంతా మన చరిత్ర రుజువు చేస్తోంది. ఒక రోజున నేను ఈవిధంగా అన్నాను: "అసామాన్యమైన విషయాలను సాధించిన వారు ఈ పృథ్విపై నాకు తెలియకుండా కొంతమంది ఉండవచ్చు." కాని వారు ప్రపంచానికి దూరంగా ఏకాంతవాసం చేయడంవల్ల ఈ ప్రపంచానికి వారిని గురించి తెలియదు. ఏదీ అసాధ్యం కాదని చెప్పడానికే ఇది చెపుతున్నాను. కాని పైకి అసంభవంగా కనిపిస్తుంది. భౌతికంగా ఏకాంతవాసం చేస్తున్నప్పటికి ప్రాణికంగాను, మానసికంగాను ఆవిధంగా చేయడం మాత్రం అసాధ్యము. మానవుడు పుట్టిపెరిగే ఈ సువిశాల భూ వాతావరణంలో మానవ "జాతి ఆత్మలు" ఉన్నాయి కదా! ఈ జాతి ఆత్మలు పురోగమించి కొంత పరిపూర్ణత అందుకుంటే తప్ప వ్యక్తి ముందుకు సాగలేడు. అందరూ కలిసి పురోగమించేవరకు వ్యక్తి ఆగాలని కాదు; ఎవరైనా ఒకరు గబగబా ముందుకు సాగాలంటే అంతా కలిసి ఒక స్థాయిని చేరాలి కాబోలు అనిపిస్తుంది....వ్యక్తి ఎప్పుడూ సంఘానికి ముందుగానే ఉంటాడు. అందులో సందేహం లేదు కాని కొంత సంబంధ సామ్యం తప్పదు.

మానవులు ఏ స్థాయిలో అత్యధికంగా ఏక
మవుతారు ?

అంటే 'అత్యంత అన్యోన్యాశ్రయత్వం' అనా నీ ఉద్దేశం ?

కాదు, సామూహిక సంకల్పం విషయముపై
అడుగుతున్నాను.

సామూహిక సంకల్పమా ? నీవు అన్ని విషయాలనూ కలగాపులగం చేయకూడదు. మానవులలో సత్సంకల్పం అని చెప్పినప్పుడు అది చైత్య సంబంధమైనది. అందులో సందేహం ఏమీ లేదు. కాని ప్రాణిక సంబంధమైన అన్యోన్యాశ్రయత్వం భౌతికమైనదానికంటె చాలా ఎక్కువది. ఉదాహరణకు, మొదటి ప్రపంచయుద్ధానికి కారణం ప్రాణిక జగత్తునుంచి అనేకశక్తులు (ప్రాణిక ప్రపంచ ప్రతికూల శక్తులు) విపరీతంగా భౌతికజగత్తులోకి దిగిరావడమే. ఆ విధంగా దిగి వచ్చిన శక్తులను తెలుసుకొని వాటినుంచి పరిక్షించుకొనే ప్రయత్నం చేసినవారుకూడా వాటి ఫలితాలకు గురికాక తప్పలేదు. ఈ పృథ్వి అంతా ఆఫలితాల ననుభవించింది. ప్రాణిక దృష్ట్యా చెప్పాలంటే మొత్తంమీద ఒక క్రమక్షయం ఏర్పడింది. ఆశక్తులు ఎక్కడనుంచి వచ్చాయో, క్రమక్షయం ఎక్కడినుంచి ఏర్పడుతోందో చైతన్య వంతంగా తెలిసికొని చేతనంగా దానిని ఎదుర్కొనగలిగినవారికి కూడా ఆ పర్యవసాన ఫలితాలు తప్పలేదు. ఈ పృథ్వీవాతావరణంలో ఏర్పడ్డ కొన్ని విపరీత పరిణామాలను వారు నిరోధించలేకపోయినా, ఏం జరిగిందో ఎవరికీ తెలియదు, కాని యుద్ధం తర్వాత అంతా పాడైపోయిందని మాత్రం అందరూ చెప్పుకున్నారు. అంతవరకే వారికి తెలుసు. ఉదాహరణకు, నైతికస్థాయి బాగా దిగజారిపోయింది. దానికి కారణం అపరిమితమైన ప్రాణిక జీవుల అవరోహణమే: లంచగొండితనం, పతనం, విధ్వంసం, హింస — వీటికి సంబంధించిన దుష్టశక్తులు దిగివచ్చినాయి.

అవి ఏందుకు దిగివచ్చినాయి ?

బహుశా అదొక ప్రతిచర్య. ఒక దివ్యశక్తి తన కార్యసాధనకై దిగి వస్తూండవచ్చు. అది ఈ శక్తులకు ఇష్టం లేకపోవచ్చు. దివ్యశక్తిరాక వీటి అలవాట్లకు అంతరాయం కలిగించింది. అది ఎలా ఉందంటే ఒక పరిపాలక వర్గం, తనను ఎవరైనా తొలగిస్తారేమోననే భయంతో అధికారం నిలబెట్టుకోవాలని తనే హింసాత్మకంగా తయారైనట్లు ఉంది.

14 అక్టోబరు 1953

ప్రశ్న : "ప్రేమమూర్తి అయిన దైవమే సృష్టికి మూలమైతే, అసంఖ్యాకమైన దుష్ట శక్తులు భూమిపైకి ఎలా వచ్చాయి ?"

"అంతా దైవంనుంచే ఏర్పడింది; ఏకైక పరమ చైతన్యం సూటిగా తననుంచి ఈ ప్రపంచాన్ని సృష్టించ లేదు. దానినుంచి ఒకదివ్యశక్తి బహిర్గతమై, అనేక స్థాయి లలో తన కార్యకలాపాల ద్వారా, ప్రతినిధుల ద్వారా ఈ భూమిపైకి వచ్చింది. ఈ ప్రపంచాన్ని సృష్టించడంలో సృష్టికర్తలు చాలమంది ఆధిపత్యంవహించారు. వారంతా మధ్యస్థ ప్రతినిధులని చెప్పవచ్చు. వారిని సృష్టికర్త లనడంకంటేస్రష్టలు అంటే బాగుంటుంది, ఎందువల్లనంటే, వారు ప్రకృతికి స్థూల ఆకృతి నిచ్చారు. ఈ స్రష్టలలో కొంతమంది మంచి సామరస్యం గలవాటిని, దయగల వాటిని సృష్టించారు; మరికొంతమంది, ఆకతాయివాటిని, చెడ్డవాటిని సృష్టించారు. కొంతమంది చక్కగా ప్రారం భమైన వాటిలో జోక్యం కల్పించుకొని పాడుచేసిన

వారున్నారు వీరిని స్రష్టలనేదానికంటే వినాశకారు లనవచ్చు.

ప్రశ్నోత్తరములు 1929 (30 జూన్)

చాలామంది స్రష్టలు సృష్టికార్యంలో ఆధిపత్యం వహించారని చెప్పారు కదా, ఆ స్రష్టలు ఎవరు ?

వారికి చాలా పేర్లున్నాయి, అన్నిరకాల వైయక్తిక అంశల ద్వారా, సృష్టి అంతా అనేకస్థాయిలలో జరుగుతుంది. ఒక్కొక్కస్థాయిలో కొన్ని ప్రత్యేకమైన అంశలు, వ్యక్తిత్వాలు ఉండి, వారి చుట్టూ వారి లోకాలను ఏర్పరచు కుంటారు; లేదా భూమిపై కొన్నిరకాల జీవుల ఉత్పాదనకు సహాయం చేస్తారు. అన్నిటిలోకీ చివరిస్థాయి ప్రాణికలోకవాసులు సృష్టిచేసే స్థాయి. ఇంకా అధి మానస స్థాయికి ( శ్రీఅరవిందులు ఈస్థాయిని అధిమనస్సు అన్నారు ) చెందిన స్రష్టలు ఆకృతుల నేర్పరచి, విభూతులను భూమిపైకి పంపించారు. ఈ విభూ తులలోనుంచి మరికొన్ని విభూతులు, వారిలోనుంచి మరికొన్ని, ఆ విధంగా ఉత్ప న్నమైనాయి. అందువల్ల ఈ ప్రపంచం ఇప్పుడున్నట్లుగా ఏర్పడడంలో దైవ సంకల్పం సూటిగా పనిచేయలేదని చెప్పవచ్చు. మానసిక స్థాయికి చెందిన అనేక పొరల ద్వారా పయనించడంవల్ల దానికి ఈ రూపు ఏర్పడింది. మానసిక స్థాయిలోని స్రష్టలు అనేక జీవులను సృష్టించి భూమిమీద అవతరింప చేశారు. ప్రాణికస్థాయిలో కూడా ఇలాగే జరుగుతుంది.

ఉదాహరణకు, క్రిమి కీటకాదులన్నీ ప్రాణికలోకపు స్రష్టలవల్ల ఏర్పడ్డాయని ఒక వాడుక. అందువల్లనే వాటిని సూక్ష్మదర్శినితో చూచినప్పుడు పైశాచికా కారంలో కనిపిస్తాయి. ఈ మధ్యనే మీరు నీటిలోని సూక్ష్మక్రిములను చూచారు కదా ? ఆ బొమ్మలు మీకు సరదా కలిగించడానికని, మీ ఊహాశక్తిని ఉద్దీపన చేయడానికని తయారుచేసినవే అయినా, అవి వాటి యథార్థస్వరూపాన్ని బట్టి చేయబడినవి, అవి పెద్దవిగా చేసి చూపించడంవల్ల భూతాల మాదిరిగా కనుపిస్తు

న్నాయి. నిజానికి ఈ క్రిమి కీటకాది లోకమంతా సూక్ష్మభూతాలతో నిండి ఉంది. ఇదేకనక పరిమాణంలో పెద్దవిగా ఉన్నట్లైతే భయంకరంగా తయారయేది. అందువల్ల వీటిని ప్రాణికలోక జీవాంశలు (entities) అన్నారు. ఈ ప్రాణిక లోకవాసులు వీటన్నిటిని తమాషాకోసం వినోదంకోసం సృష్టించుకున్నాయి. ఇవే భూమిపై మానవ జీవితాన్ని దుర్భరంగా తయారు చేశాయి.

ఈ మధ్యస్థ అంశలన్నీ దైవశక్తివల్లనే వచ్చాయా ?

అవును. అయితే మధ్యస్థస్థాయిల ద్వారా వచ్చాయి కాని సూటిగా రాలేదు. ఈ అంశలకి దైవంతో సూటిగా సంబంధం లేదు. (దీనికి మినహాయింపు లున్నాయి. కాని అది ప్రత్యేకం) ఈ జీవులు మిగిలిన జీవులతో సంబంధం పెట్టుకొని, అవి ఇతర జీవులతో సంబంధం పెట్టుకొని.... ఆ విధంగా దైవం దాకా ఒక పరమ వ్యవస్థగా ఏర్పడ్డాయి.

అవి దైవంనుంచి వచ్చినవైతే, వాటికి దుష్టత్వం ఎందుకు కలిగింది ?

దుష్టత్వమా ? నేను ఇదివరకు చెప్పానుగదా : దివ్యప్రభావానికి ప్రత్యక్షంగా లోనుకాకపోవడం, దైవసంకల్పంవల్ల కలిగిన సృష్టివిస్తరణలను అనుసరించకపోవడం వీటి దుష్టత్వానికి కారణాలు. విభజనలు, అల్లకల్లోలాలు ఏర్పడడానికి కారణం వీటికి దైవంతో సూటైన స్పర్శ లేకపోవడమే. ఈ జీవులలో ఎంతో గొప్పవి, తేజస్సు కలవికూడా దైవ చలనాలను అనుసరించకుండా వాటికి తోచినట్లు ప్రవర్తిస్తాయి. అవి స్వతహాగా తేజస్సు కలవి కావడంవల్ల మానవులు వాటిని చూచినప్పుడు దేవత లనుకుంటారు. విశ్వచలనాలతో సామరస్యం లేకుండా వాటి సంకల్పాన్నే అనుసరించడంవల్ల దుష్టత్వానికి, అల్లకల్లోలాలకి, అవరోధాలకి మూలకారణమౌతాయి.

ఈ ప్రశ్న * అడగడమే అనుచితము. అందుకే నాకు నవ్వు వచ్చింది. "ప్రపంచమంతా దైవమే కదా, ప్రపంచంలో చెడు ఎందుకుంది?" అని అడగడం చిన్నపిల్లల తత్వము. ఆమె ఇప్పుడా ప్రశ్న అడిగితే "భగవంతుడు కానిదేదీలేదు, అది కొంచెం కల్లోలంలో ఉన్నది, అంతే. దానిని పరిష్కరించడానికి అందరూ ప్రయత్నించాలి. దేవుడంటే కేవలం ప్రేమ మాత్రమే కాదు, సమస్తం ఆయనే. అదంతా మనకు చెడుగా కనిపిస్తే దాని ఏర్పాటు సమంగా లేదన్నమాట." అని చెపుతాను. నిజానికి జరుగుతున్నది అదే.

అది ఎందుకు జరిగిందని అడగవచ్చు. అయితే దానికి సమాధానం చెప్పవలసింది మనస్సుకాదు. అది జరిగింది, అంతే. మనకు సంబంధించినంతవరకు అది అంతే. అది ఒక ఆకస్మిక సంఘటనకావచ్చు....నీవు తాత్త్వికదృష్ట్యా పరిశీలిస్తే మనమున్న ఈవిశ్వం అనేక చలనాలలో ఒక చలనమనీ, ఈ చలనం తన స్వంత సిద్ధాంతాన్నే అనుసరిస్తోందనీ తెలుసుకోగలవు (మిగిలిన చలనాలలో యిది వర్తించక పోవచ్చు). ఆవిధంగా, ఎన్నికప్రకారం ప్రపంచనిర్మాణం జరగడమే దైవ సంకల్పమైతే ఆ ఎన్నిక జ్ఞానవంతం, తేజోవంతం అయేవరకూ అక్రమ చలనాలు జరగకుండా ఆపలేము. ఎందుకునే స్వతంత్రం ఉన్నప్పుడు మంచివే కాకుండా చెడ్డవాటిని గూడా కోరుకోవచ్చు. అది పూర్వమే నిశ్చయమైనదైతే అది స్వతంత్రమైన ఎన్నిక కాదన్నమాట. అటువంటి ప్రశ్నలడిగినప్పుడు మనస్సే సమాధానం చెప్పి, ఆ సమస్య పరిమాణాన్ని తగ్గించి ఒక ప్రాథమిక సూత్రంగా తయారు చేస్తుంది; అది వాస్తవానికి కొంచెం సుమారుగా అస్పష్టంగా, అసంపూర్ణంగా మాత్రం సరిపోతుంది.

ఏదైనా విషయాన్ని అర్థం చేసుకోవాలంటే మనం ఆ విషయంగా కావాలి. ఈవిశ్వం ఎలా ఏర్పడిందో, ఎందుకు ఏర్పడిందో తెలుసుకోవాలంటే నీవు

---

* ప్రేమమూర్తి అయిన దైవమే సృష్టికి మూలమైతే అసంఖ్యాకమైన దుష్టశక్తులు భూమిపైకి ఎలా వచ్చాయి ?

విశ్వంతో ఐక్యం కావాలి. అది అసాధ్యంకాకపోయినా అంత తేలిక గాదు. ముఖ్యంగా పిల్లలకి.

ఆమె అడిగిన అమాయికపు ప్రశ్నలలో ఇది ఒకటి. "భగవంతుడు న్యాయ మూర్తి అయితే అన్యాయం ఎందుకు ఉన్నది? ఆయన మంచివాడైనప్పుడు చెడ్డ తనం ఎందుకు ఏర్పడింది? ఆయన ప్రేమమూర్తి అయితే ద్వేషం ఎందుకు ఉంది? —అంతా ఆ భగవంతుడే. ఇది, అది మాత్రమే అని కాదు—సర్వం భగవం తుడే. సృష్టిని గురించి ఈప్రపంచంలో అనేక అభిప్రాయాలు వ్యాప్తిలో ఉన్నాయి. చాలా సరళమైన ఈ అభిప్రాయాలను మానవులు చాలా కాలం నమ్మారు. 'ఏదో ఒకటి' ఉన్నదనీ (అది ఏదో వారికి తెలియదు), భగవంతుడు దీనికొక ఆకృతినిచ్చి తద్వారా సృష్టి చేస్తాడనీ వారి నమ్మిక. నీకు అటువంటి అభిప్రాయాలుంటే ఈ భగవంతునితో "నీవు ప్రపంచాన్ని సృష్టించావు, అది చాలా బాగుంది" అని అన గలవు. ఈ కథనం ప్రకారం భగవంతుడు ఏడురోజులు కష్టపడి ప్రపంచాన్ని సృష్టించి అది చాలా బాగున్నట్లు ప్రకటించాడు. అది చాలా బాగుండి అతనికి చాలా సంతోషం కలిగించిందేమో. కాని ఈ ప్రపంచంలోని మనకు మాత్రం అది ఏమీ బాగాలేదు. ఈవిధంగా అనుకోడం చాలా అమాయికం గదా. కుండలకు ఆకృతి నిచ్చే కుమ్మరి కథ మాదిరిగానే ఉంది. భగవంతుడు కూడా మనిషివంటి వాడే. శక్తిలోనూ, పరిమాణంలోను అధికుడైనప్పటికీ మానవునివంటివాడే. నిజానికి మానవుడే భగవంతుణ్ణి తన ప్రతిరూపంగా ఊహించాడు, అంతేకాని భగవం తుడు తన ప్రతి రూపంగా మానవుణ్ణి తయారుచేయలేదు. అమాయికంగా, అసంపూ ర్తిగాఉన్న ప్రశ్నలు అడిగినప్పుడంతా సరైన సమాధానం చెప్పడం చాలా కష్టము, ప్రశ్నే సరిగా లేదు గదా. నీవు ఏదో చెప్పి అదే స్థిరపరుస్తావు. ఆ విధంగా స్థిర పరచడానికి నీకేమి హక్కు ఉంది? స్థిరపరుస్తావు కాబట్టి నీవు: "అదే ఇది అయినప్పుడు అది అలా ఉండడం ఎలా సంభవించింది?" అనే నిర్ణయానికి వస్తావు. "అదే ఇది'' అనేది నీ వాదనే అయితే అది అలా ఉండాలని కాదు.

దీనికి ఒకే ఒక పరిష్కారం ఉంది. మూలంలో విశ్వానికి, భగవంతునికి ఏరకమైన విభేదము చేయకూడదు. రోదసిలో దైవ ప్రక్షేపణే విశ్వము, అంటే విశ్వం మూలంలో ఉండేది భగవంతుడే. ఏవిధంగా చెప్పినా అది ఒక్కటే. నీవు

వాటిని వేరుచేయలేవు. "సృష్టికర్త సృష్టి" అనేదానికి ఇది పూర్తి వ్యతిరేకము. ఎటొచ్చీ సృష్టికర్త, అతని సృష్టి అని చెప్పుకోడం సులభం, అలా వివరించడం తేలిక, మరీ ప్రాథమికము. కాని అది నిజం కాదు. అప్పుడు నీవు "అన్నిటి లోకీ అధికశక్తిసంపన్నుడైన భగవంతుడు ఈ ప్రపంచం ఇలాగే ఉండడాన్ని ఎలా ఒప్పుకుంటాడు" అంటావు. కాని అది నీ స్వంత ఉద్దేశ్యమే. నీకు అసౌఖ్యంగా కనిపించే పరిస్థితుల మధ్య నీవు నివసించడం వల్లనే నీవు దానిని దైవానికి ఆపాదించి ఇలా అంటావు: "ఇటువంటి ప్రపంచాన్ని ఎందుకు సృష్టించావు ?"— "నేను చేయలేదు. నీ అంతట నీవే చేశావు. నీవే మళ్ళీ నేనైతే నీవు ఇప్పుడనుకున్నట్లుగా అనుకోవు. నీవు నేను కాకపోవడం అనేది నిన్ను ఈ విధంగా అనుకునేటట్లు చేస్తోంది." ఆ భగవంతుడు నీకు చెప్పగల సమాధానం ఇంతే. నిజం ఏమిటంటే, నీ చైతన్యం ఆ దైవ చైతన్యంతో ఐక్యం కాగలిగినప్పుడు సమస్యే రాదు. ప్రతీదీ చాలా సాధారణంగా, తేలికగా, బాగున్నట్లుగా, ఉండవలసిన రీతిలో చక్కగా కనిపిస్తుంది. మూలంతో నీవు తెగ తెంపులు చేసుకొని, ఎదురుగా నిలబడితే ప్రతిదీ తప్పుదారిలోనే కనిపిస్తుంది, ఏదీ సరిగా జరగదు.

దానిలో తర్కం కనుక్కోవాలంటే తనలోని భాగాలు తననుంచి వేరైతే దైవం ఎలా సహించి ఊరుకున్నాడని, అపక్రమం జరుగుతుంటే ఎలా ఊరుకున్నాడని ప్రశ్నిస్తావు. నేనప్పుడు "నీవు తెలుసుకోవాలనుకుంటే దైవంతో నీ అంతట నీవే ఏకం గావడం మంచిది. దైవం వీటిని ఎందుకు చేశాడో తెలుసు కోవాలంటే అది ఒక్కటే మార్గము" అని చెపుతాను. మానసిక స్థాయిలో అతన్ని ప్రశ్నిస్తే లాభం లేదు. నీ మనస్సు అర్థం చేసుకోలేదు. నీవు ఆ రకమైన ఏకత్వాన్ని పొందినప్పుడు అన్నిప్రశ్నలూ పరిష్కార మవుతాయి. అన్నీ సరిగా లేవనే భావం, అవన్నీ ఇంకొకరకంగా ఉండాలనే భావం ఎందుకు కలుగుతాయంటే, ఎడతెగని పురోగతిలో దైవసంకల్పం నిరంతరం విడమరుస్తోంది కదా. అక్కడ ఉన్నవి కొత్తవాటికి చోటివ్వాలి, అవి మిగిలినవాటికంటె బాగుండాలి. నిన్న బాగున్న ప్రపంచం రేపు బాగుండకపోవచ్చు. ఒకప్పుడు ఎంతో సామరస్యంగా, పరిపూర్ణంగా కనిపించినది ఈరోజు అవకతవకగా, సామరస్య రహితంగా ఉంటోంది. అందువల్ల ప్రపంచం ఇంతకంటె బాగుండడానికి మార్గం

చూస్తున్నాము. అది బాగున్నట్లు మనకి కనబడితే మనం చేయవలసినది చేయము. అది ఇంకా మెరుగుపడడానికి చేయవలసింది చేయము.

నీకు ఈ రకమైన అభిప్రాయాలన్నీ అవివేకంగా తోచే సమయం వస్తుంది. ఎవరిలో వారు మూసుకొని ఉండిపోతే ఇలా జరుగుతుంది. అనంతమైన విశ్వంలో ఇసుకరేణువువంటి నీ ఈ చైతన్యంతో అనంతత్వాన్ని తెలుసుకొని దానిపై తీర్పు చెప్పాలనుకుంటున్నావా? అది అసాధ్యము. ప్రప్రథమంగా నీలో నుంచి నీవు బయటపడి, అనంతత్వంతో ఐక్యం చెందితే అప్పుడు దానిని అర్థం చేసుకోగలవు కాని అంతకుముందు కాదు. నీ చైతన్యాన్ని ప్రక్షేపించి, అంటే నిన్ను, నీ ఆలోచనలను, అర్థంచేసుకోగల సామర్థ్యాన్ని దైవంపై ప్రక్షేపించి "అదంతా తప్పు" అంటావు. నాకు తెలుసు: కాని నీవు తాదాత్మ్యం పొందితే తప్ప అది అర్థంచేసుకోలేవు. సముద్రం ఎలా ఉంటుందో ఒక నీటి చుక్కను బట్టి తెలుసుకోగలమా? ఇదీ అంతే.

> "మానవుడు శరీరం ధరించినప్పుడు, దానితో పాటు అనేక సాధారణ సూచనలను, జాతిలోని అనేక ఊహలను, మానవజాతి భావాలను, సంసర్గాలను, ఆకర్షణలను, వికర్షణలను, భయాలను కూడా స్వీకరిస్తాడు.

ప్రశ్నోత్తరములు 1929 (30 జూన్)

మానవ శరీరం ధరించినప్పుడు భయ సూచనలను స్వీకరించడం కూడా అవసరమా?

అవసరం కాదు, అనివార్యమే ననిపిస్తుంది:.... వాటిని స్వీకరిస్తున్నట్లుగా ఎవరికీ తెలియను కూడా తెలియదు. మనం ఇదివరకు చెప్పుకున్నాము కదా: చైత్యపురుషతత్వం దేహంలో ప్రవేశించినప్పుడు, అది తలక్రిందులుగా పడి

వల్ల కొంతసేపటివరకు చేష్ట లుడిగిపోతుంది. ఆ సమయంలోనే దానికి తెలియ కుండా ఈ సూచనల ప్రభావానికి లోనౌతుంది. అది లేచిన తర్వాత వాటిని తొల గించుకోవచ్చు; వాటిని స్వీకరించవలసిన అవసరం లేదు. కాని అవి సూచన లని తెలుసుకోవాలి. అది కేవలం మానవ చైతన్యం నుంచి, దైహిక చైతన్యం నుంచి వేరుకావడం తెలుసుకోవాలి. ఆ విధంగా వేరై పైనుంచి వాటిని చూడ గలిగితే ఈ సూచనలనుండి విముక్తి పొందవచ్చు. నీవు అలా చేయలేకపోతే యోగసాధన చేయలేవు.

దానిని నీవు తెలుసుకోలేవు, అది ఎప్పుడూ ఉండేదే. ఉదాహరణకు, మరణాన్ని గురించి భయానకమైన సామూహిక సూచన ఉంది. నీలో నీవు అమరత్వ చైతన్యాన్ని నిలుపుకుంటే తప్ప మరణభయాన్ని పోగొట్టుకోలేవు కదా? ఒకసారి నీలో నీవు అమరత్వచైతన్యాన్ని సృష్టించుకోగలిగితే ఈ సూచననుంచి తప్పించుకోగలవు. లేకపోతే అది అసాధ్యము. నీకు దాని సంగతి తెలియదు. దానిలో నీవు మామూలుగా జీవిస్తావు. మానవజాతికి సంబంధించిన చలనాలతోను, భావాలతోను నీవు నిండిపోయావు, ఇవన్నీ నీ వ్యక్తిగతమైనవి కావు. నీకు వాటి సంగతి తెలియకపోవడానికి కారణం అవి నీ చైతన్యంతో సన్నిహితంగా కలిసిపోవడమే. ఈ విధమైన మానవచైతన్యంనుంచి నీవు విముక్తిపొంది, మరొక పరిధిలోకి ప్రవేశిస్తే, అంటే దేహంలో జీవం ఒక ఆక స్మిక చలనంగా— (అది ఇక్కడ ఉండవచ్చు, అక్కడా ఉండవచ్చు, వేరొక చోట కావచ్చు)— ఉండే పరిధిలో ప్రవేశించిన క్షణాన దేహబంధంనుంచి విముక్తి పొందుతావు. నీవు దానివైపు చూసి: అది ఒక ఆకస్మిక సంఘటన మాదిరిగా ఉంది— (అది ఎన్నిక కావచ్చు, సాధారణంగా ఆకస్మికసంఘటనే)— అని అనుకుంటావు. ఆ క్షణంనుంచి నీవు దేహానికి కట్టుబడవు. ఎందువల్ల నంటే అప్పుడు కేవలం మానవ పరిధికి పరిమితంకాని జీవిలో నీవు చేతనంగా ఉంటావు. కాని ఆక్షణం వచ్చేవరకూ నీకేమీ తెలియదు, తెలుసుకునే మార్గమూ లేదు. నీవు కేవలం మానసికమైన పరిధిలోకి వస్తే అక్కడ చాలా గట్టిగా నాటుకుపోయిన ఊహలు కనిపిస్తాయి. ఉదాహరణకు, అనంతం పరిమితులలో ఇమడనేరదని, అది కల ప్రతిదానికీ అంతం ఉంటుందనీ మొదలైన ఊహాభావాలు అద్భుతంగా కనుపించినప్పటికీ అవన్నీ వెర్రి మొర్రి భావాలే. అవి సామూహిక

మానవ మానసిక కల్పనకు చెందినవి. తామే తెలివిగలవారమని అనుకునేవారి మనస్సులోనుంచి వీటిని తొలగించడం కంటే కష్టం వేరేలేదు. మీరింకా వేదాంతంలోకి దిగలేదు కాబట్టి ఈప్రశ్నలు మీకు రాకపోవచ్చు, కాని మొదలు పెట్టినప్పుడు తెలుస్తుంది. ఇవన్నీ సమీపించలేని అమరసత్యాలనే భావం మీకు కలుగుతుంది. కాని ఇవి తెలివితక్కువ ఊహలే. ఏదో ఒకరోజు నేను చెపుతాను .... (నళినికాంతగుప్త గారి వైపు చూస్తూ) ఇక్కడ "ఎడ్వెంట్ (Advent)" పత్రిక లేదా? శ్రీఅరవిందులు చెప్పినది అందులో వేశారు. దానిని ఇంగ్లీషులో నుంచి ఫ్రెంచిలోకి అనువాదం చేద్దాము. తర్కాన్ని గురించి, హేతువాదాన్ని గురించి * ఆయన అద్భుతమైన విశేషాలు చెప్పారు. అయినప్పటికి ఇవి సాము హిక సూచనలని, వాటినుంచి విముక్తి పొందాలని మీకు తోచలేదు. ఇదంతా బానిసత్వం మాదిరిగా నీకు కనిపించకపోవడమే కాకుండా దేదీప్యమానంగా కనిపిస్తుంది. నిజానికి అది కానేకాదు.

అమ్మా! ఒక్కొక్కసారి విపరీతంగా భయం వేస్తుంది. మే మప్పుడు ఏమి చేయాలి?

అది ఎటువంటి భయం అనేదానిమీద ఆధారపడి ఉంటుంది. అది అకారణ మైన భయమా? లేక కారణమేమైనా ఉందా? అనేదాన్నిబట్టి వేర్వేరు పద్ధతుల నుపయోగించాలి.

---

* 1953 ఆగస్టు ఎడ్వెంట్‌లో వ్రాసిన శ్రీఅరవింద సూక్తులను గురించి శ్రీమాత చెప్పినట్లున్నారు. ధార్మికమ్మన్యత (తాను ధర్మపరుడనను కోడం) సౌశీల్యానికి ఎట్లు పరమశత్రువో అట్లే తర్కం దివ్య సత్యానికి పరమశత్రువు. ఎందువల్లనంటే, తన తప్పులు తాను తెలుసుకోలేనిది మొదటిది; తన లోపాలు తాను తెలుసుకోలేనిది రెండవది.

Thoughts & Aphorisms, Cent. Vol. 17, P. 84.

అది కారణాన్ననుసరించినదే.

అంటే, ఉదాహరణకి, ఎవరికైనా జబ్బు చేస్తే మీకు కూడా వస్తుందేమోనని....

కాదు, ఎవరైనా చనిపోయినప్పుడు —

అనగా, మరణించడానికి భయమన్నమాట.

దానికి రెండు పద్ధతులున్నాయి. ఇంకా చాలా ఉన్నాయి కాని ఇవి ముఖ్యము. ఏపద్ధతిలోనైనా నిగూఢ చైతన్యాన్ని ఉపయోగించడం అవసరము. అది ప్రతి వారికీ సంభవించేదే అనుకోడం (దానిని ఆ స్థాయిలోనే తీసుకుందాము) ఒక పద్ధతి; అది ముందో వెనకో ప్రతివారికి సంభవించేదే, ఎప్పుడో ఒకప్పుడు తప్పదు. దానిని గురించి భయపడవలసిన అవసరంలేదు. అది సాధారణ విషయము. ఇటువంటి ఊహలకి ఇంకొకటి కూడా కలపవచ్చు. నీ అనుభవం ప్రకారం (నీదే కాకపోవచ్చు, సాముదాయిక మానవ అనుభవం), పరిస్థితులన్నీ ఒకటే అయినా ఒక సందర్భంలో మరణిస్తారు, మరొక సందర్భంలో మరణించరు. కారణమేమిటి? ఈ ఊహని ఇంకా పొడిగిస్తే, ఇది నీ చైతన్యానికి మించినదానిపై ఆధారపడుతుందని నీవే తెలుసుకుంటావు. చివరకు, ఎవరైనా మరణించవలసి వచ్చినప్పుడే మరణిస్తారు. మరణించవలసిన అగత్యం రానప్పుడు మరణించరు. నీవు మరణించడానికి తగినంత ప్రమాదావస్థలో ఉన్నప్పుడు కూడా మరణించవు. కాని, ఏవిధమైన ప్రమాద పరిస్థితులూ లేకపోయినప్పటికీ నీకాలికి తగిలిన చిన్నదెబ్బే నీకు మరణాన్ని కలిగించవచ్చు. ఆవిధంగా సూది గుచ్చుకొని మరణించినవారున్నారు. వారికి సమయ మాసన్నమైనదన్నమాట. అందుకని భయపడడంలో అర్థంలేదు. నీవు నీ చైతన్యస్థాయిని పెంచుకొని "అది తప్పనిసరి అని చెప్పారు కాబట్టి దానిని ఒప్పుకుంటాము. దానినిగురించి భయపడవలసిన పనిలేదు. అది రావలసినప్పుడు వస్తుంది. సమయం కానప్పుడు రాదు. అది తప్పనిసరి అయినప్పుడే వస్తుంది కాబట్టి భయపడకపోవడం

మంచిది. అంతేకాకుండా అది రావడమే సహజం కాబట్టి దానిని అంగీకరించాలి" అని చెప్పగల స్థాయిని చేరాలి. ఇది వాడుకలో నున్న పద్ధతి.

రెండవది ఇంతకంటే కష్టమే కాని నాఉద్దేశం ప్రకారం ఇదే మంచిది. అది "ఈ శరీరం నేను కాదు" అనుకోడమే. అంటే తాను అనేది ఏమిటని చైత్య పురుషుడు కనబడేవరకు వారిలో వారు వెతుక్కోవాలి. చైత్యపురుషుడు వారికి కనిపించగానే అమరత్వ భావన కలుగుతుంది. మనలోనుంచి బయటకు వెళ్ళేది గాని లోనికి వచ్చేదిగాని, కేవలం ఒక వీలు ప్రకారమే జరుగుతోంది, అని తెలు స్తుంది. "బూట్లజత పాతదై చిల్లులుపడి వదిలేయాల్సివస్తే వదిలేస్తాను, అందు కని ఏడవను: వాటిని అవతల పారేస్తాను." చైత్యపురుషుడు తన ప్రయోజనా న్ననుసరించి ఈ శరీరం ధరించాడు. దానితో అవసరం తీరిపోయినపుడు ఏదో ఒక కారణంతో దానిని వదిలిపెట్టేస్తాడు. అందుకోసం భయపడవలసిన అవసరం లేదు. అది సహజ కార్యము. ఏరకమైన చింతా లేకుండా ఆపని పూర్తికావాలి.

నీవు చైత్యపురుషుని సంస్పర్శలో నున్న క్షణంలో నీ ప్రయత్నం లేకుండా, సహజసిద్ధంగా ఈ భావం కలుగుతుంది. నీ బాహ్య జీవితానికి అతీతు డవై అమరత్వభావం పొందుతావు. నాకు ఇదే మంచి పద్ధతిగా తోస్తుంది. మొదటిది మేధతో కూడిన లౌకికమైన మార్గము. ఇది చాలా నిగూఢమైనటు వంటిది, నీకు చైత్యపురుషుని స్పర్శ ఎప్పుడు కలిగితే అప్పుడు ఈఅనుభవం పొంద గలవు. ఇది స్వయంచాలకంగా జరిగేది కాబట్టి చాలా ఉత్సాహకరమైన విషయము. చైత్యపురుషునితో సంస్పర్శ పొందినప్పుడు అమరత్వభావన, శాశ్వత భావన వస్తుంది. వచ్చేవీ, పోయేవీ కేవలం జీవితపు అసంకల్పిత చర్యలు. వాటికి ప్రాధాన్యం లేదు. ఇది చాలా మంచి మార్గము. మొదటిది కారాగృహంలో ఉన్న బందీ, ఆ కారాగృహాన్ని అంగీకరించడానికి మంచి కారణాలు వెతుక్కుంటు న్నట్లుగా ఉంటుంది. ఇది కారాగృహమేమీ లేని మానవుని వంటిది.

ఇక మూడవ పద్ధతిని గూడా తెలుసుకుందాము. దీనిని అవలంబించాలంటే ఒక మహాయోగి కావలసిందే. ఎందువల్లనంటే. మరణం అనివార్యం కాదని, అది ఇంతవరకూ జరుగుతున్న (ఇంతవరకూ అలాగే జరుగుతోంది) ఒక ఆక

ష్మిక సంఘటనే అయినప్పటికీ అనివార్యంకాదనీ, దానిని మనసంకల్పంతో జయిం చాలనీ అనుకోవాలి. కాని అన్ని ప్రకృతి ధర్మాలను, సామూహిక సూచనలను, భౌతికమైన అన్ని అలవాట్లను ఎదుర్కోడంలో ఘోరసంగ్రామం జరుపవలసి వస్తుంది. నేను చెప్పినట్లు, నీవు దేనికీ భయపడని మహాయోధుడవు కాకపోతే, ఆ సంఘర్షణ ప్రారంభించకపోవడమే మంచిది. పూర్తిగా అసహాయ శూరుడివైతే తప్ప అనూచానంగా వచ్చే అనేక విషయాలను అడుగడుగునా ఎదుర్కొని జయించ లేవు. అది ఏమంత తేలికగాదు. వ్యక్తిగా కూడా తనతో తానే సంఘర్షణ పడాలి (ఈవిషయం లోగడ ఒకసారి చెప్పాను)— ఎందువల్లనంటే, నీ భౌతిక చైతన్యం భౌతిక అమరత్వాన్ని ఒప్పుకొన్నస్థితిని పొందాలంటే, ప్రస్తుతం భౌతికచైతన్యానికి ప్రాతినిధ్యం వహిస్తున్న ప్రతివాటినుంచీ విముక్తిపొందాలి. అది ప్రతిక్షణం ఒక యుద్ధమే అవుతుంది. అన్ని భావాలను, ఇంద్రియ జ్ఞానాలను, ఆలోచనలను, ప్రతిక్రియలను, ఆకర్షణలను, వికర్షణలను, అన్ని వస్తువులను, భౌతిక జీవనంలోని అన్ని అంశాలనూ అధిగమించి, పరివర్తింప జేసి, వాటి అలవాట్లనుంచి విముక్తి నొందించాలి. ప్రతిక్షణం కొన్నివేలు, లక్షలు విరోధులతో చేయవలసిన యుద్ధము. నీవొక యోధుడవని అనుకోకపోతే ఈప్రయత్నం చేయవద్దు. ఈ మార్గమున....లోగడ చాలామంది నన్నీ ప్రశ్న అడిగారు: "ఇంతవరకూ ఎవరైనా కృతకృత్యులైనారా ? " నిజం చెప్పాలంటే, ఆవిధమైనవారిని నేను ఎవరినీ చూడలేదు. కాని అది సాధ్యమే. అయితే యింతవరకూ ఆవిధంగా ఎవరూ ముందుకు వచ్చి ప్రకటించలేదు.

మొదటివి రెండూ నీ అందుబాటులోనివి, నిరపాయమైనవి. ఇంకా సులభ మైనది ఒకటి చెపుతాను. అది లౌకిక సంబంధమైన ఒక చిన్న వ్యక్తిగత ప్రశ్న ననుసరించి ఉంటుంది....నీకు భయం కలిగినప్పుడు, నీ భయమే నీవు భయపడిన విషయాన్ని ఆహ్వానిస్తున్నదన్న సంగతి నీలో నీవు పరిశీలించుకొని నీకు చెప్పుకో వాలి. నీవు రోగాలను గురించి భయపడ్డావంటే ఆ భయమే రోగాన్ని ఆహ్వాని స్తుంది. ప్రమాదాలను గురించి భయపడితే అదే ప్రమాదాన్ని ఆహ్వానిస్తుంది. నీలోను, నీ చుట్టుపక్కల నీవు గమనిస్తే యిదిఎప్పుడూ జరిగే విషయమేనని తెలు సుకోగలవు. నీ కేమాత్రం లౌకిక జ్ఞానం ఉన్నా "దేని గురించైనా భయపడడం బుద్ధి తక్కువ. అలా భయపడడం దానిని దగ్గరకు రమ్మనడానికి సూచన

చేయడమే. నన్ను చంపడానికై ప్రయత్నిస్తున్న నా విరోధి దగ్గరకు వెళ్ళి: ఇదుగో, నీవు చంపాలనుకుంటున్నది నన్నే అని చెప్పాను కదా !'' అను కుంటావు. అందువల్ల, భయం చెడ్డది కాబట్టి భయపడము, నీ తర్కంతో నీవు దానిని పోగొట్టుకోలేకపోతే నీమీద నీకు అదుపులేదని అర్థము. అప్పుడు నిన్ను నీవు స్వాధీనంచేసుకోడానికి ప్రయత్నించాలి. అంతకు తప్ప ఏమీ లేదు.

భయం పోగొట్టుకోడానికి అనేక విధానాలున్నాయి. నిజానికి ఎవరికి ఏది మంచిదో ఆమార్గాన్ని ప్రతివారూ తెలుసుకుంటారు. కొంతమందితో నీవు ఊరికే: ''భయం నీకొక బలహీనత'' అని చెపితే చాలు, వారికి బలహీనత అంటే అసహ్యం కాబట్టి దానిని పోగొట్టుకోడానికి మార్గం వెతుక్కుంటారు. మిగిలినవారికి: ''భయం ప్రతికూల శక్తుల సూచన, నీవు ఆ ప్రతికూల శక్తులను పారద్రోలి భయం పోగొట్టుకో,'' అని చెపితే చాలా బాగా పనిచేస్తుంది. అది ఒక్కొక్కరికి ఒక్కొక్క రకము. భయం చాలా చెడ్డదని మొదట తెలుసు కోవాలి. అది ఒక ద్రావకము వంటిది. పడినచోట తినేసి తొలుచుకొని పోయే ఆమ్ల స్వభావం దానిది. భయపడే అవకాశం లేకుండా చేసుకోడం మొదటిమెట్టు. కొంతమంది అవసరమున్నా, లేకపోయినా భయాన్నిగూర్చి వ్యర్థంగా మాట్లాడు తారు. వారిని బాగు చేయలేము. వారు అతి సాధారణంగా, ''నాకెంత భయం వేసిందో చెప్పలేను'' అంటారు. అయితే ఏమిటి? అదేమీ గర్వించవలసిన విషయం కాదే. అటువంటివారిని ఏమీ చేయలేము.

ఏమైనప్పటికీ భయం మంచిది కాదు, అనుకూలమైనదీకాదు, ఉన్నతమైనదీ కాదు, కొద్దిగా ప్రబుద్ధమైన చైతన్యానికి యోగ్యమైనదీ కాదు, అని నీవు గుర్తించి నప్పుడు, దానితో పోరాటం ప్రారంభిస్తావు. ఒకరి మార్గం మరొకరికి సూటి గాదని నా అభిప్రాయము. ఎవరి మార్గాన్ని వారు తెలుసుకోవలసిందే. అంతే కాకుండా, భయం చాలా విపరీతమైన అంటుస్వభావం కలది. ఘోరమైన అంటు రోగాల కంటే కూడా ఘోరమైనది. భయవాతావరణాన్ని నీవొక్కసారి పీలిస్తే చాలు, అది ఎందుకో ఏమిటో తెలియకుండానే నీకు భయం వేస్తుంది. ఒక ప్రమాదం జరిగేటప్పుడు ఏర్పడే భీతి మరేమీకాదు, ప్రతివారి చుట్టూ విస్తరిస్తున్న భయంకర వాతావరణమే. దానిని నివారించవచ్చు. అటువంటి సందర్భాలు అనే

కము. అందులో కొంతమంది ఆ సూచనను అంగీకరించక, దానిని ఖండించే సూచనను ప్రతిపాదించి సామూహిక భీతిని నివారించారు. గుప్తవిద్య తెలిసిన వారు భయం కలిగినప్పుడు దైవాన్ని స్మరించి ఆయన చేతులలోనో, పాదాలపైనో నక్కి బాహ్యంగా, అంతరంగికంగా అంతటా జరుగబోయేదాని బాధ్యతను ఆయన పైన వేయాలి. వెంటనే భయం పోతుంది. అది అన్నిటికంటే తేలిక. కాని ప్రతివారికీ గుప్తవిద్యానుగ్రహం లభించదు కదా!

మనలోనున్న నిద్రాణమైన శక్తులను ఒక్కొక్క ప్పుడు మనం తెలుసుకోలేము కదా. ఏ పనైనా చేయాలన్నప్పుడు ఆ పనిచేసే సామర్థ్యం ఉందో లేదో తెలుసుకోవాలంటే ఏమి చేయాలి?

ఆపని చేసే సామర్థ్యం ఉందో లేదో ఎలా తెలుసుకుంటారు? ప్రయత్నం చేయాలి. అదే అన్నిట్లోకీ మంచిది. నీవు వెంటనే తెలుసుకోలేకపోతే ఓరిమి వహించు. ఏదో ఒకటి చేయాలని నీలో బలవత్తరమైన ప్రేరణ కలిగినప్పుడు ఆపనితో నీకు సంబంధం ఉన్నదనీ, అది చేసే సామర్థ్యం ఉన్నదనీ తెలుసుకోవాలి. కాని, ఒక్కొక్కసారి ఈ శక్తులు ఎంతో అడుగున దాగి ఉండవచ్చు, వానిని వెలికి తీసుకొనిరావడానికి నీవు ఎంతో పాటుపడాలి. అందువల్ల మొదటిసారి నీవు కృతకృత్యుడవు కాకపోతే విసుగు చెందకుండా ఓరిమితో మళ్ళీమళ్ళీ ప్రయత్నించు.

21 అక్టోబరు 1953

ఒక గొప్ప కళాకారుడు ఏకాగ్రతతో, తనలోనే దైవాన్ని సందర్శించినప్పుడు దైవాన్ని వ్యక్తం చేయ డానికి చిత్రకళను ఉపయోగించవచ్చా?

తప్పకుండా ఉపయోగించ వచ్చును. కళాకారుడని నీవు ఎవరిని అంటు న్నావు? అది మొదట చెప్పు. ఒక చిత్రకారుడినా? ఒక శిల్పినా? ఇంకా

ఎవరిని? కళాకారుడంటే ఏమని అర్థం చెపుతావు? కళాకారుడంటే నీ మనస్సులో ఎవరిని ఊహిస్తున్నావు? చిత్రకారుడనా, శిల్పి అనా?

బొమ్మలు గీయగలిగినవారు, ఎవరైనా సరే

అవును. ఒక చిత్రకారుడైనా, ఒక 'డ్రాఫ్ట్స్‌మన్' అయినా ఒకటే, చిత్రకారుడైనా, శిల్పి అయినా ఒకటే. గాయకుడు, రచయిత కాదన్నమాట. వారెవరు అనే దాన్నిబట్టి సమాధానం మారుతుంది కనుక నేను అడుగుతున్నాను.

నేను అనుకున్నది డ్రాఫ్ట్స్‌మన్‌ను గురించి.

ఉదాహరణకు, 'మధ్యయుగం'లో గాజుకిటికీలకు రంగులు వేయడం, రంగు గాజు అద్దాలు అనేక డిజైన్‌లలో అమర్చడం (ప్రస్తుతం కూడా అలాంటి పనులు చేసేవారున్నారు) మొదలైన పనులు చేసేవారు ఉండేవారు. పెద్దపెద్ద క్రైస్తవ గుళ్ళలోను, చర్చిలలోను మామూలు కిటికీలకు బదులు రంగురంగుల గాజు అద్దాలతో డిజైన్స్ అమర్చేవారు. ఈ అద్దాల పారదర్శకత్వంవల్ల బయటి సూర్య రశ్మి లోపలికి స్వయంప్రకాశంగా కనపడేది. వారు ప్రత్యేక నమూనాలతోను, బొమ్మలతోను దానిని కళాత్మకంగా చేసేవారు. అది అద్భుతంగా కనిపించేది. ఉదాహరణకు, వారు ఒక స్వాములవారి జీవితాన్ని గాని, క్రైస్తు జీవితంలోని దృశ్యాలనుగాని గాజుపలకలతో అమర్చి కళాత్మకంగా వ్యక్తంచేసేవారు. ఇప్పుడు అడుగు నీ ప్రశ్న ఏదో?

అటువంటివారు దైవాన్ని వ్యక్తం చేయగలరా?

అటువంటివారు కళతో దైవాన్ని వ్యక్తంచేయగలరా అనేనా ప్రశ్న? దైవాన్ని దేనిలో వ్యక్తంచేయగలరు? దైవాన్ని వ్యక్తం చేయడమంటే ఏవిధంగానని నీ ఉద్దేశ్యం? మాటలలోనా? బోధనలోనా? చివరకు పుస్తకాలలోనా? ఇంకే రకంగా? భౌతిక ప్రపంచంలో దైవాన్ని పూర్తిగా ఎవరు వ్యక్తం చేశారు? భౌతిక ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందినప్పుడే

దైవాన్ని పరిశుద్ధంగా వ్యక్తం చేయడానికి వీలవుతుంది. కళకుగాని మరి ఏ యితర కార్యాచరణకుగాని తేడా నాకు కన్పించడం లేదు. అది కొంతమటుకు ఏకమవగలిగి (పూర్తిగా కాకపోయినా), రూపాన్ని యివ్వడానికి ఒక మార్గమవుతుంది. అది ఏ మార్గమైతేనేమి? దైవాన్ని మాటలతోను, రంగులతోను, శబ్దాలతోను, రూపాలతోను కూడా వ్యక్తం చేయవచ్చు. కాని ఈ విధానాలలో ఏదీ పరిపూర్ణం కాదు, ఎందువల్లనంటే ఆ కలయిక పరిపూర్ణం కాదు. అయితే, ఈ ప్రపంచం పరివర్తన చెందినప్పుడు, దైవం విరూపం చెందకుండా తనంతట తానే వ్యక్తం కా గలడు. అప్పుడు పరిపూర్ణమైన వ్యక్తీకరణ జరుగుతుంది. కాని ప్రస్తుతం వ్యక్తీకరణలన్నీ ఒకే స్థాయికి చెందినవి. అందులో ఏ ఒక్కటీ మరొకదానికన్నా మెరుగుగా కనబడదు. అందులో కొంత మానవ వ్యక్తిత్వం, అంటే రూపం దాల్చినజీవి, వ్యక్తం కావలసినదానిని విరూపం చేసి, పరిమితం చేస్తుంది.

క్రియాత్మక చర్యలలో కళ ఒకటి. అంతా ఒకటే అయినప్పుడు ఈ రకమైన తేడా ఎందుకు? నేను చెప్పింది అర్థమైందా?

**దైవంతో ఏకత్వాన్ని పొందినపుడు, వారు దైవానికి ఆపాదించిన రూపంలోనే దైవాన్ని చూస్తారా?**

అవును. మానవిక రూపకల్పనలన్ను పూర్తిగా వదుల్చుకుంటే తప్ప, కేవలం వస్తువిషయంగా దైవాన్ని చూడడం అరుదు. దైవంతో సంబంధం వారు ఏవిధంగా ఉండాలని కోరుకుంటారో దానిపై ఆధారపడుతుందని శ్రీఅరవిందులు చెప్పారు. ప్రతివారూ ఒక రకమైన స్వరూప సంబంధాన్ని ఆకాంక్షిస్తారు. వారికి ఆ సంబంధం ఆ రూపంలో ఏర్పడుతుంది.

**అయితే నిజానికి అది ఏమిటి ?**

రూపం లేకుండా పూర్తిగా తప్పించుకునేది, లేదా అన్ని రూపాలను పొంద గలిగినది. దైవం వ్యక్తం కావడానికి మితంలేదు. రూపంలేకుండానూ వ్యక్తం

కాగలడు: అన్నిరూపాలలోనూ వ్యక్తం కాగలడు. వారివారి ఆవశ్యకతల ననుస రించి దైవం ప్రతివారిలోనూ వ్యక్తం కాగలడు. ఎందువల్లనంటే దైవంతో పూర్తిగా ఏకత్వం పొందడానికి తగినంత 'అహంరహితం' కావడంలో కృతకృత్యు లయినప్పటికీ, ఆక్షణంలో దైవాన్ని వ్యక్తం చేయలేరు. వ్యక్తం చేయగలస్థితి లోకి రాగానే పరిమితమైన వ్యక్తిత్వం జోక్యం కల్పించుకొని అడ్డు వస్తుంది. ఆ అనుభవం దీనిని దాటి రావాలి. అనుభవమయే క్షణం ఒకటి. దానిని వ్యక్తీ కరించే క్షణం మరొకటి. అది సమకాలికంగా కూడా జరుగవచ్చు. అనుభవం పొందుతున్నప్పుడే, ఏదో ఒక రూపంలో ఆ అనుభూతిని వ్యక్తం చేసేవారున్నారు. అప్పుడు అనుభూతి, వ్యక్తీకరణ, రెండూ ఒకే సమయంలో జరిగినట్లే. అయి నప్పటికీ అనుభవం పొందిన స్వచ్ఛత, వ్యక్తం చేసేస్థితి. రెండూ రెండు భిన్నా వస్థలేకదా! ఈ తేడానుబట్టి వారే దైవంగా అయితే తప్ప దైవాన్ని తెలుసు కోడం అసాధ్యమని చెప్పవచ్చు. దైవాన్ని వ్యక్తం చేయడానికి మాత్రం, వ్యక్తీకరణం తీరు ఏదైనప్పటికి స్థాయిలు మారుతాయి.

పూర్తి అనుభవం సాధించని ఏకైక భూమిక ఒకటి మిగిలిపోయింది. అది కేవలం భౌతిక పదార్థయుతమైన భూమిక. దేహంలోకి దివ్యచైతన్యం నిజంగా దిగివచ్చినప్పుడు, పరిపూర్ణ వ్యక్తీకరణకు అవకాశం ఉండడానికి ఆ పరి వర్తనం సరిపోదనే అనుమానం రావచ్చు.... కాని అది యింకా రావాలి కదా! ఇంతవరకు ఎవరూ చేయలేదు. అలా చేయనంతవరకూ ఎవరూ తెలుసుకోలేరు. ఉన్నత మానస వ్యక్తీకరణంలో కూడ భౌతిక దేహం మూలకంగా జోక్యం కలుగచేసుకునేది ఒకటి ఉంటుంది కదా. ఉద్బోధన కాగితం మీద పెట్టేలోపల దానిని మార్చడానికి అవకాశమున్న అనేక భౌతిక ప్రకంపనలను దాటవలసివస్తుంది కదా. అయితే ఈ భౌతిక ప్రకంపనలు కూడా పరివర్తనం పొందితే, అప్పుడు బాహ్యంగా వ్యక్తమైనది అంతర్గతంగా పొందిన దానితో పూర్తిగా ఏకీభవించ వచ్చు. అంటే దైహిక వ్యక్తీకరణమే దివ్యత్వానికి వ్యక్తీకరణమౌతుంది.

అంతేనా?

మహాభారతం, రామాయణాలలోని సంఘటనలు నిజం కావా ?

ఏ అర్థంలో నిజం ? ఆరకంగా భూమిమీద వాస్తవంగా జరిగిందా అనా ? హనుమంతుడు, కోతులు మొదలైనవన్నీ అనా ?.... నేను చెప్పలేను. అది కేవలం సాంకేతికమని నా అభిప్రాయము. ఉదాహరణకు, హనుమంతుడు పరిణామక్రమం లోని మానవుడని, రాముడు ఉన్నతస్థాయిలనుంచి దిగివచ్చిన అంతర్వనలము (involution) లోని దివ్యమానవుడని చెప్పవచ్చు.

అంతర్వనలపు జీవి పరిణామాత్మక జీవి అంటే అర్థం ఏమిటి ?

పరిణామాత్మక జీవి అంటే జంతుకోటి పరిణామ క్రమంలో ఏర్పడినది. అంతర్వనలపు జీవి అంటే, భూమి పుట్టినప్పుడు ఉన్నత లోకాలనుంచి వచ్చి భూమిపై భౌతికంగా అభివ్యక్తమైన జీవి. క్రిందనుంచి కాకుండా పైనుంచి దిగివచ్చిన జీవి అన్నమాట. పరిణామాత్మక జీవిలో కేంద్రస్థమైన వెలుగు చైత్య పురుషునికి మూలం; దానినుంచే చైత్యపురుషతత్వం అభివృద్ధి చెందుతుంది. చైత్యపురుషుడు పూర్తిగా ఏర్పడిన తర్వాత, ఉన్నత లోకాలనుంచి దిగి, దానిలో అవతరించ గలిగిన జీవితో సమైక్యం పొందగల క్షణం ఒకటి వస్తుంది. అందు వల్ల చైత్యపురుషునిలోకి ఉన్నతలోకాలనుంచి దిగిన జీవిని అంతర్వనలపు జీవి అంటారు. ఈ జీవి అధిమనస్సు స్థాయినుంచి కాని మరొక స్థాయినుంచి గాని దిగివస్తుంది. అంతే !

అనటోల్ ఫ్రాన్స్ "జాంగ్లార్" కళాకారుడేనా?

నాకు తెలియదు. కళాకారుడంటే మీరు చేసిన నిర్వచనంపై ఆధార పడుతుంది.

నన్నడిగితే, కళాత్మకమైనవాటిని తయారుచేసేవారంతా కళాకారులే. ఏమైనా ఎలా ఉపయోగిస్తారో అనేదానినిబట్టి దానికి అర్థం వస్తుంది. ఉదాహరణకు, జపానులో ప్రకృతి దృశ్యానికి మనోజ్ఞతను కల్పించేటట్లుగా చెట్ల ఆకృతిని మార్చే తోటమాలులున్నారు. అన్నిరకాలుగా కత్తిరించి వాటి రూపాలు మారుస్తారు. ప్రకృతి దృశ్యం రమణీయంగా కనపడడానికి అనువుగా ప్రతివాటికి ప్రత్యేక ఆకృతి వచ్చేటట్లుగా చేస్తారు. తోటలో చెట్టు ఎక్కడ అవసరమో, అక్కడే పాతుతారు. మొత్తం పరిసరాల రామణీయకతకు దోహదం చేసేటట్లుగా దానిని పెంచుతారు. ఇలా అద్భుతాలు చేయగలుగుతారు. తోటను ఫోటోతీస్తే చాలా బాగుంటుంది. నేను ఆ తోటమాలిని కళాకారుడే అంటాను. ఇతరులు అతనిని తోటమాలి అనవచ్చు కాని నిజానికి అతను కళాకారుడు. అన్ని రూపాలలోను సామరస్యభావాన్ని చూడగల జ్ఞానం, అన్ని రూపాలలోని పరస్పర సామరస్యం కనిపెట్టగల జ్ఞానం ఉన్నవారంతా తప్పనిసరిగా కళాకారులే, వారు తయారు చేసింధేదైనా కావచ్చు.

రాముడు, హనుమంతుడు — వీరిని గూర్చి
చెప్పడం మీరు పూర్తిచేయలేదు (నవ్వులు)

పూర్తి చేయలేదా? అవును. అంతర్వ్యలనపు జీవికి, పరిణామాత్మకపు జీవికి తేడా ఏమిటి అని మీరు అడిగారు. దానికి అది సరిపోతుంది. కథకు కీలకం తెలుసుకుంటే సరిపోతుంది. రామాయణానికి ప్రామాణిక గ్రంథం ఒకటే ఉందో లేక చాలా ఉన్నాయో నాకు తెలియదు. నేను వేరు వేరు వాదాలు విన్నాను. అన్నింటికి మించి ముఖ్యంగా రావణుడి ఓటమి, మరణం, సీతాదేవి భూప్రవేశాలను గురించి అనేక వాదాలున్నాయి. వీటిని గురించి వేరువేరు భావార్థాలతో పండితులు చెప్పగా విన్నాను. పూర్వాచార పరాయణులు ఒకరకంగా చెపితే పూర్వాచార పరాయణులు కానివారు వేరే విధంగా చెప్పారు. శాస్త్రి సమ్మతం గానే అనేక గ్రంథాలు ఉన్నాయో లేక ఎవరి ప్రకారం వారు వ్యాఖ్యానించారో తెలియదు.

(నళిని) అనేక గ్రంథాలున్నాయి, ఉత్తర దేశంలో ఒకటి, దక్షిణాదిన మరొకటి.

బౌద్ధుల మాదిరిగానా! ఉత్తరాది దక్షిణాది ప్రజలకు విభిన్నరకాల ఊహలు. సాధారణంగా దక్షిణాది ప్రజలు చాలా గట్టివారు. నాకంతగా తెలియదు కాని దక్షిణాది బౌద్ధులు మాత్రం చాలా కఠినులు. గ్రంథం చదివి అర్థం చేసుకోడంలో ఏమాత్రం నమ్యతనూ ఒప్పుకోరు. దేవుళ్ళనుగురించి ఏరకమైన అభిప్రాయాలను కూడా ఒప్పుకోక త్రోసిపుచ్చింది కఠోరనిష్ఠను పాటించే దక్షిణాది బౌద్ధులు. దీనికి భిన్నంగా ఉత్తరాదిన వ్యాపించిన బౌద్ధమతం అంతా దేవతలతో నిండింది. వీరు వాస్తవంగా పూర్వపు బుద్ధులు. అయినప్పటికీ తరువాత దేవతలుగా మారారు. అటువంటి పరిస్థితులల్లోనే యిది చైనాకు, అక్కడ నుంచి జపానుకు వ్యాపించింది. జపానులోని బౌద్ధాలయం ప్రవేశిస్తే, మధ్యగా ఉన్న బుద్ధదేవుని విగ్రహం చుట్టూ వెయ్యికి పైగా బుద్ధ విగ్రహాలను చూడవచ్చు. దేవాలయంలో వెనుకగోడ పూర్తిగా ప్రతిమలతో నిండి ఉంటుంది. వాటిలో చిన్నవి, పెద్దవి, సన్నవి, లావువి ఆడ, మొగ ప్రతిమలు చాలా ఉన్నాయి. అవన్నీ దేవతలు. వీటికి క్రిందుగా అన్ని రూపాలతో, జంతువులతో సహా చిన్న చిన్న విగ్రహాలు బుద్ధ భగవానుని ఆరాధన చేస్తున్నట్లు కనపడతాయి. నిజానికి అది విగ్రహాల వెర్రి. దక్షిణాదిన వ్యాపించిన బౌద్ధమతానికి ప్రొటెస్టెంటులకున్న నిష్ఠ ఉన్నది. విగ్రహాలు ఉండకూడదు. దివ్యచైతన్యం అనేది లేదు. అది కాకుండా, కోరికలతో నిండిన ఈప్రపంచంలోకి మానవులు కోరికల ద్వారా వస్తారు; కోరికలు పోగొట్టుకోడం ద్వారా ఈప్రపంచాన్ని, ఈ సృష్టిని వదిలి నిర్వాణానికి తిరిగి వెళ్ళుతారు. శూన్యం కూడా ఒక విధంగా మూర్తము (concrete). బౌద్ధమతం ప్రకారం సృష్టికి కర్తలేదు. దక్షిణాది బౌద్ధమతం 'పాళి' భాషలోను, ఉత్తరాది బౌద్ధమతం సంస్కృతంలోను వ్రాసి ఉంది. అలాగే టిబెట్టులో టిబెట్టు భాషలోను, చైనా బౌద్ధం చైనాభాషలోను, జపాన్ బౌద్ధం జపాన్ భాషలోను వ్రాశారు. ఒక భాషలో వ్రాసింది వేరొకభాషలో వ్రాసినదానికన్నా భిన్నము. అలాగే రామాయణానికికూడా బహుశా అనేక ప్రామాణిక గ్రంథాలు ఉండవచ్చు. మహాభారతానికి యింకా ఎక్కువ.... అది చాలా విపరీతము.

(నళిని) రామాయణానికి కూడానూ,

అంటే అవన్నీ తరువాత వచ్చినవి.

తల్లీ ! మహాభారతం అసలు జరిగిందా ?

కొంతవరకు జరిగిందేమో! వీటన్నిటిలోనూ కొంత వాస్తవికత లేకపోలేదు, కొంత అల్లిన కథ. ఇవి రెండూ భిన్నమైన విషయాలు. అయితే అన్ని మతాలలోనూ, అన్ని చోట్లా జరిగేది ఇంతే. అసలు కొంత ఉంటుంది. దానిని పూర్తిగా యింకో రకంగా మారుస్తారు. చరిత్రకు, ఇతిహాసాలకు గల తేడా అదే. కాని చరిత్రే ఒక ఇతిహాసము.

ఒకేకథ అనేక సార్లు పునశ్చరణ చేస్తే రూపు మారిపోతుంది. కొన్ని వేల సంవత్సరాలు జరిగితే అది పూర్తిగా విరూపం చెందుతుంది. మూలగ్రంథాలు ఏవి? మహాభారతానికి ఆది గ్రంథాలుగా గుర్తించినవి ఏవి? చాలాకాలం ముఖస్థంగా చెప్పుకున్నారు కదా! దానినిబట్టి అది ఎలా మారిందో ఊహించ వచ్చు. ఇవన్నీ చాలా కాలంగా ఉన్న మౌఖిక సంప్రదాయాలు. అయితే ప్రథమమూలం ఎవరు వ్రాశారు?

(నళిని) వ్యాసుడు

ఆహాఁ!

(నళిని) ప్రారంభంలో అది 36,000 శ్లోకాలు, ప్రస్తుతం ఒకటి రెండు లక్షల దాకా ఉన్నాయి.

ఓ అలాగా! అంత పెరిగాయా? 36,000 నుంచి అంత ఎక్కువైనాయా. అయితే గీతలో కూడా అలాగే అనేక ప్రతులు ఉన్నాయా?

(నళిని) లేవు.

గీత మహాభారతంలో భాగమే కదా!

(నళిని) అవును.

రామాయణమే అధునాతనమైనదా?

(నళిని) కాదు.

అయితే సమకాలికమా? గామాయణానికి గ్రంథకర్త ఎవరో తెలుసా?

(నళిని) వాల్మీకి.

సరే, అది ఎక్కువ మారలేదు కదా!

(నళిని) మహాభారతం మారినంతగా మారలేదు.

కాని భేధాభిప్రాయాలు ఉన్నాయి. ఒక సంప్రదాయంలో రావణాసురుడు కావాలని మరణించాడని, తన యిచ్ఛానుసారం అసురపాత్రను కోరుకొని, దైవానికి దూరమైన తన ఉనికిని తగ్గించుకోడం కోసమని మరణం కోరుకున్నాడనీ చెపుతారు. ఆయన రాములవారిలో కలిసిపోయినాడనీ, ఆవిధంగా శీఘ్రంగా దైవంతో ఐక్యం గావడంలో కృతకృత్యుడయినాడనీ అంటారు. ఇది పురాతన వాదమేనా?

(నళిని) అన్నీ పురాతనమైనవే.

అది పురాతనమైనదే. అసురులు ఆవిధంగా పుట్టాలని కోరుకోడానికి కారణం దైవం వారిని తొందరగా విలీనంచేసుకుంటాడని. ఆవిధంగాచేస్తే దేవతలు, ఋషులు మాదిరి చుట్టుదారిలో కష్టపడకుండ దైవం దగ్గరకు అతి శీఘ్రంగా చేరు

కాని త్వరగా ఆయనలో ఐక్యం చెందవచ్చునని వారి ఉద్దేశ్యము. అసురులు దుష్టులుగా ఉండాలని కోరుకోడంలో కూడా వారు అల్లాఉంటే దైవం వారిని త్వరగా నాశనం చేస్తాడని. ఆవిధంగా వేగంగా ఆయనను చేరుకోవచ్చునని భావించారన్న మాట. ఇదంతా ఒక ఊహ. (నవ్వులు)

ఇదే విధంగా నేను సీతాదేవి నిర్గమనాన్ని గురించి కూడా రెండురకాల వాదాలు విన్నాను. (మొదటిది విశాల దృక్పథంతో చెప్పినది. రెండవది బహు పూర్వోత్తరమైనది): సీతాదేవి తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకోడానికని తనంతట తానే భూప్రవేశం చేసిందని ఒక వాదము. ఇక పూర్వోత్తర వాదం ఏమిటంటే, ఆమె నిర్దోషి కాకపోవడం వల్ల భూమాత ఆమెను కబళించిందని. (నవ్వులు)

అప్పుడు ఆకాశంనుంచి పుష్పవర్షం కురిసింది కదా ?*

ఆహా! అది యింకో కథ.... నేను పండిట్ అనే ఆయనద్వారా రామాయణం విన్నాను. ఆ పండిట్ ఒక పండితుని కుమారుడు. ఆయన న్యాయ శాస్త్రం చదవడంకోసమై పారిస్ వచ్చారు. ఆయన చాలా సనాతనాచార పరాయణుడు. పారిస్‌కు వచ్చినప్పటికీ ఆయన అలాగే ప్రవర్తించడం చాలా విచిత్రంగా కనిపించేది. ఆయన దగ్గర ఇంగ్లీషు భాషలో బొమ్మల రామాయణ ప్రతి ఒకటి ఉండేది. ఆయన ఆ పుస్తకం చూపించి నాకు కథ చెప్పి, చివరకు పుష్పవృష్టి సంగతి చెప్పారు. అప్పుడు నేను: "దాని అర్థం ఏమిటి?" అని అడిగాను. దానికి ఆయన, "చూడండి, భారత మహిళ పరపురుషుని గృహంలో కొద్ది గంటలు గడిపితేనే అపవిత్రమౌతుంది" అని చెప్పారు. అబ్బ! దారుణము. అయితే అపవిత్రురాలు కాబట్టి భూమాత కబళించింది, ఆయన నాకు యిప్పటికీ బాగా గుర్తున్నాడు. అతనిది బొంబాయి దగ్గర పల్లెటూరు. గుజరాతీభాష మాట్లాడేవాడు,

---

* సీతాదేవి అదృశ్యమైన తర్వాత ఆమె నిర్దోషిత్వాన్ని నిరూపించడానికై ఆకాశాన్నుంచి పుష్పవృష్టి కురిసిందని మూలగ్రంథంలో ఉంది.

రెండవవాదం జపానులో ఒక శాస్త్రిగారి ద్వారా విన్నాను. ఆయన కూడా పండితుడే. అలా రెండు వాదాలు వినడం తటస్థించింది.

మీ రచనలలో ఒకచోట సౌందర్యం సార్వత్రిక మని, దానిని గుర్తించాలంటే మనం కూడా విశ్వ జనీనంగా ఉండాలని వ్రాశారు.

అవును. దానిని గుర్తించడానికి విశ్వచైతన్యం కావాలని చెప్పాను. ఉదాహరణకు, నీ చైతన్యం ఒక ప్రదేశానికే పరిమితమైతే అది జాతీయ చైతన్యం అవుతుంది. (ఏదో ఒక దేశపు చైతన్యం.) ఒక దేశానికి సుందరమైనది మరొక దేశం దృష్టిలో కాదు. సౌందర్యభావమే వేరుగా ఉంటుంది. ఉదాహరణకు, (నేను ఒక కథచెప్పి మిమ్మల్ని నవ్వించగలను) డహోమియా రాజ్యపు యువరాజు పారిస్‌లో నాకు తెలుసు (అతను నీగ్రోజాతివాడు) అతను న్యాయ శాస్త్రం చదవడానికి పారిస్ వచ్చాడు. అతను ఫ్రెంచి దేశస్థుని మాదిరిగానే ఫ్రెంచి మాట్లాడినప్పటికీ నీగ్రోగానే నిలిచిపోయాడు. అర్థమైంది కదా? అతను విద్యార్థిగాఉన్న రోజులలోని కథలన్నీ మాకు చెప్పేవాడు. ఒకరోజున "నీవు పెండ్లి చేసుకుంటే ఎవరిని చేసుకుంటావు?" అని ఒకరు అతనిని ప్రశ్నించారు. "ఆహా! మాదేశపు అమ్మాయినే పెండ్లి చేసుకుంటాను. అందమైన వారు వారే కదా!" (నవ్వులు) నీగ్రోలు కానివారికి నీగ్రో సౌందర్యం అర్థం చేసుకోడం కొంచెం కష్టమే. అయినప్పటికీ ఈ సందర్భంలో అది స్వతస్సిద్ధంగా వచ్చిందే. ఇంకో విధంగా అనుకోడం అసంభవమని అతని నమ్మిక. ("సౌందర్యం అంటే నా దేశపు స్త్రీలదే") ఇదే అంతటా వర్తిస్తుంది.

ఏదోకొంత కళాభిరుచి పెంపొందించుకున్నవారు, విస్తృతంగా ప్రయాణాలు చేసి, అనేకం చూసి, చైతన్యాన్ని వికసింపజేసుకున్నవారు మాత్రం ప్రాంతీయాభిమానాన్ని కొంత తగ్గించుకుంటారు. స్వజాతి అభిరుచులనుంచి ఎవరినైనా బయటకు లాగడం చాలా కష్టము. నేను యిక్కడ ఒక దేశాన్ని గురించి మాత్రమే కాదు, ఒక జాతిని గురించి మాట్లాడుతున్నాను. అది చాలా కష్టము. అది చాలా అడుగున ఉపచేతనలో దాక్కొని నీకు తెలియకుండానే

సహజంగా, స్వతస్సిద్ధంగా పైకి వస్తుంది. ఈ విషయమే చూడండి; మిగిలిన జాతులలోని స్త్రీలకంటే నీ జాతిస్త్రీలే నీకు అందంగా కనిపిస్తారు. స్వతస్సిద్ధమైన అభిరుచి. అందువల్ల దానిని అధిగమించాలి. అప్పటికీ వారి కుటుంబానికి, కులానికి చెందినవన్నీ అసహ్యంగా ఉన్నాయని, మంచివి కాదని చెప్పేవారి గురించి నేను మాట్లాడడం లేదు. అసలు వీరిని గురించి మాట్లాడడమే లేదు. ఒకదేశం మిగిలిన దేశాలకంటే ఎక్కువ బాగుందనే వారిని గురించికూడా నేను చెప్పడం లేదు. అయినప్పటికీ ఈ జనం సాధారణమైన ఆలోచనలను మించిన వారు. నేను జాతిని గురించే ప్రత్యేకంగా చెప్పడం లేదు. అందువల్ల సౌందర్యాన్ని అన్నిరకాల జాతి అభిరుచులను వదిలిపెట్టి, కేవలం సౌందర్యభానంతోనే చూడాలంటే నీకు విశ్వజనీన చైతన్యం అవసరము. లేకపోతే సాధ్యం కాదు, ఎందువల్లనంటే, ఇష్టానిష్టాలు ఎప్పుడూ అడ్డువస్తాయి. ఆ అభిరుచులు క్రియాత్మకంగాను, చైతన్యాత్మకంగాను లేకపోయినా, అవి స్వతస్సిద్ధంగా, సహజాతంగా పైకి వస్తాయి. అందువల్ల అసలైన సౌందర్యం తెలుసుకోవాలంటే ఆకృతికి అతీతమైన స్థాయికి ఉద్గమించాలి. ఆకృతికి అతీతంగా ఉన్న సౌందర్యాన్ని నీవు తెలుసుకున్న తర్వాత ఏ రూపంలో ఉన్నప్పటికీ నిర్లిప్త వైఖరితో దానిని చూడగలవు. అప్పుడు అది చాలా ఆసక్తిదాయకంగా ఉంటుంది.

28 అక్టోబరు 1953

నిజమైన కళ సంపూర్ణమైనది. అది జీవితంలో ఒక విడదీయరాని భాగము. ఈ విధంగా సన్నిహితమైన సంపూర్ణత్వం పురాతన గ్రీకు దేశంలోను, ఈజిప్టుదేశంలోను చూడవచ్చు: అక్కడ శిల్పాలు, విగ్రహాలు మొదలైన కళాత్మక వస్తువులన్నీ వాస్తు ప్రణాళికలోనే ఒక భాగంగా ఏర్పాటై ఉంటాయి. ప్రతి చిన్న అంశం మొత్తంలో ఒక భాగమే అవుతుంది. ప్రయోజనాత్మకత, ఆచరణీయతల దృష్టి

గల ఆధునికతత్వం ప్రబలమవక ముందు జపాన్‌లో కూడా యిదే విధంగా ఉండేది: జపనీయుల యిల్లు ఒక అద్భుత కళానిలయము; ఏది ఎక్కడ బాగుం టుందో దానిని అక్కడ పెట్టి దేనికీ స్థానవైకల్యం లేకుండా, ఎక్కువ తక్కువలు లేకుండా అమరు స్తారు. ప్రతిదానిని ఉండవలసిన తీరులో ఉంచి, చుట్టుపక్కల ప్రకృతితో మేళవించేటట్లు అద్భుతంగా గృహాలంకరణ చేస్తారు. భారతదేశంలో కూడా చిత్రకళ, శిల్పకళ, వాస్తుకళలు కలిసి ఒకే పరిపూర్ణ సౌందర్యంగా, భగవంతుని ఆరాధనకు ఏకైక చేల వంగా ఉండేవి.

ప్రశ్నోత్తరములు 1929 (28 జూలై)

తల్లీ, "నిజమైన కళ పరిపూర్ణమైనది. అన్నిం టినీ ఏకముఖం చేస్తుంది. అది జీవితంతో పాటే ఒక భాగము." అని మీరు చెప్పింది నా కర్థం కాలేదు.

భౌతిక ప్రపంచంలో సౌందర్య వ్యక్తీకరణమే నిజమైన కళ అని కదా నేను చెప్పింది. ఆధ్యాత్మికంగా మారిన ప్రపంచంలో, అంటే మానవుడు దివ్య సత్యాన్ని అభివ్యక్తం చేస్తున్న ప్రపంచంలో కళ జీవితంలోని దివ్యసౌందర్యాన్ని ఆవిష్కరించేదిగాను, ప్రబోధం చేసేదిగాను ఉపయోగపడాలి. కళాకారుడు భగ వంతునితో సంసర్గం పొందగలిగి పదార్థంలో దివ్యసౌందర్యం అభివ్యక్తమవడానికి ఏవ రూపాలు ఉపయోగించాలో ఉద్బోధన ద్వారా గ్రహించుకోగలగాలి. అలా చేసినట్లయితే కళ సౌందర్యసిద్ధికి సాధనంగా ఉపయోగపడుతుంది. ఇంకా

సౌందర్యం అంటే ఎలా ఉండాలో బోధించేటట్లుకూడా కావచ్చు. పెద్దలు, పిన్నలు అందరి అభిరుచులను పెంపొందించే అంశముగా ఏర్పడాలి; బోధనలో భాగంగా కళ పెంపొందాలి. ఈ విధమైన దివ్య సౌందర్య బోధయే, అంటే అసలైన సౌందర్యమే దివ్యసత్యాన్ని వెల్లడించగలదు. దీనికీ, ప్రస్తుత చిత్రకళా రీతులకూ సంబంధమే లేదు.

### ఈనాటి చిత్రకారులు లియోనార్డో డావిన్సి రోజు లలోని చిత్రకారులంత మిన్నగా లేరు. ఎందువల్ల?

మానవ పరిణామము ఉపావర్తులంగా (Spiral) పురోగమిస్తుంది గదా! ఈ విషయము నేనొకసారి చెప్పాను.* గత శతాబ్ది ప్రారంభమునుంచి దాని మధ్యకాలము వరకు కళ అనేది పూర్తిగా ధనార్జనకోసం అజ్ఞానాంధకారాలలో పడిపోయింది. అది పూర్తిగా వర్తకంగా మారి దాని నిజస్వరూపాన్నుంచి దూరమైంది. అందుచేత కళలో జీవము వచ్చేది గాదు. అది చెడ్డ రూపాలను అనుసరించినప్పటికీ ఆనాడు వ్యాపించిన హీన అభిరుచులను, కొంత పరిహరించ డానికై అభివ్యక్తమవడానికి ప్రయత్నించింది. మానవునిలో ప్రతిప్రకృతిచలనం మాదిరిగానే కొన్ని ఒక ధోరణికి, మరికొన్ని యింకొకరకమైన విపరీత ధోరణికి దారి తీశాయి. ఇవి నిజ జీవితానికి ఒకరకంగా కట్టుపడిన ప్రతులుగా తయా రైనాయి. ఆ రోజుల్లో దానిని "ఛాయాచిత్ర గ్రహణదృష్టి" అని పిలిచేవారు. కాని యిప్పుడలా చెప్పలేము. ఎందుకంటే, ఇప్పుడు 'ఛాయాచిత్ర గ్రహణం' చాలా పురోగమించింది. కాబట్టి అలా చెప్పితే దానికి అపచారం చేసినట్లవు తుంది. ఛాయాచిత్ర గ్రహణమే కళాత్మకంగా మారింది. అందువల్ల చిత్రిం చిన ఒక దృశ్యాన్ని ఛాయాచిత్రమని విమర్శించలేము. అలాగని దానిని 'వాస్త వికం' గా (realistic) ఉందని చెప్పలేము. వాస్తవికంగా తీసిన చిత్రం అలా ఉండదు కదా! అది కేవలం సంప్రదాయ సిద్ధంగాను, కృత్రిమంగాను, వాస్త విక జీవితం ఏమాత్రం ప్రతిబింబించకుండా తయారైంది. అప్పుడు దీనికి ప్రతి చర్యగా ఇంకొక విపరీతధోరణి ఏర్పడింది. కళ భౌతిక జీవనాన్ని కాకుండా

మానసిక జీవితాన్ని ప్రాణిక జీవితాన్ని వ్యక్తం చేస్తోంది— అనే ధోరణి ప్రబలింది. అలా కళలో 'క్యూబిజమ్' మొదలైన వివిధ సంప్రదాయాలు ఏర్పడ్డాయి. అవన్నీ మనస్సుతో ఊహించి చేసినవే. కాని, కళలో మానసిక ఆలోచనలకన్నా అనుభూతికే ప్రాధాన్యం ఎక్కువ. అయినా వారు అసంబద్ధము, హాస్యాస్పదము, భయంకరము అయిన వాటిని తయారు చేశారు. ఆ తర్వాత యుద్ధాల మూలంగా యింకో అడుగు ముందుకు వేసారు. ప్రతి యుద్ధంవల్ల ప్రపంచ పరిస్థితి విశీర్ణమై ఒకరకమైన అల్లకల్లోల పరిస్థితి ప్రపంచంలోకి అవతరిస్తుంది. కొంతమంది ఇందులోనే సౌందర్యాన్ని దర్శించి దీనిని మెచ్చుకుంటారు.

వారు చేద్దామని అనుకున్నది నాకు బాగా అర్థమైంది. కాని వారు బాగాచేస్తున్నట్లు మాత్రం కనబడలేదు. ప్రయత్నం చేస్తున్నారని మాత్రమే చెప్పగలను.

విక్టోరియన్ కాలంలో, ఫ్రాంసు రెండవ సామ్రాజ్యకాలంలో ఏర్పడ్డ అతి సామాన్య భౌతికవాదులు, అతివాదులు చిత్రించినవానికన్నా ఇవే ఉత్తమమైనవి కావచ్చు. ఆ విధంగా సామరస్యం ఉన్న స్థానంనుంచి ప్రారంభించి, ఒక వంపు తిరిగి, సామరస్యాన్ని వదిలి పూర్తి అంధకారంలో వెళ్ళుతారు. ఆ తరువాత పురోగమించి పూర్వపు కళాసిద్ధికి దగ్గరగా వచ్చినట్లు గమనిస్తారు. ఆ కళాసిద్ధిలో ఉన్న సత్యాన్ని గుర్తిస్తారు. దానితోపాటుగా అంతకన్నా ఎక్కువ చైతన్యవంతంగాను, పూర్తిగాను వ్యక్తంచేయవలసిన అవసరం కూడా గుర్తిస్తారు. కాని ఒక వలయం వర్ణించవలసి వచ్చినప్పుడు రూపాలను అభివ్యక్తం చేసేదే కళ అని మరిచిపోయి అతి తక్కువ రూపాలతో భావాలను, అనుభూతులను వ్యక్తం చేయడానికి ప్రయత్నిస్తారు. ఈనాడు, మనం చూచేవి (యూనివర్సిటీ గ్రంథాలయాలలో అత్యాధునిక చిత్రకారుల చిత్రాల ప్రతిచిత్రాలు) యిలా వచ్చినవే. ఇంకా కొంచెం ముందుకు పోయి పరిశీలిస్తే వారు వ్యక్తం చేద్దామనుకున్న ఈ భావం, ఈ అనుభూతులు అస్తవ్యస్తంగా వ్యక్తంచేసినట్లుగా కనిపించినా ఉదావర్తులంలో (Spiral) అదే చోటుకి తిరిగి వచ్చిచూస్తే, (అంతకన్నా ఉన్నత పరిధిలో) అది ఒక నూతన కళకు అపరిపక్వ స్థితిఅనీ, ఆ నూతన కళ సౌందర్య కళగా ఉండి భౌతిక జీవితాన్ని వ్యక్తంచేయడం కాకుండా దాని ఆత్మనే వ్యక్తం చేయడానికి ప్రయత్నించగలదనీ తెలుసుకుంటారు.

ఏది ఏమైనప్పటికీ మనం అంతమటుకు రాలేదు కాని, మనం దానిని వేరు కోగలమని ఆశిద్దాము.

**నిరంతర పురోగతికి బదులు పరిణామం ఉదా వర్తులంగా ఎందుకు నడుస్తుంది ?**

పరిణామం నిరంతరంగా పురోగమిస్తుంది. కాని అది సరళరేఖలో సాగితే నీవు ఒక భాగాన్నే పూర్తిచేయగలవు. ప్రపంచం ఒక గోళం కాని ఒక సరళరేఖ కాదు కదా.

**ఈ ప్రపంచం వర్తుల స్తంభాకారమైతే ?**

వర్తుల స్తంభమైనప్పటికీ ఒకే గీత గీస్తే నీవు స్తంభంలో ఒక భాగాన్ని వదలి వేస్తావు. అన్నీ పరిణామ విషయంలోకి వచ్చి ప్రయత్నించేటట్లు చేయడమే ఈ ఉదావర్తుల చలనంచేసే పని. అప్పుడు ఒకటి ముందు పురోగమించి మిగిలి నవి వెనకబడడం కాకుండా అన్నీ పురోగమిస్తాయి. అందువల్ల ప్రగతి కేంద్రీ కృతమైన స్థానాన్నుంచి చూస్తే ఒకటి ఒకదాని దగ్గర్నుంచి దూరమై మరొక దానిలో ప్రవేశిస్తున్నట్లు కనిపిస్తుంది. కాని కాలగతిలో చైతన్యవంతంగా పరి ణామం పొందిన మానవుడు ఒకపని చేయడంకోసమై మరొకపని మరచిపోడు. ఈ మతిమరుపుతనమే ప్రస్తుత అనర్థము. ఏదైన సిద్ధికోసం ఒకరకపు కార్య క్రమం కొనసాగిస్తుంటే మిగిలినవాటి నన్నిటినీ మరచిపోతారు. లేదా, మిగిలిన వన్నీ నేపథ్యంలోకి వెళ్ళిపోతాయి. వాటి ఉధృతం తగ్గిపోతుంది. మానవుని లోని ఈ లోపం సరిదిద్దవచ్చు.

**అన్నీ ఉదావర్తులంలోనే పురోగమిస్తున్నప్పుడు అన్నీ ఏకంగా పురోగమిస్తాయా ? విడివిడిగానా ?**

అది అంత సామరస్యంగా జరగదనే నా అనుమానము. ఈ ప్రపంచం మరీ అరాచకంగా కనిపిస్తోంది. ఈ పురోగమన మంతా మొత్తం కలిసి వ్యవస్థీ

కృతమైతే సామరస్యపూర్వక పురోగమనం జరిగేదే. ఎక్కడికి వెళ్లుతున్నారో, అంతవరకు జరిగినదేమిటో దాని ఆచూకి దొరికితే, దాని వెంబడి వెళ్ళి ఏం జరుగుతుందో చూడవచ్చు. ప్రస్తుతానికి అది ఉన్నత వర్గాలవారికే సాధ్యము. ప్రజలంతా వీరి ననుసరిస్తారు. ఆ విధంగా అక్కడ సజాతీయత, సమకాలీనత లోపిస్తాయి. కొన్ని చలనంలోకి రాకుండా మరీ నిదానమౌతాయి. ఈ విధమైన కొద్ది తేడాకూడా చలనంలో చాలా ఎక్కువ భేదాన్ని సృష్టిస్తుంది.

ఇంకాకొన్ని ఉదావర్తనాలు ఒకదానినొకటి దాటుకోడంవల్ల ఖండించుకున్నట్లుగా కనిపిస్తాయి. సార్వత్రిక ప్రగతి చలనాన్ని మొత్తంగా ఎవరైనా అనుసరించగలిగితే ఒకదానినొకటి దాటుతున్న అనేక ఉదావర్తనాలు కనుపించడంవల్ల వారు ముందుకు వెళ్లుతున్నారో, వెనుకకు వెళ్లుతున్నారో తెలియకుండా పోతుంది. ఒకే సమయంలో కొన్ని ఊర్ధ్వంగాను, కొన్ని వెనక్కి అగాధంలోకి పడిపోతున్నట్లు కనిపిస్తాయి. ఇవి ఒకదానితో ఒకటి బొత్తుగా సంబంధం లేనివి కావు. వీటి మధ్య ఒకరకం సయోధ్య ఉంటుంది కాబట్టి మనం ఉదావర్తనానికి బదులు వర్తుల ఉదావర్తనాలు ఊహించాలి. ఆ ఉదావర్తనాలన్నీ కలిసి ఒక పెద్దగోళాకారంగా అవుతాయి. ఉదావర్తనాలు ఒకదానినొకటి దాటేచోటనే పురోగతి క్షణాలు ఉంటాయి. ఈ పురోగమనం సంపూర్ణం, సమంజసం అవడానికి ముందు పరాప్రకృతికి భిన్నంగా, ఒక ప్రణాళిక ప్రకారం కూర్చబడిన ఆంతరిక వ్యవస్థగల జీవనం అవసరము. పరాప్రకృతి ప్రణాళిక ఒక ఆకాంక్ష, నిశ్చయము, లక్ష్యముల ననుసరించి తయారౌతుంది. ఆ మార్గం చాలా విచిత్రమైనది. ప్రతిక్షణం వచ్చే ప్రచోదనలను అనుసరిస్తూ,— ప్రయత్నాలు, ఆటంకాలు, ఆక్షేపణలు, పురోగతి, పూర్వంచేసినదానిని పాడుచేయడం మొదలైన వాటితో ఏమీ అర్థం చేసుకోలేనంత సంక్షోభంగా ఉంటుంది. ఉద్వేగపూరితంగా పనిచేస్తున్న వారి మాదిరిగా ఆమె కనుపిస్తుంది— కొన్ని ప్రచోదనలను విడుదలచేసి వాటిని నాశనంచేసి, మరికొన్నిటిని ప్రారంభించి వాటిని మళ్ళీ నాశనంచేసి ఈ విధంగా జరుగుతుంది. ఆమె చేయడం, దానిని నాశనం చేయడం, మళ్ళీ చేయడం. నాశనం చేయడం, కలగాపులగం చేసి నిర్మించడం, నాశనం చేయడం మొదలైన వన్నీ ఏక కాలంలో చేస్తుంది. అది అర్థం కాదు. ఆవిడ మాత్రం ఒక ప్రణాళిక ప్రకారం— మానవ చైతన్యానికి మరుగుగా ఉన్నప్పటికీ—ఆమెకు

సుస్పష్టమైన ఒక గమ్యంపైపు పయనిస్తుంది. ఎవరైనా ఆ రకంగా నిర్మించ గలిగితే అప్పుడు తెలుస్తుంది: ఒక్కొక్కటిగా పరాప్రకృతి సృష్టిదశలో ఒక్కొక్క దాన్ని తెలియచేసే వివిధరంగుల ఉదావర్తులాలతో ఒక గోళం నిర్మించాలి. ఈ దశలన్నీ ఒకదాని కొకటి పరిపూర్ణత కలిగించేటట్లు తయారు కావాలి. కాని, ఇంతవరకు ఇవి సహకరించడానికి బదులు పోటీ పడుతున్నాయి. ఆమె ఒకటి చేయాలంటే వేరొకదాన్ని నాశనం చేయవలసి వస్తోంది. దీనివల్ల చాలా నష్టము, అంతకంటె ఎక్కువ క్రమరాహిత్యం జరుగుతోంది. వీటిని ఒక సముదాయంగా చూస్తే చాలా ఉత్సాహాన్ని కలుగజేస్తుంది. ఎందుచేతనంటే, ఇది ఊహింపదగిన అన్నివైపులా అటూయిటూ దాటివెళ్ళే ఉదావర్తుల ఆరోహణ.

నీ ప్రశ్నకు ఇంకొకరకంగా కూడా సమాధానం చెప్పవచ్చు. ఇప్పుడు చెప్పినది కళకు కూడా వర్తిస్తుంది. అదికూడా ఒక పరిణామగతిని అనుసరిస్తూ ఒకానొక క్షణంలో దాని గమ్యానికి దూరమైపోయినట్లు, మరి ఒకప్పుడు మహోన్నతంగా పైకి లేస్తున్నట్లు కనిపిస్తుంది. ఇది కాకుండా వేరొకటి ఉంది. అది సాంఘిక పరమైనది. ఉదాహరణకు, 14 వ లూయీ మహారాజు కాలంలో కళాత్మక సృష్టిసంప్రదాయం పెరిగి సౌందర్యగ్రహణానికి తోడ్పడింది. ఆ తర్వాత సాంఘిక పరిణామంవల్ల కళలో ఇతరమైన అవసరాలు, ఊహలు చోటు చేసుకున్నాయి. ఇటీవలి కాలంలో వాణిజ్యవైఖరి ఎక్కువైంది. కళకు ఈ వాణిజ్యవైఖరి వ్యతిరేకము. అది ఎంతో అపురూపమైన దానిని హీనపరచడమే నని చెప్పవచ్చు. ఉత్తమ తరగతులవారికి మాత్రమే అర్థంకాగల దానిని సామాన్యుల కెదురుగా ఉంచడమే. ఇప్పటి మన వాణిజ్య, యాంత్రికయుగం కళాభివృద్ధికి ఏమాత్రం దోహదకారి కాదు. అది సంపూర్ణంగా వికసించి, వృద్ధి కావడానికి అనువైన పరిస్థితులు లేకపోవడం వల్లనే, దాని వ్యక్తీకరణకోసం ఇతర మార్గాలు అన్వేషించి మానసిక, ప్రాణిక భూమికలలో ప్రవేశిస్తోంది. వాణిజ్యవైఖరిని తొలగించుకొని, ఇంకా మనోజ్ఞమైన వాస్తవానికి ఉన్ముఖులయే సమయం వచ్చినపుడు, కళకూడా సామరస్యపు ఉత్తమ చైతన్యతలో పునరావిర్భవించగలదు.

## కళకు ఆత్మసంతృప్తి ఒక ప్రతిబంధకమేనా ?

అవును. అది ప్రజ్ఞకుకూడా ప్రతిబంధకమే. బుద్ధిహీనత మానవ అవలక్షణాలన్నిటిలోకీ పెద్దది. జరగవలసిన దానిపై విశ్వాసము, దానిని నెరవేర్చే సంకల్పము, సృష్టిలో దానికి గల అవకాశాలపై దృఢ నిశ్చయము (ఈ అవకాశాలు నెరవేరి తీరుతాయనే దృఢ నిశ్చయము)— వీటికి, ఆత్మసంతృప్తికీ చాలా తేడా ఉంది; మన సమయము, శక్తి, సంకల్పం, విశ్వాసం, శ్రద్ధ పూర్తిగా వినియోగించి పనిచేస్తే ఏదీ అసాధ్యం కాదు అనే నమ్మకం అవసరమే. కాని, ఆత్మసంతృప్తి ఏ విషయంలోనూ పనికిరాదు, అది బుద్ధిహీనతే. దైవసిద్ధి బడయకుండా నిన్ను దూరంచేసే అవకాశాలలో ఇది ఒకటి. పరాప్రకృతి సత్సంకల్పాన్ని వ్యతిరేకించే వాటిలోకూడా దీనిని చేర్చవచ్చు. ఆ విధంగా ఆత్మసంతృప్తి కలిగితే ప్రకృతి నవ్వుతుంది. నీవు నవ్వులపాలవుతావు. ఎందువల్లనంటే, ఎవరూ తనకు తానుగా ఏమీకారు. దైవం సృష్టిలో ఒక సంభావ్యతగా ఏర్పడిన మానవుడు దైవం వల్లనే అభివృద్ధి పొందాలి. దైవంవల్లనే జీవిస్తున్న అతను దైవంకోసమే జీవించాలి, అటువంటప్పుడు ఆత్మసంతృప్తి పొందవలసిన అవసరం ఏమీలేదు. దైవం మనను ఎలా తయారుచేస్తే అలాగే ఉంటాముగాని మనం చేసేదేమీలేదు, దైవం మనద్వారా ఏమి జరుపదలుచుకున్నాడో అది చేస్తున్నప్పుడు సంతృప్తి ఎలా కలుగుతుందో నా కర్థంకావడంలేదు, పరిపూర్ణ అధికారవిహీనభావం మాత్రం కలుగవచ్చు. ఈ భావాన్ని తప్పుగా అన్వయించుకోడం చాలా చెడ్డది—ప్రతి చైతన్యస్థితికీ తప్పొప్పులనేవి ఉంటాయి కదా—అవిధమైన భేషజంవల్లనే నీవు "నేను ఏమీ చేయలేను, దేనికీ పనికిరాను, నాకు ఏరకమైన సామర్థ్యం లేదు" అంటావు. అది "నేను చేయగలను, చాలా గొప్పవాణ్ణి, నాకు అన్ని అధికారాలూ ఉన్నాయి," అనేదానికి బేసిపద్ధతి అనడం హేయము. అదీ ఇదీ రెండూఒకటే; ఒకటి వెలుతురు, రెండవది దాని నీడ. రెండూ ఒకే విధంగా ఉంటాయి. ఒకటి రెండవదానికంటె ఏవిధంగాను మెరుగు కాదు. నిజంగా తాను ఏమీ కాదని ఎవరైనా అనుకుంటే, తను ఎలా ఉన్నదీ తెలుసుకోవాలని తాపత్రయపడడు. నాకున్న అనుభవంతో నేను నిజంగా చెపుతున్నాను: తమ విషయమై తృప్తిపడేవారికంటే విపరీతం వేరేలేదు. అది నిజంగా పరిహాసాస్పదమే. అటువంటివారు కొందరున్నారు: వారు శ్రీఅరవిందులను చూడడానికి

వచ్చి తమ సామర్థ్యమేమిటో, ఇంతవరకూ తాము సాధించినదేమిటో, తాము చేయగలిగినదేమిటో, సిద్ధింప చేసుకొన్నదేమిటో చెప్పడం మొదలు పెట్టారు. శ్రీఅరవిందులు వారివంక చూచి గంభీరంగా: "ఆ! అలాగా, మీఅంత పరిపూర్ణులు ఇక్కడ ఎలా ఉంటారు? వెళ్ళిపోతేనే మీకు మంచిది."

సంగీతం ముఖ్యంగా ఆధ్యాత్మిక కళ. అది ఎప్పుడూ మతభావాలతోను, ఆంతరజీవనంతోను అనుబంధించి ఉంటుంది. కాని, మనం దానిని కూడా స్వతంత్రంగా, స్వయంసమృద్ధంగా ఉండే టట్లు చేస్తున్నాము. అది ఎదుగుబొదుగు లేని కళగా మారింది. ఉదాహరణకు, ఓపరా సంగీతం (సంగీత నాటకాలలో). ఇటీవల ప్రసిద్ధిలోకి వస్తున్న సంగీతం ఇటువంటిదే. కూర్పులో నేర్పువల్లనే అది ఆసక్తి కలిగిస్తుంది. నాటక సంగీతం ఉన్నత కళను వ్యక్తీకరించడానికి సాధనంగా ఉపయోగపడదని నేను చెప్పను; దాని బాహ్యస్వరూపం ఏదైనప్ప టికీ నిగూఢమైన కార్యం దాని ద్వారా జరుగవచ్చు. అంతా ఆ విషయం మీదా, దాని నెట్లా వాడు తున్నారో, దాని వెనుకనున్నదేమిటో అనేదానిమీద ఆధారపడుతుంది. దైవ కార్యార్థం ఉపయోగించ రానిది ఏమీలేదు. దీనికి వ్యతిరేకంగా హీనజాతికి చెందినదికూడ తాను దైవంగా నటించడం జరుగుతూ ఉంటుంది.

ప్రశ్నోత్తరములు 1929 (28 జూలై)

మీరు ఎదుగు బొదుగు లేని కుక్కగొడుగు జాతులు అని దేనినంటున్నారు ?

కుక్కగొడుగు అంటే మీకు తెలియదా? అవి ఎలా పెరుగుతాయో తెలియదా? కుక్కగొడుగులు ఎక్కడైనా పెరుగుతాయి. వాటిని సాగుచేయనవసరంలేదు. దీని భావం ఏమిటంటే, సృష్టిలో వేళ్ళు పాతుకోకుండానే ఎక్కడపడితే అక్కడ స్వతస్సిద్ధంగా ఎదిగేవే కుక్కగొడుగులు. సంపూర్ణత్వం లేకుండా, దేనితోను సంబంధంలేకుండా ఎక్కడనుంచో వచ్చినట్లు ఉంటాయి. నేను కుక్కగొడుగులకు బదులుగా చెట్లమీద ఉండే పరాన్నజీవులు అని చెప్పియుండవచ్చు. కొన్ని మొక్కలు చెట్లను ఆతుక్కొని జీవనాధారంగా చేసుకొని ఎదుగుతాయి. అంటే, కొన్ని మొక్కలు నేలలోనుంచి వేళ్ళద్వారా సూటిగా ప్రాణాధారమైన ఆహారాన్ని తీసుకునేందుకు బదులుగా వేరే చెట్లకు చుట్టుకొని ఆహారాన్ని వాటి నుంచి గ్రహిస్తాయి. ఆహారాన్ని సంపాదించుకునేందుకు యితరుల పనిపై ఆధారపడి జీవిస్తాయి. అలాగే కొన్ని పరాన్నజీవులు ఇతర జంతువులపై ఆధారపడి జీవిస్తాయి.

నేను దానిని గురించి వివరంగానే చెప్పాను, కళను పోషించే కాలంలో, ఉదాహరణకు గ్రీకుదేశంలో, ఇటలీ పునర్వికాసకాలంలో ( గ్రీకు దేశంలోను, ఈజిప్టులోను ఎక్కువ) ప్రజోపయోగంకోసం భవనాలు నిర్మించేవారు. గ్రీకు, ఈజిప్టుదేశాలలో వారి దేవతలను పవిత్రంగా నిలపడానికి ప్రత్యేక ఆలయాలు కట్టేవారు. వారు చాలా సంపూర్ణంగా, మనోహరంగా నిర్మించుదామనుకున్నారు. దానికై వారు వాస్తుకళను ఉపయోగించారు. అంటే సామరస్యయుక్తమైన రేఖలు శిల్పాలు వాస్తుకళకు తోడై దృగ్గోచరమయ్యే దాన్ని వివరిస్తాయి. చిత్రకళ ఈ వ్యక్తీకరణను పూర్తిచేస్తుంది. ఈ విధంగా సమన్వయంతోకూడిన ఏకత్వమై జ్ఞాపకచిహ్నాన్ని సృష్టించాయి. చిత్రాలు, శిల్పాలు భవనంలో భాగంగా ఏర్పడ్డాయి. అవన్నీ వేరువేరుగా ఉండి అవి అక్కడ ఎందుకు పెట్టారో అనేటట్లు కాకుండా అన్నీ ఆ భవనప్రణాళికలో భాగంగా ఏర్పడేవి. ఉదాహరణకు, వారు ఒక దేవాలయాన్ని నిర్మించవలసివచ్చినప్పుడు, దానిలో వారనుకున్న సౌందర్యాన్ని వ్యక్తీకరించడం కోసమే, అంటే వారి ఆరాధ్యదైవానికి అది బాహ్యాంబరం

కావాలనే ఏకైక సంకల్పంతోనే వివిధ కళలను మిళితం చేసి సంపూర్ణంగా నిర్మించేవారు. చిత్రకళ వర్ధిల్లిన కాలాలన్నీ యిలాగే గడిచాయి. కాని, గత శతాబ్ది చివరి భాగంలో కళ ఒక వ్యాపారంగాను, కేవలం ధనార్జన కొక మార్గమే నన్నట్లుగాను తయారైంది. అమ్మడానికి చిత్రాలు వేసేవారు కేన్వాస్ మీద చిత్రించి దానిని ఫ్రేమ్‌లో బిగించేవారు. ప్రత్యేక అవశ్యకమేమీ లేకుండా చిత్రాన్ని ఎక్కడో ఒకచోట పెట్టేవారు. దేనినో ఒకదానిని వ్యక్తీకరించడానికి నిర్మించిన ఒక శిల్పాన్ని తెచ్చి ఏదో ఒకచోట పెట్టేవారు. అది నప్పేది కాదు. వస్తుతః అందంగా ఉన్నవాటిని అమర్చినపుడు అర్థంలేకుండా పెట్టేవారు. అన్నీ కలిపి సంపూర్ణంగా తయారుచేసి ఏదో ఒకదానిని వ్యక్తంచేయాలనే ప్రయత్నం లేనేలేదు. అది ఒక చిత్రాన్నిగాని శిల్పాన్ని గాని తయారుచేయగల నైపుణ్యం, తెలివితేటల ప్రదర్శన. అదే విధంగా, ఆ రోజుల్లోని వాస్తుకళకు కూడా ప్రత్యేకమైన అర్థం లేదు. భవనంలో ప్రతిష్ఠించాలనుకున్న ఒకానొక శక్తిని వ్యక్తం చేద్దామనే ఉద్దేశ్యంతో భవనం నిర్మించలేదు. వాస్తుకళ ఒకానొక ఆకాంక్షను వ్యక్తం చేసేదిగాను, ఉత్సాహాన్ని ఉద్గమింపజేసేదిగాను, ప్రతిష్ఠించుదామనుకున్న దేవత వైభవాన్ని వ్యక్తంచేసేదిగాను ఉపయోగపడలేదు. వాటినే నేను కుక్కగొడుగు కళ అంటాను. ఒక యిల్లు యిక్కడ, మరొకటి అక్కడ నిర్మించి, చిత్ర పటాలు, శిల్పాలు అన్నిచోట్లా పెడతారు. ఇంట్లోకి ప్రవేశించగానే కొంత శిల్పం, కొంత చిత్రలేఖనం అనేకరకాల వస్తుప్రదర్శన పెట్టెలు కలిసి ఒకదాని కొకటి సంబంధం లేకుండా కనబడతాయి. ఇదంతా కూడా వస్తు చిత్రకళ ప్రదర్శనశాలగా కనిపిస్తుంది గాని అసలైన సౌందర్యానికి, కళకు అక్కడ స్థానం లేదు. ఇది ఎంత ఘోరంగా కనిపిస్తుందో అర్థం చేసుకోవాలంటే, కళ అంతరార్థం తెలుసుకోవాలి. దానికే అలవాటుపడినా, లేదా ఆ కాలంలో జీవించినా, అదంతా కూడా సహజంగానే కనుపిస్తుంది. కాని అది సహజం కాదు; పైగా వ్యాపారోద్దేశం వల్ల విరూపతను పొందినది.

దీనికి ఒకరకంగా సమాధానం చెప్పుకోవచ్చు. దీనిని విద్యాబోధనకు ఒక సాధనంగా ఉపయోగించుకోవచ్చు. అప్పుడది ఒక మ్యూజియం మాదిరి చరిత్రాత్మక విజ్ఞానంతో విషయాలు తెలుసుకోడానికి ఉపయోగపడుతుంది. మ్యూజియం అందంకోసం కాదుగదా! పైగా దానికి దూరం కూడాను. కాని ఒక కళా

కారునికి అది ఘోరంగా కనిపిస్తుంది. విద్యాబోధన దృష్ట్యా అది బాగుంటుంది. ఎందువల్లనంటే, అన్నిరకాల వస్తువులూ కూర్చి ఒకచోట చేర్చుతారు కదా! ఈ రకంగా నీవు నేర్చుకొని అపార పాండిత్యాన్ని సంపాదించవచ్చు. కాని, సౌందర్యదృష్ట్యా అది భయంకరమైనది.

అందువల్ల, తిరిగి పూర్వం మాదిరిగా దానిని అలంకార కళగా (ఈ శతాబ్ది ప్రారంభ సంవత్సరాలలో మాదిరిగా) తయారుచేసే ప్రయత్నాలు జరిగాయి. అంటే, ఇంటిని సర్దేటప్పుడు కూర్పునంతటినీ ముందుగా దృష్టిలో పెట్టుకొని దాని ప్రకారంగా ఎక్కడ పెట్టవలసినవాటిని అక్కడ పెట్టినట్లు ప్రతి వస్తువుకూ ఒక స్థానం ఏర్పడి, ఆ స్థానంనుంచి దానిని తొలగించకూడదన్నట్లు ఏర్పాటు చేస్తారు. ఆ విధంగా ఒక కూర్పు సృష్టిచేయడం జరుగుతుంది, అది కొంతవరకు మంచిదే. అప్పట్లో వారు ఆవిధంగా ప్రయత్నం చేశారు.

ఇక్కడ భారతదేశంలో పద్ధతి వేరు. ఇక్కడ కళకు ఏర్పడిన సంప్రదాయం అనూచానంగా వచ్చినది, ఆ సంప్రదాయంలో తయారుచేసిన వస్తువులే భారతదేశంలో కనిపిస్తాయి. వారి జీవితం వాటి మధ్యలో గడుస్తుంది. బాహ్య ప్రపంచంలో, ముఖ్యంగా యూరోపులో కలిగిన పరిణామాలను అనుభవించాల్సిన పని వీరికి లేదు, ఆంగ్ల ప్రభావానికి లోనైన కొన్నికొన్ని ప్రాంతాలలో సౌందర్య ఆరాధన పూర్తిగా పోయింది. బొంబాయిలోని కొన్ని కళారీతులు భయంకరంగా తయారైనాయి. కలకత్తాలో కొన్ని సంప్రదాయాల వారు భారతీయ కళను పునరుద్ధరించే ప్రయత్నం చేస్తున్నారు. కాని అది చాలా స్వల్పము. కళ దృష్ట్యా పురాతన దేవాలయాలు, పురాతన చిత్రాలు మొదలైన పురాతన వస్తువులు చాలావరకు నీకు అందుబాటులోనే ఉన్నాయి. అవన్నీ చాలా మంచివి. ఒక విశ్వాసాన్ని వ్యక్తీకరించడం కోసమే అవి ఏర్పడ్డాయి. అవి మొత్తం కూర్పును దృష్టిలో పెట్టుకొని సాధించినవే కాని, క్రమంలేకుండా తయారైనవి కాదు.

నేను చెబుతున్న కళోద్యమం మీపై కలుగచేసిన ప్రభావం తక్కువ. ఏదో కొంచెం ఉన్నప్పటికీ అది లోతుగా పాతుకోలేదు. ఐరోపా నాగరికతకు

సంబంధించిన విషయం మీకు చాలా స్వల్పంగా అనుభవమైంది. ఈ దేశంలో చాలా చిత్రాలలో (ఇది చాలామంచి ఉదాహరణ) చేవ్రాలు కనిపించదు. ఇంచుమించు మంచి చిత్రాలన్నిటికీ అంతే. గుహలలో చిత్రాలపైగాని, దేవాలయాలలో శిల్పాలపై గాని చేవ్రాలు కనుపించదు. అవి సృష్టించిన దెవరో ఎవరికీ తెలియదు. అవన్నీ ఇప్పటి మాదిరిగా పేరుకోసమని సృష్టింపబడినవి కాదు. ఒక గొప్ప శిల్పి కావచ్చు, చిత్రకారుడు కావచ్చు, వాస్తునిపుణుడు కావచ్చు. అంతమాత్రం చేత తన పేరు అన్నిటిమీదా వ్రాసి ఎవ్వరూ మర్చిపోకుండా వార్తాపత్రికలో ప్రకటించుకోడం వంటివి చేసేవారు కారు. అ రోజులలో కళాకారులు తమ పేరు యుగాల తరబడి నిలుస్తుందా లేదా అని ఏమాత్రం ఆలోచించకుండా పనిచేసేవారు. ఉదాత్తసౌందర్యాన్ని వ్యక్తీకరించాలనే ఆకాంక్షతోను, అక్కడ ప్రతిష్ఠించిన దైవానికి తగిన ఆవాసము సమకూర్చాలనే తహతహతోను వారు పనిచేసేవారు. మధ్యయుగం 'చర్చి' లు నిర్మించేటప్పుడు ఐరోపాలోకూడా ఆవిధంగానే చేసేవారు. అక్కడ కూడా వాటిని నిర్మించిన కళాకారుల పేర్లు కనిపిస్తాయని నేను అనుకోను. ఒకవేళ ఏదైనా ఉన్నప్పటికీ అది పొరపాటున నిలిచిపోయిందని అనుకోవచ్చు. ఇప్పుడు మాత్రం ప్రతి అల్ప చిత్రం పైనగూడా ఫలానవారు వేసినది అనే ముద్ర కనుపించాల్సిందే.

ప్రాక్పశ్చిమ కళలకు సమన్వయం కుదురుతుందని కొందరంటారు నిజమేనా ?

అవును, తగినంత ఔన్నత్యం పొందితే ప్రతిదానికీ సమన్వయం సాధ్యమే.

ఆ సమన్వయ ఫలితంగా ఏం జరుగుతుంది ?

అవసరమైతే అది అలాగే జరుగుతుంది. కాని, ప్రధానంగా ఇవన్నీ ప్రారంభదశలలో ఉన్నాయి. ఈ నవీనకాలపు అవకాశాలవల్లనేమి, వాణిజ్య సంబంధాల వైపరీత్యం వల్లనేమి అన్నీ కలగాపులగమౌతున్నాయి. తూర్పు దేశాల వస్తువులు పశ్చిమదేశాలకు, పశ్చిమదేశాల వస్తువులు తూర్పుదేశాలకు సరఫరా అయి ఆ దేశాలపై పరస్పర ప్రభావాన్ని కనపరుస్తున్నాయి. ప్రస్తుతం

యిలా కలగడం వల్ల కొంత గందరగోళం ఏర్పడుతోంది. కాని, దానినుంచి ఒక సరికొత్త వ్యక్తీకరణ రానున్నది. దాని సాధ్యత సుదూరాన లేదు. ఈనాటి మానవులు ఒండొరులతో కలిసిపోతున్న పరిస్థితులందు, పరస్పర ప్రభావానికి లోనుకాకుండా ఎవ్వరూ ఆరీతిగా కలిసిపోజాలరు. ఉదాహరణకు, జయించాలనే వ్యామోహంతో, ప్రపంచంలో అన్నిరకాల దేశాలనూ జయించిన పశ్చిమదేశాలు జయింపబడిన దేశాల ప్రభావానికి గురి అయినాయి. పూర్వపు రోజుల్లో రోమన్ సామ్రాజ్యం గ్రీకుదేశాన్ని జయించినప్పుడు పూర్తిగా అది గ్రీకుదేశ ప్రభావానికి గురైంది. అది జయించకపోతే అలా అయ్యేది కాదు. ఇంక అమెరికన్‌ల విషయం— వారు గుర్తించినా గుర్తించకపోయినా వారు తయారుచేసిన వస్తువు లన్నీ జపాను వస్తువులే. జపానును ఆక్రమించినది మొదలు అమెరికన్ పత్రికల నిండా కనిపించేవి జపాను వస్తువులే. అమెరికానుంచి వచ్చిన వస్తువులను విమర్శనాత్మకంగా పరిశీలిస్తే జపాను ప్రభావం కనిపిస్తుంది. అదంతా స్వయంచాలకంగా సంభవించేదే. పరిశీలిస్తే చిత్రంగా ఉంటుంది. ఒక రకమైన సమతాస్థితి ఏర్పడి, ఎవరైతే బాహ్యదృష్టిలో విజేతలో వారు పరాజితుల ఆత్మచేత విజితు లవుతారు. అది అలా పరస్పరంగా ఏర్పడుతుంది. విజేత స్థూలంగా జయిస్తాడు, సమస్తమును స్వాయత్తం చేసుకుంటాడు. కాని, అతనిని ఆవహించేది పరాజితుల ఆత్మయే.

అందుకని, కలిసిపోవడం ద్వారా.... పరాప్రకృతి విధానాలన్నీ క్లిష్టం. విదానం, అస్పష్టం. చాలా త్వరగా చేయగలిగేవాటికి కూడా ఆమె చాలాకాలం తీసుకుంటుంది. ఒకపని చేయాలంటే, చాలా తేలికగా, ఎక్కువ వృథాచేయకుండా, ఆత్మబలంతో చేయవచ్చు. ప్రస్తుత ప్రపంచంలో దుబారా ఎక్కువగా ఉంది. మొత్తంమీద నెరవేరినప్పటికీ, జనులు కలిసిపోయేటట్లు చేయడంలో ఆమె మార్గాలు ఆమెవే.

### అది ఉద్దేశ్య పూర్వకమేనా ?

మామూలుగా మనం అనుకునే ఉద్దేశ్య పూర్వకం కాదు. కాని, మనం అనుకునే ఉద్దేశ్యం, చేరవలసిన గమ్యాల వ్యక్తీకరణ—అంతా మన చైతన్యం

మీద ఆధారపడుతుంది. మానవుడు అసలు విషయం కాకుండా చిన్నచిన్న వివరాల దగ్గరనుంచీ చూడడంవల్ల యిదంత గందరగోళంగా కనపడుతుంది. ఎందువల్లనంటే, తన జీవన ప్రమాణానికి పోలిస్తే, కాల పరిమాణం పరిమితం కదా! కాని, పరాప్రకృతికి కాలం అనంతము. అంతా వృథా అయినా కూడా ఆమె లెక్కచేయదు. ఎందువల్లనంటే, ఆమె ఒక పెద్ద క్రాగు గల గృహస్థువంటిది. అన్నీ అందులో వేసి మిశ్రమంచేసి అది బాగులేకపోతే అంతా దానినుంచి తీసి పారేసి మళ్ళీ మిశ్రమం చేస్తుంది. అన్నీ తీసి మళ్ళీ అందులో వేసి వేరే మిశ్రమం చేయవచ్చునని ఆమెకు తెలుసు. ఆవిధంగా చేస్తుంది. దీనిలో నష్టం లేదు కదా! ఏదీపోదు. మళ్ళీ అన్నీ పునరావృత్తమౌతాయి, రూపాలు నమసి పోయినా దానిలోని పదార్థం మళ్ళీ ఉపయోగిస్తుంది గదా! ఇలా నిరంతరంగా చాలా కాలం గడుస్తుంది. ఏదో చేయడం, దానిని పాడుచేయడం, తిరగేసి చూడడం—యిష్టమై కొన్ని వందల సార్లు చేస్తేమాత్రం ఆమెకు ఏమినష్టము? ఆమెకు పని తప్ప ఏదీ వృథా పోదు! ఆమె పనే ఆమె సంతోషము. పని లేకపోతే ఆమెకు ఉనికి లేదు.

ఆమెకు సంతోషమే కాని మానవులకు కాదా!

కాదు. అది మానవులకు ఘోర విలాసంగా కనపడుతుంది.

## 4 నవంబరు 1953

(శ్రీమాత క్రిందటివారం చెప్పినదాని ప్రకారం క్లాసులో. పిల్లలు ఉదావర్తాలతో ఉన్న ఒక గోళాన్ని నిర్మించారు. శ్రీమాత క్లాసు ప్రారంభించక పూర్వం దానినిగురించి కొద్దినిమిషాలు మాట్లాడారు.)

వంపులో ఒకభాగం మాత్రమే గోళానికి తాకుతుంది. మిగిలినది లోపలి వైపుగా తిరిగి చుట్టుకుంటుంది. అలా చేయడం కష్టము. ఎందువల్లనంటే, దానిలోనుంచి లోపల కనబడదు కదా! కాని, దాని కేంద్రమందు అన్ని ఊదావర్తములు కలుస్తాయి.

మీరుచేసింది, చేసినవిధానం కూడా ఏమంత బాగా లేదు. గోళపు అంచుకు ఉదావర్తపు వంపులో ఒకభాగం మాత్రమే తాకుతుంది. ప్రతివంపూ అంచులో ఒకభాగాన్నే తాకుతుంది. రంగులు మాత్రం స్పష్టంగా చూడవచ్చు. క్షేత్రగణితం ప్రకారం చేస్తే బాగా వస్తుంది. ఉదావర్తపు వంపులోని ఒక భాగం గోళపు లోపలి భాగాన్ని తాకుతుంది, మీరు ఈవిధంగా చేయగలరని భావిస్తాను.

పవిత్ర: ఈ ఉదావర్తాలు గోళపు ఉపరితలం పైన ఉంటాయా లేక లోపలివైపు ఉంటాయా ?

ఉపరితలంపై కాదు, అన్ని సర్పిలాలూ లోపలనే.

అంటే కేంద్రం వైపుగానా ?

అవి ఒకదానినొకటి తాకుతూ ఉంటాయి. ప్రతి ఉదావర్తపు భాగమూ గోళపు లోపలివైపు తాకుతూ, గోళమంతా ఉదావర్తాలతో నిండుతుంది.

గోళం లోపలిభాగం పూర్తిగా ఉదావర్తాలతో నిండుతుందా ?

గోళం లోపలి భాగమంతా పూర్తిగా సర్పిలాలతో నిండుతుంది. అందులో పదార్థంలేదు కాబట్టి (కేవలం సర్పిలాలతో) ఒకవైపునుంచి మరియొకవైపుకు చూడగలుగుతాము. ఏమీ కనబడకుండా ఉండేటట్లుగా అవి ఒకదానితోనొకటి లుపిపోవు. వాటి రంగులు చాలా ప్రకాశమానంగా, తేజస్సును విరజిమ్ముతాయి. గోపలివైపుగా దానిరేఖను అనుసరించవచ్చు. వాటిని అసంఖ్యాకాలుగా ఊహించుకోవాలి.

ఇవి లోపలివైపుగా చిన్నచిన్నవై కుంచించుకొని పోతాయా ?

మొదటి వర్తులాలన్నీ ఒకే పద్ధతిలో కేంద్రమంతా ఉండనవసరములేదు. మొదటి వర్తులంతో ప్రారంభించి కేంద్రంవైపుగా చుట్టుకొనే ఉదావర్తులాల సముదాయం కాదది.

అయితే మళ్ళీ కేంద్రంలో ప్రారంభించి గోళం వైపు విస్తరించడమా ?

కాదు. ఆరంభస్థానం, అంతిమస్థానం ఒకచోటేకాదు. కాని, దూరం నుంచి చూస్తే అలా ఉన్నట్లే భావన కలుగుతుంది, నిజానికి అంతకంటే క్లిష్టంగా ఉంటాయి. దూరానికి మసకగా కనబడుతుంది కాని అక్కడ లేదు.

తల్లీ, ఈ రంగులు ఏమి సూచిస్తాయి ?

ఇవి మూడురకాల ఆకుపచ్చరంగులు, ఒక నీలిరంగు, అది నీలమేకాని ఆకుపచ్చతో కలిసిన నీలము. ఇంకా రెండురకాల గోధుమరంగులు, ఒక నలుపు, ఒక బూడిదరంగు, రెండురకాల ఎరుపురంగులు. ఈ రంగులలో ప్రాణంలేదు. వాటికొక అర్థం చెప్పవచ్చు.

శ్రీమాత 1929 ఆగస్టు 4 న యజ్ఞము, ఆత్మసమర్పణపై జరిగిన సంభాషణలలో కొంత భాగం యిలా చదువుతున్నారు:

> ఆధ్యాత్మిక జీవితం అందరిలోనూ ఉన్న ప్రధాన వస్తువును వెల్లడి చేయడమే కాకుండా అనంతమైన దాని భిన్నత్వాన్నికూడ బయటపెడుతుంది. అది ఏకత్వంలో భిన్నత్వం కోసమని, ఆ భిన్నత్వంలోని పరిపూర్ణత కోసమని పనిచేస్తుంది; మానవనైతికత ఆత్మస్వేచ్ఛ, జీవితపు వైవిధ్యాలకు భిన్నంగా ఒక

కృత్రిమ విలువను పెంపొందింప జేస్తుంది. అది సుస్థిరం, పరిమితం అయిన ఒక మానసిక సృష్టి చేసి దానినే అందరూ అనుసరించాలని అంటుంది. అందరూ అదే ఆదర్శభావాన్ని, అవే లక్షణాలను పొందాలి. నైతికమంటే దైవము కాదు. దైవానికి ఏ విధంగానూ సంబంధించినది కాదు. అది కేవలం మానవుడికే చెందుతుంది. నైతికము మంచిచెడులను రెండు భాగాలుగా స్థిరపరచి. వాటినే మూలాంశంగా తీసుకుంటుంది. కాని ఇది ఏకపక్షంగా చేసిన విభజన. అది సాపేక్షంగాఉన్న వాటిని తీసుకొని అవే నిరపేక్షమైనట్లు విధించాలని చూస్తుంది. ఈ విధమైన మంచి చెడులు విభిన్న వాతావరణాలలోను, కాలాలలోను, యుగాలలోను, దేశాలలోను, వేరువేరుగా మారిపోతాయి.

ప్రశ్నోత్తరములు 1929 (4 ఆగస్టు)

ఇదివరలో మానవులు దేవాలయాలలో నరబలి ఎందుకు యిచ్చేవారు ?

నాకు ప్రశ్న బాగా అర్థంకాలేదు. ఎందుకు చేయకూడదు? మేకను బలి యివ్వడంలోను, మానవుడిని బలి యివ్వడంలోను తేడా ఏమీ లేదు. అనుశ్రుతంగా మనకు తెలిసినది ఒకటైతే అసలు జరిగింది వేరొకటి ఉంటుంది. బలి యివ్వడాన్ని గురించి చెప్పినప్పుడు అది కేవలం సాంకేతికం గావచ్చు. కొన్ని మతాలు వేలవత్సరాలలో మానవులను బలి యిచ్చినట్లు మనకు తెలుస్తోంది. వస్తువులను నాశనం చేసే మానవ సహజాత స్వభావం వంటిదే అది. ఈ మతాలది

నాశనానికి దారితీసే స్వభావము. ఇప్పుడు ఇంకా అనేకరకాలుగా ఉంది. ఎవరైనా పదార్థమయమైన అర్పణలు ఎందుకు చేస్తున్నారని అంటే చెప్పడానికి ఆ విషయం మనకు తెలియాలికదా! నాకు మాత్రం ఆవిషయం అంతబాగా తెలియదు. అది జీవితాన్ని ఏదృక్పథంతో చూస్తున్నారు అనేదానిపై ఆధారపడుతుంది. ఏమైనప్పటికీ తోటిమానవుని దైవానికి బలి యిచ్చేటంత ఆధిక్యతను, అర్హతను తనకు ఆపాదించుకున్నా, లేదా దాన్ని ఒకానొక ప్రత్యేకదృక్పథంతో చూపినా అది తప్పకుండా దుష్టమైఖరే. బలి యివ్వడంలో జంతువునిస్తే ఒకటీ మానవుని ఇస్తే మరి ఒకటా? ఎంత ఆశ్చర్యము!

ఇప్పుడు ఈదేశంలో ఉన్నట్లు అదివరకు చాలా మతాలలో శిరోరహితమైన కాళికా* దేవాలయాలు ఉన్నాయి, అదంతా అజ్ఞానాంధకారంతో కూడిన విషయము. ఏరకమైన హానీ చేయకుండా శాంతించ(తృప్తిచెంద)డానికి రక్తాన్నిగాని, శక్తినిగాని, మరేదైనాకాని కోరే అమానుష దేవత అనే అజ్ఞానంతో కూడిన భీతివల్ల అలా చేస్తారు. దైవం అంటే రాక్షసత్వం అనే దురభిప్రాయం వల్లనూ, భయం వల్లనూ ఇలా జరుగుతుంది. ఒకవేళ ఈ సిద్ధాంతం సమ్మతించినప్పటికీ ఒకేఒక బలిని అనుమతించవచ్చు. అదే ఆత్మబలి. తనకు బదులుగా యింకొక జీవిని బలి యివ్వడానికి—యింకొక జంతువుపైగాని యింకొక మానవునిపైకాని హక్కు ఎవరికుంది? ఏదైనా బలి ఇవ్వాలనుకుంటే ఆత్మబలి ఇవ్వాలి గాని యితరులను కాదు, యితరులవీ కాదు. అసలు ఈవిషయమే ఇంత జుగుప్సాకరంగాను, అజ్ఞానాంధకారబంధురంగా ఉండగా, మేకను బలి యివ్వడంలోను, మానవుని బలియివ్వడంలోను తేడా ఉండవలసిన అవసరం ఏముంది? మేక దృష్ట్యా అది భరింపరాని ఆలోచన—మేకనే ఎవరైనా ఆవిధంగా అడిగితే....

మానవులకు ప్రపంచంలో తమ ప్రాముఖ్యాన్ని గురించి, వ్యక్తిత్వపు విలువను గురించి విచిత్రమైన ఊహాలుంటాయి. అయినప్పటికీ అవేమీ అడ్డురావు.

---

* శిరోరహితమైన కాళిని సేవించడానికి ప్రతి సంవత్సరం మానవులు కొన్ని వేల కోడిమెడకాయలు విరుస్తారు.

"ఇంకో జీవి ప్రాణాన్ని తీసుకునేందుకు నీకు హక్కులేదు" అంటే ఒప్పు కుంటారు. బలి యివ్వడం మానివేయి. లేదు బలి ఇవ్వాలనుకుంటే నీ ఆత్మ బలిదానం చేయి. రక్తాన్నిగాని, మరి యితరమైన ప్రాణిక శక్తులను వేటి నైనాగాని సమర్పిస్తే తృప్తిచెందే ఘోరమైన దేవుడు ఒకడున్నాడని నీవు నమ్మితే అలాగే చేయి. కాని, బలి చేయడానికి ఏ అధికారంతో నీవు ఇంకో జీవి ప్రాణం తీయాలనుకుంటావు? అది భరింపరాని క్రౌర్యము. బలికోసం కోడిపెట్టలను చంపినా అంతే. కాని నా ఉద్దేశం ప్రకారం దానికి యింకో కారణముంది. అది మానవులకు విందు, మితిమీరి విందారగించడానికి ఒక అవకాశము. నాకు మాత్రం రెండురకాల బలులకూ తేడా కన్పించడంలేదు.

దుష్ట పరిసరాలలోను, మానసిక ప్రాణిక కల్లోలాలలోను, చిక్కుకొన్నప్పుడు కూడా దైవసాక్షాత్కారం పొందడం సాధ్యమా ?

పరిసరాలనేవి ఆంతరంగికంగా లేనప్పుడు అది సాధ్యమే. అలా ఉంటే అది చాలా కష్టము. అనుమానాస్పదమైన జీవితాలను గడుపుతున్నవారు కూడా దివ్యసాక్షాత్కారములను పొందిన సందర్భాలు అనేకము. తప్పతాగిన ఒకానొక సందర్భంలో అకస్మాత్తుగా దైవదర్శనం లభించిన త్రాగుబోతు కథఉంది. అది అతని జీవితవిధానాన్నే మార్చివేసి ఆ తర్వాత అతను మద్యపానం చేయకుండా ఆపు చేసింది. కాని, అతనికి దైవ సాక్షాత్కారం కలిగిన క్షణంలో మాత్రం మంచి నిషాలోనే ఉన్నాడు. మనం మళ్ళీ వెనుకటి విషయానికే వస్తున్నాము. దైవం నైతికవేత్త అని నేననుకోను. నైతిక పాలన చేసేది మానవుడే కాని దైవంకాదు. అన్ని సంఘటనలూ ఏకమైన ఒకానొక క్షణంలో జీవికి ఉన్మీలనం కలిగినప్పుడు ఎవరిలోనైనా చైత్యపురుషుడు మేల్కొనవచ్చు. సర్వాంతర్యామి యైన దైవం అపుడు ప్రత్యక్షమవుతాడు. అదే తన ప్రాముఖ్యం. గొప్పతనాలతో గర్వించి కన్నుమిన్ను గానని ఋషిగాని సాధువుగాని అయితే అతనిలో దైవం సాక్షాత్కరించడం కష్టము. ఎందుచేతనంటే, దైవం అభివ్యక్తం కావడానికి అతనిలో స్థానం లేదు. విజ్ఞుడైన అతని వ్యక్తిత్వానికీ అతని నైతిక విలువకీ తప్ప అతనిలో మరిదేనికీ చోటులేదు.

సంపూర్ణమైన పరిశుద్ధత, పరిపూర్ణమైన విజ్ఞత గల ఒక స్థితిలో దైవంతో స్పర్శను అనుభవించవచ్చు. ఆసందర్భంలో అయితే, దాని అర్థం వారు ఒకరకమైన పరిపూర్ణతను పొందారనీ. వారు వ్యక్తిగత ప్రాముఖ్యం, వ్యక్తిగత విలువలనే విషయాలను పూర్తిగా విడిచిపెట్టారనీ చెప్పవచ్చు. అదే ముఖ్యము, గర్వం, వ్యక్తిగతవిలువ, వ్యక్తిగత సామర్థ్యం, వ్యక్తిగత శక్తి, యివన్నీకూడా దైవ సంస్పర్శకు ఆటంకాలు, అవరోధాలు, వీటి వల్ల వ్యక్తి చాలా ఘటికుడై, గొప్పవాడవడంవల్ల దైవానికి స్థానముండదు.

అన్నింటికన్నా ముఖ్యం ఆకాంక్ష ప్రబలంగా ఏర్పడడము. ఈ విధంగా ప్రబలమైన ఆకాంక్ష అన్నిరకాల పరిస్థితులలోను ఏర్పడుతుంది.

పొరబడకూడని అంశాలు రెండున్నాయి. అవి, కొన్నిరకాల అవసరాలు (భౌతిక పదార్థాన్ని పూర్తిగా స్వాధీనపరుచుకోవడంలో కృతకృత్యులు కావాలనుకుంటేనే అవి అవసరాలు), కొన్ని నైతిక విలువలు. ఇవి రెండూ వేరు. ఉదాహరణకు, కొందరు వారి భౌతిక చైతన్యాన్ని స్వాధీనపరుచుకొని దానికి యజమానియై వారి శరీరాన్ని పూర్తిగా పరివర్తన పొందేటట్లు చేయడం కోసం వారి శరీరం విషగ్రస్తం కాకుండా, మేధాశక్తి పొరగమ్మకుండా, సంకల్పం రద్దుకాకుండా నిలబడగలరు. అట్లాకాకుండా, ఆ రకంగా చేస్తే నైతికవిలువ పెరుగుతుందనే ఆలోచనతో చేస్తేమాత్రం, అది వారికి ఏరకంగాను ఉపయోగపడదు. అది అందుకోసం ఏర్పడలేదు. అది అవసరాన్ననుసరించి ఆచరించేది. ఉదాహరణకు, విషగ్రస్తుడవవుతావని నీకు తెలుసు కాబట్టి నీవు విషం తీసుకునే అలవాటు చేసుకోవు.. కొంతమంది క్రమంగా విషపూరితం చేసే వస్తువులను వాడతారు. వాటికి దుష్ఫలితాలు లేవని వారనుకుంటారు. ఎందువల్లనంటే, వాటి ప్రభావం కనబడనంత మెల్లగా వారిపై ప్రసరిస్తుంది. ఎవరైనా భౌతిక చర్య లన్నిటిమీద యాజమాన్యం పొందగలగాలనుకొని, దాని కోసం శరీరంపై ప్రతిచర్యలు జరిపించే నాడీ కేంద్రంలో కాంతిని నిలపగలిగితే వీటిని మానివేయాలి కాని నైతిక విలువలకోసం కాదు. యోగసిద్ధి పొందాలనే దృష్ట్యా అవసరం కాబట్టి యివి మానేయాలి. యోగ్యత సంపాదించాలని గాని, లేదా యోగ్యత సంపాదిస్తావు గనుక దైవం సంతోషించి నీలో వ్యక్తమవుతాడనే

ఉద్దేశంతో గాని యిది చేయకూడదు. అది కానేకాదు. ఇంకా చెప్పాలంటే, తప్పులు చేసినవారు తమ తప్పులను గుర్తించి, బలహీనతను తెలుసుకొని, శ్రద్ధతో (విధేయతతో) దానినుంచి బయటపడాలని ఆకాంక్షిస్తే వారికే దైవం సన్నిహితుడౌతాడు. ఎన్నడూ ఏరకమైన తప్పులూ చేయకుండా, ఇతర మానవుల దగ్గర తన ఆధిక్యతను చూచుకొని సంతృప్తి చెందేవారి కన్నా దైవం వీరినే ఎక్కువ సన్నిహితులుగా భావించవచ్చు. తప్పులు చేయడం, చేయకపోవడంలో ఏమీ లేదు. అన్నింటికన్నా ఎక్కువ తేడాను కలుగజేసేది వారికున్న శ్రద్ధ, స్వతఃసిద్ధత, ప్రగాఢ ఆకాంక్ష— ఆ ఆవశ్యకత ఎటువంటిదంటే, ప్రపంచంలో మిగిలినదేదీకూడా లెక్కకు రానంత ప్రగాఢమైన ఆవశ్యకత. ఇదివరకు ఆత్మార్పణ, అర్పణలను గురించి చెప్పినట్లుగా దేనికైనా విచారిస్తే వారు ఆధ్యాత్మిక చైతన్యస్థాయిలో ఉన్నట్లు కాదు. తమ కోరికలను పరితృప్తి చేసుకోలేక పోయినందుకు విచారిస్తే, వారి కోరికలు వారు ఆకాంక్షించేదానికంటె ఎక్కువ కాకపోయినా దానితో సమానమైన ప్రాముఖ్యం కలవన్నమాట. "వాంఛలను నేను చైతన్యవంతంగా గుర్తించగలను కదా. దైవ సాన్నిధ్యం కోసం నా వాంఛలను పరిత్యజించేటపుడు, ఆ దైవాన్ని పొందుతానని నాకు పూర్తి నమ్మకం లేకపోతే, దానిని నేను త్యాగమనే చెపుతాను" అని నీ వనవచ్చు. దానిని నేను దైవంతో బేరమాడడమే నంటాను. "ఇచ్చి పుచ్చుకో. నా వాంఛా పరితృప్తి లోని ఆనందాన్ని నీకు యిస్తాను. దానికి ప్రతిఫలంగా నాలో నీవు ఉండడంవల్ల కలిగే ఆనందం కలిగించు. లేకపోతే అది న్యాయం కాదు." అంటే, అది ఆత్మార్పణ కాదు. కేవలం బేరమాడడమే.

ఇది నేను చాలాసార్లు విన్నాను. "నేను చాలా త్యాగం చేసాను. చాలా కష్టపడ్డాను, చాలా శ్రమించాను. అయినప్పటికీ, దానికి ప్రతిఫలంగా నాకేమీ రాలేదు" దానికి నేను ఇలా బదులు చెప్తాను: "అందులో ఏమీ ఆశ్చర్యం లేదు."

### బాగా గర్వంకలవారు ఆకాంక్షాపరులు కాగలరా?

ఎందుకు కాకూడదు? గర్వం కలవారే గర్వభంగమైనప్పుడు వివేకవంతులవుతారు. దెబ్బలు తగిలినప్పుడు వారిలో చైతన్యం కొద్దిగా మేల్కొంటుంది.

అప్పుడు వారికి ఆకాంక్ష కలుగుతుంది. దానికితోడు వారి స్వభావం ప్రగాఢమై కొంత బలంతో కూడినదైతే వారి ఆకాంక్ష శక్తిమంతమౌతుంది.

దెబ్బలు తగలకుండా కూడానా ?

అలా జరుగవచ్చు. కాని, అప్పుడు అన్నీ కలగాపులగం అవుతాయి. అన్ని సందర్భాలలో కూడా కలిసిపోతాయి. అవి స్పష్టం కావడానికి చాలాకాలం పడుతుంది. ఏదో స్థాయిలో ఎక్కడో అక్కడ ఏదో పరిస్థితిలో మొదలుపెట్టవచ్చు. ఎప్పుడైనా మొదలుపెట్టవచ్చు. కొన్ని సందర్భాలలో చాలాకాలం పడుతుంది. ఆ మిశ్రమము ఎలా ఉంటుందంటే, ఒక అడుగు ముందుకు వేస్తే అందులో సగం వెనక్కి వెడుతుంది. దీనికి ప్రత్యేక కారణం ఏమీ లేదు. వ్యక్తి జీవితంలోని ప్రధాన ఉద్దేశ్యం భగవంతుని తెలుసుకోడమే కదా. అది ఎక్కడైనా ఎప్పుడైనా కావచ్చు. ఏమాత్రం అవకాశం ఉన్నా పైకి ఉబుకుతుంది. ఎవరైనా పూర్తిగా సంతృప్తి చెందితేమాత్రం అదే ఒక అవరోధమవుతుంది. ఎందుకంటే, అప్పుడు వారు ఆత్మసంతృప్తితో నిదురిస్తారు. (వారి చైతన్యం నిదురిస్తుంది) కాని అది ఎక్కువకాలం నిలువదు. ప్రపంచంలోని ప్రస్తుత జీవిత పరిస్థితులలో, అహంకారంతో కూడిన సంతృప్తి, అంటే వ్యక్తిగత సంతృప్తి ఎక్కువకాలం నిలవలేదు. అది ఉన్నంతకాలం మాత్రం వ్యక్తులు కరుడుగట్టిపోయి ఆకాంక్షించ లేరు. కాని అది ఎక్కువకాలం ఉండదు. ఇంకేమైనా అడుగుతారా ? ఇంకెవరూ ఏమీ చెప్పరా ?

ఈరోజుకి చాలిద్దాము. సుఖంగా నిదురపొండి !

## 11 నవంబరు 1953

శ్రీమాత Quelques Peroles, Quelques Prieres మొదటి పేజీలు చదవడం మొదలుపెట్టబోతున్నారు.

ఈ మొదటి ప్రతులు 1912 లో వ్రాయడం జరిగింది. మీలో చాలా మంది అప్పటికింకా పుట్టలేదు. మేము 12 మందిమి ఒక సంఘంగా ఏర్పడి వారానికి ఒకసారి కలుసుకునేవాళ్ళము. చర్చనీయాంశం ముందుగా యిచ్చే వారు. ఆ వారం దాని సమాధానం వ్రాసుకొని రావాలి. ప్రతి ఒక్కరూ తాము వ్రాసింది పట్టుకొచ్చేవారు. సాధారణంగా నేనుకూడా సంక్షిప్తంగా తయారుచేసి తీసుకువెళ్ళి, చివరికి చదివేదాన్ని. అదే యిక్కడ ప్రచురించబడి ఉంది, అంతా కాకుండా ఈ రెండు మాత్రమే. మొదటివి రెండు మాత్రమే. ఆ తరువాతవి ఇంకొకటి. మిగిలినవి 'వర్డ్స్ ఆఫ్ లాంగ్ ఎగో' అనే పుస్తకంలో ప్రచురిత మయినాయి.

ఆ విధంగా నాలుగు సమావేశాలు జరిగినాయి. మొదటి సమావేశంలో చర్చనీయాంశం "సాధించవలసిన లక్ష్యం ఏది? దానికి చేయవలసిన దేమిటి? ఏ సాధనాలద్వారా సాధించాలి? దానికి నా జవాబు :

శ్రీమాత 7 మే 1912 * న వ్రాసిన దానిని చదువుతారు.

ప్రగతిశీలమైన విశ్వసామరస్య ఆగమనమే మనం సాధించవలసిన లక్ష్యము.

ఆదే అతిమానసము.

శ్రీ అరవిందులను అప్పటికి నే నెరుగను. అప్పటికింకా వారేమీ వ్రాయలేదు.

> "మూర్తి త్రయంతోను, సప్త విశిష్టతలతోను, ద్వాదశ లక్షణాలతోను ఉన్న అచింత్యుని ప్రథమ వ్యక్తీకరణకు భువిపై పరిపూర్ణ ప్రతినిధులుగా తయారుకావాలని"

> "మూర్తిత్రయము, సప్తవిశిష్టతలు, ద్వాదశ లక్షణములు,— అని మీరు అంటున్నవి ఏమిటి ?

నాకు ఇపుడు గుర్తులేదు. మూర్తిత్రయం ప్రేమ, జ్యోతిస్సు, జీవనము అనేవి. అవి మూడూ సచ్చిదానందములకు సరిపోతాయి. సప్తవిశిష్టతలు,— అవి ఎక్కడో వ్రాసి పెట్టాను. సృష్టి ఏడుసార్లు జరిగిందని చెప్పే పూర్వపు సంప్రదాయం ప్రకారం, మొదటి ఆరుసార్లూ జరిగిన సృష్టులు స్రష్టలోకి తిరిగి విలీన మైపోయినాయి. ప్రళయం అని చెప్పేది యిదే. ఆ విధంగా ఆరుసార్లు యిలా జరిగిన తర్వాత ఏర్పడిన ఏడవ సృష్టి ప్రస్తుతం నడుస్తోంది. ఇదే చివరిది. శాశ్వతంగా కొనసాగేది ఇదే. దీని పేరు 'సమతాసృష్టి' ఈ సృష్టులను గురించి నేను ఎక్కడో వ్రాశాను. వాటి క్రమం నాకు గుర్తు లేదు. ఒకదాని తర్వాత ఒకటిగా సృష్టి ఆరుసార్లు జరిగింది. ఒక్కొక్కటి ఒక్కొక్క ప్రత్యేక పద్ధతి ప్రకారం ఏర్పడి, అపరిపూర్ణంగా తోచగానే ఉద్భవస్థానంలోకి ఉపసంహరించబడింది. మళ్ళీ పునః సృష్టి ఏర్పడి ఈ విధంగానే జరిగింది. ఈ రకంగా ఆరుసార్లు జరిగింది. అది క్రమానుగత పురోగతి. ఆ క్రమం తెలిసినట్లయితే ప్రతి సృష్టిలోనూ ఉన్న మూలసూత్రం (ముఖ్యోద్దేశం) విశదమౌతుంది. ఈ సంప్రదాయ ప్రకారం సమతాస్థితి ప్రస్తుత సృష్టికి మూలసూత్రం అని, ఇదే అంతిమ సృష్టి అనీ తెలుస్తోంది. ఈ లోకం మళ్ళీ ప్రళయానికి గురికాక, ఎడతెగకుండా పురోగమిస్తుందని దాని అర్థము. ప్రస్తుత సృష్టి సమతాస్థితి మూలంగా ఏర్పడిందని తెలుసుకోవాలి.

అందువల్ల, యిది మంచి, యిది చెడు, అనేది లేదు; ఏది సమతాస్థితిలో ఉన్నది, ఏది లేదు, అనేదే లెక్క. అసమస్థాయి, సమస్థాయి, అనేవే ఉన్నాయి. అంతే, నేను అప్పుడు చెప్పింది దానిమీద ఆధారపడింది.

ద్వాదశ లక్షణాలు అనేవి వేరే ఉన్నాయి. అవి ఎక్కడో వ్రాసిపెట్టాను. ఈ ప్రపంచం కొనసాగాలంటే, ఈ ద్వాదశ లక్షణాలద్వారా అన్ని అంశలూ పరిపూర్ణ సమతాస్థితిని సాధించాలి. అప్పుడు ఈ ప్రపంచం నిరవధికంగా పురోగతి చెందుతూ సామరస్యం ఎన్నటికీ చెడగొట్టుకోకుండా వినాశనానికి దారి తీయకుండా నిలుస్తుంది.

ఇప్పటి మానసిక స్థితికి అనుగుణమైన రీతిలో, ఈ ప్రపంచానికి ఒక క్రొత్తరూపమున 'సనాతన వాణి' ని వినిపింపజేయవలసి ఉన్నది. ఆ 'సనాతన వాణి' సర్వమానవ విజ్ఞాన సమన్వయంగా రూపొందుతుంది.

ఇక్కడ మీరు చెప్పే 'సనాతనవాణి' ఏమిటి ?

'వాణి' అనే మాటను నే నిచట 'సత్య' మనే అర్థంలో ఉపయోగిస్తున్నాను. శాశ్వతంగా యథార్థమైన పరమసత్యం ఒకటున్నది. కాని, అది కొన్ని నిశ్చిత రూపాలను దాలుస్తుంది. ఈ నిశ్చితరూపాలు మారుతూ, రూపాంతరం చెందుతాయి. ఒక్కొక్కప్పుడు విరూపం కూడా చెందవచ్చు. నిజం తెలుసుకోవాలంటే మూలానికే వెళ్ళాలి, ఆ మూలమే సనాతనవాణి, అది సృజనాత్మకం. అదే సత్యము. శాశ్వతమైనదీ అదే. అది అనేకరకాల శబ్దముల ద్వారా, భావములద్వారా వ్యక్తమవుతుంది. శబ్దమనే పదాన్ని నేను సాహిత్యపరంగా ఉపయోగిస్తున్నాను. అదే యింకోచోట సృజనాత్మక శబ్దముగా, వాణిగా వాడబడింది. అదే అన్ని ప్రవచనములకు, అన్ని ఆలోచనలకు మూలము.

"సాధించవలసిన ఆదర్శం" ఏదో నాకు అర్థం కాలేదు.

సాధించవలసిన ఆదర్శమా? నేను ఏమి చెప్పాను? భువిపై సామరస్యం నెలకొల్పడమేనని చెప్పాననుకుంటున్నాను. కాదా?

"భూమికి సంబంధించినంత వరకు, ఈ ఆదర్శాన్ని సాధించడానికి మార్గం అందరినీ చైతన్యవంతంగా చేసి మానవైక్యతను సాధించడం, ఏకైక ఆంతర దివ్యత్వాన్ని అందరూ వ్యక్తీకరించేటట్లు చేయడము.

ఇంకోరకంగా చెప్పాలంటే, అందరిలోనున్న దైవంయొక్క సామ్రాజ్యాన్ని నెలకొల్పడం ద్వారా ఐక్యతను కలుగచేయవచ్చును.

అందువల్ల, అన్నిటిలోకీ ఉపయోగమైన పని ఏదంటే: "దైవాంశ తమలో ఉన్నట్లు ప్రతివారూ చైతన్యాత్మకంగా గుర్తెరిగి దానితో ఏకత్వం పొందడము."

అవును, నీకు అర్థం కాలేదూ? ఇంతవరకు కొన్ని వందలసార్లు చెప్పాను కదా!.... ఆఁ, యిప్పుడు నీ కర్థమైనట్లున్నదే? (నవ్వులు)

"2) ఇంతవరకు మానవునిలో చైతన్యాత్మకంగా లేని అనేక స్థితుల వ్యక్తీకరణం జరగాలి. ఆ తర్వాత, ఇంతవరకు పృథ్వికి అందుబాటులో లేని ఒక విశ్వ

శక్తితో లేదా అనేక విశ్వశక్తులతో దానికి సంబంధం
ఏర్పరచాలి."

ఇంతవరకు మానవునిలో చైతన్యాత్మకంగా లేని అనేక స్థితులు వ్యక్తీకరణం పొందాలి. అంటే, ఒకదానిపై ఒకటిగా ఏర్పడిఉన్న చైతన్య స్థాయిలు, ఇంతవరకు భూమిపై వ్యక్తంకాని క్రొత్త భూమికలు ఉన్నాయి. వీటినే శ్రీఅరవిందులు అతి మానసిక స్థాయిలు అన్నారు. అదీ, నేను చెప్పినదీ ఒకటే. అంటే, పృథ్విపై యింతవరకు వ్యక్తం కాకుండా ఉన్న సృష్టికి లోతుగా గాని, పై స్థాయికి గాని వెళ్ళి దానిని తెలుసుకొని భూమిపై వ్యక్తం చేయాలి. ఈ స్థితులు మానవునిలో యింతవరకు చైతన్యవంతంగా లేవని మాత్రం నేను చెపుతాను. (మానవుడు యింతవరకు అవి ఉన్నట్లుగా తెలుసుకో లేదు.) వాటితో ఏకత్వం పొంది బాహ్యచైతన్యంలోకి తీసికొనివచ్చి వాటిని కార్యాచరణలో వ్యక్తీకరించవచ్చు. అంతేకాక, దానికింకా నేను మరికొంత (ఇది నేను ముందుగా చూచింది—— శ్రీఅరవిందులు అలా కార్యాచరణలో చేస్తారని నాకు అప్పట్లో తెలియదు. అయినప్పటికీ యిది చేయవలసిన కార్యంగా నేను అప్పుడే గుర్తించాను) ఈ తీరుగా చేర్చాను:

3) "ప్రస్తుత ప్రపంచ మనస్తత్వానికి అను
గుణంగా సనాతనవాణిని క్రొత్తరకంగా ఈ ప్రపం
చానికి వినిపించడము."

అదే పరమసత్యం, పరమ సామరస్యం. అదే శ్రీఅరవిందులు కొనసాగించిన పూర్తి కార్యక్రమము; భూమిపై పనిచేయవలసిన విధానము; దీనిని నేను 1912 వ సంవత్సరములోనే ముందుగా తెలుసుకున్నాను. శ్రీఅరవిందులను నేను 1914 వ సంవత్సరంలో మొదటిసారిగా కలుసుకున్నాను. అంటే, ఈ కార్యక్రమం నేను తయారుచేసిన తర్వాత రెండు సంవత్సరాలకు.

4) "భగవంతుని 'సంతతి' అనే నూతన జాతి వికాసం చెందడానికి అనువైన స్థలంలో ఒక ఆదర్శ సంఘాన్ని సామూహికంగా స్థాపించడము."

ఆశ్రమం ఎక్కడ స్థాపించాలని నిర్ణయించారు ?

ఎక్కడ స్థాపించాలని నిర్ణయించానా ! నేను ఏమీ నిర్ణయించలేదు. కాని, ఆ నిర్ణయం తీసుకోవాలని మాత్రం చెప్పాను. నాకు ఇండియాకు రావాలనే అభిలాష తప్ప మరి యే ఉద్దేశ్యమూ లేదు. దానికీ దీనికీ సంబంధం ఉన్నదని కూడా తెలియదు. నేనేమీ నిశ్చయించలేదు. ఏది చేయవలసి ఉందో ఆ స్థితిని దర్శించగలిగాను.

పిల్లలు అగస్టు 4, 1929 తేదీన శ్రీమాత జరిపిన సంభాషణను తిరిగి ప్రారంభించారు;

"సాధారణ సాంఘిక వ్యవస్థలు మానవులలో ఉదారులు, దురాశాపరులనే రెండు రకాలవారిని భేదంగా చూస్తాయి. దురాశాపరులను అసహ్యించుకుంటారు, తిడతారు. ఉదారపురుషులను నిస్వార్థులుగాను, సంఘానికి ఉపయోగపడేవారుగాను పరిగణించి వారి గుణాన్ని శ్లాఘిస్తారు. కాని, ఆధ్యాత్మిక దృక్పథానికి ఆ రెండు రకాలవారూ ఒకే స్థాయికి చెందినట్లే. ఒకరి ఔదార్యం, మరియొకరి అత్యాశ కూడా మహోత్కృష్టమైన సత్యానికి, మహా దివ్యశక్తికి విరూపాలు మాత్రమే. ఒక దివ్యశక్తి విస్తృతమౌతూ వికీర్ణమౌతూ, అత్యంత భౌతికస్థాయి

నుంచి అత్యంత ఆధ్యాత్మికస్థాయివరకూ అన్ని స్థాయిలపైకి శక్తినీ, అనేక విషయాలనూ, ఇంకా తన దగ్గరున్నవాటన్నిటినీ బహిర్గతం చేస్తూఉన్నది. ఉదారునికీ, అతని ఔదార్యానికీ వెనకాల ఆత్మరీతి ఉండి, అదే ఈ చలనాన్ని వ్యక్తం చేస్తుంది. వెదజల్లి, ఎక్కువ మేర విస్తరింప చేయగల శక్తిగా అతను పని చేస్తాడు. ఇంకొకరకమైన శక్తి, అంటే యింకో దివ్యచలనం అన్నిటినీ పోగుచేసి కూడబెడుతుంది. అది శక్తులను, అనేక వస్తువులను, ఉన్నత స్థాయికి చెందినా హీనస్థాయికి చెందినా అన్నిటినీ పోగుచేసి కూడబెడుతుంది. దురాశాపరుడని నీవు హీనపరచినవాడు ఈ చలనానికి ఉపకరణంగా పని చేస్తాడు. ఇద్దరూ ముఖ్యమే. పథకం పూర్తికావడానికి యిద్దరకూ పాత్ర ఉంది. కూడబెట్టి, కేంద్రీకరించేటట్లు చేసే చలనపు అవసరం విస్తరింపచేసి వెదజల్లే చలనంకన్నా ఏమాత్రం తక్కువ కాదు.

ప్రశ్నోత్తరములు 1929 (4 ఆగస్టు)

'ఆత్మరీతి' అంటే అర్థం ఏమిటి ?

ఏమిటా వాక్యం ? (శ్రీమాత పుస్తకం చూస్తారు) ఆఁ, అది ప్రత్యేక రీతియందలి ఆత్మ; ప్రతి జంతురీతికీ వెనకాల అద్దాని ఆత్మ ఉంటుందని చెప్పాను కదా. అలాగే ప్రతిరీతిలోని మానవునికి వెనకాల ఒకరకమైన ఆత్మ ఉంటుందని

అర్థము. దానినే నేను ఆత్మరీతి అన్నాను. ఈ రకపు ఆత్మ పురోగతి చెంద వచ్చు. దానికి వినాశనం లేదు.

ఆత్మరీతి అంటే వ్యక్తిగతంగా గాని, సామూహికంగా గాని వస్తుధర్మా నికి సరిపోతుంది. ఒక్కొక్కప్పుడు దీనిని వస్తుసత్యం అని కూడా అంటారు.

ఔదార్యం సత్యం యొక్క విరూపమేనా ?

అవును. మానవుని గుణగణాలన్నీ వారి వెనకాల ఉన్న ఒక సత్యానికి విరూపాలు. నీవు గుణములన్నా, లోపాలన్నాకూడా వాటి వెనుకనున్నదానికి విరూపాలే, ఆ వెనకాల ఉన్నదేదైనా కావచ్చు. ఔదార్యం వెనకాల మనంచూచే సత్యం ఏమిటి ? అది విస్తరించే శక్తుల సంచలనము. అయితే ఈ శక్తులు విస్తరించాలంటే ముందర కేంద్రీకృతం కావాలి కదా. అందువల్ల ఒక రకమైన సంచలనం ప్రారంభమవుతుంది. శక్తులు కేంద్రీకృతమౌతూ, విస్తరిస్తూ తిరిగి కేంద్రీకృతమై మళ్ళీవిస్తరిస్తాయి....నీవు కేంద్రీకరించకుండా విస్తరింపచేయజూస్తే, కొంతకాలమైన తర్వాత విస్తరింపజేయడానికేమీ మిగలదు. ఇదే శక్తులన్నిటికీ వర్తిస్తుంది. ఇవిగాక, ధనం కూడా ఒక శక్తే. అది కేవలం శక్తే. అందువల్లనే దానిని స్వంతం చేసుకునేందుకు ఎవరికీ హక్కులేదు. ఇతర ప్రకృతి శక్తులు. విశ్వశక్తులు మాదిరిగానే ధనం కూడా ఒక శక్తే. వెలుతురు కూడా అటువంటిదే ఒక శక్తి అనుకుంటే "వెలుతురు నాది, దాన్ని గదిలో దాస్తాను. ఇతరులకు యివ్వను" అని అనాలని ఎవరికీ అనిపించదు. కాని, ధనం విషయంలో అదేదో వారి వ్యక్తిగత విషయం అనుకొని దానిని స్వంతం చేసుకొని దాచుకో వచ్చు ననుకునేటంతగా మూఢులౌతారు. అది అలాగే జరుగుతోంది. ధనం అంటే నోట్లు కాదు. ఎందువల్లనంటే, దీపం ఉంటే దాన్ని వెలిగించి "ఈ వెలుగు నాది" అన్నట్లే ఉంటుంది. దీపం నీదే కావచ్చు. అలాగే "డబ్బు, నోట్లు, వెండి నాణాలు" నీవి. అది ధనం కాదు. దాని వెనకాల ఉన్న మారక శక్తే ధనం. అది ఎవరికీ చెందదు, అందరకూ చెందుతుంది. అది తిరుగు తుంటేనే దానికి జీవం ఉంటుంది. ఒకచోట నిలవచేస్తే దాని జీవశక్తి పోతుంది. పూలకూజాలో నీరుపోసి అలాగే ఉంచాలనుకుంటే ఆ నీరు మురిగిపోయినట్లుగా,

ధనంకూడా మురిగిపోతుంది. దానిని మానవులు ఇంకా అర్థం చేసుకోలేదు. తరువాత దానిని గురించి వ్రాస్తాను.

అది ఎప్పుడూ ఆ విధంగా ఉండదు.

భౌతిక వస్తువులపై పేరాశ ఉన్నప్పుడు... ?

అన్ని వస్తువులమీదా పేరాశా? అలాగే ఆధ్యాత్మిక విషయాలకు కూడా అత్యాశ ఉంటుంది. అన్ని శక్తులనూ తామే అట్టేపెట్టుకొని ఎప్పుడూ యితరులకు యివ్వనివారే లోభులు. దాన్ని గురించిన సత్యం ఇంతకు ముందే చెప్పాను కదా. విస్తరింపజేసే శక్తికోసమే కూడబెట్టుకోగల శక్తి సంగ్రహించాలి. నీకు ఆ రెండింట్లో ఏదో ఒకటే ఉన్నట్లయితే సమత చెడుతుంది. అప్పుడు అది అత్యాశగా గాని, వ్యర్థంగాగాని కనిపిస్తుంది. అందుచేత, సమస్థాయిలో, లయబద్ధమైన చలనంగా ఈ రెండూ ఉండవలసిందే. ముఖ్యంగా ప్రస్తుత పరిస్థితుల్లో సమతా స్థితి సరైన మార్గమని తెలుస్తోంది కదా! అటుగాని యిటుగాని మొగ్గకుండా బుద్ధుడు చెప్పిన 'మధ్యేమార్గాన్ని' అనుసరించాలి. ఆ మధ్యేమార్గమే సమతా స్థితి. అందుకుగాను తాడుమీద నడుస్తూ చేతిలోని కర్ర సహాయంతో సమస్థాయి నిలుపుకున్నట్లుగా తెలిసికొని ప్రవర్తించాలి.

ఈ ప్రపంచంలో అందరికంటె ఔదార్యవంతుడు కూడా తనదగ్గర మొదట ఏమీ లేకపోతే యివ్వలేడు కదా! మొదట కూడబెట్టినది తాను కాకపోయినా, వేరొకరు తనకొరకు కూడబెట్టి యుండవచ్చు. కాని, తన జేబులో ఏమీ లేకపోతే తాను ఏమీ పంచిపెట్టలేడు. అది విశదమే కదా! పంచిపెట్టే శక్తి ఎంత ముఖ్యమో కూడబెట్టే శక్తి కూడా అంత ముఖ్యము. ఇవి రెండూ ఎప్పుడైతే అహంభావ పూరితమవుతాయో, అప్పుడు పూర్తిగా విరూపం చెందుతాయి. వాటి విలువ పూర్తిగా పోతుంది.

18. నవంబరు 1953

పునర్జన్మ దాల్చేది, తల్లిదండ్రులు పరిసరాలు, పరిస్థితులు ఏర్పరచే బాహ్యజీవి కాదు. అంటే మనోమయ, ప్రాణమయ, అన్నమయ పురుషుడు కాదన్నమాట. ఒక శరీరాన్ని వదిలి యింకొక శరీరాన్ని ధరించేది చైత్యపురుషుడే. అందువల్ల, మనోమయ పురుషుడు కాని ప్రాణమయ పురుషుడు కాని పూర్వజన్మలను గుర్తుపెట్టుకోలేడు; ఒకానొక వ్యక్తి లక్షణాలలోగాని, జీవిత విధానంలోగాని తనను తాను గుర్తుపెట్టుకోలేడు. అదంతా చైత్యపురుషునికి మాత్రమే గుర్తుంటుంది. మనలో చైత్యపురుషుని గుర్తించి చేతనత్వంపొందిన ఘడియలలో మాత్రమే మన పూర్వజన్మల సరైన స్మృతి కలుగుతుంది.

మనం పూర్వపు జన్మలో ఎలా ఉన్నామో తెలుసుకునేందుకు ప్రయత్నించే దానికన్నా మనం యీ జన్మలో ఎలా ఉండాలో తెలుసుకునేందుకు ప్రయత్నించడం చాలా ముఖ్యము.

ఏప్రిల్ 2, 1935 శ్రీమాత వాక్కులు (1929) పేజీ 185.

పునర్జన్మ ఎత్తేది మనోమయ, ప్రాణమయ, అన్నమయ పురుషుడు కాకుండా చైత్యపురుషుడే అయితే

### ఒక జన్మలో పొందిన మానసిక ప్రాణిక పురోగతి మరొక జన్మలో ఏమీ ఉపయోగించదా ?

వీటిలోని పురోగతి చైత్యపురుషునికి ఎంత దగ్గరగా తీసుకొస్తే, అంటే అన్నిభాగాలనూ చైత్యపురుషుని ప్రభావంలోకి తీసుకొని వచ్చినంతవరకు పురోగతి ఉంటుంది. ఏదైతే చైత్యపురుషుని ప్రభావంలో ఉండి, చైత్యపురుషునితో ఏకత్వం పొందుతుందో అది మాత్రమే పురోగతి కొనసాగిస్తుంది. చైత్యపురుష సత్తయే జీవితానికి అధికృత వహిస్తూ దానిచుట్టూ మిగిలిన జీవితమంతా వ్యవస్థీక రించుకొని జీవి అంతా దాని ప్రభావానికి లోనైతే దానితో ఏకత్వం పొంది అవసర మైతే పురోగతి కొనసాగిస్తుంది. నిజానికి భౌతికదేహానికి గూడా అదే చలనాన్ని కలుగచేస్తే— అంటే చైత్యపురుషునికి ఏరకమైన పురోగతి, చలనాలు ఉంటాయో అవే భౌతిక దేహానికి కలుగచేస్తే అది చెడిపోవలసిన అవసరం లేదు. కాని అదే కష్టము.

చైత్యపురుషునితో సంస్పర్శ పొందినవి మాత్రమే చిరకాలం నిలుస్తాయి. వాటికే గుర్తుంటుంది. మిగిలినవన్నీ శరీరంతోపాటు నశించి, మట్టిలో కలిసి పోయి వేరొకచోట ఉపయోగిస్తాయి. మట్టిలో కలిసిపోయి, ఆ మట్టి చెట్లకి ఉపయోగపడగా మానవునికి అవి ఆహారమవుతాయి. ఈ విధంగానే మళ్ళీ మట్టిలో కలుస్తూ, మళ్ళీ పెరుగుతూ కొనసాగుతుంది. ప్రకృతి ఈ విధంగానే పురోగమిస్తుంది. పురోగమనం కోసం ఆమె అనేక రూపాలు తయారుచేసి, అవి నిరుపయోగం కాగానే నాశనం చేస్తుంది. తర్వాత మళ్ళీ ఆ ధాతువులన్ని టినీ కూడదీపి వేరొకదానిని తయారు చేస్తుంది. ఆ విధంగా నిరంతరం కొనసా గిస్తుంది. అది ఆమెకు చాలా బాగుంటుంది. ఎందువల్లనంటే, ఆమె చాలా ముందుచూపుతో కొన్ని శతాబ్దాల భవిష్యత్తును చూడగలదు, ఆ విధమైన దృష్టికి మానవ జీవితపరిమాణం నిరవధికంలో నిట్టూర్పుతో సమానము. అందువల్ల ఆమె కొన్నిటిని తీసుకొని, కొన్నిటిని తయారుచేసి కొంతసేపు వినోదిస్తుంది. అది ఆమెకు బాగుంటుంది. అది ఆమెకు బాగుండనప్పుడు మళ్ళీ నాశనంచేసి, అన్నీ కలిపివేసి కొత్తవాటిని రూపొందిస్తుంది. ఈ విధంగా ఆమె ప్రక్రియలు చాలా నిదానంగా జరిగి, చివరకు పదార్థమంతా పురోగతి చెందుతుంది. ఎప్పుడైనా

ఈ విధంగానే కలిసిపోతూ, విడిపోతూ, మళ్ళీ తయారవుతూ పురోగమిస్తుంది. ప్రతిసారీ అది బాగా కలవడంకోసం కొత్త పదార్థం చేరుతూ ఉంటుంది. ఏదో ఒకరోజు ఒక కొత్తది తయారు కావచ్చు. ఆమెకు తొందరలేదు; మనం తొందరపడినప్పుడు ఆమె "నీకెందుకంత తొందర. ఎప్పటికైనా అది జరిగేదే కదా, నీవు విచారించవలసిన అవసరం లేదు. శాంతంగా నిరీక్షించడమే నీవంతు"— "నిరీక్షించేది నేను కాదు" అని నీ వంటావు. ఎందువల్లనంటే, నీవు "నేను" అని చెప్పేది వచ్చిపోతూ ఉంటుంది కదా! నీవు శాశ్వతమైన దివ్యచైతన్యాన్ని 'నేను' అని పిలవగలిగితే అంతటా ఉండి అన్నీ చూడగలవు. నీవు అలా చేయడాన్ని ఎవరూ నిరోధించరు. కాని, నీవు నీ శరీరాన్నే "నీవు" అనుకుంటున్నావు. నీవు ఆవిధంగా అనుకోడం మానేస్తే ఇది సాధ్యమౌతుంది.

విశ్వ ప్రకృతిచర్యలలోని తర్కబద్ధమైన నియతత్వమే 'న్యాయ' మనునది.

భౌతిక దేహానికి వర్తించిన ఈ నియతత్వ ఫలితములే అస్వస్థతలు, వైద్య విజ్ఞానం అనుల్లంఘనీయమైన ఈ న్యాయానికి కట్టువడి ఆరోగ్యానికి దారితీసే పరిస్థితులను కలుగజేయడానికి ప్రయత్నిస్తుంది.

సాంఘిక వ్యవస్థలో నైతిక చైతన్యము, ఆధ్యాత్మిక క్షేత్రంలో తపస్సు ఈ పద్ధతిలోనే పని చేస్తాయి.

ఈ సార్వత్రిక ధర్మవిధానాలలో జోక్యం కల్గించు కొని మార్చగలశక్తి దివ్యకటాక్షానికి మాత్రమే ఉంది.

భువిపై దివ్యకటాక్షాన్ని వ్యక్తం చేయడమే అవతారం చేయవలసిన ముఖ్య కార్యము. ఒక అవతార

పురుషునికి భక్తుడు కావడమంటే దివ్యకటాక్షానికి ఉపకరణం గావడమే. సార్వత్రిక ధర్మం పనిచేసేవిధానంతో పూర్తిగా ఏకత్వం పొందడంద్వారా, అంటే పరిపూర్ణ జ్ఞానం కలిగి దైవ కటాక్షంతో ఏకత్వం పొందడం ద్వారా శ్రీమాత దైవకార్య నిర్వాహకురాలుగా పని చేస్తోంది.

దైవానికి అభిముఖముగా శ్రద్ధాభక్తులతో కూడిన ఆకాంక్షయొక్క ప్రతి చలనమూ శ్రీమాత ద్వారా దైవకటాక్షాన్ని క్రిందకు దిగివచ్చేటట్లు చేస్తుంది.

"ప్రభూ, 'నేనెప్పుడూ తప్పుచేసి" ఎరుగను అని నీ యెదుట నిల్చుని ఎవరు మనస్ఫూర్తిగా చెప్పగలరు ? నీ కార్యధోరణికి వ్యతిరేకంగా రోజులో మే మెన్నిసార్లు తప్పులు చేస్తున్నామో, అన్నిసార్లూ నీ కృప వచ్చి వాటిని తుడిచివేస్తోంది కదా !

"ఎడతెగని నీ కరుణాకటాక్షం అడ్డుపడి రక్షించక పోతే, సార్వత్రిక ధర్మపు కఠోరదంష్ట్రాల క్రింద మేము ఎన్నిసార్లు పడి నలిగిపోయేవారమో ?

"ఇక్కడున్న ప్రతివారూ పరిష్కరించవలసిన ఒకానొక అసాధ్యస్థితికి ప్రతినిధులు. కాని, నీ దివ్యకరుణతో అంతా సుసాధ్యమే. నీ దివ్యకార్యం విడివిడిగానూ

మొత్తముమీదనూ కూడ అన్నిరకాల అసాధ్యతలనూ,
దివ్యసిద్ధులనుగా పరివర్తింపజేస్తుంది."

15 జనవరి 1953, "శ్రీమాత వాక్కులు" 1949, పేజీలు 183-84

"విశ్వప్రకృతి చర్యలలోని తర్కబద్ధమైన నియత
త్వమే న్యాయము"— అంటే ఏమి ?

నియతత్వధర్మం అంటే మీకు తెలుసు,—తెలియదా ? మీరసలు వేదాంతం చదవనేలేదా ? (ఒక ప్రొఫెసరుగారి వైపు తిరిగి) పవిత్రా ! వీరికి నియతత్వవాదం అంటే వివరించండి. అర్థం అయేటట్లు క్లుప్తంగా చెప్పండి.

పవిత్ర : నియతత్వం అంటే, ఏదైనా జరిగి
నప్పుడు దాని ఫలితాలు ఎప్పుడూ ఒకే విధంగా
ఉంటాయి.

ఆ జరిగేది అదే,—సరిగ్గా అటువంటిదే అయివుండాలి కదా! మరి, ఈ విశ్వంలో ఏరెండైనా ఒకే విధంగా ఉండడం జరుగుతోందా ? లేదుకదా!

నళినీకాంతగుప్త : ఒకే కారణం ఒకే ఫలితాన్ని
యిస్తుంది.

అవును. ఒకే కారణం ఒకే ఫలితాన్ని యిస్తుంది. అదే విజ్ఞాన శాస్త్రానికి మూలసిద్ధాంతము. నేను అంతకంటే సూక్ష్మమైన అర్థంలో ఇక్కడ వాడాను. ప్రతిదీ (అదే అయినా కావచ్చు, కాకపోవచ్చు) ఎప్పుడూ ఒక ఫలితాన్ని యిస్తుంది, ఆ ఫలితం వేరొకదాన్ని, అది మళ్ళీ యింకొక దాన్ని.... ఈ విధంగా అనంతగా కొనసాగుతుంది. అందువల్ల, న్యాయం అంటే, నళినీకాంతగుప్త చెప్పినట్లుగ, స్వయంచాలకంగా ఒకే కారణం ఒకే ఫలితాన్ని కలుగచేస్తుంది. ఎవ్వరూ కూడా ఇంకొకదానికి కారణం కాకుండా ఒకమాట మాట్లాడలేరు. ఒక

చర్య జరుపలేరు. ఆ ఇంకొకటి మరొకదానికి కారణమౌతుంది. అది వేరొక దానికి. ఇవన్నీ స్వయంచాలకంగానే ఒకదాన్నొకటి అనుసరిస్తాయి. అది సార్వత్రిక న్యాయము.

ఒక కార్యం కొనసాగించినప్పుడు దానికొక పర్యవసానం ఉంటుంది, దాని వల్ల ఇంకొకటి జరిగి అది కొనసాగుతుంది. ఉదాహరణకు, నీకొక చెడుఊహ కలిగితే, దానికొక ఫలితం ఉంటుంది. ఆ ఫలితానికి మళ్ళా వేరొక ఫలితం. భగత్కృప ఉంటే తప్ప నీవు దీనినంతా తప్పించలేవు. దానిని మార్చేశక్తి ఒక్క దైవ కటాక్షానికి మాత్రమే ఉంది. దాని నియతి అంత పటుతరమైనదీ, భీకర మైనదీ కావడంవల్ల, ఎవరైనా ఒకసారి అందులో ప్రవేశిస్తే మళ్ళీ బయటకు రాలేరు. అదీకాక, భూమిపై పడినక్షణంనుంచే దానిలో ప్రవేశిస్తారు, పృథ్విపై జీవనమంతా ఈప్రకారంగా గడపవలసినదే. చేసిన ప్రతిపనికీ, మాట్లాడిన ప్రతి మాటకూ, ఆలోచించిన ప్రతి ఆలోచనకూ ఒక పర్యవసానం ఉంటుంది. ఆ పర్యవసానం ఇంకొక పర్యవసానానికి దారితీస్తుంది. ఆచరణాత్మక దృష్టితో చూడాలంటే కొన్ని ఉదాహరణలు తీసుకొని, "నీవు ఇది చేశావంటే స్వయం చాలకంగా అది జరుగుతుంది," అని చెప్పుకోవచ్చు. ఉదాహరణకు, మానవ నిర్మితాలైన సమాజాలలో నీవొక నేరం చేస్తే నీకు శిక్ష పడుతుంది. నీ అంతర్వి వేచనలో, నీవు చేసిన తప్పుకు బాధపడతావు. చట్టం తెలియదు అనేది క్షమార్హం కాదు. నీవు చట్టం విషయం తెలుసుకోకపోయినా శిక్షననుభవింపక తప్పదు. తెలియక నీవు తప్పు చేసినప్పటికీ, నీ తెలియనితనం నిన్ను శిక్షనుంచి రక్షించదు. నీకు దండన తప్పదు. తెలిసినదికదా!....దివ్యకృప ప్రసరిస్తే తప్ప దండన తప్పించుకోలేవు. దివ్యకృప సర్వాంతర్యామి కాబట్టి అది అన్నిటినీ మార్చగలదు. నేను వివరించినది అది. దివ్యకృప లేకపోతే చేసేదేమీలేదు. సూటిగా చెప్పా లంటే మానవాళిలో ఎప్పుడూ కనుపించే లోపం అజ్ఞానమే.

ప్రకృతిలో లభించే వస్తువులన్నిటినీ ఉపయోగించడం నేర్చుకోడానికి మానవుడు ఎటువంటి దారుణమైన అనుభవాలు పొందాలో నని నేను ఆలోచిస్తు న్నాను. సహజసిద్ధంగా దేనినైనా కనుక్కున్నాడంటే అది దైవకృపేనని చెప్ప వచ్చు. కాని, అతనికి అవసరమైన పాఠాలు నేర్చుకోవాలంటే మాత్రం....చెట్ల

మీద కొన్ని ఫలాలున్నాయనుకోండి; అందులో కొన్ని మంచివి, కొన్ని విషపూరిత మైనవి; ఆవిషయం చెట్టుమీద వ్రాసిఉండదుకదా, అక్కడ ఎవరో ఒకరుండి, "అవి తినకండి, విషం" అని చెపుతారు. అలా చెప్పేవారు అక్కడ లేనిపక్షంలో నీ కెలా తెలుస్తుంది? అవి తిని నీవు విషగ్రస్తుడవైతే కదా. అటువంటి నీ అనుభవంవల్ల లాభంపొందేవారు వేరొకరుంటారు.

ఈవిషయం ఎందుకు చెపుతున్నానంటే కొన్నిరకాల పండ్లు చాలారుచిగాను, శరీరానికి పుష్టికలిగించేవిగాను ఉంటాయి. వాటివల్ల ఎంతో ప్రయోజనముంటుంది. అవి పంట పరువుకు రానప్పుడు తింటే మాత్రం విషమే. ఉదాహరణకు 'ఎవకాడో' (Avacado, butterfruit) విషయం తీసుకోండి. అది పండనప్పుడు తింటే (సాధారణంగా తినరు, అవి చాలా చేదు) వెంటనే విషగ్రస్తులనుగా చేస్తుంది. పండితే చాలా బాగుంటాయి. దక్షిణఅమెరికా, ఆఫ్రికాదేశాలలో కొన్నిచోట్ల ఈ చెట్లు పెద్దమామిడిచెట్ల మాదిరి పెరుగుతాయి. పళ్ళన్నీ ఒకే విధంగా వ్రేలాడుతూ ఉంటాయి. ఆ చెట్టు సంగతి తెలియక దారినపోయే బాటసారులు అవి కోసుకుని తింటే అక్కడికక్కడే మరణిస్తారు. ఒక నెల తర్వాత ఆదారిన మరికొంతమంది బాటసారులు వస్తారు. పళ్ళన్నీ పండి ఉంటాయి. కోసుకొని తిని బాగున్నాయని తృప్తిపడతారు. అప్పుడు ఎవరైనా చూస్తే "మీరు ఈ పండ్లుతిని చక్కగా ఉన్నారుకదా, మీకు పూర్వం వచ్చినవారు ఇవి తిని ఎలా మరణించారు?" అంటారు. మొదటివారు తిన్నవి పండలేదని, తర్వాతవి పండినవని, పండినవి తినవచ్చనీ, పచ్చివి విషమనీ, తెలుసుకోడానికి ఈవిధమైన అనుభవాలు ఎన్నో కావాలి.

భూమిపై మనకంటె పూర్వం జీవించిన వారందరి అనుభవాల ద్వారా మనం ఎంతో ప్రయోజనం పొందుతాము. అట్లా కాకుండా, మనం కొత్తదేశానికి వెళ్ళి అన్నీ మనంతట మనమే తెలుసుకోవాలంటే ఎన్ని అసౌఖ్యకరమైన అనుభవాలు పొందాలో కదా. పై చెప్పిన ఫలాలవంటివి ఎన్నో ఉన్నాయి. ఉదాహరణకు, అత్తిపండు పండకముందు అందులోనుంచి కారే పాలు ఎంతో ప్రమాదం కలిగిస్తాయి. నోరంతా పొక్కిపోయి, కడుపులోకూడా పుళ్ళుపడి చాలా బాధపెడతాయి. బాగా పండినతర్వాత పాలు అంటకుండా తింటే ఎంతో

మంచిది. ఇటువంటి ఉదాహరణలు ఎన్నైనా చెప్పవచ్చు. మన పెద్దవారివల్ల మనం తెలుసుకుంటాము. వారికి వారి పెద్దవారు చెప్పి ఉంటారు. పూర్వపు వారికి మొదటగా ఈ విషయం ఎలా తెలుస్తుంది ? మొదటిసారిగా ప్రకృతి నుంచి ఈ విషయాలను ఎవరు నేర్చుకున్నారు ?.... ప్రకృతిలో లెక్కకుమించిన వస్తువులున్నాయి. వృక్షసంపదను చూడండి. ప్రకృతిలో దానికి సంబంధించిన విషయాలన్నీ మనకు ఇప్పటికీ తెలియదు. ఈ ప్రపంచంలో వచ్చే జబ్బు లన్నిటికీ ఔషధం తప్పకుండా ఉంటుంది. అది ప్రకృతి సహజం అని కొంతమంది అంటారు. ఇది ఎంతవరకు నిజమో నాకు తెలియదు. కాని, అది పనిచేసే విధానంచూస్తే సత్యమే ననిపిస్తుంది. పాముపుట్ట లున్నచోట పాముకాటుకు పని చేసే ఓషధులు కూడా ఉంటాయంటారు. కాని, ఆ మొక్కను గుర్తించడం ఎలా ? అక్కడ అనేకమైన మొక్క లుంటాయి కదా ! ఎవరు చెపుతారు ? కొంతమంది వెన్నెలరాత్రులలో పర్వతాలపైకివెళ్ళి ఎన్నో మొండి వ్యాధులను కూడా కుదర్చగల మూలికలను గ్రహిస్తారు. అది వారికెలా తెలుసింది ? ఆ ప్రయోగాలు చేసిన దెవరు ?

మరి కుక్కగొడుగులో ?

అది ఒక విషయమే. చక్కటికూరకు పనికివచ్చే కుక్క గొడుగులు. తినిన మరుక్షణంలో యమభటులను రావించగల కుక్కగొడుగులు కూడా పక్క పక్కనే పెరుగుతాయి. సంచితజ్ఞానం వల్ల మనం ప్రయోజనం పొందుతాము. దీనికి మించిన జ్ఞానం మనకు దక్కకుండా పోయిందని నా అనుమానము. ఎందువల్లనంటే, ఈ విధంగా తెలుసుకున్న విషయాలు చాలమంది పదిలపరచరు. మనమూ అంతే. ఏవైనా విషయాలు తెలుసుకున్నప్పటికీ మిగలినవారికి పనికి వచ్చేటట్లు వాటిని వ్రాతపూర్వకంగా భద్రపరచము. నిజంగా పరిశీలించి, తెలుసు కోవాలంటే ప్రకృతి అనంతమైన క్షేత్రము.

పవిత్ర : పెన్సిలిను మందు కనుక్కున్నవారు—
ఎంతమంది మరణించారో, ఎన్ని ప్రమాదాలు
జరిగాయో....

అది మానవ కల్పితము. అది అతని స్వయంకృతము. దాని జోలికి పోకపోతే ఏమీ జరుగదు.

> పొరపాటున, తెలియక, అయాచితంగా ముట్టుకొని ఉండవచ్చు.

అయినప్పటికీ అది ప్రేలుడుమందే. అది ఒకరి నేరమంటావా ?

> రసాయనికశాస్త్రం చదువుకొని ప్రేలుడుమందును గురించి తెలుసుకోడానికై స్పృశించవచ్చు.

వారికి దానినిగురించి తెలియకపోతే అంతే. ఉదాహరణకు, పొటాసియం క్లోరేటును తీసుకోండి. చూడడానికి ఏమీ అపాయంలేదన్నట్లు తెల్లగా, స్వచ్ఛంగా, స్ఫటికాలతో అందంగా కనిపిస్తుంది. సుత్తితో దానిని పగలగొట్టడం ప్రారంభిస్తే ఉన్నట్లుండి ప్రేలుతుంది.

వృక్ష విభాగం పరిశీలిస్తే, భూమి మీద ఎన్నిరకాల మొక్కలున్నాయో ఇంతవరకు ఎవరికీ తెలిసిఉండదు. ఈనాటి మానవులు తెలుసుకొని ఉపయోగిస్తున్న మొక్కలసంఖ్య చాల స్వల్పమని చెప్పవచ్చు. యూరపు ఖండంలో ఆహారం నిమిత్తం కేవలం మూడువందలయాభై మొక్కలను మాత్రం వాడితే జపాను వాసులు ఆరువందల కంటె ఎక్కువ రకాలనే తమ ఆహారానికి వినియోగిస్తారని అక్కడివారు నాకు చెప్పేవారు. అందులోనే చాల తేడా వస్తుంది. "మీరు ఆహారపదార్థాలను ఎంత వృథాచేస్తున్నారు, ప్రకృతి ఎన్నో పదార్థాలను తయారుచేస్తోంది. మీ రన్నీ వ్యర్థంచేస్తున్నారు" అని నేను జపానులో ఉండగా జపనీయులు నాతో అనేవారు. యూరపులో వెదురు చిగుళ్లు తినడం గురించి మీరు విన్నారా ? తాటితేగలను గాని, కొబ్బరిపూవులను గాని తినడం తెలుసా ? కొబ్బరి పూవుతో సలాడ్ చాలా రుచిగా ఉంటుంది. కాని, దానికోసం చెట్టే త్యాగం చేయాలి. అంటే సలాడ్ కోసం చెట్టును చంపేయడ మన్నమాట. ఎప్పుడైనా తుఫాను వచ్చి చెట్లుపడిపోతే అప్పుడు అన్నీ ఏరుకొని చక్కగా

తయారుచేసుకోవచ్చు. మీ రెప్పుడైనా కొబ్బరిపూవులను తిన్నారా? నాకు అది ఆశ్చర్యం కలిగించదు. నేను జపానులో ఉండగా వెదురు మొలకలనే రుచి చూచాను. అది అక్కడ ప్రసిద్ధమైన వంటకము. ఇక్కడి వెదుళ్ళకంటె ఆ దేశంలో వెదుళ్ళు చాల మృదువుగా ఉంటాయి కాబట్టి మొక్కలింకా పైకి రాని స్థితిలో తింటే చాలా రుచిగా ఉంటాయి.

ఆ విధంగా జపానులో ఆరువందలకు పైగా వృక్షజాతులను ఆహారంగా వాడితే యూరపులో మూడువందలయాభై మాత్రం వాడుతున్నారు. సృష్టిలో పనికివచ్చే వా టన్నిటినీ వాడడం నేర్చుకుంటే ఆకలిచావులను కొంతవరకు తగ్గించ వచ్చునేమో?

ఏదేమైనప్పటికీ ప్రపంచవిధానం ఈతీరుగాఉంది. ప్రపంచంలో ధర్మపాలన ప్రారంభమైతే ఎలా ఉంటుందో తెలియదు. అప్పుడంతా సుఖమేనని మాత్రం నేను చెప్పలేను. ఎందువల్లనంటే, ప్రపంచంలో ఎవరూ భగవంతునిముందు నిలు చుని "నేను ఒక్క తప్పయినా చేయలే" దని చెప్పలేరు కదా. ఈవిధంగా తప్పు లను గురించి చెప్పేటప్పుడు తెలియదనడం ఒక సాకుగాదు. తెలియక ముట్టు కున్నా నిప్పు కాల్చక మానదు. తెలిసిముట్టుకున్నావంటే నీ అజాగ్రత వెనకాలగల నీ మూర్ఖత్వం బయటపడుతుంది. తెలియకపోతే అది నిన్ను పూర్తిగా దహి స్తుంది. అప్పుడు ప్రకృతిమాతతో 'అమ్మా, అది కాలుతుందని తెలిస్తే ఇలా కాలిపోయేవాడిని కాదుగదా!' అనగలవా? అలా అన్నప్పటికీ నీమాట వినేదెవరు?

మనం పిలవడంవల్ల దైవకృప వచ్చి అడ్డు పడుతుందా?

పిలవడం వల్లనా? కావచ్చు, కాని పూర్తిగాకాదు. తగిన నమ్మకంతో, ఆకాంక్షతో చిన్నపిల్లలు తల్లితో చెప్పినట్లు "అమ్మా, నాకిది కావాలి" అని నిష్కపటంగా అడగగలిగితే తప్పక సమాధానం వస్తుంది. తనకు మంచి కలిగిం చనిదానిని, హానికరమైనదానిని అడిగితే మాత్రం సమాధానం లభించదు.

ఇటువంటి ఫలితం దేనివల్ల కలుగుతుంది ? ఈ పిలుపుకు మూలం ఏది ?

విధికృతం అలాఉండి పిలిచారేమో. అంటే, ఇది గ్రుడ్డు ముందా ? పిట్ట ముందా ? అన్నట్లుంటుంది. నీవు తనను పిలిచేటట్లు చేసినది దైవకటాక్షమా ? లేక, దైవకటాక్షం నీవు పిలిస్తే వచ్చినదా ? చెప్పడం కష్టము.

ముఖ్యంగా లోపించేది నమ్మకము. ఆలోచనలో ఎక్కడో కొద్దిపాటి శంక ఏర్పడి చర్చిస్తుంది. అది అంతటినీ పాడుచేస్తుంది. పూర్తిగా అసహాయ స్థితిలోఉండి, ఇక వారి మనస్సు ఏమీ చేయలేదనీ, దానికేమీ చేతకాదనీ తెలుసుకొని ఎవరైనా పైసహాయంకోసం ఆకాంక్షిస్తే అప్పుడు కొంతప్రయోజనం ఉంటుంది. ఆవిధమైన నిరాశలోనుండి బయలుదేరిన తీవ్ర ఆకాంక్ష ఎవరికైనా కలిగితే ఫలితం దొరుకుతుంది. అలా కాకుండా, నీ ఆలోచన "నేను ఆకాంక్షించాను, ప్రార్థించాను. అయినప్పటికీ ఇది సమయమౌనో, కాదో, భగవంతుడు సహాయంచేస్తాడో, చేయడో" అంటూ వివాదంచేస్తే అంతా నిష్ప్రయోజనమే. ఏమీ జరగదు. సాధారణంగా అదే అవుతుంది. "నీవు యోగసాధనలో పురోగమించాలంటే నీకు కోరిక లుండరాదు" అంటారు. ఇంకా కొంచెం ముందుకు పోయినవారు "నీకు అవసరాలే రాకూడదు" అంటారు. ఇంకా ముందున్నవారు "దైవంనుంచి ఎన్నడూ ఏమీ కోరవద్దు" అంటారు. కాని, సాధారణ మానవులు నూటికి తొంభైతొమ్మిదిమంది "నేను ఏమీ అడగకపోతే నాకేమీ దొరకవు" అంటారు. అంటే మూలందగ్గర నరికివేయడమే అవుతుంది. అలా అనేవారు కేవలం నమ్మకం లేకనే "ఇది కావాలి, అది కావాలి" అంటారు.

నేను అవసరాలను గురించి చర్చచేయను, అది సబబుకాదు. పూర్వం శ్రీఅరవిందుల చిత్రపటం* తయారుచేసిన డచ్ చిత్రకారుడు అక్కడ ఉన్నప్పుడే ఒకానొక యోగసాధన చేసేవాడు. ఆయన నాతో ఒకరోజున, "నామటుకు నాకు

* ఆ చిత్రం ఇప్పటికీ ఉంది.

ఏమీ లేకపోయినా ఫర్వాలేదు. నిజంగా ఎవరి అవసరాలను వారు కనిష్ఠ పరిమితికి తెచ్చుకోవచ్చు. నాకు ఒక్క టూత్‌బ్రష్ పళ్ళుతోముకోడానికి ఉంటేచాలు," అన్నాడు. నేను అప్పటికింకా భారతదేశం రాలేదు. లేకపోతే ఈవిధంగా సమాధాన మిచ్చేదానను; "భారతదేశంలో కోటానుకోట్లు ప్రజలు టూత్‌బ్రష్‌లు లేకుండా ఉన్నారు. అయినప్పటికీ వారి దంతాలు పరిశుభ్రంగానే ఉన్నాయి. పళ్ళుతోముకోడానికి బ్రష్ ఒకటే మార్గంకాదు గదా". నోరు శుభ్రం చేసుకోడం తప్ప మరేమీ అంత ముఖ్యమైనవి కావని అప్పట్లో అతని అభిప్రాయం. నోటి శుభ్రతకు టూత్‌బ్రష్ తప్పనిసరి అని అతను అనుకునేవాడు. మానవుల ఆలోచనా విధానం ఎలా ఉంటుందో దీనినిబట్టి తెలుసుకోవచ్చు. దేనినో ఒకదానిని పట్టుకొని అది లేకపోతే గడవదనుకుంటారు. అది పూర్తిగ అవివేకమే. నోటి శుభ్రత అవసరమే కావచ్చు. కాని దానికి టూత్‌బ్రష్‌తో ముడిపెట్టడం సమంజసం కాదు. టూత్‌బ్రష్‌లు ఇటీవలనేకదా కనుక్కొన్నారు.

ఇంకొక అతనుకూడ ఇలాగే చెప్పేవాడు. "నాకు ఏమీ లేకపోయినా ఫర్వాలేదు."—అప్పుడు మేము కాలినడకన చేసే ప్రయాణాల గురించి మాట్లాడుకుంటున్నాము. (తగినంత సామాను వీపుకి కట్టుకొని మైళ్ళకుమైళ్ళు నడవాలి కాబట్టి దాని బరువు సాధ్యమైనంత తగ్గించుకుందామనుకుంటారు.) దానికిగాను యేయే వస్తువులు తప్పనిసరి అవుతాయి అనే విషయం చర్చించుకుంటున్నాము. అతను టూత్‌బ్రష్ కావాలన్నాడు. మరొకతను సబ్బు అవసరం అన్నాడు. కాని సబ్బువాడనివారెంతమందిలేరు? అలాగని వారి శుభ్రత తక్కువకాలేదుగదా! అది అందరూ ఆలోచించరు. ఏదో ఒక విషయాన్ని అంటిపెట్టుకొని అది లేకపోతే గడవదనుకుంటారు. నాలుగుదేశాలు తిరిగి చూస్తే తెలుస్తుంది. నీవు తప్పనిసరి అనుకునేవి మరియొకరికి కనివిని ఎరుగని అపూర్వ వస్తువులు, వాటిని గురించి వారికేమీ తెలియదు. కాబట్టి ఆ వస్తువులకు ప్రాముఖ్యంలేదు. అవి తప్పనిసరి కావు. అదంతా ఒకానొక వాతావరణంలోని జీవితం, అక్కడి విద్యల ఫలితంగా వచ్చినవే. ఇవి సాపేక్షకమైనవి అవడమేకాకుండా తాత్కాలికమైనవి.

25 నవంబరు 1953

"దైవంయెడ మనకున్న విశ్వాసానికి తగినట్లు గానే దివ్యకృప పనిచేసి సహాయం చేయగలదు" అని మీారు చెప్పారు. దైవంపై నమ్మకం లేనివారు కష్టాలలో ఉండి అంతశ్శుద్ధితో దైవాన్ని పిలిస్తే ఏం జరుగుతుంది ?"

అటువంటివారు ఎలా పిలువగలరు ? ఇవి పరస్పరం విరుద్ధంగా ఉన్నాయి. వారికి దైవంపై విశ్వాసం లేకపోతే పిలవాలని తోచదు కదా. అది విరుద్ధంగా లేదా ? విశ్వాసముంటేనే దానికి తగినట్లు దైవాన్ని పిలువగలడు. ఏమంటావ్ ?

"శత్రువు ఎదుటపడినప్పుడు చిరునవ్వు చిందించడం అతనిని నిరాయుధుని చేయడమే" అని మీారిక్కడ చెప్పారు. చిరునవ్వు అంటే ? శత్రువు ఎదుట నవ్వకూడదు కదా.

నవ్వకూడదా !.... నే నిక్కడ చెప్పినది ఒక అనుభవము. ఒకానొక అనుభవాన్ని నేను సామాన్య సూత్రంగా చెప్పాను. ఒకరు చాలా దురుద్దేశంతో మరొకరి దగ్గరకు వెళ్ళినప్పుడు వారు చిరునవ్వు చిందించగలిగితే అతను నిరాయుధుడౌతాడు. ఏమీ చేయలేడు. చాలా నిర్మలమైన దరహాసము కనుపరచ కలగాలి. అంతేగాని, పళ్లు బయటపెట్టి కృత్రిమంగా నవ్వడం కాదు. (నవ్వులు) అంటే, స్వాధిపత్యం ఉండి ఉన్నతచైతన్యంలో ఉంటే సంపూర్ణంగా నవ్వగలరు. ఉన్నత చైతన్యంలో ఉన్నవారు మాత్రమే ఉన్నత దృష్టితో చూడగలిగి, సాధారణ చైతన్యానికి కృత్రిమంగా, భీతావహంగా తోచేవాటినిగూడా క్షుద్రచేష్టలుగా పరిగణించి చిరునవ్వు నవ్వగలరు. ఆ విధంగా అన్నిటినీ చూచి నవ్వగలిగినప్పుడు (అలా ఉన్నప్పుడు ప్రతిదానికీ కారణం తెలుస్తుంది, అన్నిటిలో పని

చేస్తున్న శక్తులను గూడ చూడగలరు) పరిస్థితులే మారిపోతాయి. ఆ నవ్వు మర్యాదకోసం నవ్వే మామూలు నవ్వు కాదు, నీలోని చైత్యపురుషుని నవ్వు.

## పిలవనప్పుడు దైవసహాయం లభించదా ?

అది ఆ విధంగా కానేకాదు..... దివ్యచైతన్యం అంతటా ఎప్పుడూ ఒకే విధంగా పనిచేస్తుంది. దాని క్రియాత్మక శక్తి ఎప్పుడూ ఒకే విధంగా ఉంటుంది. దైవకృప పనిచేయడానికి గాని, దానిని నిరోధించడానికి గాని నీలో నీవు ఒక పరిస్థితిని నీ వ్యక్తిగత వైఖరిననుసరించి తయారు చేసుకుంటావు. అదీగాక, నీ విశ్వాసమే (సత్యంపై విశ్వాసం, దైవకృపపై విశ్వాసం, దైవానికి గల జ్ఞానంపై విశ్వాసం) నీవు వీటిని గ్రహించగలిగేటట్లు చేస్తుంది. నీకు నమ్మకం లేనప్పటికీ కొంత గ్రహించడానికి ప్రయత్నించవచ్చు. కొంతమంది దైవంతో సవాలుచేస్తున్నట్లు "ఇదిగో చూడు, నేను ఇటువంటి కష్టాలలో ఉన్నాను, ఇవి నా శక్తికి మించినవి. దైవం వీటిని తొలగించినట్లైతే నేను విశ్వసించగలను." అంటారు. ఇటువంటివారు అనేకమంది ఉన్నారు. ఈ విధంగా పైకి వ్యక్తం చేయకపోయినా వారి ఆలోచన ఈ విధంగానే సాగుతుంది. ఇది అన్నిటికంటె నికృష్టమైన స్థితి. అది నిన్ను పూర్తిగా అడుగుకి నెట్టివేస్తుంది. విశ్వాసానికి పూర్తిగా వ్యతిరేకమైన స్థితి ఇది. ఆ విధంగా "నీవు నాకు ఇది చేసిపెడితే నీవు ఉన్నట్లు నేను నమ్ముతాను. నీవు నిజంగా ఉన్నావో లేవో, వారు చెప్పినట్లు ఉన్నావో లేదో నేను పరీక్షించి తేల్చుకుంటాను. ఈ పనిచేయి, మాకు బాగా స్పష్టమౌతుంది, నిన్ను నమ్ముతాము.'' అని దైవంతో బేరమాడడం ఎంత నీచము ! వారికి తెలియకుండానే చాలమంది అలా చేస్తారు. "నా జీవితం ఇంత విషాదంగా, అసౌఖ్యంగా ఉంటే నేను దైవాన్ని ఎలా నమ్ముతాను ?" అని కొందరంటారు. ఆ విధంగా వారు దైవచైతన్యాన్ని తమ అల్పవ్యక్తిగత అవసరాలకు పరిమితం చేసుకుంటారు.

విశ్వాసముంటే సహాయం దానంతట అదే
వస్తుందా ?

అది రావడానికి అణువంత విధేయత చాలు. ఎవరైనా పూర్తిగా విధేయులై పిలిచి (అది ఎంతవరకు పనిచేస్తుందో చూద్దామని ఊరికే పిలవడం కాదు, అది అసలు పద్ధతి కాదుగదా !) సమాధానం కోసం విధేయతగా ఎదురుచూస్తే అది తప్పక వస్తుంది. అంతేకాకుండా, మనస్సును నిశ్శబ్దపరచి ప్రశాంతంగా నిలవ గలిగితే, ఆ సహాయం రావడం, దాని స్వరూపం మొదలైన వాటినిగూడ చూడ గలరు.

దేవతలు ఎక్కడనుంచి వస్తారు ?

ఎక్కడనుంచి అంటే ? వారి మూలం ఏది అనా నీ ఉద్దేశం ? వారిని ఎవరు రూపొందించారు అనా ? ఏమైనప్పటికీ అన్నీ ఆ పరమస్థానంనుంచే వస్తాయి. దేవతలుకూడా ఆ పరమదైవం నుంచే వస్తారు.

దీనిని వివరించే పురాణసంప్రదాయం ఒకటుంది. పిల్లలకు చెప్పినట్లు మీ కిప్పుడా కథ చెపుతాను. అప్పుడు బాగా అర్థమౌతుంది.

ఒకనాడు "దేవుడు" తనను తాను బాహ్యీకరణం చేసుకుందామనుకున్నాడు. అంటే, తానొక మూర్తిత్వం పొందితే ఎలా ఉంటుందో చూచి ఆనందించుదా మనుకున్నాడు. దానికోసమని తన చైతన్యాన్ని వెలువరించి (అంటే తన చైతన్యాన్ని వ్యక్తీకరింపజేసి), ఒక విశ్వాన్ని సృష్టించమని ఆ చైతన్యాన్ని ఆజ్ఞాపించాడు. ఆ చైతన్యం నాలుగు మూర్తిత్వాలుగా ఏర్పడింది. ఆ నాలుగూ పరమచైతన్యంలో నుంచి వెలువడిన నాలుగు అత్యుత్తమ మూర్తులు : చైతన్యమూర్తి, ప్రేమమూర్తి (లేక ఆనందమూర్తి), ప్రాణమూర్తి, తేజోవిజ్ఞాన మూర్తి — చైతన్యం, తేజం ఒకటే కాబట్టి వాటిని చైతన్యం, ప్రేమానందాలు, ప్రాణ సత్యాలు అని చెప్పుకోవచ్చు — సత్యము అనేది సరైనమాట. సహజంగా ఇవి అధికశక్తిమంతమైనవి. ఆ సంప్రదాయ ప్రకారం ఇవి ప్రథమ మూర్తులు.

ప్రతి మూర్తీ తమతమ గుణగణాలు, శక్తిసామర్థ్యాలు మొదలైన వాటిలో అతి తెలివిమీరి తాము పరదైవపు విభూతులు మాత్రమే ననే విషయం విస్మరించాయి. తత్ఫలితంగా : తేజము లేక చైతన్యము పరమచైతన్యంనుంచి విడిపోయినప్పుడు, అంటే తానే పరమచైతన్యమని, తను కానిది ఏదీలేదనీ అనుకోగానే అది అకస్మాత్తుగా అజ్ఞానవంతంగా, జడంగా అయిపోయింది. ప్రాణంకూడా జీవశక్తి అంతా తనలోనే ఉన్నదని, తనులేనిది ఏదీ లేదుకాబట్టి తాను పరమచైతన్యం మీద ఆధారపడనక్కరలేదని అనుకోగానే అది మృత్యువుగా మారిపోయింది. ఆ విధంగానే, సత్యం సత్యమంతా తనలోనే ఉన్నదని, తను తప్ప వేరే సత్యం లేదని అనుకున్నప్పుడు అసత్యంగా మారింది. ప్రేమ, లేక ఆనందం తనే దివ్య ఆనందం అనుకున్నప్పుడు, అంటే, తను తన ఆనందం తప్ప వేరే ఏమీ లేదనుకున్నప్పుడు, అదే దుఃఖంగా రూపొందింది. ఈ విధంగా ఎంతో సుందరమైనటువంటి ఈ విశ్వం అమంగళంగా తయారయింది. ఆ చైతన్యం (దానినే నీవు దివ్యమాత, పరమచైతన్యం అనవచ్చు) ఇదంతా చూచి చాల కలతచెంది "ఇది విజయవంతం కాలేదే" అనుకొని, తనను రక్షించమని ఆ పరమదైవాన్ని వేడుకున్నది. "ఈ విధంగా జరిగిపోయింది, నేనిప్పుడేమి చేయాలి?" అని దైవాన్ని ప్రశ్నించింది. "తిరిగి ప్రారంభించు, ఈసారి ఆ విభూతులు మరీ అంత స్వతంత్రం కాకుండా, నీనుంచి విడిపోయి తద్వారా నాతో సంబంధం వదులుకోకుండా చూడు" అని ఆయన సమాధానం చెప్పారు. అప్పుడు ఆమె అణకువ కలిగి గర్వంలేని దేవుళ్ళను అనేకమందిని సృష్టించింది. వారు ఈ విశ్వాన్ని సృష్టిచేయడం ప్రారంభించారు. అయితే, మొదట వచ్చిన విభూతులు వీరికి అడుగడుగునా అడ్డుతగలడం ప్రారంభించాయి. అందువల్లనే ఈ ప్రపంచం ఒక బీభత్సమైన రణరంగంగా, కష్టాలకు, దుఃఖాలకు నిలయంగా తయారైంది. ఏది సృష్టించాలన్నా ఈ దేవుళ్ళు పూర్వపు విభూతులను ఎదుర్కోవలసిందే. ఆ ప్రథమ విభూతులు పదార్థంలోకి చొచ్చుకొని పోయి ప్రతిచోటా అలజడి కలిగిస్తే అది సరిచేయడం ఈ దేవుళ్ళవంతైనది. దేవుళ్ళు ఆ విధంగా వచ్చారు, ఆ విధంగా వచ్చినవీరిని ద్వితీయ విభూతులనవచ్చు.

తల్లీ, ఆ విధంగా మొదటి నాలుగు విభూతులు మారిపోయాయని చెప్పారు కదా; అది పొరపాటు వల్లనా ? కావాలనా ?

పొరపాటు కానేకాదు. పరదైవం తనసృష్టి స్వేచ్ఛగా సాగాలనుకున్నాడు. (కథాసంవిధానం అలా ఉంది). తనదగ్గరనుంచి వెళ్ళినదంతా స్వతంత్రంగా, స్వేచ్ఛగా వెళ్ళిపోయి తిరిగి బలాత్కారంగా గాకుండా స్వతంత్రంగా తనలో ఐక్యం కావాలనుకున్నాడు. నిర్బంధంవల్ల అది విధేయంగా, చైతన్యంగా ఉండా లనుకోకుండా, విలువ తెలుసుకొని స్వతస్సిద్ధంగా అవి ఆ విధంగా ఉండా లనుకున్నాడు. ఆ విధంగా ఈప్రపంచం, ఎన్నుకునే స్వతంత్రంతో, సర్వ స్వతంత్రమైనదిగా సృష్టించబడింది. అందువల్లనే ప్రతివారికీ ప్రతిక్షణం ఎన్నుకొనే స్వతంత్రం ఉంది. కాని దాని పర్యవసానాలు దానికున్నాయి. సరియైన ఎన్నికచేసుకుంటే మంచిదే, చెడు ఎన్నిక చేసుకుంటే,—సరిగ్గా అదే జరిగింది.

ఈకథను తాంత్రిక దృష్టితోను, ఆధ్యాత్మిక దృష్టితోను అర్థంచేసుకుంటే బాగుంటుంది. లేకపోతే ప్రపంచంలోని మిగిలిన కథలతోపాటే. అందరికీ అర్థమయేటట్లు చెపితే పిల్లల కథల మాదిరిగా ఉంటుంది. ఆ సంకేతాలను అర్థం చేసుకోడం నేర్చుకుంటే అంతా తెలుస్తుంది. ఇంతవరకు నేను చెప్పిన కథను కూడా ఆవిధంగా అర్థం చేసుకుంటే నీకు అసలు రహస్యం తెలుస్తుంది.

అది ఒక "ఆకస్మిక సంఘటన" అని చెప్పే సంప్రదాయాలు కొన్ని ఉన్నాయి. అంటే అది ఇంకొకరకంగా జరిగివుండవచ్చు నన్నమాట. కాని అది ఈవిధంగానే జరిగింది. ఈ నాలుగు విభూతులలో ప్రతిదానికీ మూలమైన పరదైవం దగ్గరగానే ఉండడం వల్ల అవి తమలో దైవత్వపు ఆధిక్యాన్ని, చైతన్యాన్ని కలిగే ఉంటాయి. అవి పూర్తిగా దైవంలోనుంచి వచ్చినవేకాని, ఇతరమైనవి కాదు. దైవం తనను తాను వేరుగా చూచుకోవా లనుకోడం వల్లనే ఈ విభూతులు ఏర్పడ్డాయి. తనలో నున్నవాటన్నిటిని గుర్తించడంకోసమే ఆ దైవం మూర్తిత్వాన్ని పొందాడు, అంటే అంతా స్థాణువుగా అవ్యక్తస్థితిలో ఉండడానికి బదులు తనలో ఉన్నదానినంతా బాహ్యానికి ప్రక్షేపించుకున్నాడు. తనలోని అనంతమైన సాధ్యతలను

చూచుకోవాలనే ఆవిధంగా ఏర్పడినాడు. అందువల్ల అన్నీ సంభవమే. అది అలా జరిగింది, ఇంకొక విధంగా కూడా జరుగవచ్చు. అంతేకాకుండా, మన విశ్వంతో పాటుగా, దానితో ఏ మాత్రం సంబంధం లేకుండా, దానికి భిన్నంగా మరికొన్ని విశ్వాలు ఏర్పడి ఉన్నాయంటే ఎవరూ కాదనలేరు. దైవం ఈ విధంగా బాహ్యీకరణం పొందగా ఏర్పడినది మన విశ్వం ఒకటే.కాదు. ప్రస్తుత స్థితిలో మన విశ్వం కనిపిస్తోంది. ఇంతకంటె మిగిలినవి బాగుండపచ్చు. కాగా, మన విశ్వం పైకి చూడడానికిమాత్రమే ఇలా దుఃఖదాయకంగా కనిపిస్తోంది. దాని బాహ్యస్వరూపాన్ని కాకుండా లోపలచూస్తే అది అలాలేదని తెలుసుకుంటావు. ఒకే వైపుగా మాత్రం చూస్తే అలా కనిపిస్తుంది.

> మనం ఒక నిశ్చయమైన ఆధ్యాత్మిక ప్రగతి సాధించినపుడు అదృశ్యంగా ఉన్న దైవ విరోధ శక్తులు పగతీర్చుకోవాలని ప్రయత్నిస్తాయి. అవి ఆత్మను ఏమీ చేయలేనప్పుడు, దేహంపై దాడి చేస్తాయి, దైవం మనవైపున ఉండడంవల్ల వాటి ప్రయత్నాలన్నీ వృథా అయిపోయి అవి పరాజితమౌతాయి"
>
> (వర్డ్స్ అఫ్ లాంగ్ ఎగో, 1949 ముద్రణ, పుట 215)

"అదృశ్యంగా ఉన్న దైవ విరోధశక్తులు" అంటే ఏవి ?

అవి మొదట ఏర్పడిన నాలుగు మూర్తులు, అవి అంతులేని విభూతులుగా ఏర్పడ్డాయి. వాటిలోనుంచి అనంతంగా మరికొన్ని విభూతులు. అందులోనుంచి ఇంకా కొన్ని రూపాలు ఏర్పడ్డాయి. ఇవన్నీ కూడి ఒక ఒడంబడికచేసుకొని, దానిప్రకారం నడుచుకుంటూవచ్చాయి. తమ పాలన తప్ప మరి యే యితర పాలనకూ లోబడకపోవడమనేది వాటి ఒప్పందము. వీటినే భారతదేశంలో

అసురు లంటారు. వాటి మధ్య ఏర్పాటు చేసుకొన్న తర్కానికి లోనై అవి అలా ఉన్నాయి. చెడు మార్గం అనుసరించడంతో ప్రారంభించి అవి అలాగే కొనసాగిస్తున్నాయి. అందులో కొన్ని మనసు మార్చుకున్నాయి. ఈ విషయం భగవద్గీతలోకూడ కనిపిస్తుంది. వేటిని మార్చవచ్చో, వేటిని మార్చడానికి వీలు కాదో, ఏవి మార్పును సహించక అదృశ్యమవడానికి నశించడానికి కోరుకుం టాయో అందులో ఉంది. వాటి పద్ధతికూడ అదే, కొన్ని ఒకరకం, మరికొన్ని వేరొకరకము.

"మారినవి" ఏవి ?

నీకది తెలుసా? అయితే నీ జ్ఞాపకశక్తి మంచిదే. అందులో ఒకటి మారడమేకాకుండా, దైవకార్యంలో సహాయంకూడా చేస్తున్నది, అదే చైతన్య తేజముల విభూతి.

అది మారిపోతే కష్టాలు వాటంతట అవే పోతాయి.

అవును, సహజంగా అంతే. అయితే, దాని శక్తి మాత్రం ఇంకా మిగిలే ఉంటుంది. అదే ఒక మహాభూతం అవుతుంది.

చైతన్యం జడంగా మారిందని మీ రన్నారు కదా, చైతన్యం పరివర్తనచెందితే జడత్వంపోతుందా?

అది తిరిగి చైతన్యతేజంగా మారిపోతుంది. అంటే, దాని యథాస్థితికి వచ్చేస్తుంది.

అది ఆ విధంగా జరిగిందా ?

నేను చెప్పినట్లు అది అచేతనంగా మారితే అనేకరూపాలను, విభూతులను

తయారుచేస్తుంది. ఆ పరిస్థితిలో అది పరివర్తన చెందితే దానితోపాటు అవన్నీ పరివర్తన చెందవుకదా! వాటికి కూడా స్వాతంత్ర్యము, ఎన్నుకునే స్వేచ్ఛ ఉంటాయికాబట్టి, వాటంతట అవి మారితే మారవచ్చు. లేకపోతే లేదు. ఆ విధంగా మారినవి కొన్ని, మార్పును నిరోధించినవి కొన్ని ఉన్నాయి. నా ఉద్దేశ్యం లో మార్పును నిరోధించినవే ఎక్కువ.

అన్నిటిలోకీ ఎక్కువ హానికరమైనది "అసత్య ప్రభు"ని శక్తి— విశ్వంలో ఈ సత్యవిరోధియే అన్నిటి కంటె ప్రబలమైన ఆటంకము, పైగా, అతనికి ఈ పృధ్విలో, ఈ భౌతిక ప్రపంచంలో మంచి పలుకుబడి ఉంది. ఎందువల్లనంటే, చూచేవారికి అతనొక అద్భుతమైన వ్యక్తిగా కనుపిస్తాడు. "జాతులకెల్ల ప్రభువు" నని తనను తనే చెప్పుకుంటూ, చూపులకు భయంకరంగా, తేజోవంతంగా, మనుష్యులను ఆకట్టుకొనే శక్తిస్వరూపుడుగా కనిపిస్తాడు. చారిత్రకంగా చూస్తే కొన్ని రాజ్యాధినేతలనే అతడు ప్రేరేపించాడు. అక్కడి ప్రజలను తన పాలనలోకి తెచ్చుకొనే "జాతుల ప్రభువు" అనే బిరుదాన్ని ధరించాడు, కడచిన రెండు మహాయుద్ధాలనూ నిర్వహించినవాడు ఇతడే. ఆ సందర్భంలో 'నానా జాతి ప్రభువు' గా ప్రత్యక్షమైనాడు. పైగా తను ఎన్నటికీ పరివర్తన చెందనని గూడా ప్రకటించుకున్నాడు. కాని, తనకు అంతం సమీపిస్తున్న సంగతి అతనికి తెలుసు— దానిని దూరం చెయ్యడం కోసమే సహజంగా అతడు ప్రయత్నిస్తాడు. తాను నశించే లోపల అన్నిటినీ నాశనం చేసితీరుతానని ప్రతిజ్ఞ కూడా చేశాడు. కాబట్టి మనం అన్ని రకాలైన అవాంతరాలకూ సంసిద్ధులం కావాలి.

> ఫిబ్రవరిలో మీరు భూమిపైకి ఒక నూతన తేజము ఆవిష్కరించనున్నది"* అని సందేశమిచ్చారు. ఆ తర్వాతనే (5 మార్చి, 1953)

---

* 'శృణ్వంతు' అనే బెంగాలి పత్రికకు ఇచ్చిన సందేశం: "సత్య, తేజములను ఈనాటినుంచీ సర్వదా భూమిపై ఆవిర్భవించనీ"

(21 ఫిబ్రవరి, 1953)

స్టాలిన్ మరణించారు. దానికేమైన ప్రత్యేక అర్థం ఉన్నదా ?

నిజానికి అది చాల చిన్న ఫలితము. స్టాలిన్ మరణం (హిట్లర్ మరణం కంటే ఎక్కువగా) ప్రస్తుత ప్రపంచ పరిస్థితిలో ఏ రకమైన మార్పూ తీసుకొని రాలేదు. దానికి ఇంకా కొంత జరగవలసిన అవసరం ఉన్నది. ఒక హంతకుణ్ణి ఉరితీసినప్పుడు ఏం జరుగుతుందో ఇదీఅంతే. ఆ హంతకుని ఆత్మ అక్కడే ఉండి బాహ్యానికి ప్రక్షేపితమౌతుంది. అది ఒక ప్రాణిక రూపం ధరించి అక్కడ ప్రేక్షకులుగా ఉన్న ఒకరిలో ప్రవేశిస్తుంది. అప్పుడు వారికి హఠాత్తుగా పాప ప్రవృత్తి కలుగుతుంది. అటువంటివారు చాలామంది ఉన్నారు. ముఖ్యంగా కొంతమంది బాలనేరస్థులను ప్రశ్నించినప్పుడు ఈవిషయం బయటపడింది: "ఈవిధంగా చంపాలనే కోరిక నీకెప్పుడు కలిగింది" అని వారిని ప్రశ్నిస్తే వచ్చే సమాధానం ఇది : "ఫలాన వారిని ఉరితీస్తుండగా ఈ కోరిక నన్ను ఆవహించింది".

ఈవిధంగా ఎవరు మరణించినప్పటికీ ప్రయోజనం ఎక్కువ కనిపించదు —లేదంటే అది ఇంకొక చోటికి వెడుతుంది. దానిరూపం మాత్రం ఒకటే. నీవు ఒక చొక్కా ధరించి ఒక చెడ్డపనిచేసి ఆ చొక్కా అవతలపారేసి "ఇకనేనేమీ చెడ్డపనులు చేయను" అన్నట్లే ఉంటుంది. నీవు ఇంకొక చొక్కా ధరించి ఆ పని కొనసాగిస్తావు.

ప్రాణమే మరణంగా మార్పుచెందినప్పుడు, అది స్వయంగా ఎందుకు మరణించలేదు.

స్వీయరక్షణ దానికి బాగాతెలుసు. నీవు చెప్పింది నిజమే. అయితే అది భూమి మీదకు అవతరించకుండా జాగ్రత పడుతుంది. ప్రాణికలోకంలో మరణం లేదు. అది ఈ భౌతిక ప్రపంచంలోనే ఉన్నది. అందువల్ల అధి ఇక్కడ అవ తరించకుండా జాగ్రతపడుతుంది.

## స్టాలిన్ ఆ విధంగా ఉండడం విధిలిఖితమా ?

స్టాలిన్ అసలు మానవుడేనా, అని నా అనుమానము. అంటే, అతనిలో చైత్యపురుషుడు లేడని నా ఉద్దేశము. ఒకవేళ ఉన్నప్పటికీ—భౌతిక ప్రపంచంలో ప్రతి అణువులోనూ దైవకేంద్రం ఒకటుందికదా—అది సంపూర్ణమై, వ్యక్తిత్వాన్ని పొందిన చైత్యపురుషుడు కాదు. ప్రాణికలోకంనుంచి సూటిగా దిగివచ్చి అవతరించిన ఒక ప్రాణికజీవి అని నా నమ్మకము. స్టాలిన్‌కు హిట్లరుకి మధ్యగల పెద్ద తేడా అదే. హిట్లరు సాధారణ మానవుడు. మనుష్యులలో కూడ అతి బలహీనమై, ఉద్రేకం ఎక్కువ కల మనస్సు అతనిది. ఒక అల్పకార్మికుని మాదిరిగా, చిన్న బడిపంతులు మాదిరిగా అతని వివేచనాశక్తి కడు బలహీనము. బేలతనం ఎక్కువ.

అంత బేల మనస్సు కావడంవల్ల, ఒకజీవి అతనిని ఆవహించి నప్పుడు మంచి మధ్యస్థునిగా పనిచేశాడు. అతడు ఆత్మలను ఆవాహనం చేసే ఒకానొక బృందంలో చేరి వారి కార్యక్రమాలలో పాల్గొంటూ ఉండగా ఆ జీవి అతనిని ఆవహించింది. ఆ సమయంలో మూర్ఛ వచ్చినట్లు అతనికి తెలివి తప్పడం జరిగింది. నిజానికి అది మూర్ఛకాదు, జీవి ఆవహించేటప్పుడు కలిగిన అలజడి. ఆ విధంగా అతనికి శక్తి వచ్చింది. అయితే అది ఘనమైన శక్తి గాదు. అతను ఏదైనా తెలుసుకోవాలనుకున్నప్పుడు తన కోటలోకివెళ్ళి "ధ్యానం" లో కూర్చొనేవాడు. అప్పుడు అతడు, తనను భగవంతునిగా భావించుకొనే ఆ 'నానాజాతి ప్రభువును' నిజంగానే ఆహ్వానించగలిగేవాడు. అవంతా అతనికొక అద్భుతంగా కనిపించేది. కాని, అదొక అల్పజీవి. అది వెండికవచం, వెండిశిరస్త్రాణం, కలికితురాయి ధరించి ధగధగలాడుతూ మెరుస్తుంటే, హిట్లరు దిగ్భ్రాంతుడయేవాడు. కళ్ళకు మిరుమిట్లుగొలిపే వెలుగుతో అది భౌతికరూపం ధరించకపోయినా మధ్యస్థసాధనం కాబట్టి హిట్లరుకు కనిపించేది. అతనికి ఒకరకమైన యోగదృష్టి ఉండేది. ఆ సమయాల్లో అతడు మూర్ఛపోయేవాడు. నేలపైబడి పొర్లాడుతూ, నోటివెంట నురుగులుగ్రక్కుతూ, తివాచీలు కొరుకుతూ, కడు దైన్యంగా కనుపించేవాడు. అతని దగ్గర మనుష్యులకు ఈ సంగతి తెలుసు. అదే "నానాజాతిప్రభువు",

కాని అది అసలైన నానాజాతిప్రభువు కాదు, దాని అంశ : చాల శక్తిమంతమైన అంశ,

అది అదృశ్యమవడానికి ఇష్టపడితే దైవానికి నష్టమా ?

నీవు అనేదేమిటి ? అదృశ్యమవడమంటే ఏమిటి ? ఎక్కడికి అదృశ్యం కావడం ? నీకు రామాయణగాధ తెలుసు కదా ? రావణుడు కోరుకున్న దేమిటి ? అదృశ్య మవాలని కోరుకోడమంటే అదే. వ్యక్తిత్వం వదలుకోడ మన్నమాట.

మరణానంతరం రావణాసురునికి ఏం జరిగింది ?

అది మాకు ఎవరూ చెప్పలేదు.

ఎవరూ చెప్పలేదా ? నాకు చెప్పారు. రావణాసురుడు పరదైవంలోకి అదృశ్యమై లీనం కావాలని కోరుకున్నాడు. ఆ విధంగా వ్యక్తిత్వం కోల్పోయి మూలాధారమైన పరదైవంలో విలీనమై పోయినాడు. మొదటినుంచీ అతడు శత్రుత్వం వహించడమే మంచిదనుకున్నాడు. దానికి కారణం భక్తులై కొలిచిన దానికంటే ఆ విధంగా ఉంటేనే మార్గం చేరువ అవుతుంది; ఎంతో శీఘ్రంగా దైవాన్ని చేరవచ్చు. దైవం నిశ్చయించుకుంటే ఏదో ఒకనాడు నాశనం చేస్తాడు. అతడు దైవం నుంచి వేరుపడి వెళ్ళలేడు, అంతా దైవమే కదా. ఎటొచ్చీ తన వ్యక్తిత్వం పోగొట్టుకొని దైవంలో ఏకమైపోతాడు.

అదీగాక, నశించేది ఏమీ లేదు; భౌతికశరీరం పోయినప్పటికీ దాని నిర్మాణాంశాలన్నీ ఉంటాయి. అంతా దైవమే కాబట్టి అంతా శాశ్వతమే, దైవంలో నుంచి ఏమీ బయటకు పోలేవు. మనం మన దేహంతో ఏకత్వం పొందడం వల్ల మృత్యువు అనే భావం ఏర్పడుతోంది. కాని నిర్మాణాంశాలు నశించవు. అవి శాశ్వతము. నశించేది దేహం మాత్రమే.

ఆ విధంగా ఆ జీవులలో కొన్ని సంపూర్ణంగా ఆ అనంతునిలో లీనమై పోవాలనుకుంటాయి. అవి వ్యక్తిగత చైతన్యాన్ని వదులుకుంటా యన్నమాట. స్వీయచైతన్యంతో భగవంతునికి సర్వసమర్పణ చేసుకొని దానివల్ల చైతన్యవంతంగా వ్యక్తిగత అమరత్వం కోరుకోకుండా దైవంలో లయంకావడానికే కోరుకుంటాయి. పరివర్తన అనే ఆత్మార్పణం కంటె, వ్యక్తిరహితంగా లీనం కావడమే అవి వాంఛిస్తాయి.

ఎందువల్ల ?

గర్వంవల్ల కావచ్చు. మొదటినుంచి కూడ గర్వమే కారణము. ఇంచు మించు అన్ని మతాలలోను ఆ విధంగానే చెప్పారు. గర్వం అంటే తమ ఆధిక్యత, ప్రాముఖ్యతలవలన కలిగిన ఒకానొక చైతన్యము.

ఈ నాలుగు విభూతులూ ఆ పరదైవంలోని భాగాలే నని చెప్పారు. అటువంటప్పుడు ఆయన చైతన్యం కాకుండా ఇతరమైనది వాటి కెలా ప్రాప్తించింది ?

వేరొక చైతన్యమా ? అటువంటిదేమీ లేదు. తనలోని ఒకభాగం మూర్తిమంతం కావడమే విభూతిలోని మూల సూత్రము. ఆ మూర్తి మౌలిక గుణగణాలను శక్తిమంతంగా నిలుపుకుంటుంది. కాని ఈ విభూతులు, కోరుకునే స్వతంత్రం ఇవ్వాలనే సంకల్పంవల్ల ఏర్పడినట్టివి. ఆ విధంగా ఇవి మూలాధారంతో సంబంధం ఉంచుకోడం, వదిలివేయడం అనే విషయాల్లో సర్వస్వతంత్రం పొందాయి. వాటిలో ఉన్న శక్తి, గొప్పతనాలే వాటికి అధికులమనే భావం కలిగిస్తాయి. స్వయంగా దైవంతో సంబంధంపెట్టుకొని, సర్వసమర్పణ చేసుకోవాలనుకోకుండా, తమలోని శక్తిని, గొప్పతనాన్ని ఉపయోగించుకొని స్వతంత్రంగా ఉండా లనుకోడమే చాలు, వాటిని మూలాధారం నుంచి విడదీయడానికి, వాటి నిర్మాణాంశాలు దైవానికి చెందినవైనా అవి వేర్పాటు చేసుకోగలవు.

అయితే అవి అలా స్వయంగా విడిపోయినప్పటికీ చైతన్యపులోతులలో నశింపు లేని ఒక లంకె ఏర్పడి ఉంటుంది. ఆ లంకె వల్లనే హంతకులు మొదలైన నేరస్థులకు కూడ ఏదో ఒకమూల దైవజ్ఞానం ఉంటుంది. వివేకానందస్వామి చెప్పిన అంశం ఒకటి మీరు చదివారో లేదో; ఆయన నేరస్థునికి ఇలా చెప్పాలని చెప్పారు: "మేలుకో, మేలుకో, ఓ తేజోమయపురుషుడా, ప్రకాశించు."

చిన్నపిల్లలకు చెప్పినట్లు కథగా మీకు చెపుతా ననడం వల్ల ఇది నిజంగా కథానిక మాదిరిగా కనిపిస్తోంది. పిల్లల కథగా కనుపించినప్పటికీ దానిని భౌతిక పరంగా గాకుండా ఆధ్యాత్మికపరంగా అర్థం చేసుకోవాలి. అంతా ఇక్కడ చెప్పినట్లుగానే జరుగుతుం దనుకోగూడదు.

అయినప్పటికీ ఇక్కడ నేను చెప్పినది సాంకేతికంగా చెప్పినా అంతే. తల్లికి పుట్టిన బిడ్డ తల్లిలో భాగమే కదా! భౌతికంగాకూడ అంతే — కొన్ని గంటలుగాని, రెండు రోజులుగాని, రెండు నెలలుగాని— ఈ సంబంధం ఎంత దృఢంగా ఉంటుందంటే, అది బాహ్యానికి వచ్చి నిలిచిన తనలోని భాగంగానే, పెరుగుదలగానే కనిపిస్తుంది. విభూతి విషయంకూడ అంతే. పిల్లలు పెరిగి పెద్దవారై తమ తల్లిదండ్రులతో సంబంధం లేకుండా స్వతంత్రంగా పెరగడానికి ఈ లంకె ఎంతమాత్రం అడ్డురాదు. కాని, మూలంలో, ఆదిలో, ఇది అది ఒకటే కదా. అదే పదార్థం బాహ్యీకరణం పొందింది, అంతే.

విభూతుల విషయంలో అంతే జరిగింది. ఎటొచ్చీ భౌతిక పరిధిలో కాకుండా అత్యున్నత ఆధ్యాత్మిక పరిధిలో అది జరిగింది. ఇక్కడ జరిగేది పైన జరిగేదాని సాంకేతికమే.

మీకు ఎప్పుడూ ఈ విధంగా తోచలేదా? ఇదేమి, ఈ పిల్లవాని తల్లిదండ్రులు అంత మంచివారు, నిజాయితీ పరులు, ఉదారులు, సత్యశీలురు అయినప్పటికీ ఇతడు ఇంత ఆకతాయి అయినాడేమిటి? అది నీకు ఆశ్చర్యంగా తోచవచ్చు. కాని ఇందులో అసాధ్యమేమీ లేదు. అంతా జీవుల అంతర్నిర్మాణాన్ని బట్టి జరుగుతుంది. ఒకే విధంగా ఉండే వస్తువులు రెండు ఎక్కడా కనుపించవు.

ఏ ఇద్దరి తత్వాలూ ఒకరకంగా ఉండవు. ఆంతరిక వ్యవస్థననుసరించి, వ్యక్తి సమగ్ర వ్యవస్థ ననుసరించి, అంటే, ఆ నిర్మాణాంశల ఏర్పాటు పరస్పర సంబంధాల ననుసరించి, జరుగుతుంది. కణాలు గూడా ఒకే పద్ధతిలో ఏర్పడవు కాబట్టి, బాహ్యాకృతిలో కూడ తేడా కనిపిస్తుంది. కాని, నీవు నిత్యం చూస్తూ, వీటి మధ్యలోనే పెరగడంవల్ల నీ కిదంతా సహజంగా కనిపిస్తుంది. పిల్లవాడు తల్లిదండ్రులకు భిన్నంగా కనుపించడం నీవు సహజం అనుకుంటావు. కాని అదీ, ఇదీ ఒకటే. పరదైవపు విభూతి ఆ పరదైవంలో భాగమే అయినా వేరుగా కనిపిస్తుంది. దానికి కారణం అది మొత్తంలో భాగమైనా, మొత్తం అంతా అందులో లేదుకదా. ఆ విధంగా మొత్తమంతా వ్యక్తం కాకపోవడంవల్ల ఆంతరిక నిర్మాణంలో తేడా వచ్చి అది మొత్తంనుంచి వేరుగా ఉంటుంది.

ఇంతవరకు చెప్పుకున్నదాంట్లో చాలా వేదాంతం వచ్చింది. ఇప్పటికి ఇది చాలు.

9 డిశంబరు 1953

> ఎప్పుడూ మనం ఆలోచించే విషయాలే మనల్ని ఆవరించి ఉంటాయి.

శ్రీమాతృ వచనాలు, 1949 ముద్రణ.

అవును. అది చాలా ముఖ్యము.

నీవు అసహ్యంగా ఆలోచిస్తే నీ పరిసరాలు కూడా అసహ్యంగానే ఏర్పడతాయి.

> "అహంకారాన్ని తప్పించుకోడం అంత తేలిక గాదు. భౌతిక చైతన్యంలో దానిని తప్పించుకున్న

ప్పటికీ, ఆధ్యాత్మిక చైతన్యంలో అది ఇనుమడించి అడ్డువస్తుంది"

(పైవలెనే)

ఆధ్యాత్మిక చైతన్యంలో అహంకారాన్ని ఏ విధంగా కలుసుకుంటాము ?

భౌతిక, ప్రాణిక, మానసిక పరిధులలోని అహం మాదిరిగానే ఆధ్యాత్మిక అహంకారం కూడా ఉంటుంది. కొంతమంది కష్టపడి, తమ అహంకారంనుంచి, పరిమితులనుంచి అన్నివిధాలుగా విముక్తులై ఆధ్యాత్మిక చైతన్యాన్ని అందుకో గలుగుతారు. కాని, అప్పుడు వారికి, దురహంకారం కలిగి, తామే అధికుల మనేభావం, తమస్థితికి రానివారిపై తిరస్కారభావం కలుగుతాయి. అహంకారం లోని అవహేళన, దుష్టత్వం మళ్ళీ వారి కక్కడ తగులుతాయి. అటువంటివారు చాలామంది తమ భౌతిక, ప్రాణిక చైతన్యంలోని అంశాలనన్నిటినీ అధిగమిస్తారు, కాని, వాటిని అధిగమించడానికి చేసిన కృషి, దానివల్ల వారికి కల్గిన విజయం, వారికొక ఆధిక్యభావం కలుగచేస్తాయి. దానితో వారు గర్వించి తమ ఆధిక్యత స్థిరపరచుకుంటారు.

ఇది ఎవరూ గమనించనంత తరుచుగా జరుగుతుంది.

నా కిది అర్థం కావడం లేదు : "ప్రకృతి శక్తు లంటే, మానవుల పరిమాణానికీ, వారి శక్తిసామర్థ్యా లకూ మించిన కొన్ని జీవుల బాహ్యాచర్యలు తప్ప మరేమీ కావు."

శ్రీమాతృ వచనాలు, 1949

అర్థంకాలేదా? ....గాలిని ఉదాహరణగ తీసుకుందాము. "ఇవి ప్రకృతి శక్తుల ప్రకటనలు. ఇది ఫలానా దృగ్విషయ ఫలితం'' అని శాస్త్రిజ్ఞులు చెపు

తారు, వారు ఇంకా వేడి, చలి, ఎక్కువ, తక్కువ అనేవి కూడా ఇలాంటివే నని చెప్పి "అవి గాలివీచడం వల్ల ఏర్పడుతున్నాయి. ఇవి వాతావరణంలోని వాయు ప్రవాహాలు" అని చెపుతారు, కాని అదికాదు. దాని వెనుక కొన్ని జీవ తత్వాలుంటాయి. అవి చాలా పెద్దవి కావడం వల్ల వాటి ఆకృతి మనం ఊహించ లేము. ఉదాహరణకు, ఒక చీమను మానవునిగురించి వర్ణించమంటే ఏమి చెపు తుంది? మహాఅయితే అది చిటికెనవ్రేలు కొస చూడగలదు, లేక, పాదంమీద ప్రయాణం చేయగలదు. అదే దానికొక పెద్ద ప్రయాణము. అందువల్ల, మాన వాకృతి ఎలా ఉంటుందో అది తెలుసుకోలేదు. ఇదీ అంతే. గాలి, వాన, భూకంపం మొదలైనవి కలుగజేసే శక్తులు కొన్నిరకముల మహాజీవతత్వములకు సంబంధించిన చలనాలు, లేక ప్రకటనలు, వానినే నీవు చేష్టలనిగూడా అనవచ్చు. వారి పాదపు కొసలైనా మనం చూడలేము కాబట్టి వాటి ఆకృతిని మనం తెలుసు కోలేము.

ఏమైనప్పటికీ మామూలు అహంకారం కంటె,
ఆధ్యాత్మిక అహంకారం మంచిదే కదా!

కాదు. మామూలు అహంకారంకంటె అది చాలా ప్రమాదమైనది. ఎందు వల్లనంటే, అది అహంకారమని ఎవరూ గుర్తించలేరు.

బాహ్యానికి అహంకారపూరితులుగా ఉన్నప్పుడు, అది ఎవరికి వారు తెలుసుకో గలగడమే కాకుండా, మిగిలినవారు కూడా దానిని గుర్తించేటట్లు చేస్తారు; పరిస్థి తులు కూడా అనుక్షణమూ నీకు దానిని రుజువు చేస్తూ ఉంటాయి. ఆధ్యాత్మిక చైతన్యంలో ఉన్నప్పుడు నీ చుట్టుప్రక్కల వారంతా నిన్ను అధికంగా గౌరవించే వారవడం వల్ల, నీలో దురహంకారమున్నట్లు నీవు తెలుసుకోలేవు.

అది చాలా అపాయము. భౌతికగర్వం కంటే ఆధ్యాత్మిక గర్వం చాలా ప్రమాదమైనది.

అయితే అమ్మా, అహంకారం ఉన్నప్పుడు దైవాన్ని తెలుసుకోగలరా ?

దైవంతో ఏకత్వం పొందిన సమయంలో కాదు, ఆక్షణంలో అహంకారం అంతమౌతుందనేది తెలిసిన విషయమే. కాని, ఆస్థితి ఎంతోకాలం నిలవదు. ఇంకోరకంగా చెప్పాలంటే, అహంకారాన్ని తమతోపాటే ఉంచుకొని దైవసాక్షాత్కారం పొందినవారు ఆ చైతన్యాన్ని ఎక్కువసేపు నిలుపుకోలేరు. ఆ అనుభవం పొందుతూండగానే వారి ఉనికి వారికి తెలియడం ప్రారంభిస్తుంది. అది మరీ ఘోరము. అనుభవం పొందుతూ తమను చూచి తామే మెచ్చుకోడం మొదలు పెడతారు. తాము చాలా అతీత వ్యక్తులమని, మిగిలిన వారికంటె చాలా అధికుల మని భావించుకుంటారు, దానితో దారుణంగా తయారౌతుంది.

మీరు ఇంకా ఇలా చెప్పారు : "ప్రభూ ! నీవు నాకు జీవితం గాని, మరణం గాని, ఆనందం గాని, దుఃఖం గాని, సుఖం గాని, కష్టంగాని, ఏది నిర్ణయించినప్పటికీ నీ దగ్గరనుంచి వచ్చిన వాటినన్నిటినీ కూడా ఆహ్వానిస్తాను."

దైవం మనకు దుఃఖాన్నీ, కష్టాలను కూడా కల్గిస్తాడా ?

బిడ్డా ! నీవు చదువుతున్న విషయం ఎందులోనిదో తెలుసా: అది కృష్ణుని ఉద్దేశించి రాధ చేసిన ప్రార్థన. దివ్య శక్తులకు వ్యక్తిత్వం ఆరోపించి వర్ణించడం వల్ల తనను తాను వ్యక్తం చేసుకోడంలో దైవానికి మానవ అనుభూతులు కల్పించడం జరిగింది. దాని సరియైన రూపం అర్థంచేసుకోవాలంటే ఎంతో వివరణ అవసరం, ఆవిధంగా వివరిస్తే అందులోని రసభావం అంతరించి ఒక సిద్ధాంతంగా తయారౌతుంది. ఇంకా చెప్పాలంటే, నీతి సూత్రాలు చెప్పినట్లవుతుంది. అంతా దైవంలోనే ఉన్నదని, అంతా దైవానికే చెందుతుందని చెప్పడంకోసం ఆ విధంగా

చెప్పారు. ఎవరైనా తమ చైతన్యస్థితిని మార్చుకొని దైవంతో తాదాత్మ్యం చెందితే అదే అన్నిటినీ మారుస్తుంది. ఉదాహరణకు, బాధ, దుఃఖం, కష్టం మాదిరిగా కనిపించేవి ఏమైనా వచ్చినప్పటికీ అవి నిన్ను దైవానికి సన్నిహితం చేయడానికి తగిన అవకాశమనీ, సంతృప్తికరంగా ఉండే సంఘటనల కంటె ఈ సంఘటనల ద్వారానే అంతవరకు అనుభవం కానటువంటి ఒక అపరిమిత ఆనందాన్ని పొంద వచ్చునేమో ననీ భావించడం మొదలుపెడతావు. నీవు దానిని ఆ విధంగానే అర్థం చేసుకోవాలి; ఆ విధమైన ఉద్దేశంతో, అదే చైతన్యంతో తీసుకోకుండా సాధారణ భావంతో తీసుకుంటే అంతా దైవమే అనే సిద్ధాంతానికే అది వ్యతిరేకం అవుతుంది.

ఒకే విషయమైనా ఒకే పరిక్రంపనమైనా దానిని గ్రహించి, ప్రతిస్పందించ డాన్నిబట్టి అపరిమితానందాన్ని కాని, నిరాశని కాని కలుగచేస్తుంది. అది వారి చైతన్యస్థితిపై ఆధారపడుతుంది. అందువల్ల, దురదృష్టం అని మనం దేనినీ చెప్పలేము. కష్టం అనేదేదీ లేదు. చైతన్యస్థితిని మార్చడానికి అన్నీ అవసరమే. అంతే. నీవు అలా నీ చైతన్యస్థితిని మార్చుకోడంలో కృతకృత్యు డవై ఈ విధమైన బ్రహ్మానందస్థితిని చేరితే మిగిలిన వారంతా ఇంకా పోట్లాడు కుంటూ, అశాంతికి లోనై కష్టపడుతూ ఉండడం గమనిస్తావు. నీవు మాత్రం చాలా సమతాస్థితిలో, అద్భుతంగా, ఆనందంగా, ఆహ్లాదంగా ఉంటూ, "వారు కూడా నేను చేస్తున్నట్లే ఎందుకు చేయకూడదు?" అనుకుంటావు. కాని, అసలు సంగతేమిటంటే, ఆ విధమైన సంసిద్ధత, లోనుండి రాకపోతే అందరూ అలా చేయలేరు. సాధారణ చైతన్యంలోనే ఉండిపోయినవారికి కష్టం అనేది చాలా యథార్థంగా కనిపిస్తుంది.

కాని, ఈస్థితిని చేరుకున్నవారు కొంతమంది తాము మాత్రమే సుఖంగా ఉండడానికి ఇష్టపడక, మిగిలినవారిని కూడా ఈ మార్గంలోకి కొంతవరకు తీసు కుని రావడానికని తమ బ్రహ్మానందస్థితిని పరిత్యజిస్తారు.

ప్రపంచవైఖరి అనేక తీరులుగా ఉంటుంది. ముఖ్యంగా మంచి అనేదాని పట్ల వైఖరి ప్రతి వ్యక్తి ననుసరించి ఉంటుంది. ఒకరికి విజయవంతమైన మార్గం మరియొకరికి కాదు. ఎవరి మార్గాన్ని వారు అనుసరించాలి. అందు

వల్లనే అందరితోను "నేను చేసేటట్లు చేయి" అని చెప్పితే చాలా కష్టము. కాని, గురువులంతా అలాగే చెపుతారు. "నేను చేస్తున్నట్లుచేయి, గమ్యం చేరుతావు" అని, ఎవరు చెప్పినా అదే: "నేను చేస్తున్నట్లు చేస్తే నీవు కూడా నా మాదిరిగానే అవుతావు."

(నిశ్శబ్దము)

మిమ్మల్ని ఒకప్రశ్న అడుగుదామనుకుంటున్నాను. ఈ అధ్యాయం మొదట్లో: "మనం ఆలోచించే విషయాలే మనల్ని అవరిస్తాయి" అని ఉన్నది కదా, అది మీకు బాగా అర్థమైందా? (ఒక విద్యార్థివైపు తిరిగి) నీవు ఏదైనా ఒక విషయాన్నిగురించి ఆలోచించినప్పుడెల్ల, ఒక అయస్కాంతం నీ చేతిలో పట్టుకొని ఆ విషయాన్ని నీదగ్గరకు ఆకర్షిస్తున్నట్లుగా ఉంటుంది—అర్థమైందికదా. కొంత మందికి ఒక దురలవాటుంటుంది: వారు అస్తమానం అన్నిరకాల ఆపత్తులనూ ఊహిస్తూ, మరుక్షణంలోనే ఏదో ఘోరం జరుగబోతున్నట్లు ఎప్పటికప్పుడు భయపడతారు. అటువంటి వారిని నేను చాలామందిని ఎరుగుదును. ఇక్కడ కూడా కొంతమంది ఉన్నారు. అటువంటివారు అయస్కాంతం చేతపుచ్చుకున్నట్లు వారికే కాకుండా ఇతరులకు కూడా ప్రమాదాలు తెచ్చిపెడతారు. అది వారికొక పెద్ద బాధ్యతగా తయారవుతుంది. ఆవిధంగా ఎప్పుడూ ఏదో విషయాన్ని గురించి ఆలోచించకుండా ఉండలేనివారు— వారి ఆలోచనలలా పరుగెడుతుంటే, వాటిని ఎలా ఆపాలో వారికి తెలియదు— వాటిని మంచివిషయాలపైకి మరల్చి మంచి పంథాలో సాగేటట్లు చూడవచ్చు కదా! ఒకసారి నీ ఆలోచన అలా పరుగులు పెడుతుంటే, మంచి ఎన్నిరకాలుగా జరుగవచ్చో అన్నిరకాలుగా దానిని ఆలోచించమను. అది ఒకే వలయంలో తిరుగుతుంటే, ఆదారి మంచిదారిగానే ఉండనీ. ఉదాహరణకు, ఎవరైనా కొంచెం అస్వస్థత చెందగానే "ఏమి జరుగుతుందో ఏమో! ఒకవేళ విషమిస్తుందేమో, ఫలానా జబ్బుకి దారి తీస్తుందేమో. అలా అయితే చాలా ప్రమాదమే." అనేదాని బదులుగా, "అబ్బే. అదేం లేదు. బయటకు కనబడకుండా లోపల దాగి ఉన్న కొన్ని ప్రకంపనాలకు బాహ్యంగా కనబడే భ్రమే అస్వస్థత, అందువల్లనే వాటినిగురించి ఎవరూ మాట్లాడరు. కాని, జరిగేది అదే. ఈప్రగాఢ ప్రకంపనాలు పైకి వచ్చేస్తే లోపల

జరిగిన కల్లోలం సర్దుకుంటుంది. ఈ అసమ స్థాయిని, ఈ అస్వస్థతను, అంటే ఈ కలిగిన చెడ్డ పరిస్థితిని, దైవీకృప విలీనం చేసుకొని, నశింప చేస్తుంది. దాని ఛాయలేమీ మిగలవు. సుఖదాయకం, ఆనందదాయకం అయినవి మాత్రమే మిగులుతాయి.'' అనే ఆలోచనలు ధారావాహినిగా సాగాలి.... ప్రతివారూ తమ మనస్సును పరుగులు పెట్టించే అవసరం ఉందనుకుంటాను. అటువంటప్పుడు, దానిని మంచిమార్గాలలోనే పరుగెత్తిస్తే ఫలితం నీకే తెలుస్తుంది. ఉదాహరణకు, ఈవిధంగా ఆలోచిస్తే బాగుంటుంది: నేను ఇంకా బాగా నేర్చుకోవాలి, ఇంకా మంచివి తెలుసుకోవాలి. ఇంకా ఇంకా ఆరోగ్యవంతుణ్ణి కావాలి, కష్టాలన్నీ తొలగిపోవాలి; చెడ్డవాళ్ళంతా మంచిగా అభిమానంగా తయారవాలి, క్రూరులకు వారి క్రూరత్వం పోవాలి, మంచి నిర్మాణాలు వృద్ధిపొందాలి, నశించవలసినవి నశించి మంచివాటికి చోటివ్వాలి, ప్రపంచమంతా నిరంతరంగా పురోగమించాలి. ఆ ప్రగతి కొనసాగితే చివరకు అంతా పరిపూర్ణ సామరస్యంగా మారుతుంది.... అంటూ ఈ విధంగా ఎంతైనా ఆలోచించవచ్చు. అప్పుడిక నీచుట్టూ అన్నిరకాల ఆహ్లాద విషయాలు చేరుతాయి. చుట్టూ ఉన్న వాతావరణాన్ని గమనించేవారికి, మనస్సును చీదరపెట్టే కొన్ని కలతలు కనిపిస్తాయి— వాటి బదులుగా కొందరు చాలా సంతోషకరమైన రూపాలు, సూర్యకిరణాల వెలుగుతో నిండిన రూపాలు కాని, సుందరమైన చిత్రాలు కాని చూస్తారు. చిత్రకారులు కొంతమంది ఈ విధంగా చాలా మంచి ఆలోచనలను గ్రహిస్తారు.

జననీ, ప్రతి ధ్యానమూ ఒక నూతన ఆవిష్కారంగా కావాలి. ఎందుకంటే, ప్రతి ధ్యానంలోనూ క్రొత్తది ఏదో జరుగుతుంది." * అని మీరు సెలవిచ్చారు. ధ్యానం అయిన తర్వాత ధ్యానంలో ఏమి జరిగిందో తెలుస్తుందా ?

అసలు విషయం అదే. ధ్యానంపై దృష్టి పెట్టుకొని చైతన్యాత్మకంగా ఉండు. బాగా దృష్టి నిలిపితే చైతన్యవంతులు కావచ్చు. బాగా దృష్టి నిలిపి ఏకాగ్రత వహించాలి.

> అమ్మా, కష్టానుభవమనేది అజ్ఞానం వల్లనూ, బాధవల్లనూ కలుగుతున్నది కదా; దివ్యమాత తన పిల్లలకోసం పొందే బాధ, కష్టానుభవముల స్వరూపం ఎట్టిది? దివ్యమాత అంటే 'సావిత్రి' లోని దివ్యమాత.

దానికి కారణం ఆమె ప్రకృతితో కలిపి పనిచేయడమే. ప్రకృతిలో పాల్గొనడం కోసమే ఆమె భూమిపైకి దిగి వచ్చింది. ఆ విధంగా పాల్గొనక పోతే ఆమె వారిని ముందుకు నడిపించలేదు. బాధలులేని తన పరమచైతన్యంలో ఆమె నిలిచిపోతే ఆమెకు మానవులతో ఏ విధమైన సంబంధం ఉండే అవకాశం లేదు. కాని, అసలు సంగతి ఆమె మరచిపోదు. మానవ చైతన్యాన్ని పొందినప్పటికీ యథార్థమైన తన పరమ చైతన్యంతో సన్నిహితత్వం నిలుపుకుంటుంది. ఆ విధంగా ఆ రెండింటినీ కలుపుతూ మానవ చైతన్యాన్ని గూడా పురోగమించేటట్లు చేస్తుంది. వారి చైతన్యాన్ని తాను స్వీకరించకుండా, వారి దుఃఖంలో పాలుపంచుకోకుండా ఉంటే, వారికి సహాయం చేయడం కష్టము. ఆమె కష్టాలు అజ్ఞానంవల్ల కలిగినవి కాదు, అది తాదాత్మ్యంవల్ల కలిగే కష్టము. వారితో సన్నిహితసంస్పర్శ పెట్టుకొని వారున్న స్థితినుంచి వారిని తప్పించడానికని వారు పొందుతున్న ప్రకంపనాలే తానూ పొందాలని పొందింది. వారితో ఆ విధమైన సంస్పర్శ లేకపోతే ఆమె ఉనికిని గుర్తించరు, లేదా ఆమె తేజస్సును భరించలేరు.... దీనినే వివిధ మతాలలో వివిధ రూపాలలో వర్ణించారు. దైవ బలిదానం అని కూడా దీనినే వర్ణించినప్పటికీ అందులో కొంత నిజం లేకపోలేదు. అది స్వచ్ఛందమైన ఆత్మార్పణ. ఎందువల్లనంటే, పరిపూర్ణ చైతన్యవంతము, బ్రహ్మానందమయము, పరిపూర్ణశక్తిమంతము అయిన స్థితిని వదులుకొని బాహ్య ప్రపంచాన్ని అజ్ఞానాన్నుంచి తప్పించడానికై తాను కూడా అజ్ఞాన స్థితినే చేపట్టడం

త్యాగం కాదా. ఆ స్థితిని చేపట్టకపోతే దానితో సాన్నిహిత్యం పెంచుకోలేరు; అదే అవతార పురుషుల ముఖ్యోద్దేశ్యము. లేకపోతే అవతారాల అవసరమే లేదు. దివ్యచైతన్యం, దివ్యశక్తి తమ పరిపూర్ణతాస్థాయి నుంచి సూటిగా భౌతిక పదార్థం మీద పనిచేసి దానిని పరివర్తింపజేయ గలిగితే మానవ శరీరం ధరించవలసిన అవసరమే లేదు. సత్యలోకం నుంచి పరిపూర్ణమైన చైతన్యంతో మానవచైతన్యంపై చర్య జరపగలిగితే సరిపోయేది. నిజానికి అది పనిచేస్తూనే ఉన్నది. కాని, చాలా నిదానము. ఈ విధమైన వేగంతో పృథ్విని పురోగమింప చేయాలంటే మాత్రం, మానవరూపం ధరించక తప్పదు. మానవ శరీరంతోపాటు కొంత మానవ ప్రకృతినిగూడా స్వీకరించక తప్పదు. మానవ ప్రకృతిని స్వీకరించినప్పటికీ, పరమ చైతన్యాన్నీ, పరమసత్యంతో సాన్నిహిత్యాన్నీ వదులుకోకుండా, ఆ రెంటినీ మిశితం చేసి పరుసవేదిలాగా పరివర్తనను సాధించవచ్చు. భౌతికపదార్థానికి దూరంగా ఉంటే మాత్రం చేయగలిగినది ఏమీ లేదు.

అయితే సావిత్రి తాను ఏమి చేయబోతున్నదో ముందుగా తెలుసుకునే చేసిందా ?

అవును. ఆమె ఆ విధంగానే చెప్పింది. నీవు చదువలేదా ? తాను ఒంటరిగా ఉండవలసి వస్తుందని కూడా ఆమె ముందుగా తెలుసుకుంది. "నేను ఒంటరిగా ఎదుర్కోడానికి సంసిద్ధంగా ఉన్నానని" కూడా ఆమె చెప్పింది.*

తాను "దుఃఖముల జనని"ని, "పరాక్రమ జనని" ని కలుసుకోగలదని ఆమెకు ముందుగా తెలుసా ?

---

* శ్రీ అరవిందుల 'సావిత్రి' శతజయంతి గ్రంథాలలో 29 వ ప్రతిలో పేజీ 503 నుండి 521 వరకు 1953 డిశంబరు 1 న అక్కడి పాఠశాల వార్షికోత్సవంలో పఠించారు.

తెలుసుననే చెప్పాలి, ముందు జరుగబోయేది అంతా కూడా ఆమెకు తెలుసుననే అందులో స్పష్టంగా ఉన్నది. వారందరికీ కూడా ఆమె ''మీకు అవసరమైనది నేను తీసుకువస్తాను" అని చెప్పింది. దానిని బట్టి కూడా ఆమెకు అంతా తెలుసుననే అనుకోవాలి. లేకపోతే ఆ విధంగా చెప్పదు కదా.

> 'సావిత్రి' లో 'దుఃఖముల జనని' ఈ విధంగా చెప్పింది. "ప్రపంచం బహుశః తన తుది నిద్రలో మునగవచ్చు; అపుడు నేను కూడ శాశ్వత నిశ్శబ్ద శాంతిలో నిద్రిస్తాను."

''సావిత్రి" శతజయంతి సంపుటం 29, పేజీ 505.

ఆహా, అదే మానవచైతన్యము. బాధలన్నీ శమించిపోయినతర్వాత, ''నేనిక నిద్రిస్తా'' నని చెప్పడం మానవ చైతన్యానికి కలిగే ఊహ. శ్రీఅరవిందులు ఇక్కడ సావిత్రిలో చెప్పినది దీనిని గురించే. దివ్యశాంతికోసం ఈవిధంగా ఆకాంక్షిస్తున్నవారు ప్రళయం వచ్చి ప్రపంచమంతా అంతరిస్తే అప్పుడుండేది శాంతియేకదా నని భావిస్తారు. కాని, ఈ భావనలోనే కొంత వైరుధ్యం కనిపిస్తోంది, ఎందువల్లనంటే, ప్రళయమే వస్తే అక్కడ ఏమీ మిగలదు గదా, ప్రశాంతి మాత్రం ఎలా అనుభవించడం?

మానవ చైతన్యంలోని అనేక వైరుధ్యాలలో ఇది ఒకటి మాత్రమే: "ఈపృథ్వి ఉన్నంతకాలం, బాధ లున్నంతకాలం నేనీ ప్రపంచంతోపాటుగా బాధల ననుభవిస్తాను. ఎప్పటికైనా ప్రపంచం శాంతిని ప్రవేశించి, శూన్యస్థితిలోని ప్రశాంతిలోకి అదృశ్యమైతే నేను కూడా విశ్రమిస్తాను.'' ప్రపంచంలో బాధ ఉన్నన్నాళ్ళు, నేను దానిని అనుభవిస్తాననీ, అది దానికి లేనప్పుడు నాకు కూడా ఉండదనీ కావ్యరీతిలో చెప్పడమిది.

అట్టి స్థితిలో 'దుఃఖాల జనని' ఏమి చేస్తుంది ?

ఆమె చేయగలిగినది ఇంకా ఏముంటుంది ?

అపుడామె, 'ఆనందజనని' అవుతుంది.

సావిత్రి దివ్యమాత చైతన్యాన్ని సూచిస్తుంది, కాదా ?

అవును.

సత్యవంతుడు దేనిని సూచిస్తాడు ?

ఆయన కేవలం అవతారమే; పరమసత్యపు అవతారము.

16 డిశంబరు 1953

ప్రియజననీ, "... మనలోని చైత్యపురుషుని తెలుసుకోడానికి, ఆ తర్వాత దానితో తాదాత్మ్యం పొందడానికి, అనేక మార్గాలు ఏర్పడ్డాయి. మానసికమైనవి కొన్ని, మత సంబంధమైనవి కొన్ని, మరి కొన్ని యాంత్రికమైన పద్ధతులుకూడా ఏర్పడ్డాయి".
శ్రీమాతారవిందుల 'విద్య' లో 'జీవితశాస్త్రము' నుంచి.

మీరు వీనికేమైనా ఉదాహరణ లివ్వగలరా ?

యాంత్రికమైన పద్ధతులంటే ఆసనాలు, హఠయోగం మొదలైనవి. అవి చేయడంలో ఉద్దేశం ఇదే. ఒక మతంమీద విశ్వాసంతో ప్రార్థనలు, మతానికి

సంబంధించిన కొన్ని కర్మకాండలు అనుష్ఠించేవారికోసం మతసంబంధమైన పద్ధతులు ఏర్పడ్డాయి. ఎవరైనా ఒక మతాన్ని నమ్మినప్పుడు, ఆ మత నియమాలకు కట్టుబడి, దానిలో నమ్మకాలను, సూత్రాలను అనుసరిస్తూ ప్రార్థించి, వేడుకుంటారు. మానసికమైన మార్గం యోగమార్గము. అంతఃపరిశీలన ద్వారా శాశ్వతమైనదానికోసం అన్వేషించడమే ఈ పద్ధతి.

మీ ఆదర్శం విశాలమై, ఉన్నతమై, ఉదారమై,
స్వప్రయోజనం కాంక్షించనిదై ఉండాలి.
(పైదాని వలెనే)

అంటే అర్థం ఏమిటి ?

ఉన్నతమైనదంటే తెలియలేదా? ఉదాహరణకు, కొంతమంది గొప్పభాగ్యం సంపాదించాలనుకుంటే, మరికొంతమంది ఒక వ్యాధికి నివారణోపాయం కనుక్కోవా లనుకుంటారు. ఒక వ్యాధికి నివారణోపాయం కనుక్కోడానికన్నా ధనం సంపాదించుకోవాలనుకోడం ఎక్కువ స్వప్రయోజనాన్ని కోరేదీ అధమమైనదీ. కొంతమంది సౌఖ్యవంతమైన ప్రశాంత జీవనమే తమ ఆదర్శంగా పెట్టుకొని పిల్లపాపలతో, కుటుంబసౌఖ్యంతో ప్రపంచంలో అన్నిటిలోకీ మంచివన్నీ ఏర్పరుచుకొందా మనుకుంటారు. కొంత అధమమే అయినా అది సర్వసాధారణమైన ఆదర్శము. రేడియం కనుగొన్న క్యూరీ దంపతుల మాదిరిగా సంఘానికంతా ఉపయోగపడే పనులు చేద్దామని కొంతమం దనుకుంటారు. అది ఉన్నతాదర్శము. స్వప్రయోజనాన్ని కాంక్షించకపోవడమంటే అదే. అన్నిటికంటె అత్యుత్తమ ఆదర్శం, దైవంతో ఏకత్వాన్ని పొంది ఆ దైవకార్య నిర్వహణ చేయాలనుకోడము. ఇది అన్నిటి కంటే పై మెట్టు. నేను ఈ మొదటి అధ్యాయంలో ఈ విషయాలేవీ ప్రస్తావించదలచుకోలేదు. ఆ పుస్తకం తంత్రం మొదలైన విషయాలేమీ తెలియనివారికి కూడా ఉపయోగించాలని వ్రాశాను. అయినప్పటికీ, ఆత్మదర్శనము, దైవంతో ఏకత్వం, పృథ్విపై దైవకార్య నిర్వహణ మొదలైనవి స్వప్రయోజన రహిత, స్వలాభ రహిత అత్యుత్తమ ఆదర్శాలుగా ప్రకటితమైనాయి.

అప్పుడింకా విశేషణా లేమి వాడాను?

ఉన్నతం, విశాలం, ఉదారం, స్వప్రయోజన రహితము.

అవును. విశాలమే. అది పూర్తిగా అల్ప వ్యక్తిగత చైతన్యానికి, పూర్తిగా దాని స్వలాభానికి కాకుండా ఒక సంపూర్ణత్వానికి వర్తిస్తుంది—అది ఒక సమూహం కావచ్చు. ఒక దేశం కావచ్చు, ఖండం కావచ్చు, లేక పృధ్వి అంతా కావచ్చు. భూమి అంతా పనిచేసే చర్య ఏదైనా, మనిషికి అది విశాల చర్యేనని చెప్పవచ్చు.

దాని తర్వాత మీరు, "అది మీ జీవితాన్ని మీకే కాకుండా అందరికీకూడా అమూల్యమైనదిగా తయారు చేస్తుంది"— అని చెప్పారు.

అవును. మీరు పనికిరానివారైతే జీవితానికి విలువేఉండదు. మీరు ఉపయోగిస్తే అది అమూల్యమౌతుంది. వ్యక్తిగత జీవితానికి సంబంధించిన చిన్న చిన్న విషయాలతో మీ కాలమంతా గడిచిపోతూ తీరికలేకుండా ఉండడం కన్నా విసుగుదల వేరే లేదు. అట్లా ఉంటే జీవితం సారహీనం, అపరితృప్తం, నిరుపయోగం అనే భావం కలుగుతుంది. జీవితంలో ఆసక్తి పోతుంది. ఆ విధంగా సంసార తాపత్రయంలో మునిగిపోయినవారున్నారు, పిల్లలకి కొంచెం దగ్గు వచ్చినా, తుమ్మువచ్చినా గంటలకొద్దీ హైరాణపడతారు. భోజనం సరిగా కుదరకపోయినా, ఇంకేమైనా జరిగినా గల్లంతు చేస్తారు, ఉద్యోగంపోయి, ఇంకొక ఉద్యోగం వెతుక్కుంటూ "ఈ సంసారాన్ని ఎలా పోషించగలను" అంటూ విచారిస్తూ కూర్చుంటారు. ఇటువంటి జీవితం కేవలం బొరియలోని వానపాము జీవితమే..

**చైత్యపురుషసత్త అందరిలోను పరిశుద్ధంగానే ఉంటుందా లేక దానిని ఆ విధంగా చేయాలా ?**

అది ఎప్పుడూ పరిశుద్ధమే. కాని. అది ప్రతివారిలోనూ కొద్దిగానో గొప్పగానో ప్రత్యేకత పొంది చర్యలలో స్వతంత్రంగా ఉంటుంది. దాని నిర్వచనాన్ని బట్టి అది ఎప్పుడూ పరిశుద్ధమైనదే నని గుర్తించవచ్చు. ఎందువల్లనంటే మనలోని దైవంతో సంస్పర్శను పొంది, జీవి సత్యతను వ్యక్తీకరించేది అదే. అది ఒకరికి అంధకారంలో దివ్య విస్ఫులింగం మాదిరిగానైనా ఉండవచ్చు. లేదా పూర్తిగా రూపొంది తేజోమయంగా, చైతన్యవంతంగా, స్వతంత్ర పురుషుడుగానైనా ఉండవచ్చు. ఈ రెండింటి మధ్యగా అనేక స్థాయిలున్నాయి.

**సాధారణంగా అది పొరగమ్మి ఉంటుందా ?**

దానితో సంస్పర్శ పెట్టుకోనిది బాహ్య చైతన్యమే. అది లోపలివైపు తిరగకుండా బాహ్యదృష్టి పెట్టుకొని, ఆ బాహ్య శబ్దాలు, కదలికల మధ్యనే జీవిస్తుంది. అది అంతర్దృష్టి నిలుపుకొని, తనలోనికి చూచుకొని, అంతర ప్రబోధాలను వినడానికి బదులు, బాహ్యంగా చూస్తూ, తన చర్యలపైనా, తన మాటలపైనా కేంద్రీకరించి మనుగడ సాగిస్తుంది.

**ఈ చైత్యపురుషునికి ఏదైనా శక్తి ఉన్నదా?**

శక్తా? సాధారణంగా జీవితాన్ని నడిపించేది చైత్యపురుషుడే. దాని సంగతి తెలియకపోవడంవల్ల ఎవరూ దానిని గుర్తించరు. కాని, సాధారణంగా జీవితాన్ని నడిపించేది అదే. బాగా శ్రద్ధవహిస్తే దానిని తెలుసుకోగలరు. కాని, మానవులలో ఎక్కువ భాగం దానిసంగతి బొత్తిగా ఎరుగరు. ఉదాహరణకు, బాహ్యమైన అజ్ఞానంతో వారు తలపెట్టిన పనిని చేయడానికి వీలులేకుండా ఇంకొక పని చేయవలసి వస్తుం దనుకోండి. ఇక వారు అరచి, కేకలుపెట్టి దురాగ్రహంతో విధిపై విరుచుకుపడి (అదంతా వారి నమ్మకము ననుసరించి) ప్రకృతి దుష్టురాలని గాని, వారి విధి వక్రమైనదని గాని, లేదా భగవంతుడు అన్యాయం చేస్తున్నాడని

గాని ఇంకా అనేకవిధాలుగా నిందిస్తారు. కాని, సర్వసాధారణంగా, జరిగినది వారి పురోగతికి అతి ప్రధానమైనదే. ఇంతే కాకుండా, మీరు చైత్యపురుషునితో, మీ జీవితాన్ని సౌఖ్యవంతంగా తీర్చిదిద్దమనిగాని, ధనార్జన చేయించమనిగాని, గర్వకారణమైన సంతానం కలిగేటట్లు చేయమనిగాని, అడిగితే అది ఏమీ చేయదు. నీలో ఒక అంశ జాగరిత మవడానికి, తద్వారా నీలో దైవంతో ఐక్యత పొందాలనే ఆవశ్యకత కలగడానికి తగిన సందర్భాలు సృష్టిస్తుంది. ఒక్కొక్కసారి నీవెంతో జాగ్రత్తగా రూపొందించిన ప్రణాళికలు విజయవంతమైతే, నీవు నీ బాహ్య అజ్ఞానంలోను అల్పమైన కాంక్షతోను, గమ్యంలేని చర్యల తోను మూసుకొని పోయే ప్రమాదం ఉండేది. నీ కేదైనా ఆ ఘాతం తగిలినప్పుడు, నీవు ఆశపెట్టుకున్న ఉద్యోగం దొరకనప్పుడు. నీ ప్రణాళికలు విచ్ఛిన్నమైనప్పుడు, నీకు అన్యాయం జరిగిందని బాధపడతావు, కాని, అటువంటప్పుడే సత్యమైన దానికి, ప్రగాఢమైనదానికి నీలో ప్రవేశం కలుగుతుంది. నీవు ఏమాత్రం తెలివి కలిగినా తిరిగి చూచుకొని, సత్యహృదయుడవైతే "ఆహా నాది తప్పే— ప్రకృతిగాని, లేదా దైవకృప గాని, లేక నాచైత్యపురుషుడు కాని సరిచేసి ఉండవచ్చు." అనుకుంటావు. అదంతా వ్యవస్థీకరించినది నీ చైత్యపురుషుడే.

జీవి దైవంతో తాదాత్మ్యం పొందాలని కోరేది చైత్యపురుషుడేనా ?

అవును. అది చైత్యపురుషుని సంకల్పమే.

దాని ఉనికికి హేతువే అది. ఉదాహరణకు, మనస్సు చర్యలు కొన్ని (ఒక్కొక్కసారి దైహికమైనవి, ప్రాణికమైనవికూడ) తమకు తెలియకుండానే చైత్యప్రభావానికి లోనై నడుచుకుంటాయి, తత్ఫలితంగా అవి చైత్యపురుషుని వదలిపెట్టక దివ్యజ్ఞానాన్ని, ఐక్యతను దైవంతో సంబంధాన్ని ఆకాంక్షిస్తాయి.

చైత్యపురుషసత్త సత్యాన్ని ఏవిధంగా వ్యక్తీక రిస్తుంది ?

అది సత్యాన్ని వ్యక్తీకరిస్తుందని నేను చెప్పానా?

మనలోని ఆంతరంగిక కేంద్రమునే మనం చైత్య పురుషుడు అంటున్నాము. అదే మనలోని ఉన్నత సత్యానికి స్థానం, అదే సత్యం తెలుసుకొని దానిని వ్యక్తీకరించగలదు.

"విద్య" లో 'జీవితశాస్త్రము' నుంచి.

అదా? జీవితసత్యమా— అది పరమ సత్యంకాదు.

జీవిత సత్యం అంటే, మన ఉనికిలోని ఉద్దేశ్యం అని అర్థము. నిజానికి, అదే మన జీవితోద్దేశ్యం వెల్లడయేటట్లు సందర్భాలను వ్యవస్థీకరిస్తుంది; లేకపోతే, బాహ్యజీవిని తనలో తను పరిభ్రమించేటట్లు చేసి, ఆధారం దొరకకపోగా మద్దతు కోసం అంతరంగంలోకి మళ్ళేటట్లు చేస్తుంది. అప్పుడు దానికి చైత్యాధారం కనిపిస్తుంది,

దేహానికి అద్భుతమైన నమ్యత, సహనశక్తి ఉన్నాయి. మనం ఊహించిన దానికంటే అనేకమైన పనులు చేయ గల సామర్థ్యం దానికుంది. దానిని అజ్ఞాన, నిరంకుశ ఆధిపత్యాలనుంచి తప్పించి, జీవిలో కేంద్రస్థసత్యపు ఆధీ నంలోకి తీసుకొని రాగలిగితే, దాని అద్భుతసామర్థ్యానికి దిగ్భ్రాంతుల మౌతాము. ప్రశాంతితో, నిశ్చలతతో, దృఢత్వంతో, కుదిరికతో, దానికి విధించిన కార్యాన్ని

అది ఏ క్షణంలోనైనా అవలీలగా చేయగలదు. అది చర్యలో విశ్రాంతి తీసుకొని, తాను చైతన్యవంతంగా, ఉపయోగకరంగా వెచ్చించిన బలాన్ని విశ్వశక్తుల సంపర్కం ద్వారా తిరిగి పొందగలదు.

(పై దాని వలెనే)

'చర్యలో విశ్రాంతి' పొందడం ఎలా ?

అది అంతర్వ్యరణానికుండే నిశ్చితత్వంవల్ల వస్తుంది. ఎవరైనా దేనినైనా ఆకాంక్షించినప్పుడు, దానితోపాటు వారి ఆకాంక్షకు సరైన సమాధానం వస్తుందని వారికి తెలిస్తే, వారిలో ఒక ప్రశాంతత నెలకొంటుంది. వారి ప్రకంపనాలలో నిశ్చలత పాదుకొంటుంది. అట్లా కాకుండా, వారిలో ఒక అపనమ్మకముండి, వారిని వారి ఆశయం దగ్గరకు నడిపించేదేదో తెలియకపోయినా, అసలు ఆశయం చేర వచ్చునో లేదో అని, దానికొక మార్గ మున్నదోలేదో అనీ అనేక విధాల సంశయాలతో ఉంటే, అది వారిని బాగా కలత పరుస్తుంది. అది వారి చుట్టూ ఒక దుమారం లేపడంవల్ల అసలు విషయాన్ని గ్రహించలేరు. అట్లా కాకుండా నిశ్చలమైన విశ్వాసంతో ఆకాంక్షిస్తున్నప్పుడు, నిజమైన ఆకాంక్ష ఏదీ వృధాగాదని తెలుసుకుంటే అప్పుడు ప్రశాంతత నెలకొంటుంది. ఎంత గాఢంగా ఆకాంక్షించినప్పటికీ, వ్యాకులపాటుతో తను కోరినది వెంటనే ఎందుకు జరగడంలేదని ఆత్రపడితే ఆ ఆకాంక్ష నిలవలేదు. వేచి యుండడం నేర్చుకోవాలి. నేను ఒకచోట చెప్పాను— "ఎలా వేచియుండాలో తెలుసుకోడమంటే కాలాన్ని మనపైపు పెట్టుకోవడమే" నని. అది పూర్తిగా నిజము. ఆరాటం కలిగితే వారి కాలమంతా నష్టమై పోతుంది. కాలమే కాకుండా వారి శక్తి, వారి చలనాలు కూడా మాయ మౌతాయి. చాలా ప్రశాంతంగా, నిశ్చలంగా, శాంతంగా, నిజమైనదేదో జరిగి తీరుతుందనే విశ్వాసంతో, దానిని జరగనిస్తే, అది చాలా శీఘ్రంగా సిద్ధిస్తుంది. ఆ ప్రశాంతిలో అన్నీ బాగా జరుగుతాయి.

23 డిశంబరు 1953

"మనస్సు జ్ఞానాన్వేషణకు అసమర్థమైనదైతే
జీవిలో ఏభాగం జ్ఞానాన్ని తెలుసుకుంటుంది ?

''విద్య'' లో 'జీవితశాస్త్రము' నుంచి.

అతిమానసిక పరిధికి చెందిన విజ్ఞానంలో ప్రవేశించాలి.

దానిని క్రిందకు కొనిరావాలంటే ?

ప్రతిసారీ ఏదో ఒకటి ఈ జ్ఞానాన్ని ఆకర్షిస్తుంది. (సంసిద్ధంగా ఉన్నది ఏదో ఒకటి.) అది వస్తుంది.

అయితే అది మనస్సులోకి దిగిరాదా ?

వస్తుంది. మనస్సులోకి, ఉన్నతమనస్సులోకి వస్తుంది. లేక చైత్య పురుషుని లోనికివస్తుంది. చైత్యపురుషుని ద్వారా జ్ఞానం పొందవచ్చు. అయితే మనస్సులో మాదిరిగా అది సూత్రీకరించి ఉండదు. అది ఇంకొక రకమైన జ్ఞానము. అది ఒక రకమైన ఆంతరిక నిశ్చలత్వంతో సరియైన పని సరియైన పద్ధతిలో సరియైన సమయానికి చేసేటట్లు చేస్తుంది. హేతువాదానికిగాని, మానసిక ఏర్పాటులకు గాని తప్పనిసరిగా లోనుగానక్కరలేదు.

ఉదాహరణకు, ప్రతిదానినీ వివేచనచేసి చూచే మనస్సు ప్రమేయం లేకుండా, చేయవలసినదాని విషయంలో పరిపూర్ణ జ్ఞానంతో పనిచేయవచ్చు. అప్పుడు మనస్సు నిశ్శబ్దమౌతుంది. అది ఊరికే చూచి, విని, విషయం నమోదు చేసు కుంటుందేతప్ప పని చేయదు.

ఇక్కడ మీరు, "జ్ఞానం మానవ మనస్సు కంటే చాలా ఉన్నతమైన పరిధికి, ఇంకా విశుద్ధభావాల పరిధికి గూడా ఆవలనున్నదానికి చెందుతుం" దని అన్నారు.

"విద్య" లో 'జీవిత శాస్త్రము' నుంచి.

ప్రియజననీ, "విశుద్ధభావాలు" అంటే అర్థం ఏమిటి ?

మనం దీని గురించి మాట్లాడుకొని ఎక్కువరోజులు కాలేదు. అనేక ఆలోచనల క్రింద తర్జుమా అయి వచ్చేవే విశుద్ధభావాలు. ఒక్కొక్క భావం అనేక ఆలోచనలను ఉత్పత్తి జేయగలదు. అనేక విధాలుగా వ్యక్తంకాగలదు. అయినప్పటికీ అది అలాగే ఉంటుంది.

ఒకొక్కసారి మనం ఒక స్థానంమీద దృష్టి కేంద్రీకరించి చూస్తాము. ఆ క్షణంలో అన్నీ మరచి పోతాము. ఏదైనా చప్పుడయితే మాత్రం కదిలి పోతాము. ఈ స్థితి ఏది ?

ఏకాగ్రత నిలపడమా ? అది పూర్తిగా ఏకాగ్రత చేపే సూత్రమే. నీవు స్వతస్సిద్ధంగా అలా చేయగలవా ?

ఆ! చాలా సార్లు.

అయితే మంచిదే.

అవునమ్మా! కాని, ఆ క్షణంలో ఏమి ఆలోచించిందీ గుర్తుంచుకోలేను.

అహాఁ!....హఠాత్తుగా అందులోనుంచి రావడంతో ఆలోచనలు జారిపోతాయి కదా!

అవును.

నీ సాధారణ చైతన్యానికి భిన్నంగా వేరొక చైతన్యస్థాయిలో ప్రవేశించడం వల్ల ఇలా జరుగుతుంది. ఆ రెండు స్థాయిలకీ మధ్య లంకె సరిగా ఏర్పడ లేదన్న మాట. దానికి ఇంకా కొంత కాలం పడుతుంది. అది ఒక వంతెన నిర్మించడం వంటిదే. లేకపోతే, ఒక్క ఉదుటున ఆ స్థాయి మార్చినప్పుడు ఎటో అటు దూకడంలో అక్కడున్నదేదో మరచిపోతారు. వారు పొందిన అనుభవం అక్కడే ఉండిపోతుంది. ఆ పని ఒక పద్ధతి ప్రకారం జరిపితే, అంటే ప్రతి రోజు ఈ పనికోసం కొంత సమయం కేటాయించి, ఒక పది పదిహేను నిమిషాల పాటు ధ్యానం చేసి, ఆ స్థితికీ, బాహ్య జీవితానికీ లంకె ఏర్పరచాలి. కొంత కాలమైన తర్వాత ఇది చేతనవుతుంది. అప్పుడు గుర్తుంచుకోవచ్చు. అది ఎంతో ఉపయోగిస్తుంది. పూర్తిగా ఏకాగ్రత సంపన్నం చేతనైతే నీవు సాధించ లేని సమస్యే ఉండదు—అంటే, గణితంలో సమస్యలని కాదు నా ఉద్దేశము. జీవిత గమనంలో సమస్యలు, తీసుకోవలసిన నిర్ణయాలను గురించినవి, మానసిక మైన సమస్యలు మొదలైన వాటన్నిటినీ పరిష్కరించవచ్చు. ఈ ఏకాగ్రత శక్తి ముందు ఏ సమస్యా అపరిష్కృతంగా నిలవలేదు.

నిజానికి, ఒక బిందువుమీద దృష్టి నిలిపి కేంద్రీకృతం చేయడం వీలు. ఆ విధంగా ఒక క్షణంలో ఆ బిందువుగానే మారిపోతారు. ఆ బిందువుపైపు చూస్తున్నవారుండరు. వారే ఆ బిందువు. ఇంకా కొంత సేపు శక్తి నిశ్చలత లను నిలుపుకొని అలా చేస్తే, నిన్ను ఏదీ కదల్చకుండా ఉంచే, ఆకస్మికంగా (నీలో ఉన్మీలనం జరుగుతుంది.) నీవు ఆవలవైపుకి వెళ్ళుతావు. అప్పుడు నీకు జ్ఞానోదయం అవుతుంది.

నీవు ఎంతకాలంనుంచి ఇలా చేస్తున్నావు? ఇది ఎప్పుడూ జరుగుతోందా? లేక ఈ మధ్యనేనా?

నాకు తెలియదు.

నీకు తెలియదా? బహుశా నీవు చేస్తున్నప్పటికీ ఆ విషయం నీకు తెలియక పోవచ్చు.

తెలియలేదు.

అయితే నీవు కావాలని చేయడం లేదన్నమాట, దానంతట అది నీకు కలిగి పూర్తిగా నిన్ను ఆవరిస్తోంది.

అవును.

నీకు గుర్తుండక పోవడానికి అది కూడా ఒక కారణం కావచ్చు.

(ఇంకొక బిడ్డ) మాతా, జ్ఞానానికి సంబంధించిన పరిధిలో ప్రవేశించినప్పుడు అనేక మధ్యస్థస్థాయిల ద్వారా వెళ్ళవలసి ఉంటుందా?

మధ్యస్థ స్థాయిలా? నీవు ఒక పద్ధతి ప్రకారం ఇలా చేస్తున్నప్పుడు, సాధారణంగా ఒక స్థాయినుంచి ఇంకొకస్థాయికి వెళ్ళవలసిందే. ఒక ప్రత్యేక స్థాయిలో జాగరితులై, అక్కడ ఒక రకమైన సుషుప్తి పొంది, మరియొక స్థాయిలో మేల్కొంటారు. అది అలా కొనసాగుతుంది. అది ఈ ప్రకారంగా చేసినప్పుడు గుర్తుంటుంది. ఎందువల్లనంటే, చైతన్యాత్మక సంకల్పంతో చేసి ఆ కార్యక్రమమంతా పర్యవేక్షిస్తారు కదా. ఎక్కడికో వెళ్ళి అక్కడ జరిగేది చూసిరావడానికి తగినట్లుగా జీవిని నిశ్శబ్దం చేయించే ఈ చలనాలూ, అక్కడ జరుగుతున్న దానిని గుర్తిస్తూ ఇంకొక ఉన్నత స్థానంలో వివృతికోసం సిద్ధం చేసే

చలనాలూ మొదలైన వన్నీ కలిసి వ్యక్తిలోని వివిధ అంశాల మధ్య చైతన్యాత్మక మైన సంస్పర్శను నెలకొల్పుతాయి. అప్పుడు వేటినీ మర్చిపోకుండా, సంకల్పాత్మకంగా కూడా అనేక అనుభవాలను పొందవచ్చు.

ఉదాహరణకు, కొంతమంది చదువురానివారు ఆకస్మికంగా కలిగిన ఒక శక్తివల్ల ఉన్నతమనస్సులోనో, చైత్యపురుషునిలోనో, లేదా జీవిలో ఏదో ఒక భాగంలోనో సూక్ష్మమైన ఒక అనుభవం పొందుతారు. దానికి అనేక కారణాలుంటాయి. అది గత జన్మల ఫలితం కావచ్చు, ఈ జన్మలోని చైతన్యానికి సంబంధించిన విషయంవల్ల కావచ్చు, ఇంకా అనేక కారణాలవల్ల కావచ్చు. ఏమైనప్పటికీ, అది పూర్తిగా ఉపయోగపడాలంటే, దానిని వారి పురోగమనానికి ఉపయోగించుకోవాలనే సంకల్పం ఏర్పడాలి. చేయవలసినదానిని తన సామర్థ్యాన్ననుసరించి చేయగలిగినంత బాగా చేయడానికై జీవిలోని వివిధ భాగాలలో చైతన్యాత్మకంగా కావడానికి కూడా అది ఉపయోగపడాలి. ఉదాహరణకు, బొత్తిగా చదువురాని అమాయికులు కొందరు నాకు తెలుసు. కాని వారికి అసాధారణమైన దృష్టి వరంగా వచ్చింది; వారిని సమాధిలోకి పంపినప్పుడు అనేక విషయాలను చూచి, వాటిని వర్ణించేవారు. వారికి చూడడం, వర్ణించడం బాగా చేతనవును. కాని ఆ స్థితి దాటగానే వారు అతి సాధారణ వ్యక్తులుగా ఉండిపోయేవారు. అయినప్పటికీ అది అద్భుతమైన వరమే. దీనిని బట్టి, ఆధ్యాత్మిక దృష్ట్యా అత్యుత్తమ పురోగతి సాధించి, బాహ్య జీవితంలో అతి సామాన్యులుగా ఉండే వ్యక్తులు కొంతమంది ఉంటారని తెలుస్తుంది. మరికొంతమంది అత్యున్నతమైన ఆధ్యాత్మిక సిద్ధిని పొంది, నిరంతరం దైవసాన్నిహిత్యాన్ని అనుభవిస్తున్నప్పటికీ, వారి జీవితంలో ఒక్కసారైనా దివ్యదర్శనం పొందనివారున్నారు. వారు దానిని గురించి అది ఒక లోపముగా చెప్పుకొనేవారు. అదంతా వారి స్వభావాన్ని, విధిని, వారు చేయవలసిన పనిని అనుసరించి ఉంటుంది. అన్నీ ఒక్కరే చేయలేరు కదా. దైహికంగా అది అసాధ్యము. అందువల్లనే ఏది కావాలో ఎన్నుకోవాలి.

శరీరం రోగగ్రస్తమైనప్పుడు, మనస్సు, ప్రాణికం కూడా అస్వస్థత చెందుతాయా ?

అట్లా కాదు. అస్వస్థత ఎలా వస్తుందో చెప్పాను కదా ! జీవిలోని వివిధ భాగాల మధ్య విభేదాలు వచ్చి సామరస్యం చెడినప్పుడు అస్వస్థత కలుగుతుంది. ఉదాహరణకు, ఒకానొక భాగం ప్రగతి చలనాన్ని అనుసరించక వెనకబడి, మిగిలిన భాగాలన్నీ పురోగమిస్తే, అసమస్థాయి ఏర్పడుతుంది. సామరస్యానికి కలిగిన ఈ చీలికవల్ల అస్వస్థత కలుగుతుంది. అప్పుడు మనస్సు, ప్రాణికం చాలా మంచిస్థితిలోనే ఉండవచ్చు. కొంతమంది ఏళ్ళతరబడి భయంకరమైన మొండి రోగాలతో బాధ పడుతూ కూడా మానసిక శక్తిని కాపాడుకుంటూ మానసికంగా పురోగమించిన వారున్నారు. సల్లీప్రుదోమ అనే ఒక గొప్ప ఫ్రెంచికవి తన అస్వస్థతలో అద్భుతమైన కవిత వ్రాశాడు. ఒకవైపు శరీరం నశించిపోతున్నప్పటికీ ఆహ్లాదకరంగా, చిరునవ్వులు చిందిస్తూ అందరితోను ఎంతో ఆప్యాయంగా ఉండేవాడు. అందువల్ల అది మనుష్యులనుబట్టి ఉంటుంది. మరి కొంతమంది ఏ కొంచెం అస్వస్థత కలిగినా తలక్రిందులై ఎందుకూ కొరగాకుండా తయారౌతారు. ఈ కూర్పు ఒక్కొక్కరిలో ఒక్కొక్క రకము.

శరీరానికి, మనస్సుకి మధ్య కొంత సంబంధం ఉంటుందని అంటారు కదా. మనస్సు బాగా లేకపోతే అప్పుడేమౌతుంది ?

శరీరానికి. మనస్సుకి మధ్య సంబంధం తప్పకుండా ఉంటుంది. అది సంబంధం కంటే ఎక్కువే; అది ఒక బంధం, సాధారణంగా శరీరానికి అస్వస్థత కలిగించేది మనస్సే కాకపోయినా అస్వస్థతలో దానిదే ప్రధానపాత్ర.

శరీరం అస్వస్థత చెందితేనో ?

అది మనుష్యులనుబట్టి ఉంటుందని చెప్పాను కదా ! కొంతమంది శరీరానికి ఏకొంచెం వచ్చినా వారి మనస్సు పూర్తిగా కలత చెందుతుంది, కొంతమందికి

శరీరం ఎంత బాధపడుతున్నా మనస్సు స్వచ్ఛంగా ఉంటుంది. కాని, మనస్సు కలతచెంది యుండగా శరీరం ఆరోగ్యవంతంగా ఉండడం అరుదు. పూర్తిగా అసంభవం కాకపోయినా సాధారణంగా శరీరస్థితి మనఃస్థితిపై ఆధారపడుతుంది. భౌతిక శరీరానికి మనస్సే యజమాని. ఈ విషయం నేను ఆ పుస్తకంలో వ్రాశాను. దేహం అణకువ, విధేయత కలిగిన సేవకుడు. ఆ మనస్సు నెట్లా వాడుకోవాలో చాలామందికి తెలియక అంతా వ్యతిరేకం చేస్తారు. శరీరాన్ని రూపొందించే శక్తి, దానిపై పనిచేసే అధికారం మనస్సుకుంటే, సాధారణంగా ఈ శక్తిని దేహాన్ని అస్వస్థతగా చేయడానికి ఉపయోగిస్తారు. ఉదాహరణకు, ఏదైనా కొంచెం హెచ్చు తగ్గు రాగానే మనస్సు పరిపరివిధాల పోతుంది, అనేక రకాల విపత్తులను ఊహించి, "ఏం జరుగుతుంది? ఇదా, అదా, అది ఏవిధంగా ముగుస్తుంది" అంటూ తనను తాను ప్రశ్నించుకోవడం ప్రారంభిస్తుంది. ఈ విధంగా దానిని ఆలోచించనీయకుండా, ఆ శక్తితో మంచి పరిణామాలను రూపొందిస్తే చాలా బాగుంటుంది: శరీరానికి విశ్వాసం కుదర్చడంకోసం, అక్కడ కలిగినది ఏదో మామూలుగా వచ్చి పోయే కలత తప్ప మరేమీ కాదనీ, అసలైన గ్రహణశక్తి ఉంటే ఆ కలత వచ్చినది వచ్చినట్లే పోతుందనీ చెప్పాలి, వారికి వారు నివారణ చేసుకోడం నేర్చుకుంటే అద్భుతమైన ఫలితాలను పొందవచ్చు.

ఆకస్మిక విపత్తులు జరిగే ముందుకూడా కోరుకునే సమయం కొంత ఉంటుంది. ఉదాహరణకు, జారిపడే విషయంలో కూడా జారడానికి, పడడానికి మధ్య క్షణికమాత్ర విరామం ఉంటుంది. ఆక్షణంలో కొద్దిపాటుగాని, ప్రమాదకరమైన పాటుగాని ఎంచుకునే స్వతంత్రం ఉంటుంది. కాని చైతన్యం జాగరితమై నిరంతర చైత్య సంస్పర్శలో ఉంటే తప్ప ఇది సాధ్యంకాదు. అప్పటికప్పుడు చైత్య సంస్పర్శ కుదుర్చుకోడానికీ విరామం చాలదు. అది నిరంతర స్పర్శగానే ఉండాలి, జారిన క్షణానికి, పడే క్షణానికి మధ్య సమయంలో మానసిక, చైత్య కోశాలు దృఢంగా నిలబడితే ఏమీ జరుగదు. అట్లా కాకుండా మనస్సు అలవాటు కొద్దీ నిస్పృహ చెంది, "అయ్యో, పడిపోయాను—"అంటుంది. ఆ విరామం సెకండులో ఒక క్షణికమే కాబట్టి అప్పుడే ఎంచుకోవాలి. అలా ఎంచుకోవాలంటే జీవితంలో ప్రతిక్షణం జాగృతితో ఉండాలి. సెకండులో ఒక వంతు కాలంలో ప్రమాదం జరగకుండా, అస్వస్థత ప్రవేశించకుండా జాగ్రత్త పడవచ్చు. ఆ

ఎన్నిక ఎప్పుడూ ఉంటుంది. కాని అది చాలా స్వల్ప విరామం కాబట్టి ఆ క్షణాన్ని పోగొట్టుకోకూడదు. అది దాటిపోయిందంటే అంతా అయిపోయినట్లే.

## అది తర్వాత చెయ్యవచ్చు గదా ? (నవ్వులు)

కాదు. ఆతర్వాతది మరియొకక్షణం....పడ్డారు, దెబ్బ తగిలింది; కాని, పరిస్థితులను మంచిగా మార్చుకోడానికి, అంటే దానిని ఉపరితలానికి తీసుకొచ్చి, దాని పరిణామాలు చాలా త్వరగా సమసి పోయేటట్లు చేయడానికి గాని, అతి ప్రమాద భరితంగా చేసుకోడానికి గాని వేరొక క్షణంఉంది. మీకు తెలుసో లేదో కాని, కొంతమంది వ్యక్తులు ఆకస్మిక ప్రమాదాలను ఎప్పుడూ వృధాగా పోనీయరు. ఏమాత్రం ప్రమాదం జరిగేటట్లున్నా వారు దానిని పొందుతారు. ఆ ప్రమాదం సామాన్యమైనది కాదు. వారికి ఎప్పుడు ప్రమాదం జరిగినా అది తీవ్రంగానే తయారౌతుంది. అప్పుడు సాధారణంగా అందరూ "అయ్యో పాపం! అతను దురదృష్టవంతుడు, బొత్తిగా అదృష్టం లేనివాడు" అంటారు కాని అది అజ్ఞానము. అది పూర్తిగా అతని చైతన్యం పని చేయడాన్ని బట్టి జరుగుతుంది. దీనిని గురించి మీకెన్ని ఉదాహరణలైనా చెప్పగలనుగాని, అలా చేస్తే చాలామందిని బయటకు తేవలసి వస్తుంది. అది నాకిష్టంలేదు. ఈ విషయం మీరిక్కడ బాగా పరిశీలించగలరు; ఇంచుమించు చనిపోవలసినవారు ప్రమాదంనుంచి చెక్కు చెదరకుండా బయటపడతారు. మరికొంతమందికి అతి తేలికగా పోవలసినదే ప్రమాదభరిత మౌతుంది.

అదంతా ఆలోచనను బట్టి, ఆలోచించేతీరును బట్టి జరగదు. మిగిలిన వారి మాదిరిగానే వారుకూడా చాలా మంచిగానే ఆలోచించవచ్చు. కాని అది కాదు. అదంతా ఆ ఎంచుకొనే క్షణం మీద ఆధారపడుతుంది. సరైన క్షణంలో సరైన ప్రకారంగా ప్రతిచర్య చేయగలరా లేదా అనేది ముఖ్యము. ఈ విషయాలన్నీ చాలా ఆసక్తికరమైనవి.

ఇది పూర్తిగా వారి తత్వాన్ని బట్టి జరుగుతుంది. కొంతమంది కడు జాగృతిగల చైతన్యం కలవారై ఎప్పుడూ ఆదమరవక మెలకువ కలిగిఉంటారు.

సరిగ్గా అవసరమైన క్షణంలో సహాయం అర్థిస్తారు, లేదా దివ్యశక్తికోసం ప్రార్థిస్తారు. అదంతా ఆ క్షణంలోనే, ఆ విధంగా ప్రమాదం తప్పించుకుంటారు. నిజానికి మరణించవలసిన ప్రమాదమే అయినా చెక్కు చెదరరు. మరి కొందరికి చిన్నగాయం తగిలినావారిలో ఏదో వికలమై— అది భయం కావచ్చు, నిస్పృహ కావచ్చు, లేదా వారి చైతన్యంలో ఓటమి కావచ్చు— పైకి ఉబుకుతుంది, కొద్దిగా కాలు మెలితిరిగినా అది విరిగి ఊరుకుంటుంది. దానికి కారణం అక్కరలేదు. వారి కాలు విరగవలసిన పనేలేదు.

కొంతమంది పై అంతస్తుకి నిచ్చెనవేసి ఎక్కుతూండగా నిచ్చెన జారుతుంది— నిజానికి వారు హతమారి పోవలసినదే కాని సురక్షితంగా ఉంటారు. అది వారికి ఎలా సాధ్యమైంది? అది విచిత్రంగానే తోస్తుంది కాని జరిగే విధానం అదే. హాయిగా, ఏమీ జరగకుండా చక్కగా కింద పడుకుని ఉంటారు. ఇవన్నీ జరిగిన విషయాలు. పేర్లుకూడా చెప్పగలను.

ఇదందా దేనిమీద ఆధారపడుతుంది? ఎన్నిక చేసుకోవలసిన క్షణంలో వారు తెలివిగా ఉండడాన్ని బట్టి జరుగుతుంది. ఇందులో మనస్సుకి సంబంధించినది ఏమీ లేదని గమనించాలి. అవి వ్యక్తివైఖరి ననుసరించి జరుగుతుంది. వారి చైతన్యం సరియైన తీరులో ప్రతిచర్య చేస్తున్నదా లేదా అని చూడాలి. ఈ వైఖరికి గలశక్తి అద్భుతమైనది. అది ఎంత దూరమైనా తీసుకొని పోతుంది, అది సెకండులో నాల్గవవంతు కాబట్టి ఎన్నడూ నిద్రపోని చైతన్యం, తామసం లేని జాగరిత చైతన్యాన్ని సూచిస్తుంది. అది అలా జరుగనున్నదని ముందుగా తెలియదు కదా, అందువల్ల అప్పుడు తెలివి తెచ్చుకునే అవకాశం లేదు. ఎప్పుడూ మెలకువగా ఉండాలి.

ఆ విధంగా మరణించే పరిస్థితి ఏర్పడినప్పటికీ జీవించిన ఒక వ్యక్తి నాకు తెలుసు. అతని చైతన్యం అతివేగంగా పని చేయడంవల్లనే బ్రతికి బయటపడ్డాడు. అతను ఒక డోసు మందు వేసుకోడానికి బదులు పొరపాటున పన్నెండు డోసులు వేసుకున్నాడు. అది విషపు మందు. దానితో అతని గుండె ఆగిపోవలసినది. అతను సరియైన పద్ధతిలో ప్రతిచర్య జరపడం వల్ల ఇప్పటి వరకూ

బ్రతికి ఉన్నాడు. ఇవి ఎవరికైనా చెపితే మహిమలు మాదిరిగా ఉంటుంది. కాని అవి మహిమలు కాదు. జాగరిత చైతన్యము.

మేము 'క్రేన్' తో పనిచేస్తున్నప్పుడు ఎలా తప్పించుకోగలిగాము. *

ఆ సంగతి మీకు తెలిసిందనుకున్నాను.

మాకు కొంతవరకే తెలుసు.

చాలా కొద్దిగా, ఊహామాత్రంగా తెలిసినదన్నమాట—అది మీమీద బడిన ఒక ముద్రే కాని జ్ఞానం కాదు. అది ఎలా పని చేసిందో ఎవరూ చెప్పలేరు.

అది దైవ కటాక్షమే.

అది పని చేసిన విధానం వివరిస్తే అందరికీ వినడానికి ఆసక్తి కరంగా ఉంటుంది. అందరిలోను చైతన్యవంతులై ఆక్షణంలో జాగృతి కలిగి విశ్వాసంతో దైవ కటాక్షాన్ని అర్థించినవా రెవరోనని ఆలోచిస్తే చాలా ఆసక్తి కలుగుతుంది.

---

* ఆశ్రమంలోని కొంతమంది యువకులు ఒక పెద్ద చెట్టుబోదెను ఒక క్రేన్ సహాయంతో లారీలో పెట్టడానికి ప్రయత్నిస్తుండగా క్రేన్ విరిగి దాని భాగాలన్నీ చెదిరి చుట్టూ పడిపోయాయి. కాని ఎవరికీ దెబ్బ తగలలేదు. సగం వరకు పైకి ఎత్తి ఉన్న చెట్టుబోదె క్రమంగా క్రిందకు జారసాగింది. అది క్రిందకు జారి సరిగా లారీపై పడితే పక్కనున్న పిల్లలంతా దానికింద పడి నలిగిపోయేవారు. కాని విచిత్రంగా, ఏ కారణం లేకుండా ఆ చెట్టు మధ్యలో అలా నిలబడిపోయింది.

ఇందులో చాలా అంతస్తులున్నాయి. వ్యత్యాసముల ద్వారా తప్ప మానవులు అర్థం చేసుకోలేరు. నాకు కృతజ్ఞతాభివందనాలు చెప్తూ (తమను రక్షించినందుకు) చాలామంది ఉత్తరాలు వ్రాశారు. అంతేకాని ఏమీ జరగనందుకు నాకెవరూ అభివందనాలు తెలుపలేదు. అర్థమైందా! ఒక ప్రమాదం జరిగిందంటే, అది ఒక అవ్యవస్థితికి ప్రారంభమన్నమాటే... ముఖ్యంగా అది మందితో కూడిన ప్రమాదమైతే ఆ గుంపులోని ప్రతి వ్యక్తి పరిస్థితి దానికి కారణమౌతుంది. అందులో సక్రమంగా ఉన్నవారెంతమంది, సరిగా లేనివారెంతమంది—— ఆ నిష్పత్తిపై ఆధారపడి జరుగుతుంది. ఈ విషయం నేను అందులో వ్రాశానో లేదో గుర్తులేదు. ఏదైనా ఒక అపాయ సమయంలో గాని, అనగా, ఒక ప్రమాదం ఆసన్నమయినప్పుడుగాని, లేదా ఒక ప్రమాదంజరిగి తప్పించుకున్నప్పుడుగాని, జన సామాన్యానికి దైవకటాక్షం పనిచేసిన సంగతి తెలియదు. ఇటువంటి సందర్భాలలో మాత్రమే తెలుసుకో గలుగుతారు. అంతేకాని, ఒకపనిగాని, ఒక ప్రయాణం గాని సక్రమంగా జరిగినప్పుడు అది ఎంత నిరవధిక కటాక్షఫలితమో తెలుసుకోలేరు, అప్పటి సామరస్య పరిస్థితులనుబట్టి ఏమీ జరుగదు. కాని అది వారికి అతి సహజంగా కనిపిస్తుంది. వారెప్పుడైనా అస్వస్థులై వెంటనే తేరుకుంటే అప్పుడెంతో కృతజ్ఞత చూపిస్తారు. అంతే కాని, వారు బాగా ఉన్నప్పుడు అది దైవ కటాక్షంవల్ల నేనని తెలుసుకోరు. నిజానికి ఇదే గొప్ప మహిమ, మందికి జరిగిన ప్రమాదాలలో సమస్థాయి, అసమస్థాయిల రాశి నిష్పత్తి, వివిధ వ్యక్తుల ప్రభావాల కలయిక కారణమౌతాయి.

పూర్వపు రోజులలోని ఒక విమాన చోదకుడు నాకు తెలుసు. ఆ రోజుల్లోని గొప్ప 'అసు' (మొదటి ప్రపంచయుద్ధ కాలంలో వారిని అలా పిలిచేవారు.) లలో అతను ఒకడు. అతను అనేక ఘన విజయాలు సాదించాడు గాని అతనికి మాత్రం ఏం జరగలేదు, కాని ఉన్నట్లుండి అతనికి జీవితంలో ఏదో హఠాత్పరిణామం వచ్చినదని, తనకు మంచిరోజులు పోయినవని, ఏ ప్రమాదమో ఏదో జరుగుతుందని తోచి అతను యుద్ధంనుంచి విరమించి మామూలు మిలటరీ విమానాలు నడపడం ప్రారంభించాడు. అతని చైతన్యం ఏదో కారణంవల్ల కలతపడి ఉంటుంది. ఒకసారి అతను ఫ్రాంసునుంచి దక్షిణాఫ్రికాకు ప్రయాణం పెట్టుకున్నాడు. ఫ్రాంసులో ఒకానొక స్థలంనుంచి మడగాస్కరుకు (నాకు అతని

గురించి వ్యక్తిగతంగా అంత బాగా తెలియదు కాబట్టి వివరాలు తెలియవు) బయలుదేరాడు. మడగాస్కర్ నుంచి ఫ్రాంస్‌కు తిరిగి వచ్చేయాలనుకున్నాడు. మా అన్నగారు అప్పట్లో కాంగోలో గవర్నర్‌గా ఉంటూ ఫ్రాంసునుంచి శీఘ్రంగా వెళ్ళి ఉద్యోగంలో ప్రవేశించాలనుకొని ఇతని విమానంలో ప్రయాణం చేయ నిమ్మని కోరాడు (ఆ విమానాన్ని ఒక ప్రదర్శన వాహనంగా ఉద్యోగస్థులు కొంపు లకు వాడేవారు). మా అన్నగారి మిత్రులంతా అతనిని అందులో వెళ్ళవద్దని నిరుత్సాహపరిచారు. ''ఈ కేంపులు ఏమంత మంచివిగావు. మీ రిందులో వెళ్ళ కూడ'' దని వారు చెపుతున్నప్పటికీ మా అన్నగారు అందులోనే బయలుదేరారు. మధ్యలో సహారా ఎడారిపై ప్రయాణిస్తున్నప్పుడు విమానానికి కొంత ఇబ్బంది కలిగింది. కాని అదేమి మహిమావిశేషమో, విమానం బాగుపడి మా అన్నగారిని కాంగోలో దించి తిరిగి దక్షిణం వైపుగా తన ప్రయాణం కొనసాగించింది. కొద్ది సేపట్లో ఆకాశమధ్యంలో విమానం కూలిపోయి అతను మరణించాడు. అది అలా జరుగుతుందని తెలుస్తూనే ఉంది. కాని మా అన్నగారికి తన అదృష్టంపై గొప్ప విశ్వాసం, తనకేమీ జరగదనే నిశ్చితత్వం దృఢంగా ఉన్నాయి. దానికి మనం ఇలా అర్థం చెప్పుకోవచ్చు. వారిద్దరి పరిస్థితులవల్ల ఒక అవ్యవస్థితి అనివార్య మైంది. సహారాపై కలిగిన ఇబ్బందినిబట్టి ఆ విషయం తెలుస్తోంది. అప్పుడు తప్పనిసరిగా విమానం కిందకు దిగవలసి వచ్చింది. కాని అంతా సవ్యమై ప్రమాదం జరగలేదు. అతను దిగిపోయి అతని వాతావరణం లేకపోగానే మొదటి వ్యక్తి దురదృష్టం బలీయమై అతని మరణానికి కారణమైంది.

ఒక పడవ ప్రమాదం విషయంలో కూడా ఇలాగే జరిగింది. ఒక ఇద్దరు ప్రముఖ వ్యక్తులు (వారి పేర్లు ఇప్పుడు గుర్తులేవు) విమానంలో ఇండో-చైనాకు వెళ్ళారు. తిరిగి వచ్చేటప్పుడు వీరి విమానానికి ప్రమాదం జరిగి వీరిద్దరూ తప్ప మిగిలినవారంతా చనిపోయారు. అదొక విచిత్ర సంఘటన. బహుశా వీరిద్దరూ (భార్యాభర్తలు) దురదృష్టకారకులు కావచ్చు. ఆ వాతావరణమే వారి నంటిపెట్టు కొని ఉండేది. వీరిద్దరూ ఫ్రాంసుకు తిరిగి రావాలనుకొని ఒక పడవ ఎక్కారు. అనుకోకుండా ఆ పడవ ఎర్రసముద్రం మధ్యలో ఒక గుట్టని ఢీకొని మునిగి పోయింది. అది చాలా అసాధారణము, లక్షప్రయాణాలలో ఒకటిగూడా ఇలా జరుగదు. వీరిద్దరూ తప్ప అందులోనివారంతా మునిగిపోయారు. ''జాగ్రత్త,

వీరితో కలిసి ప్రయాణించకండి'' అని నేను చెపుదామనుకున్నాను గాని అప్పట్లో నేనేమీ చేయలేకపోయాను. ఇటువంటివారు కొంతమంది ఉంటారు. వారెక్కడికి వెళ్ళినా బాగానే తిరిగి వస్తారు. కాని కూడా ఉన్నవారిని ముంచుతారు.

ఇటువంటి విషయాలు సాధారణ దృష్టితో చూచినవారికి ఏమీ బోధపడదు. కాని, సామూహికంగా ప్రయాణం చేసేటప్పుడు ఆ వాతావరణాల కలయిక విషయంలో జాగ్రత వహించాలి. ఎవరితో ప్రయాణం చేస్తున్నారో వారిని గమనించాలి. ఆంతరికజ్ఞానం, దృష్టి ఉంటే తప్ప ఇది సాధ్యం కాదు. ఎవరికైనా నల్లటిమేఘం చుట్టూ ఆవరించుకుని ఉంటే. వారితో ప్రయాణం తప్పించుకోవాలి. అటువంటప్పుడు ప్రమాదం తప్పక జరుగుతుంది. వారు బాగానే ఉండవచ్చు. అందువల్ల విషయాలను పైపైన పరిశీలించడం కాకుండా గాఢంగా పరిశీలించడం చాలా అవసరము.

(ఒక బిడ్డవైపు తిరిగి) ఇతని మొహం చూస్తే ఈ పద్ధతిలో జీవితమంతా కష్టసాధ్యమని అనుకుంటున్నట్లుగా ఉంది!

30 డిసెంబరు 1953

చిన్న పిల్లలలో సహజంగా విధ్వంసం చేయాలనే కోర్కె కలుగుతుందనడంలో మీ ఉద్దేశ్యమేమిటి ?

అది పిల్లలందరిలోనూ కలగదు. పైపెచ్చు చాలా జాగ్రత్తగా ఉండే పిల్లలు నాకు తెలుసు. పెద్దవారంత ఎక్కువగా పిల్లలు తమ భౌతిక చైతన్యంలో దృఢపడరు. పెద్దవారౌతున్నకొద్దీ కరుడుగట్టిపోయి, తమంతట తాము ఇంకొక విధంగా వికాసం పొందాలని సంకల్పించుకుంటే తప్ప సాధారణంగా వారి చైతన్యంలో వారు ఘనీభవించి పోతారు. ఉదాహరణకు, పిల్లలలో ఎక్కువమంది తమ ఊహలు, కలలు, ఇంకా తమలో కనబడే అనేకమైన వాటినీ, బాహ్యంగా జరిగే వాటినీ వేర్వేరుగా గుర్తించలేరు. పెరిగి పెద్దవారైన తర్వాత పరిమితమై

పోయినట్లుగా చిన్నతనంలో వారికి ప్రపంచం పరిమితం కాదు. అంతర్గతంగా వారు అతి సున్నితంగాను, చైత్యపురుషునికి అతి సన్నిహితంగాను ఉంటారు. అంతే కాకుండా, పెద్దవారైన తర్వాత అదృశ్యమయే కొన్ని శక్తుల ప్రభావానికి వీరు లోనౌతారు. అందువల్లనే నిద్రలో వారొక్కొక్కసారి భయపడడం గమనిస్తాము. నిద్రలో పెద్దవారు పిల్లల మాదిరి ఝుడుసుకోరు గదా! వారికి దృగ్గోచరమయేవి స్థూలస్వరూపాలు కావు. వెనకాల జరిగే శక్తుల ఖేలను వీరు నిశితంగా గ్రహిస్తారు. ఆ గ్రహింపువల్లనే వాటి ప్రభావానికి లోనౌతారు. వారిలో వారు ముకుళించుకు పోయి, మొద్దుబారిపోయిన పెద్దవారిపై ఆ శక్తుల ప్రభావం ప్రసరించదు. ఈ శక్తులన్నీ, అంటే విధ్వంసక శక్తులు, క్రూర శక్తులు, దుష్ట శక్తులు, దుస్సంకల్పం కలిగించే శక్తులు మొదలైనవి మన వాతావరణంలో ఉన్నాయి, బాగా చైతన్యవంతులై. అంతర్గతంగా బాగా వృద్ధి పొందితే వాటిని దూరంగా ఉన్నప్పుడే గుర్తించి నిరోధించగలరు. ఇంచుమించు అర్ధ స్వప్నావస్థలో జీవించే చిన్న పిల్లలపై ఈ శక్తుల ప్రభావం ఎక్కువ. ఆ విధంగా వారిని వశపరుచుకొని మామూలుగా ఉన్నప్పుడు వారు చేయనటువంటి పనులను వారిచే చేయిస్తాయి. అదే అన్నిటికీ కారణము.

ఇంతే కాకుండా, అచేతనత్వంవల్ల కూడా అనేకం జరుగుతాయి. సాధారణంగా వారు హాని చేస్తున్నామని తెలియకుండానే హాని చేస్తారు. అచేతనత్వం అంటే అదే. వారి చలనాలతో వారు మూసుకోపోవడంవల్ల తాము చేసేదాని ఫలితమేమిటో వారికి తెలియదు. తరుచుగా జరిగేది అదే.

పిల్లలకు సరియైన పద్ధతిలో బోధపరచి, వారి సున్నిత భావాలకు నచ్చచెప్పి, అలాచేయడం ఇతరులకు హాని కలిగిస్తుందని చెపితే (కొద్దిగా వారికి చేసి చూపించినా మంచి ఫలితం వస్తుంది) వారు హాని చేయడం మానేస్తారు.

ఇదంతా వారికి బోధపరిచి చెప్పారా, లేదా, అనే దానిపై ఆధారపడుతుంది. ఈవిధంగా క్రూరత్వపు అర్ధచేతనావస్థ చలనాలు పెద్దవారిలో అప్పుడప్పుడు కనిపించేవే. పిల్లల చైతన్యంపై ముద్రవేయడానికి అది చాలు. అలా కాకుండా

ప్రతికూల స్వరూపం వారిలోనే ఏర్పడిన పిల్లలుకూడా ఉంటారు. వారిని పునరుద్ధరించడం అసాధ్యము. అదృష్టవశాత్తూ అటువంటివారు ఇక్కడ (ఆశ్రమంలో) లేరు.

> పుట్టబోయే శిశువు స్వభావం తల్లిపైనే ఆధార పడుతుందనే విషయం నిశ్చయము. ఆమె నివసించే భౌతిక పరిసరాల మీద ఎంతగా ఆధారపడుతుందో అంతగా ఆమె ఆకాంక్ష, సంకల్పాల మీదకూడా ఆధారపడుతుంది. అందువల్ల ఆమె తెలుసుకోవలసింది చాలా ఉంది. ముఖ్యంగా ఆమె ఆలోచన లన్నీ నిష్కల్మషంగా, మనోజ్ఞంగా సాగేటట్లు, ఉదాత్తం, సున్నితం అయిన భావాలు కలిగేటట్లు చూచుకోవాలి. సామరస్య పూరితం, నిరాడంబరం అయిన భౌతిక పరిస్థితులలో నివసించాలి. అంతే కాకుండా తను గ్రహించ గలిగిన అత్యున్నత ఆదర్శాన్ని అనుసరించి శిశువును రూపొందించాలనే దృఢ సంకల్పం, ఆకాంక్ష కలిగించుకుంటే, అధికమైన అవకాశాలతో ఈ ప్రపంచంలోకి రావడానికి శిశువుకు అత్యుత్తమ పరిస్థితు లేర్పడతాయి.
>
> —"విద్య" నుంచి.

మహానుభావులు భూమిపై అవతరించాలనుకున్నప్పుడు తమ తలిదండ్రులను వారే ఎంచుకుంటారా ?

అవును. అది వారి చైతన్యస్థితి పైనా, చైత్యపురుషుని స్థాయిపైనా ఆధారపడుతుంది. చైత్యపురుషుడు పూర్తిగా వృద్ధిపొంది పరిపూర్ణుడై, పునర్జన్మ దాల్చే విషయం అతని ఇష్టానిష్టాలపై ఆధారపడి జరిగేటట్లయితే, ఎన్నిక చేసుకొనే సామర్థ్యం కూడా ఉంటుంది. నేను ఈ సంగతి లోగడ వివరించాను. చైత్య

పురుషునికి శరీరం లేనంతకాలం మన దృష్టివంటి భౌతికదృష్టి ఏర్పడదు. అందువల్ల వారు వ్యక్తం కావడానికి అనుకూలమైన శరీరం కోసమే చూచు కుంటారు. ఈవిషయంలో, భౌతిక జడత్వానికి కూడా దాని భాగం ఇవ్వవలసి ఉంటుంది. అంటే, దైహిక సూత్రాలను తప్పనిసరిగా అనుసరించాలి కాబట్టి, దానికి అనువైన శరీరాన్ని ఎన్నుకుంటారు. అందువల్ల, చైత్యపురుషుని దృష్టికి జన్మించబోయే ప్రదేశం ఎన్నుకోడం కూడా అతి ముఖ్యము. కాని, ముందు చూపుతో తెలుసుకోలేని విషయాలు అనేకము. ఉదాహరణకు, పుట్టబోయే పరిస రాలను, దేశాన్ని, కుటుంబాన్ని, తలిదండ్రుల స్వభావాన్ని, వారిలో పరిణతి చెందిన కొన్ని గుణాలను, ఆత్మసంయమమును (Self-mastery) కూడా ఎన్నుకోవచ్చు. కాని, అవరోధాలను ఎదుర్కోగల చేతనత్వం వారిలో లేకపోతే ఇది ఎందుకూ చాలదు. ఇవన్నీ సానుకూలమై, తల్లిదండ్రులు సహక రించినప్పటికీ, అడపాదడపా ఉపరితలానికి వచ్చి, కలతబెట్టి, చేసిన పనిని పాడుచేసి, శాంతి, నిశ్శబ్దాల ఆవశ్యకతను నిరూపించే నికృష్ట జడత్వాన్ని, అపరి మిత అవచేతనను ఎదుర్కోడానికి తగిన చేతనత్వం కావాలి. అంతా సంసిద్ధం చేసుకుని ఎన్నుకొన్నప్పటికీ ఇంకా సన్నాహం అవసరమౌతుంది. ఇంకా, జన్మించేక్షణంలో, శరీరంలో ప్రవేశించేటప్పుడు, దిమ్మెర పోయినట్లయి ఆ స్థితి లోనే చాలాకాలం గడపడం గురించి వేరే చెప్పనక్కరలేదు. ఆ పరిస్థితి పూర్తిగా తొలగిపోయేవరకు అది తప్పదు.

### కొంతమంది పిల్లలు దుష్టులవడానికి కారణం ఆ తలిదండ్రులు వారికోసం ఆకాంక్షించకపోవడమేనా?

బహుశా ఆ తలిదండ్రుల అవచేతనలోని దుష్టత్వమే దానికి కారణమేమో! పుట్టిన పిల్లల ద్వారా వారిలోని దుష్టత్వానికి రూపుకట్టి బహిర్గతం చేస్తారు. ప్రతి వారిలోనూ క్రీనీడలుంటాయి. కొంతమంది వాటిని బాహ్యానికి ప్రక్షేపిస్తారు. అలా చేయడంవల్ల వారు పూర్తిగా విముక్తి పొందకపోయినా దానివల్ల వారికి ఊరట కలుగుతుంది, దానివల్ల 'లాభం' పొందేది వారి పిల్లలు మాత్రమే. ఆ సమయంలో తలిదండ్రుల చైతన్యస్థితి అతి ప్రధానమైనదని తెలుస్తోంది కదా. వారికి కడుహీనం, నికృష్టం అయిన భావాలు ఏర్పడితే అది వారి పిల్లలలో తప్పక

ప్రతిబింబిస్తాయి. ఈ విధమైన అవలక్షణాలతో కూడి, అసంపూర్ణంగా తయారై (అంటే తెలివితేటల దృష్ట్యా చూస్తే అనేక లోపాలతో), దుష్ట పెంపకంలో పెరిగిన పిల్లలు అసంపూర్ణులై, అర్ధచైతన్యవంతులైతే, వారు గర్భస్థమయేటప్పుడు వారి తలిదండ్రుల చైతన్యస్థితిలోని దోషమే దానికి కారణము. జీవితపు అంతిమ ఘడియలలోని చైతన్యస్థితి మరణిస్తున్నవారి భవిష్యజ్జన్మకు ఎంత ప్రధానమో, ఆ విధంగానే గర్భస్థమయే జీవికి ఆ తల్లిదండ్రుల చైతన్యస్థితి కూడా అంత ప్రధానము. ఆ స్థితి శిశువుపై గాఢంగా ముద్రపడి, జీవితమంతా కొనసాగుతుంది. అందువల్ల ఇవన్నీ, అంటే ఆ క్షణంలో తల్లిదండ్రుల చిత్తవృత్తి, వారి ఆకాంక్ష, వారి నీచస్వభావం, ఒకానొక క్షణంలో జరిగిన సంఘటన మొదలైనవన్నీ పైకి ఎంతో స్వల్పంగా కనిపించినప్పటికీ, వాటి పర్యవసాన ఫలితాలు చాలా ఎక్కువ. అవన్నీ కూడడంవల్ల అసంపూర్ణత, దుష్టత్వాలతో అప్రయోజకుడైన శిశువు ఈ లోకంలోకి వస్తాడు. ఆ శిశువు జుగుప్సాకరంగా ప్రవర్తిస్తే తల్లిదండ్రులు దండిస్తారు. కాని, దానికి బదులుగా, తమను తాము దూషించుకోడంతో ప్రారంభించాలి. "ఈ బిడ్డ గర్భస్థమైనప్పుడు మనం ఎంతటి ఘోరచైతన్యస్థితిలో ఉన్నామో కదా" అని అనుకోవాలి. అసలు కారణం అదే కదా!

ఒక్కొక్కసారి బిడ్డకు తల్లి ఎంతో బాగా బుద్ధులు గరిపి పెంచినప్పటికీ చుట్టుపక్కలవారు పాడు చేస్తారు కదా! అప్పుడు తల్లి ఏం చేయగలదు ?

అది నిజమే. అంతకంటే కూడా పిల్లలను పనివాళ్ళమీద వదలడం ఇంకా ఘోరమైన నేరము. ఎందువల్లనంటే, పనివారిలో అపరిష్కృతము, అంధకారావృతము, అయిన చైతన్యం ఉంటుంది. వారు సంకల్పపూర్వకంగా గాకపోయినా స్వచ్ఛందంగా (Spontaneously) వారి చైతన్యం పిల్లలలోకి ప్రవేశింపజేస్తారు. దీనికితోడు వయసు రాగానే పిల్లలను స్కూలుకు పంపినప్పుడు, అక్కడ వారు అనేకరకాల పిల్లలతో కలిసి మెలిసి మెలగవలసి వస్తుంది. అందులో కొంతమందితో సంపర్కం బొత్తిగా వాంఛనీయం కాదు. ఈ సంబంధాలు తప్పించుకోడం చాలా కష్టము. అయినప్పటికీ కొద్దిపాటి

చైతన్యం, అధికంగా సత్సంకల్పం ఏర్పరుచుకొని జీవితం గడిపితే అవాంఛనీయమైనవారి స్పర్శ కలిగినప్పుడు వెంటనే తెలుసుకోగలరు. మంచి స్వభావం కలవారైతే వారిని చూడకుండా, వారితో గడపకుండా తప్పించుకోవడానికి ప్రయత్నిస్తారు.

అవతలివారి సత్సంకల్పంకంటె దుష్టసంకల్పపు శక్తి అధికమైతే ?

అదీ నిజమే. అలా జరుగవచ్చు. తిరిగి తిరిగి మళ్ళీ మొదటికే వస్తున్నాము. అదేమిటంటే, ప్రతివారూ తాము చేయగలిగినదానిని చేతనైనంత బాగా దైవానికి అర్పించే కానుకగా చేయాలి. ఒకసారి ఈ విధంగా అంతా వ్యవస్థీకృతమై, జీవిలో నిజమైన ఆకాంక్ష ఏర్పడి, దానితో జీవిఅంతా వెలుగుతుంటే, అప్పుడు దుష్టప్రభావాలను ఎదుర్కొనగలరు. కాని, ఈ ప్రపంచంలో అడుగు పెట్టిన తర్వాత మరీ అంత పరిశుద్ధంగా, దుష్టప్రభావానికి అతీతులుగా ఉండడం కష్టము. భోజనం చేసేటప్పుడు, దానిని ఒంటపట్టించుకుంటారు; గాలి పీల్చినప్పుడు దానిని కూడా లోపల హరించుకుంటారు. అందువల్ల గమనించవలసినదేమంటే, చేయవలసినదానిని చేతనైనంతవరకు పురోగమనానుక్రమంగా శోధన చేయడమే.

కొంతమంది పిల్లలు ఉద్రేకం కలిగించే విషయాలపై మాత్రమే ఆసక్తి చూపుతారు. ఎందువల్ల ?

వారిలో తామసం అధికంగా ఉండడమే అందుకు కారణము. తామసం ఎక్కువైనకొద్దీ తీవ్ర పరిస్థితులు, ఉద్రేకపూరిత సంఘటనలు అవసరమౌతాయి. దైహికమైన తామసం ఉన్నవారికి మసాలాలు, కారాలు అధికంగా గల భోజనం చేస్తేగాని కడుపు నిండినట్లుండదు. నరాలమీద వాటి ప్రభావం విషతుల్యంగా పని చేస్తుంది. అవి ఏమాత్రం శరీర పోషణకు పనికిరావు. అయినప్పటికీ జనం తామసపూరితులు, దైహిక చైతన్యం లేనివారు కావడంవల్ల వారికి అవే కావాలి.

మానసికంగాను, ప్రాణికంగాను కూడా అంతే. తామస ప్రవృత్తులకు కొత్త ఉద్రేకాలు కలిగించే చిత్రాలు, హత్యలు, ఆత్మహత్యలు మొదలైన విషయాలపై ఆసక్తి ఎక్కువ. నిజానికి మనిషిని దుష్టుడుగా, క్రూరుడుగా చేసేది తామసం తప్ప వేరుకాదు. ఉద్రేకపు అవసరంవల్ల నీలో కదలిక కలిగి నీలోనుంచి నీవు బయటకు వస్తావు. పూర్తిగా తామసికులెవరో, మిశ్రమస్థితి కలవారెవరో, తమ లోని వివిధభాగాలతో ఘర్షణ పడుతున్నవారెవరో గమనించడం నేర్చుకోవాలి. అవసరమైనప్పుడు ఏదో ఒకదానికి బలం చేకూర్చుకోగలందులకై తమ ప్రకృతిలో ఇవన్నీ యేయే పాళ్ళలో కలిసి ఉన్నాయో తెలుసుకోడం అందరికీ అవసరము. కొంతమందికి జీవితంలో ఎదురుదెబ్బలు తగిలితే గాని ముందుకు కదల లేరు. లేనిపక్షంలో జీవితమంతా వృథాగా గడిపేస్తారు. మరికొంతమందికి నిదానంగా, నిశ్శబ్దంగా, ఊరికి దూరంగా ఉండడం అవసరమౌతుంది. ఇవన్నీ వారి మంచికే ఉపయోగపడుతాయి. కాని, వారు పురోగమించవలసిన అవసరం కలిగినా, ఏదైనా సాధించాలనుకున్నా, వారి బలహీనతలను జయించాలనుకున్నా, అడ్డంకులను తొలగించుకోవాలన్నా ఇవి అదృశ్యం కావాలి..... ఇదంతా క్లిష్టంగా కనిపిస్తోంది కదూ ! స్వభావంలో అవి యేయే పాళ్ళలో ఉన్నాయనేది ముఖ్యము. ఈ మూడు గుణాలూ నీకు తెలుసా ?* తమలో ఈ గుణాలు ఏ పాళ్ళలో ఉన్నదీ కచ్చితంగా తెలుసుకొని ఒక గుణాన్ని బాగుచేయడానికి మరొక గుణాన్ని ప్రయోగించాలి. ఆ విధంగా తనలో సమతను ఏర్పరుకొని, ఎదురు దెబ్బలు లేకుండా, విపరీత సంఘటనలను ఎదుర్కోకుండా నిలవగలిగిన క్షణాన్ని పొందగలగాలి. ఇక ఆ క్షణంనుంచి అంతా బాగా జరుగుతుంది.

మన పాఠశాలలలోను, మన విశ్వవిద్యాలయం
లోను విద్యాబోధన శ్రీఅరవిందుల ఆదర్శాల కను

---

* హిందూ మనస్తత్వశాస్త్రంలోని మూడు సూత్రాలు : తామస, రాజస, సత్త్వగుణాలు. జడత్వం, అయోమయం తామసానికి లక్షణాలు; ఉద్రేకం, వాంఛ మొదలైన తీవ్రప్రవృత్తులు రాజస లక్షణాలు: తేజస్సు, సమత సత్త్వ లక్షణాలు.

గుణంగా ఉండాలని కదా ప్రతిపాదించారు. కాని, ఇప్పటివరకు పైచోట్ల మాదిరిగానే ఇక్కడి విద్యా విధానం సాగుతున్నది.

అవును. అది ఇంకొక విధంగా ఉండాలనే నేను మొదటినుంచీ ప్రయత్నిస్తున్నాను. ప్రస్తుత విద్యార్థులైన మీరు పెరిగి పెద్దవారై ప్రొఫెసర్లుగా చేరినప్పుడు వచ్చే పిల్లలకు సరియైన పద్ధతిలో సరియైన విద్యావిధానం ప్రవేశపెట్టడానికి మిమ్మల్నే నియమిస్తాము. ప్రస్తుతం ఇది విద్యార్థులకు కాకుండా ప్రొఫెసర్లకే పాఠశాలగా ఉన్నది. మిగిలినవారికి తెలిసినదంతా కూడా ముందు మీరు తెలుసుకోవాలి— ఎందువల్లనంటే, పునాది ముందు అవసరము, అది మరీ అధికంగా, విపులంగా, గాఢంగా గాకపోయినా సాధారణ మానవ విజ్ఞానానికి చెందిన ఆధారం ఒకటి అవసరం— ఆ విధమైన పునాదితో ఇక్కడి ప్రభావానికి లోనైతే చదివినదానిని ఆ దృక్పథంతోనే పరిశీలించగలవు. అంటే. నిజమైన జీవిత దృక్పథంతో నన్నమాట. ఆ విధంగా మీ రన్నీ తెలుసుకున్నారంటే. బయటనుంచి వచ్చే పిల్లలకు అవన్నీ బోధించవచ్చు. అది ఇక్కడి కార్యక్రమంలో ఒక భాగము.

ఏవో కొన్ని విషయాలు మినహాయిస్తే, అతి సాధారణ సూత్రాల ననుసరించి ఇక్కడ విద్యాబోధన జరుగుతోంది. ఆ విషయం నాకు తెలుసు. అది ఇంకొక విధంగా ఉండాలంటే, దానికి కావలసిన పుస్తకాలు ఇక్కడే ప్రచురించాలి, దానికి కావలసినదంతా సంగ్రహించి బోధనా విధానాన్ని కూడా ఇక్కడే రూపొందించాలి. ఆ విధంగా చేయమని నేను చాలమందిని కోరాను. పాత పద్ధతిలో కాకుండా నూతన పంథాలో నడిపించాలంటే, తీసుకోవలసిన శ్రమను ఎప్పుడూ వాయిదావేసే తత్వం అలవడుతుంది, అది తెలుసు. ఉదాహరణకు, ఒక విషయాన్ని సరియైన అర్థంతో గ్రహించేటట్లు చేయాలంటే, ఎన్నో వస్తువులు కావాలి. అవి తయారుచేయడానికి చాలకాలం పడుతుంది, ఎన్నో గడ్డు సమస్యలు ఎదురౌతాయి. వారంతట వారు చదువుకోవానికి తగిన మంచి పుస్తకాలు లేకుండా పిల్లలకు చదువు చెప్పడం చాల కష్టము. ఉన్నవాటిలోనే మంచివి ఏరుకొని సరిపెట్టుకోవలసి వస్తుంది. అప్పుడైనా ఎక్కువ రకాలు

కనిపిస్తుంది. ఆ చైతన్య స్పందనను ఇక్కడ చూడవచ్చు. అది అన్నిటిలోకీ ముఖ్యము. ఇవి పైకి చెప్పుకునేవిషయాలుగాక, చేయవలసినవి కాబట్టి, ఇక్కడ ఎవరమూ పైకి చెప్పుకోము— ఈ రోజు మాదిరిగా ఏదైనా సందర్భం వస్తే తప్ప—, మీరిక్కడకు వచ్చి చాల సంవత్సరాలైంది కదా, ఇటువంటి సందర్భం ఈ రోజు వచ్చింది.

మీ ప్రశ్నలు పూర్తి అయినవా?



ఆ సందర్భమే అయినప్పటికీ అడుగుతున్నాను. తల్లీ, ప్రతి సంవత్సరం జనవరి ఒకటిన మీరు సందేశమిస్తారు కదా, అది దేనిని సూచిస్తుంది?

అవును. ప్రతి సంవత్సరం....అది యుద్ధసమయంలో ఇంకా విచిత్రంగా ఉండేది. అది భవిష్యత్తును సూచన చేసేది. ప్రస్తుతం అటువంటి యుద్ధంలేదు. కాబట్టి ఆ విధంగా లేదు. అయినప్పటికీ, సాధించవలసిన ప్రగతికి అది సూచనగా ఉంటుంది. రేపు ప్రొద్దున మీకొక ప్రార్థన లభిస్తుంది.* దానిని గురించి గాఢంగా ఆలోచించండి. ఇప్పుడు ప్రజలకు మనపై ఆసక్తి పెరిగింది. చాల మంది పైవారు ఇక్కడికి వస్తున్నారు, ఇక్కడ మనం ఏం చేస్తున్నామోనని కుతూహలపడుతున్నారు. అలా వచ్చిన వారికి ఆశ్రమమంతా చూపించి మన కార్యక్రమాలు తెలియజేస్తున్నారు. అందువల్ల, ''మనం ఏమిచేయబోతున్నామనే విషయంమీద ఎక్కువ మాట్లాడకండి, చేసిచూపించండి, అంతే,'' అని చెప్పవలసిన అవసరం కలిగింది. ఎప్పుడూ కూడ చెప్పడంకంటె చేయడం మంచిది. అది సవిస్తరంగా కూడా చేయాలి. దీనికి మించిన గూఢార్థం సైతం అందులోఉంది. దానిని గురించి మరొకసారి ప్రస్తావిస్తాను. సెలవు.

* * *

---

* 1954 నూతన సంవత్సరాది ప్రార్థన ; "ప్రభూ, ఈ సంవత్సరానికి ప్రజలకు తమ సలహా ఇది: "దేనిని గురించీ ప్రగల్భాలు పలుకవద్దు, నీ చేష్టల ద్వారా నీ సంగతి తెలియచేయి."